# శ్రీమద్రామాయణము

## అరణ్యకాండ

Acc. No. 27651

రచన


డా॥ జి. ఎల్. ఎన్. శాస్త్రి, M.Sc.. M. Phil, Ph.D.
భౌతికశాస్త్ర విభాగాధ్యక్షులు
టి. జె. పి. యస్. కళాశాల, గుంటూరు.






జగద్గురు పీఠము - గుంటూరు శాఖ
( The World Teacher Trust - Guntur Branch )
గుంటూరు – 522 002.

శ్రీమద్రామాయణము
అరణ్యకాండ


ప్రతులకు

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
జి. ఎల్. ఎన్. శాస్త్రి
' మైత్రేయ నిలయం '
5–10–4, 2/9, బ్రాడీపేట, గుంటూరు–522
ఫోన్ : 33995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
14–38–2, 'రాధామాధవమ్'
ముప్పిడి కోలనీ, విశాఖపట్టణము–530 002.
ఫోన్ : 65291

వెల : సాధారణ ప్రతి రూ. 55/-
గ్రంథాలయ ప్రతి రూ. 70/-

ముఖ చిత్రం : బాలి

ముద్రణ :

మాస్టర్ ప్రింటింగ్ ప్రెస్
ఐ. సి. సి. బిల్డింగు వద్ద, జిన్నాటవర్,
గుంటూరు–522 001.
ఫోన్ : 23789

# అంకితము



## ప్రత్యక్ష గురువు

గీ॥ కుంభ సంభవ లీలా వినోద మేధ,
అసుర కామిని శూర్పణఖార్తి గాధ,
రామచంద్రుని శౌర్య సంగ్రామ విధము.
మంచి చెప్పిన మారీచమంత్రి పథము,
లేమ సీతను భ్రమపెట్టు లేడి హొయలు.
ఆసురీ భావ కపట సన్యాసి లయలు,
'రామబంధు' జటాయు సంగ్రామ విధియు,
ప్రబల సద్భక్తురాలైన శబరి కథయు,
గలిగియున్నట్టి అరణ్యకాండ గమము
అష్టదళయుక్త పద్మమట్లలరు సుమము—
పదవి, ధనమును, పేరును, పాదపూజ
లెన్నడేనియు కోరని ఎక్కిరాల
కృష్ణమాచార్య దరహాస కృపను గోరి
అర్పణముజేతు వారికే అట్టి సుమము

# పరోక్ష గురువు



బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు

గీ॥ సర్వ సాహిత్య రీతుల సార్వభౌమ !
సరస గంభీర వేదార్థ సత్కవీంద్ర !
వివిధ సద్గ్రంథకర్త శ్రీ విశ్వనాథ !
హృదయ పూర్వక నతులయ్య సదయమూర్తి

# విషయ సూచిక

# ముందుమాట

'ముందుమాట' అని పేరే గాని ఒక విధంగా ఇది చివరి మాటే! ఎందు కని అంటారేమో - గ్రంథానికి ముందున్నా దీన్ని వ్రాసేది చివరి కేగా – అందుకని. సరే! ఈ ముందు వెనుకల మాట అటుంచి అసలు మాట కొద్దాం! ఈ అరణ్య కాండను వ్రాయడం 1979 లోనే జరిగింది. అయితే అది ఇప్పటికి అంటే 1993 నాటికి గ్రంథ రూపంలో వెలువడ బోతోంది (ఈ ముందు మాట వ్రాసే సమయానికి గ్రంథ రూపంలో ఇంకా తయారు కాలేదుగా– అందుకని 'వెలువడబోతోంది' అని వ్రాశాను) అంటే 14 సంవత్సరాల తర్వాత అన్నమాట! సీతారాములు 14 సంత్సరాలు అరణ్య వాసంలో వున్నారు గదా! అలాగే ఈ 'అరణ్యకాండ' గూడా 14 సంవత్సరాలు అరణ్యవాసంలో వుందన్న మాట! పోన్లెండి! అపశ్రుతి లేకుండా రెండు అరణ్యవాసాలకూ శ్రుతి కుదిరింది. కాబట్టి, ఫలశ్రుతి బాగానే వుంటుంది.

## గ్రంథముద్రణా ప్రసక్తి

ఈ రోజుల్లో గ్రంథాలు ముద్రించాలంటే చాలా ఖర్చుతో కూడినపని. వాణీ కటాక్షమే గాని లక్ష్మీ కటాక్షం అంతగా లేనివారు ఇతర సహృద యుల సహాయం వుంటేనే తప్ప – తమంతకు తాముగా గ్రంథముద్రణకు సాహసించలేరు. ఆ గ్రంథాలు రామాయణ భారతాల్లాంటివి అయితే ఈ రోజుల్లో మరీ కష్టం. వీటిల్లో గూడా అరణ్యకాండ, అరణ్య పర్వం లాంటివి అయితే మరింత కష్టం. సుందరకాండ ముద్రణా సహాయానికైతే ముందుకు వచ్చే సహృదయులు అరణ్యకాండ అనంగానే వెనుకంజ వేస్తారు. ఎందుకంటే – అది అంతే! (మరీ మీకు అంతగా ఎందుకో తెలుసుకోవాలని కుతూహలంగా వుంటే ఈ పుస్తకంలోనే "సాధకులకు మాత్రమే" అన్న శీర్షిక

కింద వున్న విషయాలు చదువుకోండి!) సుందరకాండలో సముద్రలంఘనానికి హనుమ కావలసి వస్తే, అరణ్యకాండ ముద్రణాభార సాగరాన్ని దాటి ఒడ్డుకు చేరాలంటే మళ్లీ ఆ హనుమగాని మరో హనుమగాని రావల్సిందే!

హనుమ ప్రసక్తి

హనుమ మళ్లీ భూలోకంలోకి రావాలనుకుంటే రాగలడు. "యత్ర యత్ర రఘునాథ కీర్తనం, తత్ర తత్ర కృత మస్తకాంజలిం, బాష్పవారి పరిపూర్ణలోచనం, మారుతిం నమత రాక్షసాంతకమ్" ఇది శ్లోకం అని మాత్రమే తెలియడం కాకుండా దీని అర్థాన్ని నమ్మేటటువంటి వారికి హనుమ రాగలడని తెలుస్తుంది. రామ సంబంధమైన కార్యం అయితే అక్కడ హనుమ తప్పకుండా వుంటాడు. అయితే ఎలా వుంటాడు, ఏ రూపంలో వుంటాడు అనేది చూచే వాళ్ల దృక్పథాన్ని బట్టి వుంటుంది.

ఒక ప్రక్క తన ఆఫీసు పనులకు అన్యాయం జరక్కుండా చూసుకుంటూ, మరో ప్రక్క గ్రంథ ముద్రణా బాధ్యతను ఆత్మీయతా దృష్టితోను, ఆరాధనా భావంతోను నిర్వహించడానికి నడుంకట్టుకున్న 'సూరపరాజు హనుమాన్ ప్రసాద్' ను చూచి ముచ్చట పడి హనుమ అతనిలో ప్రవేశించి త్రివిక్రమునిలా విజృంభించాడు – ముందుగా అతను పాదుకా పట్టాభిషేక గ్రంథాన్ని అన్న రఘురాముని స్మృతి చిహ్నంగా ముద్రించి ముద్రణా సహాయకారకులకు ఆదర్శప్రాయుడైనాడు. దాంతో వాళ్లందరూ వాళ్లంతకువాళ్లే నిస్సంకోచంగా ముందుకు వచ్చి అత్యంత విశ్వాసంతో, ఆదర భావంతో, ఈ గ్రంథ ముద్రణకు తమవంతు సహాయ, సహకారలను అందించారు. దీన్నే ఆచరణాత్మక సాధనా విధానం అంటారు. ఇందులో తమ సంస్థ యొక్క, తమ యొక్క పురోభివృద్ధిని కాంక్షించి ఇచ్చిన తల్లి తండ్రులేకాదు, తల్లి తండ్రుల యోగ క్షేమాలు కాక్షించి తాముదాచుకొన్న డబ్బులు ఇచ్చిన చిన్నారి చిరంజీవులు గూడా వున్నారు 'CHAILD IS THE FATHER OF THE MAN' అన్న సూక్తి ఊరికే పోతుందా?

రామాయణామృతం

"అచ్చమైన యమృత మమరులు త్రావినా
రోయి! దానికేనసూయ పడను
పరమ మౌని యైన వాల్మీకి కృతరామ
సత్కథా సుధారసంబుఁ ద్రావి."

"దేవత లేదో ఎవ్వరికీ త్రాగడానికి అవకాశం లేకుండా తామొక్కరే ఆ అమృతాన్ని త్రాగామని చెప్పుకుంటే చెప్పుకోనీయండి. అందుకు మనం ఏ మాత్రం అసూయ పడాల్సిన పనిలేదు. ఎందు కంటే అంతకు మించిన 'వాల్మీకి కృతరామాయణామృతం' మనకుంది. ఆ రామాయణామృతాన్ని త్రాగి రుచి చూచిన వాణ్ణి కాబట్టి ఇలా చెప్ప గలుగు తున్నాను" అన్నారు మహాకవి విశ్వనాథ సత్యనారాయణ గారు వారి రామాయణ కల్పవృక్షంలో. మరి అలాంటి రామాయణం ఈ గ్రంథానికి కథావస్తువు.

గురూపదేశం

మా గురువు గారైన ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు 'రామాయణాన్ని వ్రాయి శాస్త్రీ!' అని ఆదేశించారు. దాన్నే నేను ఉపదేశంగా భావించి వారి మాట శిరసా వహించాను. అందుకే జీవితం ముగిసేలోగా షట్కాండలు పూర్తిచేసి గురువు గారికే అంకితం చేసి మాట చెల్లించు కుంటాను. (ఒక్క రామాయణమే కాదు లలితాస హస్రనామ ప్రాశస్త్యం, సౌందర్య లహరి, శివానందలహరి మొదలైన ఇతర గ్రంథాలు గూడా! 1986 లో వ్రాసిన 'తైత్తిరీయోపనిషత్తు' గ్రంథం గూడా గురువు గారి ఆదేశం మేరకే వ్రాయటం జరిగింది. ఆ గ్రంథం భారత ప్రభుత్వ మానవ వనరుల మంత్రిత్వ శాఖ వారిచే కొనుగోలు చేయబడి దేశంలోని అన్ని విశ్వ విద్యాలయ గ్రంథాలయాలకు పంపబడింది. అందుకనే ఇప్పుడు ఒక్క కాపీ కూడా లేదు. మళ్లీ ముద్రించాలి. తెలుగు, సంస్కృతం సరిగ్గా రాని ఒక 'భౌతిక శాస్త్ర అధ్యాపకుడు' వ్రాసిన గ్రంథాలకు ఇంతటి ప్రజాదరణ కలిగిందంటే - గురూపదేశ ఆశీర్వాద బలానికి ఇంత కంటె వేరే నిదర్శనం ఏం కావాలి?

ప్రస్తుత గ్రంథస్థ విషయం

ఇందులోని వచనం ప్రవచనం లాగానే సాగుతుంది. అందుకని ఒక ఉద్గ్రంథం చదువుతున్న భారం పాఠకునికి అనిపించదు. ఎదురుగా పాత్రలు నిలబడి మామూలుగా మనం రోజూ మాట్లాడే భాషలో మాట్లాడు కుంటూంటే వింటున్నట్లు, సన్నివేశాలను ఎదురుగా చూస్తున్నట్లు అనుభూతిని పొందుతారు. మీరు - మీరు పొందిన అనుభూతిని నాకు ఉత్తరం వ్రాసి తెలియ పరిస్తే ఈ గ్రంథ ద్వితీయ ముద్రణలో అవి గూడా కలిపి ప్రచురిస్తాము. అగస్త్యుడు లాంటి ప్రజోప యోగ మహామునులు, రాముడు లాంటి భర్త, సీత లాంటి భార్య, లక్ష్మణుడు లాంటి తమ్ముళ్లు, శూర్పణఖ లాంటి దుష్పనాతులు, కాముకులు, మారీచుడు లాంటి హితబోధకులు' రావణుడు లాంటి పరదారాభి లాషులు, శబరి లాంటి భక్తుల - గురించి వున్న ఈ అరణ్యకాండలోని రామాయణాన్ని చదివి ఆనందించగలరని ఆశిస్తాను.

[చివరకు ఒకే ఒక్క సంగతి. శ్రీయుతులు M. కృష్ణస్వామి, పార్వతీకుమార్ గారు ఇద్దరూ కూడా నా సహధర్మచారిణి పేరు మీనాక్షిగా వ్రాశారు. (అయితే మరి కాదా అని ఆశ్చర్యపడకండి! విషయం వినండి!) నా సహ ధర్మచారిణి అసలు పేరు 'విష్ణుప్రియ'. అయితే-మాస్టర్ E.K గారు పెట్టిన పేరు 'మీనాక్షి'. అందువల్ల జగద్గురు పీఠములోని సోదరులందరికీ మీనాక్షి అంటేనే తెలుస్తుంది తప్ప ఇంకోపేరు వ్రాస్తే వాళ్లందరికీ నామీద అనుమానం వస్తుంది. అయితే మీనాక్షి అని వ్రాయడం వల్ల మా బంధు వర్గం వాళ్లందరికీ అనుమానం వస్తుంది. ఈ విషయాన్ని ఈ పుస్తక ముఖంగా వివరిస్తున్నాను గాబట్టి ఇక ముందు ఎవ్వరూ ముఖ్యంగా మా అత్త/మామ గారి తరఫువాళ్లు ఎవ్వరూ నన్ను అనవసరంగా అపార్థం చేసు కోవద్దని సవినయంగా కోరుకుంటున్నాను !]

ఇట్లు

G.L.N. శాస్త్రి

# కృతజ్ఞతలు

సాష్టాంగ దండప్రణామములు చెయ్యడానికి నాకు జన్మనిచ్చి అవకాశం కలుగజేసిన తల్లిదండ్రులను హృదయంలోనే స్మరిస్తూ ఆరాధిస్తాను.

స్వచ్ఛమైన చిరునవ్వుతోనే సర్వవిధాలా అనుగ్రహించి, ఆధ్యాత్మిక మార్గంలో నన్ను అపురూపంగా తీర్చిదిద్దిన ప్రత్యక్ష గురువులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి చరణకమలాలకు సభక్తి ప్రణామములు.

రామాయణ కల్పవృక్షకావ్యంతో ప్రభావితుణ్ణై, నేను పరోక్ష గురువుగా ఆరాధిస్తున్న బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పాదారవిందములకు హృదయపూర్వక నమస్సుమాంజలులు.

అపారమైన ప్రేమానుగ్రహాలను నామీద, నా కుటుంబ సభ్యులమీద వర్షింపజేసే శ్రీ విశ్వయోగి విశ్వంజీగారు నా యీ గ్రంథ ప్రచురణా యజ్ఞానికి శుభాశీస్సుల నందించారు. వారికి నా హృదయపూర్వక భక్తి ప్రణామములు.

ఈ అరణ్యకాండ చదివి, ఆనందించి సహృదయంతో స్పందించి– నాగురించి, నా ధర్మపత్నిని గురించి, ఈ గ్రంథ రచనను గురించి తమ తమ సహజమైన మృదులమైన ఆత్మీయతా భావాలను వ్యక్తంచేసిన జగద్గురుపీఠము – అంతర్జాతీయ గౌరవాధ్యక్షులు - శ్రీ కంభంపాటి పార్వతీ కుమార్‌గారికి, మానవధర్మశిక్షణ సంస్థ అధినేత డా॥ మోపిదేని కృష్ణస్వామికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు, శుభాభివందనములు.

ముఖపత్ర ముద్రణలో ఎంతో ఓర్పుతో వ్యవహరించి, సహకరించిన చి॥ Ch. S. N. రాజుకు నా నిండు దీవెనలు, శుభాకాంక్షలు.

ఇక

ఆచరణాత్మక సాధనా మార్గంలో ఆధ్యాత్మికతను ఆనంద క్రీడాత్మకంగా అనుభవిస్తూ, ప్రధాన ఋత్విక్కుగా నిలచి సహ ఋత్విక్కుల సహాయ

సహకారాలతో ఈ గ్రంథ ప్రచురణా యజ్ఞాన్ని ఫలవంతం చేసిన చి॥ సూరపరాజు హనుమాన్ ప్రసాద్‌కు- హనుమాన్ ప్రసాద్‌కు ఇరువైపులా రెండు చేతుల్లాగా వుండి అత్యవసర సమయాల్లో ఆదుకొని గ్రంథప్రచురణకు సహకరించిన అతని సోదరులు చి॥ సత్యం, చి॥ శ్రీనివాసులకు –

మనిషికి ముఖమెంత ప్రాముఖ్యం వహిస్తుందో పుస్తకానికి మొదటి అట్ట (TITLE PAGE) , దానిమీద బొమ్మ అంత ప్రాముఖ్యాన్ని చేకూర్చి పెడతాయి. ఈ అట్ట ప్రాముఖ్యాన్నే సరదాగా " అట్టహాసం " అని గూడా అనుకుంటూ వుంటాం! ఈ గ్రంథానికి ఆ 'అట్టహాసం' కట్టుదిట్టంగానే జరిగింది. ఈ అట్టహాసం చాలా ఖర్చుతో కూడిన పని. "ఎంత ఖర్చైనా అనుకున్న విధంగా రావల్సిందే" అందుకయ్యే ఖర్చు మాకు వదిలెయ్యండి అని మాకు అండగా నిలిచి ఆనందింపచేసిన శ్రీ చామర్తి నాగకృష్ణారావు (N. K. ప్లాస్టిక్స్, గుంటూరు) వారి శ్రీమతి లక్ష్మీసామ్రాజ్యంగార్లకు –

శరచ్చంద్ర చంద్రికలు వెదజల్లుచున్నట్లుగా వుండే విధంగా పాఠకులు ఎంతో హాయిగా చదువుకొని ఆనందించే విధంగా అతి సుందరంగా గ్రంథాన్ని ముద్రించి ఇచ్చిన మాస్టర్ ప్రింటింగ్ ప్రెస్ అధినేత చి॥ J. సంజీవరావు అతని సిబ్బందికి –

నా కృతజ్ఞతాపూర్వక శుభాశీస్సులు

ఈ అందరూ అన్ని విధములా అభివృద్ధిని పొందునట్లు శ్రీరామచంద్రుని ప్రార్థిస్తున్నాను.

ఈ గ్రంథం వెలుగులోకి రావడానికి ఇంకా ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన వారుంటారు. వారందరికీ ఈ పుస్తక ముఖంగా కతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ అరణ్యకాండ గ్రంథ ప్రచురణకు నా యందు, మా 'జగద్గురు పీఠ' సంస్థ యందు గల ప్రేమాదరాభిమాన గౌరవములతో తమ వంతు సహాయముగా విరాళములనందించిన దాతల పేర్లు

| | | |
|---|---|---|
| 1. | చామర్తి నాగకృష్ణారావు గారు, N.K. ప్లాస్టిక్స్, గుంటూరు | 2,716 |
| 2. | నంబూరు మల్లికార్జునరావు గారు & బ్రదర్స్, గుంటూరు | 2,000 |
| 3. | నూనె ఉమాదేవి గారు, వారి కుటుంబ సభ్యులు. గుంటూరు | 2,000 |
| 4. | కుర్రె భారతరెడ్డి గారు, రామచంద్రపురం | 1,116 |
| 5. | మోహనలాల్ మహేంద్ర కుమార్ & కంపెనీ, గుంటూరు | 716 |
| 6. | ఉమ్మిడి రామచంద్రప్రసాదు గారు, తెనాలి | 516 |
| 7. | కొలిశెట్టి రామాంజనేయులుగారు, పిడుగురాళ్ల | 516 |
| 8. | నందిపాటి రామకుమారి గారు. గుంటూరు | 316 |
| 9. | రాబర్ట్ గారు, గుంటూరు | 300 |
| 10. | గ్రంథి కోదండ రామారావు గారు, రాజమండ్రి | 252 |
| 11. | M. పాండురంగవిఠల్ గారు, గుంటూరు | 251 |
| 12. | అమర్లపూడి శశిజాహ్నవి, గుంటూరు | 220 |
| 13. | M కోటయ్య గారు, గుంటూరు | 216 |
| 14. | తన్నీరు మల్లీశ్వరమ్మ గారు, గుంటూరు | 216 |
| 15. | వంగల వేంకటేశ్వర శాస్త్రిగారు, నాదెండ్ల | 216 |
| 16. | మున్నంగి చంద్రశేఖర్ గారు, గుంటూరు | 216 |
| 17. | గద్దె శ్రీనివాసరావు గారు, గుంటూరు | 216 |
| 18. | V. రంగారావు గారు, విజయవాడ | 200 |
| 19. | సర్వా వెంకటశేషయ్య గారి కుటుంబ సభ్యులు, హైదరాబాదు | 200 |
| 20. | K. లక్ష్మిగారు, గుంటూరు | 200 |

21. మోపిదేవి కృష్ణస్వామి గారు, విజయవాడ 116

22. B . భాషగారు, గుంటూరు 116

23. పరమాత్మని వేంకట రమణయ్య గారు, గుంటూరు 116

24. సూరి అప్పయ్య గారు, విజయవాడ 100

ఈ సహృదయులందరికీ వ్యక్తిగతముగా, కుటుంబ పరముగా సంస్థ పరముగా అన్ని విధములా అనుకూల్యము, అభివృద్ధి సిద్ధించి అందరూ ఆయురారోగ్య ఐశ్వర్యములతో వర్ధిల్లవలెనని శ్రీ రామచంద్రుని ప్రార్థిస్తూ వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలను తెలియజేయుచున్నాను.

G.L.N. శాస్త్రి

ఓం శ్రీ సాయిరామ్ గురుదేవ దత్త

# ఆశీస్సులు

శ్రీ రాముడు యావత్ మానవజాతికి ఆదర్శ వంతుడైన అరాధ్య మూర్తి. రామాయణము భారతీయులకే కాక ప్రపంచము లోని మేధావు లందరికి పరమ పవిత్రమైన కావ్యము. రష్యాలో రామాయణమును నాటకముగా రంగస్థలము వైపు ప్రదర్శింప చేసుకొని ఆనందిస్తూ మన సనాతన సంస్కృతిని మెచ్చుకుంటున్నారు. అట్టి రామాయణాన్ని ఎన్నిసార్లు విన్నా ఆనందదాయకమే.

రామాయణాన్ని వచన కావ్యంగా వ్రాయటానికి ధర్మవర్తనుడు సౌజన్యమూర్తి అయిన జి.యల్.యన్. శాస్త్రి పూనుకున్నాడు. దానిలో భాగముగానే యీ అరణ్యకాండను ఆంధ్ర పాఠక లోకానికి అందిస్తున్నాడు. అంతరార్థాలు, విశేషార్థాలు, యోగార్థాలు తెలిసిన సుజ్ఞాని గనుక రామాయణములోని అరణ్యకాండ సాధకులకు ఏ విధమైన ఆధ్యాత్మిక అన్వయాన్ని అందిస్తున్నదో విశద పరుస్తూ తెలియ పరిచాడు. సామాన్య మానవుడు సహితము చక్కగా అర్థము చేసికోగలరీతిలో రచనలు కొనసాగించాడు. హృదయాన్ని అర్థము చేసికొని సంచరించగల ఓర్పు, నేర్పుగల శాస్త్రి గురుదేవుల కృపా కటాక్షములతో ఇంకా ఇంకా జీవితములో ఉన్నతిని సాధించగలడని, ఎన్నో ఎన్నో గ్రంథరాజములను సమాజమునకు అందించ గలడని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ ఆశీస్సులను అందిస్తున్నాను.

విశ్వయోగి విశ్వంజీ

విశ్వమందిరం
గుంటూరు.
14-3-93

# స్పందన

రామాయణము ఆదికావ్యము. అంటే ఈ భూమి మీద మానవునకు ఇవ్వబడిన జ్ఞాన సంపద. మానవత్వం ఆకళింపు పరిపూర్ణముగ రామాయణ మందు నిక్షిప్తము చేయబడి వున్నది. అన్ని రకముల మానవ తత్వములను వివిధ పాత్రల ద్వారా రామాయణము అందించి యున్నది. రాముని ఈశ్వర తత్త్వము నుండి, రావణుని అహంకార తత్త్వము వరకు, ఋషుల పోకడలనుండి, కోతుల పోకడల వరకు సమస్తమైన మనో వికాసములను, వికారములనుకూడ అద్దముపట్టి చూపు మహత్తర గ్రంథము రామాయణము.

భూమి మీద మానవుని ఉనికి వున్నంత వరకు రామాయణము వుండును. బుద్ధి ప్రచోదనము చేయుచుండును. ఎన్నిసార్లు చదివినను మరల మరల చదువవలెనను జిజ్ఞాస కలిగించు రామకథను, తనదైన శైలిలో మరొక్క మారు పామరులకు అందించుటకు, పూజ్యులు, సోదరులు అయిన G L.N. శాస్త్రి గారు చేయుచున్న ఈ ప్రయత్నము ఒక యజ్ఞము. శాస్త్రిగారు రామాయణమును ప్రవచించినా, రచించినా కన్నులకు కట్టినట్లుగ వివరించ గల ప్రజ్ఞాశాలి. ప్రవచనమునందే కాక ప్రవర్తనమున గూడ రాముని అనుస రించు శ్రద్ధాశీలివారు. అంతర్లోకముల నుండి ముని మార్గమున వారి సత్కార్యములకు సిద్ధినొసగువారు వారి శ్రీమతి మీనాక్షిదేవి. ఈ దంప తుల పవిత్ర ఆధ్యాత్మిక జీవనమే- రామాయణ రచనా వ్యాసంగమునకు పునాది. అట్టి పునాదికి రాళ్లనందించిన వారు గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు. స్వయముగ సాన్నిధ్యమిచ్చి పునాదులను గట్టిపరచి యీ దంపతుల నాశీర్వదించి, వారిచే జగత్కళ్యాణ మగు కార్యములను నిర్వర్తింప జేయుచు విహంగ వీధులలో చిఱునవ్వులను వెన్నెలలుగ వెదజలుచున్నవారు MASTER E.K. వారి ఆశీఃబలమున శ్రీ శాస్త్రి దంపతులు

విజృంభించి, ఇతిహాసములకు,ఉ వనిషత్తులకు, వేదములకు భాష్యమొసం గుచు పామరులను పండితులుగా తీర్చి దిద్దుచున్నారు.

పురాణేతిహాసముల ప్రసంగము, వేదమునందు శిక్షణ, వైద్యము నందు నిపుణత, శాస్త్రములయందు అవగాహన, సత్కార్యములందు శ్రద్ధ, అన్నింటిని మించి సంభాషణయందు సరసత్వము శాస్త్రి గారి మనోహర మూర్తికి భూషణములుగ, భగవదాశీర్వచనములుగా రూపుగట్టినవి.

ఈ అరణ్యకాండ యందు శాస్త్రి గారు ప్రకాశింప జేసిన రహస్యము లెన్నియోగలవు. ఋషిభావములు, రాక్షస భావములు, మానుషభావములు ధార్మికభావములు, భగవద్భావములు చక్కగ వెల్లడి చేయబడినవి. భారతీ యుడిగ జన్మించినవారు రామాయణాది గ్రంథములందలి విషయములను సవినయముగ పఠించుట కర్తవ్యము. అట్టి కర్తవ్యోన్ముఖులైన వారికి- సులభముగ గ్రహణము చేయు రీతిని శాస్త్రి గారి రచన కొనసాగినది. సహజ ముగ ఆంధ్రులు అదృష్టవంతులు, కావుననే వారియందు పోతన జన్మించి భాగవతము నందించెను కావుననే వారియందు మరల మరల దత్తమూర్తి జన్మమంది భగవత్స్ఫూర్తి నొసంగుచున్నాడు. ఎందరో మహనీయులు సశరీరముగ, ఆంధ్రులుగ జీవిస్తూ జాతికిదీవెన లందిస్తున్నారు. ఆస్తిక్యము పుంఖాను పుంఖములుగ పెరుగుచున్న ఈ సమయమందు, శ్రీ శాస్త్రిగారి రామాయణ రచన మరికొంత వూపు నందించగలదనుటలో సందేహములేదు.

చదువరులకెల్ల యీ అరణ్యకాండ, రాముని ధీరత్వము, స్థిరత్వము, మౌనము, ఓర్మి, బలము అందించవలెనని, రామరక్షగ వారి జీవితము సాగి పోవలెనని, శాస్త్రిగారి జీవితము మరింత దైవాంకితముగ సాగి, ఆయురా రోగ్య ఐశ్వర్యములను, సుఖ, సంతోష కైవల్యానుకూలముగ పెంపొంద వలెనని, సాటి సోదరునిగ గురు పాదములకు విన్నవిస్తూ....

అంగిరస ఫాల్గుణ పౌర్ణమి,
సోమవారం, 8-3-1993.

ఇట్లు,
కంభంపాటి పార్వతీ కుమార్

# ఒక మెరుపు - ఒక మలుపు

అది మార్చి 7 వ తేదీ ఆదివారం. సాయం సమయం. గుంటూరులో ఉన్నాను. ఆత్మీయులకు సంబంధించిన ఒక విశేష కార్యక్రమంలో పాలుపంచుకొంటున్నాను. అంతలో ఫాల్గుణ పూర్ణిమ ప్రవేశిస్తున్నది. ఇ.కె. మాస్టరుగారు భౌతిక దేహాన్ని విడిచి వచ్చిన పూర్ణిమ ఇది. కార్యక్రమం మధ్యలో వీలు చేసికొని పూజ్య సోదరులు శ్రీ జి.ఎల్.ఎన్ శాస్త్రి గారి ఇంటికి చేరాను. శాస్త్రిగారున్నారు. వారి శ్రీమతి మీనాక్షి గారూ ఉన్నారు.

పూర్ణిమ సంగతి నేనెత్తలేదు గాని, మా మధ్య మాస్టరుగారిని గూర్చిన ఊసులు కొల్లలుగా నడచిపోతున్నాయి. ఆ పూర్ణపురుషుని గూర్చి తనివితీరా తలచు కొంటూ, మనసారా చెప్పుకొంటూ, మరల మరల మురుసుకొంటూ, కొసరి కొసరి ముచ్చట పడుతూ పరవశిస్తున్నాం.

ఇంతలో శాస్త్రిగారు ఆవిష్కరణకు సిద్ధమవుతున్న 'అరణ్యకాండ' ను నాకు అందించారు. 'దీనికి మీరు ముందు మాట వ్రాయండి. అలా అనాలని ఇప్పటికిప్పుడే అనిపించిందినాకు.' అన్నారు.

'ఇప్పుడు మీరు పొందుతున్న ఈ మురిపెం ఉన్నదే దీనిని తగు మాత్రంగా, తగిన విధంగా అక్షర బద్ధం చేసి అందరికీ అందించేటందుకు ఈయబడుతున్నదే ఈ అవకాశం!' అని మాస్టరు గారు వెన్ను తట్టి నాకు చెప్పినట్లయింది.

ఆచార్యునిగా మాస్టర్ ఇ.కె. జాతికి అందించిన శిక్షణ ప్రధానంగా రెండు విధాలుగా సాగింది. మొదట ఆయన వ్యక్తులకు శిక్షణ నిచ్చారు. అటుపైన ఆయన బృందాలకు శిక్షణ నిచ్చారు.

వ్యక్తులకు ఇచ్చిన శిక్షణ మళ్లీ రెండు విధాలుగా సాగింది. స్త్రీ పురుషులుగా వ్యక్తులు చేరరాగా వారికి ఇచ్చిన శిక్షణ ఒకటి. స్త్రీ పురుషులను దంపతులుగా చేరబిలిచి తానుగా వారికి ఇచ్చిన శిక్షణఒకటి.

అలా దంపతులుగా మాస్టర్ ఇ.కె. నుండి శిక్షణ పొందిన వారిలో శ్రీ జి.ఎల్.ఎన్. శాస్త్రి గారి దంపతులు ప్రముఖులు. వారు అందుకు పెట్టి పుట్టినవారు! ఆ అదృష్ట విశేషాన్ని అనితర సాధ్యమయిన రీతిలో అమితంగా అనుభవించినవారు!

పదార్థానికి మితముంటుంది గాని, పారవశ్యానికి మితమేముంటుంది! కనుక అది పదార్థమయినప్పుడు మనం మితంగా కోరాలి. అది పారవశ్య మైనపుడు మనం అమితంగానే కోరాలి. అలాంటిది, కోరడంతో పని లేకుండానే ఈ దంపతులకు ఇలా అంది రావడమన్నది మాస్టరు గారి అను గ్రహవిశేషం!

అప్పటికి, అనగా - శాస్త్రిగారి దంపతులు మాస్టరు గారికి చేరువయ్యే టప్పటికి మాస్టరు గారి కార్యక్రమం మరీ అంత ఊపిరి సలపని స్థితిలో లేదు. నింపాదిగా సావధానంగా అనుయాయులకు ఆయన రూపురేఖలను దిద్దుతున్న ప్రత్యేక సమయమది! అనుయాయులను చుట్టూ చేర్చుకొని సకల శాస్త్రాలను ముచ్చటలతో, మురిపాలతో ఆడుతూ, పాడుతూ ఆయన వారికి నేర్పు కొంటూ వచ్చిన మధుర సమయమది!

శాస్త్రిగారి దంపతులను వెంటనిడుకొని విశాఖలోని సభలకూ! కార్య క్రమాలకూ మాస్టరు గారు తరలి వెళుతూ ఉండేవారు. ఇతర ప్రాంతాలకు జరిగే ప్రయాణాలలో కూడ వీరిరువురూ వారి ప్రక్కన ఆసీనులయ్యేవారు. ఆ ప్రయాణాలు, ఆ పర్యటనలు అలా లీలగా సాగుతున్న వేళలలో ఎన్ని కబుర్లో, ఎన్ని చెణుకులో! ఎన్ని పరిహాసాలో, ఎన్ని దరహాసాలో! ఎన్ని సందేశాలో, ఎన్ని సమన్వయాలో! ఇలా సాగింది ఎన్ని సంవత్సరాలో!

సంవత్సరాల తరబడి మాస్టరు గారితో అలా కలసి వెళుతూ శ్రద్ధతో వీరువింటూ వచ్చిన ప్రవచనాలలో రామాయణ ప్రవచనాల పరంపర ఒకటి.

ఇ.కె. మాస్టరు గారు శ్రీ మద్రామాయణ కల్పవృక్షాన్ని చేతబట్టుకొని రామాయణగాథను ప్రవచిస్తూ ఉండేవారు. ఆయన అలా చేయడానికి ఆత్మీయమయిన కారణం ఒకటి ఉంది. మాస్టరు గారి తండ్రి గారు శ్రీ అనంతాచార్యుల వారు. వారికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రియమిత్రులు. విశ్వనాథ వారి సాహచర్యం శైశవ స్థితి నుండీ పొందినవారు మాస్టరుగారు. చిన్నతనంలో మాస్టరు గారి నుండి వెలువడిన తొలి పద్యరచన అయిన 'అర్పణ' కు విశ్వనాథ వారు పీఠిక వ్రాశారు. వయస్సు వస్తున్న కొద్దీ మాస్టరుగారు విశ్వనాథవారికి మరింత దగ్గరై వారి వద్ద సంస్కృతాంధ్ర కావ్యాలను గురుకుల పద్ధతిలో అధ్యయనం చేశారు.

రామాయణ కల్పవృక్ష రచన జరుగుతూ ఉన్న కాలమది. విశ్వనాథ వారు మాస్టరు గారిని కలుపుకొని విజయవాడలో కృష్ణఒడ్డున సాయం సమయాలలో విహరిస్తూ ఉండేవారు. ఇటు వైపు నుండి వెళుతూ విశ్వనాథ వాల్మీకి రామాయణ శ్లోకాలను గానం చేసేవారట. అటు వైపు నుండి వస్తూ రామాయణ కల్పవృక్షంగా వ్రాయవలసిన పద్యాలను చెప్పుకొంటూ వచ్చేవారట. ఇంటికి వచ్చి రాగానే సిద్ధంగా ఉన్న వ్రాయస గాండ్రకు వరుసగా ఆ పద్యాలన్నీ చెప్పుకొచ్చేవారట. అప్పటి నుండీ మాస్టరు గారికి రామాయణ కల్పవృక్ష మంటే అదో విశేషమయిన అభిమానం. ఆ అభిమానంతో మాస్టరు గారు రామాయణం చెప్పవలసి వచ్చినప్పుడల్లా కల్పవృక్షాన్ని చేతబూనేవారు.

ఈ విధంగా రామాయణ కల్పవృక్షం మాస్టరు గారి మీదుగా శాస్త్రి గారిని చేరింది. శాస్త్రిగారి మీదుగా కొన్ని మార్పులు చేర్పులతో ఈరోజు మనలనుచేరుతూ ఉన్నది. ఇలా - సరళ వచన రూపంలో శాస్త్రి గారి ప్రత్యేకమయిన సరళిలో!

శ్రీ మద్రామాయణ కల్పవృక్షం వాల్మీకి రామాయణ కృతికి ఒక మహాభాష్యం. ఆ మహా భాష్యం మాస్టరుగారి నుండి వెలువడుతున్న దివ్య సమన్వయాన్ని తనతో జోడించుకొని శాస్త్రిగారిని చేరవచ్చింది. ఆ చేర వచ్చిన వేళలో శాస్త్రిగారికి అందివచ్చిన దివ్యదర్శనం మరల దానికి తోడయింది. ఇక రామాయణ రచన సరళ వచనంలో శాస్త్రిగారి నుండి ప్రారంభమైంది. 'నావాణి' మాసపత్రిక ఈ రచనకు వేదికయింది. ఇలా మనం ఈ రచనలో ఆదికవి వాల్మీకినీ, కవి సామ్రాట్ విశ్వనాథను, కులపతి కృష్ణమాచార్యను, కులపతికి ప్రియశిష్యులయిన శాస్త్రిగారిని-ఇందరి మీదుగా మన వరకు, మన కొరకు దిగి వస్తున్న ఆ సీతారాముని దర్శించ వచ్చు.

ఈ రచనను చదువుతున్న వేళలో మనం వాల్మీకి హృదయాన్ని గ్రహించగలము. విశ్వనాథ భాష్యాన్ని అందుకొనగలం. మాస్టరు గారి సమన్వయాన్ని స్వీకరించగలం. ఇన్నిటిని కలుపుకొని వస్తున్న శాస్త్రి గారి దివ్యదర్శనానికి ఆనందించగలం.

శాస్త్రి గారి రచనలో ప్రత్యేకమయిన విరుపొకటి ఉన్నది. ఆ విరుపులో మెరుపొకటి ఉన్నది. ఆ మెరుపు అలా మెరిసే వేళలో మానవజాతి తానుగా తిరగవలసిన మలుపొకటి కనబడుతున్నది. జాతి ఆ మలుపు తిరిగేటంత వరకు ఆ మెరుపు మరల మరల అలా మెరుస్తూనే ఉండగలదని అనిపిస్తూ ఉన్నది. ఇది వీరికి మాస్టరు గారి నుండి అంది వచ్చిన వరం!

విరుపుతో పాటుగా శాస్త్రిగారిలో ఒడుపొకటి కూడ ఉన్నది. అది భాషా సంబంధమైనది. వేదోపనిషత్తులను వివరించే వేళలలో సరళగ్రాంథిక భాషను గంభీరమయిన రీతిలో వాడుతున్నారు వీరు. పురాణేతిహాసాలను విప్పిచెబుతున్న సమయాలలో శిష్ట వ్యావహారిక భాషను సుళువు చేసి వాడు కొంటున్నారు వీరు. మొత్తం మీద వీరి కలం సగటు మనిషి జీవితానికి సమగ్రతను అందించేటందుకు కంకణం కట్టుకొన్నది.

శాస్త్రి గారు మంత్ర జ్యోతిష శాస్త్రాలలో కూడదిట్ట. లలితా సహస్ర నామానికి శాస్త్రీయమయిన పద్ధతిలో విపులమైన వ్యాఖ్యను రూపొందిస్తున్న వీరు సార్థక నామధేయులవుతున్నారు. జీవితాన్ని అన్ని విధాలా సార్థకం చేసికొంటున్నారు.

మాస్టరు గారి స్పర్శను నిండుగా పొంది మానవజాతికి దానినిమెండుగా అందిస్తున్న ఈ దంపతులు సీతారాములవలె చిరకాలం వర్ధిల్లాలని మనసారా కోరుకుంటున్నాను.

వీరినుండి వ్యక్తమవుతున్న దివ్యమయిన ఈ అక్షర దీపానికి అన్ని విధాలా అండదండలందిస్తున్న సోదరబృందానికి ఇవే నా శుభాకాంక్షలు. జీవనజ్యోతిని అర్చించుకొంటున్న వీరు ధన్యులు!

అధ్యయనానికై ఈ రచనను అందుకొంటున్న వారు అదృష్టవంతులు, ఆ సహృదయులు జీవితాన్ని రామమయంగా ప్రేమమయంగా, రూపొందించు కొంటూ కృతార్థులు కాగలరు!

విజయవాడ
8-3-93.

శుభాకాంక్షలతో,
వోపిదేవి కృష్ణస్వామి

# ముఖచిత్రం-మృగరహస్యం

ఒక్కసారి ముఖచిత్రం చూడండి! – సీతారాములుండే పర్ణశాల ముందుకు వచ్చింది లేడి. ఇది మామూలు లేడి కాదు. బంగారు వన్నెలు చిమ్మే మాయ లేడి. గడ్డి తినదు. కాని తింటున్నట్లు నటిస్తుంది. తన సంగతి ఇతర జంతువులు గమనించకుండా జాగ్రత్త పడుతుంది. సీత కాళ్లకు దగ్గఱగా కూడా వచ్చి 'తేలికగా అందుకోవచ్చు' అన్నంత దూరంలో వుంటుంది – కాని, అందదు. గడ్డిమీద కంటె దృష్టి సీతమీదే ఎక్కువ వుంటుంది. సీత తనని చూడాలని, చూసి తనను పొందాలని పించాలనీ, రామునితో చెప్పి తెప్పించుకొనే ప్రయత్నంలో ఉబలాట పడాలని – దాని ఆశ! ఇలాంటి మాయలేడిని సంస్కృతంలో 'మాయా మృగం' అంటారు.

ఈ మృగం రామాయణ కథనే మలుపు తిప్పుతుంది. అంతకు పూర్వం ఎన్ని కష్టాలు వచ్చినా సీతారాములకు వియోగం మాత్రం కలుగ లేదు. ఈ మృగం వల్ల వారిద్దరి మధ్య వియోగం కూడా కలుగుతుంది. అసలు ఈ "మృగం" రహస్య మేమిటి?

మృగమంటే లేడి అనే అర్థమేగాక ఇంకొక సంకేత రహస్యార్థం గూడా వుంది. మనకన్నా ఎప్పుడూ ముందుండే మార్గాన్ని మృగమంటారు. (మృగ-మార్గ) ఇది మృగమనే సంకేత పదానికి కీలకమైన రహస్యార్థం.

మనం ఎఱుగున్న విషయాలకన్న — ఎఱుగని, (ఎఱగవలసిన) విషయంగా ముందున్నదాన్ని గూడా మృగమంటారు. అంటే తెలియ వలసిన జ్ఞానాన్ని మృగంతో పోలుస్తారన్నమాట!

[లలితా సహస్రనామ స్తోత్రంలో "ముఖ చంద్ర కళంకాభ మృగ నాభి విశేషకా" అనే నామం వుంది. దీని అర్థం ఏమిటంటే – అమ్మవారి ముఖం చంద్రబింబంలాగా వుంటే, ముఖంమీద కస్తూరిబొట్టు ఆ చంద్ర బింబంలోని-మచ్చలాగా వుందిట! ఇది కేవలం బాహ్యార్థం మాత్రమే! రహస్యార్థం ఏమిటంటే – భ్రూ మధ్యం వద్ద ఆజ్ఞాచక్రకేంద్రం వుంటుంది. ఇది జ్ఞానానికి ప్రతీక. మనకు తెలియవలసిన జ్ఞానంయొక్క మార్గానికి (మృగ) కేంద్రం (నాభి) లాగా ఈ బొట్టు భాసిస్తోందిట! ఇంకా పూర్తి వివరణ కావాలంటే నేనువ్రాసిన లలితా సహస్రనామ ప్రాశస్త్యం చదవండి]

లేడిని వేటాడేటప్పుడు వేటాడే వానికన్నా ఎప్పుడూ ముందే వుండేటంత వడిగా లేడి పరుగెత్తుతూ ముందుమార్గాన్ని చూపుతుంది. అందుకే లేడిని మృగమనీ– ఇలా మనకు ముందున్న జంతువులను తరుము కుంటూ వేటాడడాన్ని 'మృగయా వినోదం' అని అన్నారు.

వేసవి కాలంలో ఎడారులలో ప్రయాణం చేసేవారికి దాహం వేస్తుంది. దగ్గరలో నీళ్లేమైనా వున్నాయేమోనని ఆశతో ముందువైపు నడుస్తూ వెతుకుతాడు. కొంత దూరంలో నీటి అలలు కనబడతాయి. 'అమ్మయ్య!' దగ్గరలోనే జలాశయం ఏదో వుంది అని అనుకుంటాడు. తీరా ముందుకు దగ్గరగా వెళ్తే అది మరికొంత దూరం ముందు వుంటుంది. ముందుకు వెళ్లే కొద్దీ అది ఇంకా ఇంకా ముందుకు పోతూవుండి ఎప్పటి కప్పుడు తాను ఉన్నట్లు భ్రమగొల్పుతుంది. దీన్నే తెలుగులో "ఎండమావి" (Mirrage) అంటారు. ముందుకు పోయే ప్రయాణీకుని కంటె ఎప్పుడూ ముందు వున్నట్లు ఆశ కల్పిస్తుంది కాబట్టి ఎండమావిని సంస్కృతంలో 'మృగతృష్ణ' అన్నారు.

రామాయణ కథను ముందుకు నడిపించడానికి ఈ "మృగమే" కారణం. అయితే ఇక సీత మృగాన్ని ఎందుకు కావాలని కోరుకున్నదో పరిశీలిద్దాం!

సాధారణంగా మగవారికన్నా స్త్రీలకు అలంకరణ ద్రవ్యాలన్నా వస్తువులన్నా మక్కువ ఎక్కువ. ఎంతటి స్థాయిలోవున్న స్త్రీలకైనా ఈ లక్షణం వుంటుంది. ఈ లేడి మామూలు లేడి గూడాకాదు. బంగారు వన్నె కలది. అపురూపమైనది. అటువంటి అపురూపమైన, విచిత్రమైన వస్తువుగాని, జంతువుగాని తనదగ్గఱ వుంటే అదొక గొప్పతనం! (ఎక్కడా దొరకని వస్తువు మన దగ్గఱుంటే మనకెంత గొప్ప!)

పర్ణశాలలో ఈ లేడి వుంటే వేరే దీపంకూడా పెట్టాల్సిన అవసరం గూడా వుండదు! అని కోరవచ్చును.

రాముడు లక్ష్మణుడు పర్ణశాలలో లేని సమయంలో కాలక్షేపానికి ఈ లేడి పనికి వస్తుంది అని కోరవచ్చును.

వనవాసానంతరం తిరిగి అయోధ్యకు వెళ్తే వనవాస కాలంలో ఇలాంటి అపురూపమైనవి ఎన్నో చూశానని, మచ్చుకు దీన్ని ఒకదానిని తీసుకు వచ్చానని అక్కడ వాళ్లకు చెప్పి ఊరించవచ్చు! అని కోరవచ్చును.

సహజంగా భూజాత గాబట్టి ఈ భూమ్మీది ప్రాణులన్నిటిమీద సహజమైన ప్రేమ వుంటుంది. ఇలాంటి అపురూపమైన దాన్ని ఎవరన్నా వేటగాడు వేటాడి చంపుకుతిని దాని చర్మాన్ని అమ్ముకుంటాడేమోనని జాలి గలిగి కోరవచ్చును.

"ప్రలోభానికి లొంగితే ప్రమాదానికీ దారితీస్తుంది సుమా!" అనే హెచ్చరిక ఈ ఘట్టం సాధకులకు తెలియజేస్తుంది.

# సాధకులకు మాత్రమే !

'అరణ్య' మనంగానే భయపడే వారున్నట్టే 'అరణ్యకాండ' అన్నా 'అరణ్యపర్వం' అన్నా గూడా భయపడే వారుంటారు. ఎందుకంటే — అటు సీతారాములు, ఇటు పాండవులు - అరణ్యవాసంలోనే గదా అష్టకష్టాలు పడింది - అందుకని! అయితే ఇది కేవలం ఒక మానసిక దౌర్బల్యం (Sentiment) మాత్రమే నని లెక్కచెయ్యని వారూ ఉన్నారు.

"అరణ్యపర్వం వ్రాస్తూనేగద నన్నయ్యగారు చనిపోయింది" — అని పూర్వ పక్షీయులు తమ దౌర్బల్యానికి దాఖలాగా చెప్పుకుంటూంటే - "అరణ్యపర్వమే కాదు కనీసం ఎక్కాల పుస్తకం సైజులోనన్నా ఎలాంటి పుస్తకం వ్రాయకుండా లేదా కనీసం చదవకుండా గూడా చాలామంది చని పోతున్నారుగా" - అని ఉత్తర పక్షీయులు ఆ విషయం పట్ల ఉదాసీనంగా ఉంటూ ఉంటారు. ఇలా ఇరుపక్షాలవారి ఊహల మధ్య 'అరణ్యకాండ', 'అరణ్యపర్వాలు' మాత్రం - మేమేం పాపం ఎఱుగము. మమ్మల్ని అనవ సరంగా అపార్థం చేసుకోకండి" అన్నట్లు ఉంటాయి.

అరణ్యకాండలో జరిగిన విషయాలు జాగ్రత్తగా పరిశీలిస్తే అసలు విషయం అవగాహన అవుతుంది. సీతారామ లక్ష్మణులు, అరణ్యంలోనికి ప్రవేశించడంతో అరణ్యకాండ ప్రారంభ మౌతుంది. అలాగే పాండవులు మాయాద్యూతా నంతరం ఒడంబడిక ననుసరించి అరణ్యవాసం చెయ్యవలసి రావడంతో అరణ్యపర్వం ప్రారంభ మౌతుంది.

అరణ్యకాండలో గాని, అరణ్యపర్వంలో గాని వాళ్లకు ఇక్కట్లు వస్తాయి. ఎవ్వరూ దీనిని కాదనలేరు. కాని, కొంచెం నిదానించి నిశితంగా పరిశీలిస్తే ఇటు శ్రీరాముడుగాని అటు పాండవులుగాని - అక్షయ తూణీ

రాలను, అస్త్ర శస్త్రాలను, పెద్దల ఆశీర్వాద బలాన్ని సంపాదించి – ముందు ముందు రాబోయే కష్టాలను ఎదుర్కొన గలగడానికి తగిన అర్హతలను, అవకాశాలను పెంచుకున్నారే తప్ప కష్టాలకు కృంగి, నిర్వీర్యులై నిస్తేజులవలేదని తెలుస్తుంది. ఈ కష్ట ఘట్టాలు రాకపోతే వాళ్లకు ఆ అవకాశాలు వచ్చి వుండేవికావు. అరణ్యంలో వున్నప్పుడే వాళ్లు ఎలాంటి గట్టిపనినైనా చేయగల సామర్థ్యాన్ని, ఎలాంటి విపత్కర పరిస్థితినైనా ఎదుర్కొనగల ధైర్య. స్థైర్యాలను, నైపుణ్యాలను పెంపొందించు కున్నారు. ఇవన్నీ ఇంతకు పూర్వం వారిలో లేవనా? ఉన్నవే! కాని వారిలో నిద్రాణమైవున్నా-అవన్నీ ఒక్కసారి చైతన్యవంతమై బయటపడి అవసరానికి వారిని ఆదుకుని నిలద్రొక్కుకునేలాగా చేశాయి.

అరణ్యకాండ, అరణ్యపర్వం చదువుకునే రోజుల్లో గూడా మనకు ఇలాంటి మార్పులే వస్తాయి. అంతవరకు తండ్రిచాటు బిడ్డగా, లోకజ్ఞానం లేకుండా పెరిగినవారు సంపాదన నిమిత్తం ఉద్యోగాల వేటలో అనుభవాన్ని గడిస్తారు. అప్పుడే వారిలో అంతవరకు నిద్రాణమై వున్న శక్తిసామర్థ్య నైపుణ్యాలు (Inner Talents) బయటపడతాయి. అంటే అవసరానికి తగిన వనరులను, ప్రణాళికలను, సహాయ సహకారాలను ఏర్పరచుకోవడంలో (Equip) సతమతమౌతారు. నిజంగా మనుష్యులు భౌతికంగానూ, మానసికంగానూ, ఆధ్యాత్మికంగానూ గూడా ఎదిగేది ఇలాంటి సమయాల్లోనే తప్ప హాయిగా చీకూచింతా లేకుండా గడిచిపోయే కాలంలో కాదు. ఇలాంటి సందర్భంలో జరిగే మార్పులు ఎలా వుంటాయో మచ్చుకు కొన్ని చెప్తాను మీరే ఆలోచించండి!

అంతవరకూ తల్లిదండ్రులను, కుటుంబ సభ్యులను అంటిపెట్టుకుని వున్న ఆడపిల్ల పెళ్లై అత్తవారింటికి వెళ్లడం జరుగుతుంది. తల్లిదండ్రులకు ఆ పిల్ల దూరమౌతుంది. ఇలా జరగడం కష్టం అనుకోవాలా? కావలసినదే జరిగిందని అనుకోవాలా?

అంతవరకూ తమతోనేవున్న అబ్బాయి ఉద్యోగం బదిలీ అయి దూరప్రాంతానికి వెళ్లవలసి వస్తుంది. తండ్రికి దూరమైనా, వ్యక్తిగతంగా క్రొత్త ప్రదేశంలో ఎంతో ఎదుగుతాడు. క్రొత్తవారితో పరిచయాలూ, పేరు ప్రతిష్ఠలు సంపాదిస్తాడు. ఇలా జరగడం చెడ్డనుకోవాలా? మంచి అనుకోవాలా?

చేసిన తప్పుడు పనులు మోసాలు బయటపడి శిక్షకుగురై అటు పైన జీవన విధానాన్ని మార్చుకుని హాయిగా బ్రతకడం జరుగుతుంది. ఇలా జరగడం మంచికి జరిగిందను కోవాలా? చెడుకు జరిగిందనుకోవాలా?

భార్యాభర్తల మధ్య అనుమానాల అగ్నిపర్వతాలు బ్రద్దలై అటు పైన అనురాగ బంధాలు గట్టి పడతాయి. ఇలా జరగడం మంచి అను

-లా?

ంనల్లో తాత్కాలికమైన ఇబ్బందులకు గురియై, కష్టాలను

ట్టన పరిష్కారాలు పొందడం జరుగుతోందన్న సంగతి గ్రహిస్తే అరణ్యకాండ, అరణ్యపర్వం చదువుకో వచ్చునో చదువుకోగూడదో అనే విషయానికి సమాధానం వస్తుంది.

'అన్ని కాండాలలోను ఉన్నది ఆరాధ్య దైవం అయిన శ్రీరాముని కథే గధా!' అనే భావన వచ్చినవారే నిజమైన ఆధ్యాత్మిక సాధకులు. ఈ స్థితికి వచ్చిన సాధకులకు రామాయణం గురించి మరొక క్రొత్త దృక్పథాన్ని (New Dimension) దర్శింప జేస్తాను.

ఆదర్శప్రాయ జీవితంతో ఆరాధ్య దైవం అయిన శ్రీరాముని చరిత్రను తెల్పే కావ్యమే రామాయణం. ఇది ఇతిహాస ద్వయంలో మొదటిది. రామాయణ, భారత, భాగవతాలను పరమేశ్వరుని మూడు నేత్రాలతోన

పోల్చవచ్చు. పరమేశ్వరుని దక్షిణ నేత్రం సూర్యతత్త్వ ప్రతీక– రామాయణం గూడా సూర్యవంశరాజ చరిత్ర. అందుకని రామాయణం పరమేశ్వరుని దక్షిణ నేత్రం అనవచ్చు. పరమేశ్వరుని వామనేత్రం చంద్రతత్త్వ ప్రతీక – భారతం గూడా చంద్రవంశస్థులైన కురుపాండవ చరిత్ర. అందుకని భారతం పరమేశ్వరుని వామనేత్రం అనవచ్చు. ఇక పరమేశ్వరుని ఫాలనేత్రం పరంజ్యోతికి ప్రతీక. భాగవతంగూడా ఆ పరంజ్యోతి స్వరూపుడైన పరమాత్మ చరిత్ర. అందుకని భాగవతం పరమేశ్వరుని ఫాలనేత్రం అనవచ్చు.

ఇంకో రకంగా చెప్పుకోవాలంటే భాగవతం మన ఆత్మ వికాసానికి, భారతం మన బుద్ధి వికాసానికి రామాయణం మన హృదయ వికాసానికీ వ్రాయబడిన గ్రంథాలనవచ్చు. అందుకే రామాయణం హృదయాలను కరగింప జేస్తుంది. "రామాయణాన్ని మించిన కావ్యం ప్రపంచంలో ఇంతవరకూ ఏ భాషలోనూ గూడా ఏ కవీ వ్రాయలేదు, ఇక ముందుగూడ వ్రాయబడబోదు." అని అందఱు విజ్ఞులు వప్పుకున్న సత్యం!

ప్రతి ఇతిహాస కథ నాలుగు విషయాలను తెలియజేస్తుంది. (1) చారిత్రాత్మక విషయం (Historical fact) (2) శాశ్వత సత్యం (Eternal truth) (3) ఆవర్తిత విషయము (Periodical fact) (4) ఆధ్యాత్మిక విషయము (Spiritual fact) ఇతిహాసమైన ఈ రామాయణం గూడా ఈ నాలుగు విషయాలను తెలియజేస్తుంది.

1) త్రేతాయుగంలో ఒకప్పుడు జరిగిన ఒక గాథను వివరిస్తుంది. ఇది చారిత్రాత్మక విషయం.

2) ఎప్పుడు అధర్మం విజృంభించి ధర్మానికి గ్లాని ఏర్పడ్డా తిరిగి ఒక అవతారమూర్తి వలన ధర్మం పునఃస్థాపితమౌతుంది. ఇది శాశ్వత సత్యం.

3) పరకాంతా వ్యామోహం గల రావణుడిలాంటి వాడు ఎప్పుడు పుట్టూ ఉన్నా, వాడి రోగం కుదర్చగల రాముడులాంటి వాడు పుట్టి తగిన గుణపాఠం నేర్పుతూ వుంటాడు. మరల ఇదే రామాయణం లాంటి కథ జరుగుతూ వుంటుంది. ఇది అవర్తిత విషయం.

4) ప్రతి మానవునిలోను జరిగే ఒక ఆధ్యాత్మిక సత్యాన్ని గూడా తెలియ జేస్తుంది.

పై వాటిలో మొదటి మూడు విషయాలను వివరించాల్సిన అవసరం లేదు. కాని నాల్గవ విషయాన్ని కొద్దిగా వివరించి రామాయణాన్ని ఆధ్యాత్మికంగా ఎలా అన్వయ పరచుకోవాలో తెలుసుకుందాం.

ఒక శాశ్వత సత్యాన్ని. లేదా తత్త్వాన్ని వివరించడం కోసం మనస్సుకు నచ్చేట్లు దాన్ని ఒక కథావస్తువుతో సమన్వయిస్తూ, కావ్యంలాగా రచించే పద్ధతిని ఆంగ్లంలో Veiled writings అంటారు. లేదా Allegoric writings అనిగూడా అనవచ్చు. బనియన్ మహాశయుడు వ్రాసిన Pilgrims Progress గ్రంథం ఇలాంటిదే! వేద వివరణకై వ్రాసిన పురాణ కథలన్నీ ఇలాంటివే! ఇతిహాసాలు గూడా అదే పద్ధతిలో వ్రాయబడ్డాయి. బైబిల్ గ్రంథంలోని కథలూ ఇలాంటివే! జీసస్ (ఏసు ప్రభువు) గూడా "I speek through parables and fables" అన్నాడు. ప్రతి మానవునిలో జరిగే కథనే కావ్యకథా రూపంగా తీసికుంటే అది ఆధ్యాత్మిక గ్రంథమవుతుంది. సునిశితంగా పరిశీలిస్తే రామాయణంలో ఈ ఆధ్యాత్మికాన్వయాన్ని గుర్తించవచ్చు.

ఆధ్యాత్మికాన్వయం

ప్రతి మానవునిలో అంతఃకరణమనే దశరథుడు హృదయమనే పాలిస్తూ వుంటాడు. ఈ అంతఃకరణావలంబనములైన గుణములే దశరథుని భార్యలైన కౌసల్యా సుమిత్రా కైకే

యిలు. జాగ్రత్, స్వప్న సుషుప్తులకు ప్రతీకలే లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు. తురీయమైన ఆత్మ స్వరూపుడే శ్రీరాముడు. ఆత్మతో క్రీడించు బుద్ధియే సీతాదేవి. బుద్ధిని ఆత్మతో జోడించుట యోగము. ఈ యోగమే మానవ ధ్యేయము. ఈ యోగమునకు–ఇంద్రియములకు లోబడిన మనస్సు ప్రతిబంధకము. మనలోని కామక్రోధాదులనే రాక్షస సైన్యంతో సంసార సముద్రంలో దిగబడిన దేహమనే లంకను దశేంద్రియములు (ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు) అనే పది తలలతో పరిపాలిస్తున్న వాడే మన మనస్సనే రావణాసురుడు. ఇంద్రియ లౌల్యానికి గురియైన ఈ మనస్సు అనే రావణుడు బుద్ధి అనే సీతను తనవైపు లాక్కుని వశపరచు కుందామని ప్రయత్నించుటయే సీతాపహరణము. ప్రాణాపానవాయువులకు ప్రతీకలే వాలి సుగ్రీవులు. అవి ఎప్పుడూ ఎదురు బదురే! అంటే వ్యతిరేక మార్గమే. వీటి మధ్యగల బ్రహ్మనాడియే వాయు సుతుడైన ఆంజనేయుడు. సంసార ప్రభావమునకు గురికాకుండా బ్రహ్మయందే చరింపజేయు బ్రహ్మ నాడికి ప్రతీకయైన ఆంజనేయుని వలన ఈ సంసారమనే సముద్రము దాట బడును. అట్టివానికి మరల బుద్ధిని కనుట జరుగును. అదియే సీతా దర్శనము. సంసార సముద్రంలోని దేహము లంక. ఈ దేహము మీద ప్రీతిని విడనాడి భ్రాంతి తొలగవలెననుటయే లంకా దహనము.

ఈ మనస్సు యొక్క రాజస గుణమునకు ప్రతీకయే రావణుడు. సత్త్వగుణ ప్రతీక విభీషణుడు. తమోగుణ ప్రతీక కుంభకర్ణుడు. దేహ భ్రాంతి తొలగిన మనస్సులోని సత్త్వగుణ ప్రతీకయైన విభీషణుడు ఆత్మయగు రాముని శరణు కోరగా రజోగుణ తమోగుణ ప్రతీకలైన రావణ కుంభకర్ణులను కూల్చుట జరుగును. ఈ ప్రయత్నమునకు సంసార సముద్రము అడ్డుగా నుండును. దీనిని దాటుటకు నాడులు అనే వానర సైన్యముతో సేతువు కట్టవలెను. సంసార సముద్రములోని కష్ట సుఖములు అను అలల ప్రభావము లేకుండ చేయు యోగ నిష్ఠయే ఈ సేతువు. బ్రహ్మశరముతో నాభికుండలిని భేదించినచో మనస్సను రావణబ్రహ్మ తొలగును. అప్పుడు బుద్ధి ఆత్మతో కలియుటయే సీతారాముల పునస్సమాగమము. అదియే సమాధి స్థితి. ఇదియే మానవ ధ్యేయమగు యోగ సాధనకు ప్రతిఫలము.

# శ్రీమద్రామాయణము
## (అరణ్యకాండ)
## సంక్షిప్త ఇతివృత్తం

కైకేయి వరాన్ననుసరించి శ్రీరాముడు అరణ్యవాసానికి బయలు దేరితే సీతాలక్ష్మణులు గూడా శ్రీరాముణ్ణనుసరిస్తారు. దండకారణ్యం ప్రవేశిస్తారు. దట్టమైన దండకారణ్యంలో విరాధుడనే రాక్షసుణ్ణి రాముడు సంహరించి పూర్వజన్మలో తుంబురుడైన అతనికి శాపవిముక్తిని కలుగ జేస్తారు. శరభంగ మహామునిని సందర్శిస్తారు. శరభంగాశ్రమ వాసులకు అభయం చెప్పి, సుతీక్ష్ణాశ్రమం చేరుకుంటారు. అక్కడ మునిజనులకు అభయం చెప్పి అగస్త్య ఆశ్రమానికి వచ్చి అగస్త్యభ్రాత ద్వారా అగస్త్యుని మహిమలు వింటారు. అగస్త్యుడిచ్చిన ఆతిథ్యాన్ని, ప్రశంసలను అక్షయ తూణీరాలను పొంది ముని సలహా మేరకు "పంచవటి"ని చేరడానికి బయలు దేరతారు. మధ్యలో జటాయువుద్వారా సృష్టికి సంబంధించిన ప్రజాపతుల గూర్చి మానవ, మృగ, పక్షి, వృక్షజాతుల వంశక్రమం గూర్చి తెలుసు కుంటారు. పంచవటీ సమీపంలో చక్కని పర్ణశాలను ఏర్పాటు చేసు కుంటారు.

ఒకరోజున సీతారామ లక్ష్మణులు ముగ్గురు హాస్య సంభరిత సరసోక్తులతో ఆనందిస్తూ వుండగా పర్ణశాల ప్రాంతానికి శూర్పణఖ వస్తుంది. రాముణ్ణిచూచి మోహపడితే రాముడు ఆమెను లక్ష్మణుని దగ్గఱకు వెళ్ళ మంటాడు. లక్ష్మణుడు ఆమెను తిరిగి రాముని దగ్గఱకే పంపుతాడు. రాముడు తనను స్వీకరించక పోవడానికి సీతే కారణమని ఆమెను హత మార్చే ఉద్దేశ్యంతో తన భయంకర రూపంతో సీతమీద విరుచుకు పడ పోతే లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు, చెవులను కోసి పంపిస్తాడు.

శూర్పణఖ తనగోడును ఖరదూషణాదులతో మొరపెట్టుకుంటుంది. అప్పుడు వాళ్లు పదునాలుగువేలమంది సైన్యంతో రాముణ్ణి ఎదిరిస్తారు. అందర్నీ రాముడొక్కడే అనాయాసంగా సంహరిస్తాడు. జనస్థానంలోని సర్వమునులు, ఋషులు నిర్భయులౌతారు.

జరిగిన వృత్తాంతాన్ని అకంపనుడనే రాక్షసుడు రావణునికి తెలివిగా ఎఱుక పరచి, రాముని బలపరాక్రమములకు సీతా సౌందర్యమే కారణం అని రావణుని ప్రలోభ పెడ్తాడు. రావణుడు మారీచుని దగ్గఱకు పోయి సీతాపహరణంలో తనకు సహాయపడ వలసినదిగా కోరతాడు. మారీచుడు చెప్పాల్సిన నాలుగు మాటలు చెప్పి హితబోధచేసి పంపేస్తాడు. శూర్పణఖ తన సహజమైన వాక్చాతుర్యంతో రావణుని దగ్గఱ సీతా సౌంద ర్యాన్ని వర్ణించి దమ్ముంటే దక్కించుకొమ్మని ప్రేరేపిస్తుంది. రావణుడు మళ్లీ మారీచుని దగ్గఱకు వెళ్లి తన నిశ్చయానికి ఎదురులేదు అని చెప్పి బయలుదేర మంటాడు. మారీచుడు చెప్పాల్సిన హితవచనాలు చెప్పి చేసేదిలేక బంగారు లేడిగా పర్ణశాల ప్రాంతంలో తిరుగుతూ సీతను ప్రలోభ పెడతాడు. సీత కోరంగానే లక్ష్మణుని సీతకు కాపలాగా వుంచి రాముడు లేడిని వెంబడిస్తాడు, ఎంతకూ ప్రాణాలతో చిక్కకపోతే లేడిని బాణంతో కొడ్తాడు. మారీచుడు చచ్చిపోతూ "లక్ష్మణా!" అని కేకపెట్టి పోతాడు. ఆ కేక విని రామునికేదైనా ఆపదవచ్చి వుంటుందని ఎంత చెప్పినా వినకుండా లక్ష్మణుణ్ణి రాముని దగ్గఱకు వెళ్లమని సీత నిర్బంధ పెడుతుంది. సీత సూటీపోటీ మాటలు భరించలేక లక్ష్మణుడు సీతను ఒంటరిగా పర్ణశా లలో వదిలి రాముని దగ్గఱకు వెళ్తాడు.

పర్ణశాలలో ఒంటరిగా వున్న సీత దగ్గఱకు కపట సన్యాసి రూపంలో రావణుడు వచ్చి సమయంచూచి సీతను ఎత్తుకు పోతాడు. లక్ష్మణుణ్ణి తాను అన్నమాటలకు సీత పశ్చాత్తాప పడి తన దైన్యస్థితికి తానే కారణం అని దుఃఖిస్తుంది. మార్గమధ్యంలో జటాయువు సీతను గుర్తుపట్టి

రావణునితో యుద్ధంచేసి సీతను రక్షించడానికి యథాశక్తి ప్రయత్నిస్తాడు. రావణుడు జటాయువు రెక్కల్ని విరగ్గొట్టి కొనప్రాణంతో విడిచి పెడతాడు.

ఋష్యమూక పర్వతంమీద కొందరు వానరులు కనబడితే ఎందుకైనా మంచిదని సీత తన కొంగు చింపి నగలను మూటకట్టి రావణునికి తెలియకుండా క్రిందకు జారవిడుస్తుంది. ఆ మూటను వానరులు పట్టుకుంటారు. రావణుడు సీతను లంకలో నిర్బంధించి మంచి కట్టుదిట్టం చేస్తాడు. లంకా పట్టణ సౌందర్యాన్ని, తన రాచరికాన్ని చెప్పి సీతను ప్రలోభ పెట్టినా సీత నిర్లక్ష్య భావంతోనే వుండడంతో సీతను భయపెట్ట వలసినదిగా పిశాచ రూపులైన రాక్షసులను ఏర్పాటు చేస్తాడు.

అవతల రాముని బాణానికి లేడి చచ్చి మారీచుడు బయట పడతాడు. రాముడు అసలు సంగతి గ్రహిస్తాడు. తనను వెతుక్కుంటూ వస్తున్న లక్ష్మణుని చూడంగానే రాముడు గతుక్కు మంటాడు. ఇద్దరూ కలసి పర్ణశాల వద్దకు వచ్చి సీతకోసం వెతుకుతారు. సీత కనబడదు. సీత వియోగానికి రాముడు అమితంగా దుఃఖిస్తాడు. వెదక వలసిన ప్రదేశాలన్నీ వెదుకుతారు. చివరకు కొన ప్రాణంతో వున్న జటాయువును చూస్తారు. జటాయువు ద్వారా సీత సంగతి తెలుసుకుంటారు. జటాయువుకు రాముడు ఉత్తర క్రియలు చేస్తాడు.

రామ లక్ష్మణులకు మార్గ మధ్యంలో అయోముఖి అనే రాక్షసి తారస పడుతుంది. దాన్ని సంహరించి వెళ్తూంటే వికృత రూపంతో కబంధుడనే రాక్షసుడు కనబడతాడు. కబంధుని చంపి అతని పూర్వ వృత్తాంతాన్ని తెలుసుకుంటారు. సుగ్రీవునితో సఖ్యం చేసుకోమని కబంధుడు సలహా ఇచ్చి పై లోకాలకు వెళ్లిపోతాడు. మతంగాశ్రమంలో అమాయకురాలైన శబరి అతిథ్యాన్ని స్వీకరించి, కబంధుడు చెప్పిన సుగ్రీవుడెక్కడ వుంటాడా అని వెతుక్కుంటూ పంపాసరస్సు ఒడ్డు వెంబడే నడుస్తూ వెళ్తారు.

శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## అరణ్యకాండ

సీతారామ లక్ష్మణులు దండకారణ్యం ప్రవేశించారు. పరిసరాలను, వాతావరణాన్నిబట్టి చూస్తే దగ్గరలోనే ఋష్యాశ్రమాలు ఉండి ఉంటాయని అనిపిస్తోంది. ఇంతలోనే కొందరు బాలబాలికలు ఎదురు రావడం కనిపించింది. సీతారాములు వస్తున్నట్లు ఎలా తెలిసిందో ఏమో పూల దండలతో ఆ పిల్లలు ఎదురు వస్తున్నారు. వింటినుండి అల్లెత్రాటిని జార్చి వస్తున్న రాముడు — పడగ దీర్ఘంగా పరగించి తోక జార్చిన నాగరాజుతోకూడిన శివునిలా వున్నాడు. ఆశ్రమ ప్రాంతానికి రావడం తోటే రామునికి ఒక్కసారి శీతలోపచారం జరిగినట్లయింది. చెట్లన్నీ పచ్చగావుండి వాటిపైన ప్రశాంతమైన వాతావరణంలో పక్షుల కలకూజితాలు స్వాగతం పలుకుతున్నట్లు ఉన్నాయి. ఋషుల పిల్లలతో సీతారామలక్ష్మణులు ముగ్గురూ ఋష్యాశ్రమాలకు వచ్చారు. మునులు రామచంద్ర ముఖపద్మాన్ని చూసి మురిసిపోయారు. మునిపత్నులు జానకీదేవికన్నులు, బుగ్గలు, ముంగురులు చూస్తూ ఉండిపోయారు. ఎంతోసేపటికి కాని—వారికి కర్తవ్యం గుర్తుకు రాలేదు. అర్ఘ్యపాద్యాదులిచ్చారు. ఫలాశన కందమూలాలు ఇచ్చారు. సీతారాములు అవి ఆరగించిన తర్వాత మునులు రాముని సమీపించి—

"ఈ భూమిని ఎంతోమంది పరిపాలిస్తారు. ప్రస్తుతము నీవు భూపాలకుడవు. మేము పాలితులము. శమదమాది అంతరింద్రియ గుణములు, అధ్యయన, అగ్నిహోత్ర, తపోదానాది నిత్యకర్మలు మాకు సత్యధర్మాలు. నీవు ధర్మాన్ని పాలించేవాడివి. నీ పరిరక్షణలో మా నిత్యకర్మలు వర్ధిల్లాలి. ఇది పాలక పాలితుల సంబంధము. ఈ శరీరాలు, చేతులు, కేవలము అర్చనాదులకే అంకితము కాని శత్రు సంహారానికి తగనివి. మరి నీవు ఆ సంగతి చూడకపోతే మాకింక శరణు వేరెవరయ్యా?" అన్నారు. రాముడు

వారందరిని స్వాంతనపరచి శరణాగతి ప్రసాదించి ఆ రాత్రికి అక్కడే విశ్రమించాడు. మరునాడు ఉదయము మునులవద్ద సెలవు తీసుకొని ప్రయాణమైనాడు.

# విరాధ వధ

సీతారామ లక్ష్మణులు ముగ్గురూ దట్టమైన అడవిలో ప్రయాణిస్తున్నారు. దారి దుర్గమంగా ఉంది. గుబురుచెట్ల కొమ్మలు దారికడ్డువస్తున్నాయి. కొనలు తేలిన రాళ్లు కాళ్లల్లో గుచ్చుకొంటున్నాయి. చెట్ల కొమ్మల రాపిళ్లకు, ఆకుల కదలికలకు పొడవైన చెట్ల ఊపులకు పుట్టిన వింతవింత ధ్వనులు చెవులలో గింగురుమంటూ సుళ్ళు తిరుగుతున్నాయి. మధ్యమధ్యలో వన్యమృగాల గంభీర రవాలు పర్జన్య గర్జనల్లా వున్నాయి. ఎదురుగా బెదిరిన లేళ్ల వడివడిగా దుముకుతూ భూమ్మీదకంటే ఆకాశంలోనే ఎక్కువభాగం ఉంటున్నాయి. ఆకాశం మేఘావృతం అయింది. మెరుపులు మిణుగురు పురుగుల్లా మురిపిస్తున్నాయి. లతా గుల్మములు కాళ్ల కడ్డంబడి చుట్టవేసుకుపోతున్నాయి. క్రిందపడుతూ లేస్తూ చుట్టుకొనిన తీగల్ని విడదీసుకుంటూ నడుస్తున్నారు. సీత బాగా అలిసిపోయింది. ఐనా ఓర్చుకుని నడుస్తూ కాస్త ఆగి 'దాహం తీర్చుకుందాం చెరువు ఒడ్డు ఏదైనా కనిపిస్తోందేమో చూడండి' అంది. "అయోధ్యనువదలి విశ్రాంతి తీసుకోడానికి ఇక్కడకు వచ్చావేమి?" అన్నాడు రాముడు. "అక్కడ మటుకు మహా విశ్రాంతి ఉన్నట్లు! తండ్రి ఐన రాజు ఈ లోకాన్నే విడిచాడు. కొడుకు అడవుల పాలైనాడని దుఃఖంలో మునిగిన తల్లి, అన్నగారు వదలిన చెప్పుల్ని కూడా అయోధ్యలో కొలువ నిష్టపడని తమ్ముడు– అలాంటి అయోధ్యలో ఏం విశ్రాంతని చెప్పను?" అని ఊరుకుంది జానకి. ముగ్గురూ మాట్లాడకుండా కొంతదూరం నడిచారు. "కొంప తీసి తానన్న మాటలకు నాధుడికి కోపం రాలేదు కదా అనీ, తానే మళ్లీ

ఏదో ఒకటి మాట్లాడాలని" అనుకొని "మనమేదో మరుల తీగ తొక్కినట్లు అనిపిస్తోంది. లేకపోతే ఏమిటిది. ఒక త్రోవంటూ లేదు, చెరువు సంగతి సరేసరి! ఏం అడవో ఏం పాడో" అంది. అందుకు రాముడు—

"మరులు కొన్న మీదటేగదా ఈ ఘోరారణ్యానికి భర్తతోపాటు వచ్చింది" అన్నాడు. దానికి సీత "ధర్మాన్ని అనుసరించాను గాని భర్తను కాదు అంది" అందుకు రాముడుఏదో అర్థమైనట్లు తల త్రిప్పుతూ ముందుకు నడిచాడు. భ్రుకుటి ముడితో అభిమాన హృదయుడు రాముడూ, శ్రమవల్ల అలసటతో కొద్ది దుఃఖపడుతూ సీత ముందుకు మందంగా నడుస్తున్నారు. కాస్త అలికిడి ఐతే చాలు చిన్న చిన్న జంతువులు బెదిరి మహా చురుగ్గా పరిగెత్తుకుపోతున్నాయి. అంతలోనే కాస్తదూరంగా ఒక చెరువు కనబడింది. కాని ఒడ్డుకు వెళ్ళడానికి వీలు కాకుండా దారి పొడవునా ముళ్ల కంచెలు దట్టంగా వున్నాయి. లక్ష్మణుడు కత్తితో కంచెలను కత్తిరించి త్రోవ ఏర్పర చాడు. రాముడు కొంతదూరం వెళ్లి నిలుచుండి పోయాడు. సీత గూడా అల్లాగే నిలబడిపోయింది. లక్ష్మణునికి ఇదేమీ తెలియక నీళ్లల్లోకి దిగ బోయాడు. అంతే! వెనకనుంచి భీషణమైన కర్ణకఠోరమైన ధ్వని వినపడింది. అది జంతువు అరుపులా లేదనిగమనించి, రాముడు సీతను పట్టుకొని ప్రక్కనే ఉన్నాడని అనుకొని వెనక్కితిరిగి చూశాడు. రాముడు కూడా వెనక్కు తిరిగి చూశాడు. రాముడు సీత వైపు చూశాడు. గుహలాగా తెరువ బడిన పెద్ద నోటితో, ఘోరమైన ఆకారముతో ఉన్న ఒక పెద్ద రాక్షసుడు కనబడ్డాడు. వాడు మదించిన అడవి ఏనుగులా వున్నాడు. సీతను ఒక చేత్తో పట్టుకొన్నాడు. సీత విదిలించుకున్నా గట్టిగా పట్టుకొని పోనీయడంలేదు. పులితోలు ఒంటికి కప్పుకుని ఉన్నాడు. ఒళ్లంతా రక్తమాంస భూయిష్ఠంగా ఉంది. మాంసంతో పూర్తిగా నిండిన బానపొట్ట, భుజం మీద పెద్ద శూలం, దాని చివర నాలుగు పులులు, మూడు సింహాలు, రెండు తోడేళ్ళు, పది లేళ్లు గ్రుచ్చబడి వ్రేలాడుతున్నాయి. శూలాన్ని ఒక చేతి జబ్బతో నొక్కి

పట్టి, అది చాలదనట్లు అరచేతిలో రక్తం కారుతున్న ఏనుగు తల ఒకటి వుంది. ఒక పెద్ద శ్రావణ మేఘంలా వుండి గర్జిస్తున్నాడు. రాముడు సీత యొక్క దైన్యస్థితి చూశాడు. లక్ష్మణుడూ చూశాడు. ఇద్దరూ నివ్వెరపోయారు. అప్పుడా రాక్షసుడు గర్వంతో "నా పేరు విరాధుడు" అంటూ పెద్ద వికటాట్టహాసం చేసి —

"ఏం అలా పెట్టారు ముఖాలు ? నా పేరే వినలేదా? చూడొస్తే ఈ ప్రాంతానికి ఎప్పుడూ మీరు రాలేదల్లే ఉందే! ఒక వర్ణానికి సంబంధించకుండా రెండు వర్ణాల చిహ్నాలు కనబడుతున్నాయి మీ వేషాల్లో. మీరు తప్పక దురాత్ములే ఐ వుండాలి. లేకపోతే ఒక ప్రక్క జటలు, నారబట్టలు, వేరొక ప్రక్క విల్లంబులు. ఆమెను చూడబోతే రత్నమయ భూషాలంకృత శరీరంతో అంతఃపుర స్త్రీలా వుండటం, ఇందులో ఏదో మోసం వుంది. మీరు ఈ కోమలాంగిని ఏ అంతఃపురంలోంచి పట్టుకువచ్చారు ? పట్టుకు వచ్చారు సరే! రాక రాక ఈ అరణ్య ప్రాంతానికే రావాలా? ఆ ప్రాంతంలో గూడా యముడు లాంటి ఈ విరాధుడు ఉన్న చోటికే వచ్చారేం? నా వీపు మీద శూలానికి గుచ్చబడి వున్నవి చూశారుగా? ఆ శూలంతోనే మిమ్మల్ని గుచ్చితే ఏమౌతారో ఊహించారా ? మరి ఎటో పోకుండా ఇటు వచ్చారు. నా పంట పండింది. మీ మాంసాన్ని జంతుమాంస భక్షణంలో నంజుకొని ఆమెను ఇల్లాలుగా చేసుకుంటాను. ఈ మధ్య తపస్వీజనం గూడా ఇటు రావటం లేదు. ప్రతిపూటా ఏనుగు మాంసం తినీ తిని మొహం మొత్తుతోంది. మనుష్యుల్ని తినే పులి మాంసమే రుచి అనుకుంటే అచ్చమైన మనుష్యుల మాంసం ఇంకెంత రుచిగావుంటుందో చెప్పగలమా? మరింకెందుకు ఆలస్యం – త్వరగా స్నానం చేసి రండి" అంటూ పెనుగులాడుతున్న సీతను వదిలించి మళ్ళీ — "అసలు మీదే దేశం? మీరు బ్రాహ్మణులా? క్షత్రియులా? శూద్రులా? శూద్ర మాంసం తినడం నా కలవాటులేదు. ముందు మీరెవరో తెలియందే మిమ్మల్ని తినను. చెప్పండి మీరెవరో" అన్నాడు.

# అధైర్యపడిన సీతారాములు

జానకి రామునితో "నీవు నాకు దూరంగా ఉండిపోయావు గాని దగ్గరుంటే నీ కత్తికి ఈ దుర్మార్గుడు రెండు ముక్కలు అయ్యేవాడు గాని నన్నిలా ముట్టుకునేవాడా? 'ఏమౌతానోనని కూడా ఊహించకుండా అడవుల్లోకి నా వెంటబడి వస్తున్నావు,' అని అన్న నీ నవ్వులాట మాటలే నాపట్ల ఇప్పుడు నిజమైనాయిగదా ! ఓ ప్రభూ! నీకు తోడుగా తండ్రి లేడు, తల్లీ లేదు, ఇంతవరకు నీ భార్యగా నేనైనా ఉన్నానని అనుకున్నాను. ఇకముందు నీకు భార్యకూడా వుండదు. ఇలా నిన్ను విడచి దూరమౌతున్నందుకు నన్ను క్షమించు నాథా" అంది. దీనాతి దీనంగా అన్న సీత మాటలు వింటూ, సీత నిస్సహాయ స్థితిని చూడటానికి చిత్తంలో ధైర్యం చాలక బాధతో రాముడు లక్ష్మణుణ్ణి చూచి–

"నా సీతను చూశావా లక్ష్మణా! అడవులకు వస్తే ఇంత విపత్కర పరిస్థితి వస్తుందని ఊహించనైనా లేదు గదా! ఈ భూజాత సీత వెంట వుంటే దుర్భరమైన, దుర్గమమైన ఈ వనవాస క్లేశానికి కొంత ఉపశమనముగా ఉంటుందని వస్తానంటే ఒప్పుకొని తీసుకువచ్చాను. లోభబుద్ధిగాని, కామబుద్ధిగాని ఉంటే పర్యవసానం ఇలాగే ఉంటుందని తేలిపోయింది. చూశావా? మొదట్లో వొద్దనే అన్నాను. విన్నదా? నావంక ఎంతో జాలిగా, ప్రేమగా చూసి బలవంతపెట్టి చివరకు వచ్చేసింది. ఇప్పుడిలా అయింది. ఆ మిథిలా నగరవాసు లందరూ ఏమనుకుంటారు? 'ఏదో పుచ్చు విల్లు విరిచి వైదేహిని నేను రక్షించుకోగలనని చచ్చు ప్రతాపము చూపి మనల్ని మోసం చేశాడు' అని అనుకోరూ? పినతల్లి కైకేయి ఇదేదో ఇలా అవాలని, అవుతుందని ముందే ఊహించి ఇలా వనవాసానికి పంపి ఉంటుంది. అంతకీ జానకి ఆమెయందు శ్రద్ధా భక్తులతో పరిచర్య చేసుకున్నదే ! ఆ పరిచర్యకు గూడా ఆవిడకు జాలి కలుగలేదు. ఇదంతా నేను చేసుకున్న పాపము. భార్య సుఖం

నాకు లేదు అంతే! పితృవియోగం కూడా అనుభవించిన వాణ్ణే! కాని ఈ జానకీవియోగం భరించలేను. ఆ పినతల్లి వరాలు నాకూ, నీకూ తగలడంతో సరిపుచ్చక సీతకు కూడా తగలాలా?'' అన్నాడు. గుడ్లలో నీరు నిండింది. సౌమిత్రి స్వామిని చూసి—

## లక్ష్మణుని ధైర్యవచనాలు

"అన్నా! నీవేమంటున్నావో నాకు అర్థం కావడం లేదు. నీవు ఒక్క బాణం వేస్తే అది వీణ్ణి చంపి పిండంలా చేయగలదు. తల్లికి అంత దుఃఖం ఎందుకు వస్తుంది? ఇంకా నువ్వు దగ్గరగానే ఉన్నావనుకున్నాను. ఐనా ఇప్పుడు పోయిందేముంది ? సర్వలోక రక్షకుడవైన నీవే ఇలా దీనంగా మాట్లాడటం ఏమి సబబు? యావద్భూగోళాన్నే మట్టుపెట్టగల నీ ధనుస్సు గురించి తెలియనట్లు ఉంటావేం? శివధనుస్సే పుచ్చుతుందని, విరిగిన ముక్క నెత్తిన మహా బలశాలిఅని అనుకునే మైథిలుడెవ్వడు? సరే ఈ మాటల కేమిటి గాని విను. ఒక్క బాణంతో మట్టికరచేలా చేస్తాను చూడు" అంటూ విరాధునితో—

"నువ్వు మేమెవరమో తెలియందే తినవంటున్నావు. నువ్వు ఎవరో తెలియందే మేము నిన్ను చంపము. అడవిలో ముష్టి తిండి మరిగి ఈ వన మార్గాన్నే నాశనం చేస్తున్నావు. అసలు నువ్వెవరు? అన్నాడు. లక్ష్మణుని మాట పూర్తి కాకుండానే విరాధుడు ఒక పెద్ద వికటాట్టహాసం చేసి— " మీ రెవరూ? ఎక్కడికి పోతున్నారని మొదట్లో నేను అడిగితే చెప్పలేదు సరికదా ఇప్పుడు నన్నే అడుగుతావా? నా ఒక్క పిడికిలి పోటుతో మటు మాయ మయ్యే మీకు ఇది తగిన పనికాదు" అంటూ విజృంభించిపోయాడు. అప్పుడు రాముడు విరాధునితో—

## రాముని పరిచయ వాక్యాలు

"నీవు అన్నట్లుగా మా గురించి మేమే ముందు చెప్పాలి సరే! మేమిద్దరము రామలక్ష్మణులము. ఈమె వైదేహి. ఈమెను మేము దొంగిలించలేదు. మిథిలా నగరంలో నిండు సభలో శివ ధనుస్సు వంచి ఈమెను గ్రహించాను. పితృవాక్య పరిపాలనకై ఇలా ఈ వనాలకు వచ్చాను." అన్నాడు. సీత రాముని ఆ పలుకులు విని స్వామి తన కోపాన్ని ఆదరంగా అభినయిస్తున్నా డనుకొంది. లక్ష్మణుడు మాత్రం రాక్షసునితో సభ్యతా, మర్యాదా ఏమిటి అనుకున్నాడు. విరాధుడు రాముని మాటలు విని–

"నా తండ్రి జయుడు. తల్లి శతహ్రద, రాక్షసులందరూ నన్ను విరాధుడంటారు. నేను తపస్సుచేసి బ్రహ్మను మెప్పించి వరాలు పొందాను. సర్వ శస్త్రాలు నన్నేమీ చెయ్యలేవు. అవి నన్ను వధించలేవు సరికదా బాధించలేవు. కనీసం ఛేదించనైనాలేవు. ఇంకెందుకు? ఈమెనిక్కడ వదలి మీఇద్దరూ మీ దారిన పొండి. తండ్రి మాటమీద అడవికి వచ్చామని చెబుతున్నావు. అలాంటి మిమ్మల్ని తినడం ఎందుకులే వెళ్లండి" అన్నాడు. రామునికి కోపం వచ్చింది. రోషకషాయత నేత్రుడై–

"ఒరే దైత్యుడా! భూమిమీద నాలుగుకాలాలపాటు వనగజ సింహాదుల్ని తినాలని బుద్ధి ఉంటే సీతను వదలి నీదారిన నీవుపో" అన్నాడు. విరాధుడు పెద్దగానవ్వి "నన్ను చంపుతానన్నారుగదా! మరి నాతో పేలవంగా సీతను వదలమని బేరాలాడతారేం?" అన్నాడు. రామునికి కోపం హెచ్చింది. విరాధునితో–

"నువ్వు చూడొస్తే దితి సంతానంలో మొదటివాడివిలా కనబడుతున్నావు. మూర్ఖత్వమే మీ రూపు. శత్రుత్వాన్ని, మరణాన్ని కోరి తెచ్చు

కొనే మీకు సవ్యంగా చెప్పితే బుర్రకెలా ఎక్కుతుంది?" అని ఏడు బాణాలు ఒక్కసారిగా ఎక్కుపెట్టి విరాధునిపై గురిచూసి కొట్టాడు. బాణాలు విరాధుని దూసుకొని పోయాయి. భూమంతా నెత్తురు చిమ్మింది. భుజంమీద మృగాలను గుచ్చిన శూలం తీసి విరాధుడు రాముని మీదకు విసిరాడు. అది యమ దండంలా రామునిపైకి వస్తోంది. పెనుగాలికి భూమిలోంచి పెకిలించబడి లేచిన పెద్ద తాటిచెట్టులా వస్తోంది. రాముడు ఏమీ ఆలస్యం చేయకుండా పటుతరమైన మరో నాలుగు అమ్ములు వేశాడు. అవి వస్తుంటే అడవిలోని చెట్లన్నీ గూడా ఈ దెబ్బతో హరించుకు పోతాయా అన్నట్లుంది. విరాధుడి శూలం నాలుగు ముక్కలైంది. విరిగిన నాలుగు ముక్కలూ చెదరగొట్టబడి మధ్యలో ఉన్న కొన్ని వృక్షాలను నరుక్కుంటూ మహారావంతో నాలుగు దిగంతాలకు పోయాయి. ఒక్కసారిగా వికటాట్టహాసం చేశాడు విరాధుడు. ఒక్కసారి ఊపిరి బిగపట్టి పెద్ద పెట్టున ఆవులించాడు. వంటిమీద రోమాలు ఈటెల్లా నిక్కబొడుచుకున్నాయి. అప్పుడు విరాధుడు రాముణ్ణి చూసి–

## విజృంభించిన విరాధుడు

"ఏమయ్యా రామా! చూశావా నా వొంటి మీద వెంట్రుకలు ఎలా వున్నాయో? నీ శరాలకు వీటికి ఏం పెద్ద భేదం లేదు. చూశావా! శూలాన్ని నాలుగు ముక్కలు చేస్తావా? చూడు నీ ధనుస్సునూ, నిన్ను ఏం చేస్తానో" అని రాముని మీదకు ఉరికాడు. రాముడు వెంటనే బాణాలు ఒక్కుమ్మడిగా వేశాడు. వాటిని ఏ మాత్రము లెక్కచెయ్యకుండా రామలక్ష్మణుల నిద్దరిని రెండు చేతులతో పట్టుకొని అడవంతా పరుగులు పెడుతూ భయంకరంగా నవ్వుతూ–

"ఒరే పిల్లల్లారా! మీ ఇద్దరూ నా రెండు భుజాల మీద కూర్చోండి. ఇంక అనవసరంగా విచారించకండి" అంటూ పోతున్నాడు. లక్ష్మణుడు

కాస్త తెలివిగా "అన్నా ఎలాగూ మనకు ఎలావెళ్ళాలో తెలీదుగదా, వీణ్ణి ఇలా పోనీ కాస్త దారిలో పడ్డ తరువాత వీణ్ణి ఇక్కడుండే వధిద్దాము" అన్నాడు. విరాధుడు పోతూనేవున్నాడు. సీత చెరువు వద్దనే వంటరిగావుంది. భయంతో కంపించి పోతోంది. అరుస్తోంది గొంతు చించుకొని–

"ఓ దుష్టుడా వాళ్లనలా ఎక్కడకు తీసుకు వెళ్దామనుకుంటున్నావు? వాళ్లను దించి నన్ను తీసుకుపో! రాముడంటే నీకు తెలియదు. ఆత్మ గుణాలకు పుట్టిల్లయినవాడు. నీకో నమస్కారం. పుణ్యం వుంటుంది నా రాముణ్ణి దించిపోవయ్యా! అయ్యో! వాళ్లిద్దర్నీ అలా ఎక్కడికో తీసుకు వెళ్తున్నాడు. ఇంక నేను ఏ అడవి క్రూర మృగానికో ఆహారం కావలసిందే! రామునితో పాటు సౌమిత్రుణ్ణి గూడా భుజంఎక్కించుకున్నాడు. కనీసం లక్ష్మణుని రక్షణ గూడా నాకు లేదు. పిన్నత్తా! నీ వరాలు మా ముగ్గుర్నీ పొట్టన పెట్టుకున్నాయిలే! నీ కోరిక తీరబోతోందిలే" అంటూ గగ్గోలు పెట్టోంది. ఆక్రోశిస్తోంది.

లక్ష్మణుడు విరాధుని భుజం మీద రెండు కాళ్లు అటూ ఇటూ వేసి ముందు మార్గాన్ని వెనక సీతను చూచుకుంటూ అదను కోసం నిరీక్షిస్తూ రామునితో–

## లక్ష్మణుని చొరవ

"అన్నా! ఇంక ఒక్క నిమిషం ఆలస్యం చేస్తే తల్లి ఇక కనపడదు దూరమైపోతాము. అదిగో ఆ చెయ్యి నువ్వు, ఈ చెయ్యి నేను ఒకేమారు నరికేయాలి. ఇంక ఏ మాత్రం ఆలస్యం చెయ్యక" అని అనంగానే ఇద్దరూ ఒక్కసారి రెండు బాహువులూ నరికేశారు. మేఘం గర్జించినట్లుగా పెద్దపెట్టున కేకతో ఒక్కసారి విరాధుడు నేలమీద పడ్డాడు. ఏమాత్రం ఆలస్యం లేకుండా

విరాధుడు మళ్లీ పైకి లేవకుండా ఇద్దరూ వాడి మీదకు దూకారు. దూరం నుంచి ఇదంతా చూసిన సీత పరిగెత్తుకొని అక్కడకు వచ్చింది. రామ లక్ష్మణులు రాక్షసుడి వళ్లంతా కత్తులతో తూట్లు తూట్లుగా పొడుస్తున్నారు. నెత్తురు భూమ్మీద ముద్దలు కడుతోంది. ఐనా ఎప్పటికీ చావటంలేదు. మెడ నరుకుతుంటే నరుకుడు పడదు. మరి బాహువులెలా నరుకుడు పడ్డాయో అర్థం కాలేదు. ఎలా చంపాలో తెలియని స్థితిలో తికమకపడుతున్నారు. అప్పుడు రాముడు లక్ష్మణునితో–

"తపశ్శక్తి చేత ఈ రాక్షసుడు ఇలా చావడు. కాలితో గాలి ఆడకుండా కదలకుండా కంఠాన్ని తొక్కి అట్టేపెడతాను. నువ్వు ఈ లోపల ఒక పెద్ద గొయ్యి తవ్వు. ఆ గోతిలోనికి వీణ్ణి దొర్లించి పైన రాళ్లు రప్పలతో కప్పుదాము. అదొక్కటే ఉపాయము. ఇంకో పద్ధతిని వీణ్ణి చంపలేము." అన్నాడు. ఆ మాటలు విన్నాడో ఏమో వెంటనే విరాధుడు–

## విరాధుని పూర్వ కథ

"శ్రీరామా! చాలా చక్కగా ఊహించావయ్యా! నీ చేతిలో ఎంతో మంది రాక్షసులు హతులై వుంటారు. ఇంకా ఎంతో మంది ఇక ముందు హతులవుతారు కూడా! కాని, స్వామీ ! నిన్ను నిజానికి కౌగలించుకోవలసిన వాణ్ణి. నేను గంధర్వుడైన తుంబురుణ్ణి. శాపవశం చేత ఈ స్థితిలో వున్నాను. తన కొడుకైన నలకూబరుని అదుపులో ఉండే రంభతో నేను అతిచనువుగా ఉండటం చూచి కుబేరుడు నన్ను శపించాడు. అప్పటి నుండి ఈ రూపుతో ఇలా బ్రతుకుతున్నాను. ప్రార్థిస్తే చివరకు అనుగ్రహించాడు. పినతల్లి పంపగా నువ్వు ఇలా వస్తావని, నన్ను చంపుతావని. అపుడే నాకు సహజ రూపం వస్తుందని, అంతవరకు ఈ స్థితి తప్పదని చెప్పాడు. ఇంత కాలం నుండి నీకై వేచియున్నాను. ధనుస్సు లాంటి మెరుపు తీగతో నీరదంలా వున్న

నిన్ను గుర్తించకుండా ఎలా వుంటానయ్యా ? ప్రభూ! నీ బాణం నన్ను సోకక మునుపే నా తల్లి వైదేహి మహిమాన్వితమైన తనూ స్పర్శకు నా ఈ యావచ్ఛరీరం పూతమైంది గదయ్యా! అప్పుడే నాకు అనుమానం వేసింది. కాని ఔనో కాదో అని కొంచెం సందేహపడ్డాను. "మేమిరువురము రామ లక్ష్మణులము" అని నీవు చెప్పిన తరువాత ఆ సందేహం తీరిపోయింది. అటుపైన నేనెంత తగ్గి పోరాడానో నీకే తెలుసు. సరే! మీరు ఇంకొక్క అర్థ యోజనం నడిచి ఇదే త్రోవన వెడితే శరభంగుని ఆశ్రమం వస్తుంది. ఆ ముని వల్ల మీకు అన్నీ శుభాలే కలుగుతాయి. నా సుకృతం పండింది. నీ తండ్రికి చేయని ఉత్తర కర్మలు బిడ్డగా నీవు నాకు చేయడం కంటె అదృష్టం మరొకటి ఏమి వుంటుంది చెప్పు? లక్ష్మణుడు త్రవ్విన ఆ గోతిలో పూడ్చు. దైత్యులకు సదా విష్ణుపథ మిదే గదయ్యా! ధర్మభ్రంశానికి అడ్డు పెట్టే నీపాదం నా కంఠమందు చేర్చవయ్యా" అన్నాడు. అప్పుడు శ్రీరాముడు విరాధుని కంఠంపై కాలుపెట్టాడు- విరాధుని వధ పూర్తయింది.

సీతారామలక్ష్మణులు శరభంగాశ్రమాభి ముఖంగా వెళ్తున్నారు. రాముడెందుకో దిగులుగావున్నాడు. కొంతదూరం నడచినతర్వాత "లక్ష్మణా! మనం ఎంతపని చేశామయ్యా ! అంత క్రూరంగా, కసాయివానిలా ఆ రాక్షసుణ్ణి చంపాలా? ఇంకేదైనా ఉపాయంతో వాడినుండి సీతను దక్కించుకో లేమా? బ్రతికున్నవాణ్ణి అలా కత్తులతో క్రుమ్మి తూట్లుపొడవడం, పూడ్చడం అంతా తలచుకుంటే రోతగావుంది. పోనీ చంపకుండా వదిలేద్దామంటే ఋషులందరినీ తింటున్నాడు. ఒకప్రక్క తన పూర్వ జన్మ వృత్తాంతం తనకు తెలుసు. తెలిసి ఏం లాభం ? ప్రవృత్తి రాక్షసంగానే వుంది. అయితే లోపల గంధర్వ ప్రజ్ఞ వున్నా బయట పైశాచిక దేహమే ప్రవృత్తిని నిర్ణయించిందన్నమాట! అయితే ఈ భూమ్మీద భౌతికత్వానికే విలువన్నమాట" అంటూ నడుస్తూ నడుస్తూ శరభంగాశ్రమప్రాంతానికి చేరినట్లు గుర్తించాడు.

## శరభంగముని సందర్శనం

శరభంగముని ఆశ్రమానికి వెలుగులు చిమ్ముతూ తెలిమబ్బు కదుల్తున్నట్లు సహస్రఫణ మాణిక్యాలతో మెరిసిపోయే అనంతునిలాగా, పాల సముద్రపు మీగడలా ఉన్న ఒక మహనీయమూర్తి రథంలో వస్తూండగా అక్కడున్న మహర్షులందరూ స్తోత్రాలు పఠిస్తూ ఎదురు వెళ్తన్నారు. ఆ మహనీయుడు రథందిగికూడా పాదాలు భూమిని అనకుండానే ముందుకు సాగుతున్నాడు. విశాల నేత్ర వక్షులు, గజదృఢ శరీరాలు, కిరీటభూషణులు, తేజస్సంపన్నులు, నిండుయవ్వనదశలో నున్న ఇరువది ఐదు మంది మహానుభావులు అతనిని స్తుతిస్తూ ఖడ్గ పాణులై వెంటనడుస్తున్నారు. రాముని కి అదృశ్యమంతా ఒక తైలవర్ణచిత్రంలా భాసించి సౌమిత్రితో

"లక్ష్మణా! చిన్నప్పుడు ఇలాంటివారిని గురించి మననాయనగారు గురువుగారు చెబుతూవుండేవారు. గ్రంథాల్లోకూడా ఇల్లాంటి వాళ్ల వర్ణనలు చదివాంగుర్తుందా? సరిగ్గా అల్లానే వున్నారు అనుమానంలేదు. ఆయన దేవేంద్రుడు, వాళ్లదేవతలు అయివుండాలి. శరంభంగుని ఆశ్రమంలో ప్రవేశించి ఆయనతో ఏవో రహస్యవచనాలు పలుకుతున్నారు. వాళ్లిద్దరిమైత్రి ఎంతటిది కాకపోతే అలా మాట్లాడు కుంటారు! తప్పకుండా ఆ మహాత్ముడు ఇంద్రుడే అయివుంటాడని నాహృదయం ప్రబోధిస్తోంది. ఆహా! ఇవాళ ఏ శుభమైనవేళలో లేచామోకదా! సర్వఋషి దర్శనభాగ్యంతో పాటు దేవతా దర్శనంకూడ జరిగింది. లక్ష్మణా! నువ్వు సీతా, ఇక్కడేవుండండి నేనుఇప్పుడేవెళ్ళి చూసివస్తాను. నేనువచ్చిన తర్వాత ముగ్గురం వెళ్ళివద్దాము. అని రాముడువెళ్ళాడు. కాని రాముడు వెళ్ళేలోపునే ఇంద్రుడు వెళ్ళిపోయాడు. ముని మిగిలాడు. రాముడు మునిపాదాలకు నమస్కరించి ప్రవర చెప్పుకున్నాడు. ప్రసన్న వదనంతో రాముణ్ణి ఆపాదమస్తకం ఒక్కసారి చూసి-

“ఇప్పుడే ఇంద్రుడు వచ్చివెళ్ళాడు. నా తపః ఫలంగా నన్ను స్వర్గానికి తీసుకువెళ్ళడానికి వచ్చాడు. కాని నీవు అతిథిగా వస్తావని నాకు తీర దనిచెప్పాను. ఇదిగో ఇప్పుడే వెళ్ళాడు అటుచూడు. అని చూపించి 'రాముడు వస్తాడు దర్శనంచేసుకుని వెళ్ళరాదా, అని ఇంద్రునితో అన్నాను” అన్నాడు ముని అప్పుడు రాముడు “ఇంద్రుడు నాదర్శనం చేయడమా?” అని ఆశ్చర్యంతో తొట్రుపాటుపడ్డాడు. అప్పుడు ముని సర్దుకొని–

“రామా నీవు చేసే పనులన్నీ ధర్మాలే! ఎవరైనా సరే నీ ధర్మాచరణను శ్లాఘించవలసినదే! నీ దర్శనం చేసుకోడానికి ఇంద్రుడికింకా సమయం రాలేదుట! అందుకని వెళ్లిపోయాడు” అంటూ ముని దూరంగా ఉన్న సీతాలక్ష్మణులను చూశాడు. ఇద్దర్ని చూపుడువేలు వంచి రమ్మన్నట్లు కనురెప్పలు వాలుస్తూ పిలిచాడు. ఇద్దరూ వచ్చారు. ముని చరణారవిందాలకు నమస్కరించారు. అందరూ చాలా సన్నిహితంగా కూర్చున్నారు ముని రాముణ్ణి చూసి–

“నా యీ తపఃఫలంగా ఎన్నో శుభమైనలోకాలు పొందటం కోసం ఇంద్రుడు రమ్మన్నాడు, అయినా నీవు వస్తున్నావని తెలిసి వెళ్లలేదు. ఒకవేళ వెళ్ళివుంటే నీదర్శనంనాకు జరిగేదా? ఆ లోకాలకు నీవు రమ్మంటే వస్తావా చాలు! నీ దర్శనమైనది నాకు. ఆ శుభమైనది లోకాలన్నీ నీకే ఇస్తాను తీసుకోవయ్యా “అన్నాడు అందుకు రాముడు–

“ఎంతో కష్టపడి తపఃఫలంగా సంపాదించిన మీ ఉత్తమ లోకాలను సునాయాసంగా మీ నుండి పొందితే, ఈ వనవాసపు కారణమైన తండ్రి మాట ఏమౌతుంది ? నీ ఆశీస్సులు ఉంటే అవన్నీ నేను ఆర్జించలేనా తండ్రీ! ఈ అడవిలో ఎక్కడ వాసయోగ్యంగా వుంటుందో అది చెప్పు చాలు. అదే నీవిచ్చే పదివేలు నాకు” అని అనంగానే ముని –

## శరభంగుని సలహా

"అవునవును. నీవు ఎలా గ్రహిస్తావులే! నువ్వు గ్రహిస్తానంటే ఇచ్చేది నే నొక్కడినేనా? సర్వ మునులు ఇవ్వడానికి సిద్ధపడేవారే! అయినా ఇవన్నీ పుచ్చుకుంటేనేగాని నీ రాజసం పెరగదనా ఏమిటి?" అని అన్నాడు. తను అన్నదాంట్లో తప్పు ఉన్నదనో ఏమో రాముడు మునికి ప్రదక్షిణం చేసి నన్ను క్షమించండి! అన్నాడు. శరభంగుడు రాముని వైపు ప్రసన్నంగా చూసి – ఈ గంగానది ఒడ్డమ్మటే ప్రవాహానికి ఎదురు దిశగా వెళ్లండి. అటుపైన నీకు సుతీక్ష్ణ ఆశ్రమం కనపడుతుంది. అది చాలా చక్కని ప్రదేశం. ఆ ముని మిమ్ములను హృదయంలో పెట్టుకుంటాడు. మీ వనవాసమంతా సుఖంగా గడిచిపోతుంది. కొంచెము సేపు ఇక్కడ వుండి బయలుదేరండి. నేను ఇప్పటితో ఈ శరీరాన్ని వదులుదామనుకుంటున్నాను. నీ సాన్నిధ్యంలో శరీరాన్ని వదులుదామనుకునే ఇంద్రునితో పోకుండా నీకై నిరీక్షించాను." అంటూ అగ్నినాధానం చేసి, వ్రేల్చి అందులో ప్రవేశించాడు. మునియొక్క యావచ్ఛరీరం కించిత్తు కూడ మిగలకుండా అగ్నిహోత్రుడు పూర్తిగా స్వీకరించాడు. కౌమారదశలో వినూత్న కాంతులతో విరాజిల్లుతూ విహాయసమార్గంలో విహరిస్తున్న మునిని రాముడు చూశాడు. శరభంగుని అలా చూస్తూ రామచంద్రుణ్ణి దర్శిద్దామని వచ్చిన వాలఖిల్యులు, వైఖానసులు, సంప్రక్షాళులు, పత్రాహారులు, గాత్ర శయ్యులు, అశయ్యులు, సలిలాహారులు, వాయుభక్షకులు, అకాశనిలయులు, వ్రతోపవాసులు, సజపులు, తపోనిత్యులు మొదలైన మునిసంఘాలు శరభంగుని నిష్క్రమణానంతరము రాముని వైపు తిరిగి –

## పాలకులు ఎలా వుండాలి?

"నీవు ఇక్ష్వాకుల ఇంటి బిడ్డవు. మేము నిత్యాగ్నిహోత్రులము.

నీవు రాజువి. మేము ప్రజలము. నీవు పాలకుడివి. మేము పాలితులము, అన్నిటికన్న మిన్న నీవు దేవుడవు. మేము జీవులము. మా కష్టసుఖాలు నీకు కాక ఎవరితో చెప్పుకుంటాము ? మా తపస్సులు, వ్రతనిష్ఠలు ఎలా సాగుతున్నాయో. ఇకముందు ఎలాసాగుతాయో, పంపాతీరాలకు, చిత్రకూట తటాలకు, మందాకినీ తీరాలకూ వెళ్లి చూస్తే తెలుస్తుంది. మేము ఏమన్నా కండ కట్టి బాగా బలిసి నోరూరించేట్టు ఉన్నామా ? నోట్లో పెట్టుకుంటే ఒక్క దవడ ప్రక్కకుకూడా రాని మా బక్క ఒడలుకే మొగం వాస్తారుకదా ఆ రాక్షసులు! వారి చేతిలో మేము అడవి మృగాలకంటే హీనం. బరిసెలు, ఈటెలు, శూలాలతో మమ్మల్ని గ్రుచ్చి గ్రుచ్చి రక్తం కళ్లచూస్తేనేగాని వాళ్లకు సరదా తీరదు కదా ! ధ్యానసమాధులనుండి కళ్లు తెరిస్తే మేము చూచేది, వినేది వాడియైన ఒంపులు తిరిగిన కోరలతో గుహద్వారంలో తెరవబడిన రాక్షసుల వికృత ముఖాలు, వికటాట్టహాసాలు. అంతేగాని హరి విమానమూ కాదు. హరిదూతల స్వాగతవచనాలూ కాదు. వీళ్లందరిలోనూ విట్టవీగిన విరూపుడు ఒకడు వున్నాడు. వాడే విరాధుడు. ముందు వాణ్ణి సంహరిస్తివా మాకు సగం భయం దూరమౌతుంది. అన్నారు" అందుకు రాముడు – "ఆ సంహారం ఐన తర్వాతనే మీ దర్శనం చేసుకుంటున్నాను" అన్నాడు. ఆనందం ఉప్పొంగిన మునులు "ఇది నిజంగా సూర్యవంశజుల పాలనా పద్ధతి. బాధ్యతగా కాకుండా ఆత్మీయతా దృష్టితో ప్రజాపరిపాలన అంటే ఇదే గదా ! (బాధను చెప్పితే విని తీర్చడం, కావలసినవి అడిగితే

తేవడం, బాధ్యత నిర్వర్తించినట్లు అవుతుంది. చెప్పకుండానే వారి బాధలు తెలుసుకుని తీర్చడం, అడక్కుండానే వారికి కావలసినవి కొనితేవడం ఆత్మీయత అవుతుంది) "రామా ! ఎలాగూ విరాధవధతో మాకు జీవితం మీద ఆశ కలిగించావు. జీవితం మీద కలిగిన ఈ ఆశ బ్రతకగలమనే నమ్మకం ఇక ముందుకూడా మాకు చెడకుండా చూడాలి నువ్వే" అన్నారు. అందుకు రాముడు చిఱునవ్వు నవ్వి –

## రాముని అభయం

"మీకు జీవితంపై ఆశ కలిగించానా? బ్రతకగలమనే నమ్మకం కలుగచేశానా? అయితే ఇంతవరకు మిమ్మల్ని ఎంత దీనస్థితిలో వుంచానో అర్థమవుతోంది. మీరిలా మాట్లాడటం నా చేతకానితనాన్నీ, దోషాన్నీ నాకు తెలియబరుస్తున్నాయి. మీరిలా మాట్లాడే దుస్థితి కలిగిందంటే ఇంక మా సూర్యవంశ రాజుల పరిపాలనను సవరించవలసిన అవసరం ఏర్పండిం దన్నమాట. సరే! మిమ్మలి నమ్మించినదానికి ఆ రాక్షసులను నా విల్లంబులకు ఆహారంగా చేస్తాను".

"మీ కిదే నా అభయం. తండ్రి కోరితే వనాలకు వచ్చాను గాని ఈ రావడంలో ఇన్ని ధర్మాలు కలసి వస్తాయనుకోలేదు. ఈ వనవాసం వలన తీర్థము, స్వార్థముకూడా నెరవేరుతున్నపుడు అంతకంటే కావలసిన దేమున్నది. మీ సంకల్ప ప్రకారమే, మీకు ప్రియం చేకూరే విధంగానే నడుచుకుంటాను. సరా !" అన్నాడు. ఇలా మాట్లాడుతున్నంత సేపు ముఖంలో ఆదరపూర్వక దరహాసం నిండినా, చివరకు అనుకోకుండానే రాక్షస చర్యలపై ఒక విధమైన ఏహ్య భావం రాముని ముఖంలో రేఖా మాత్రంగా పొడసూపింది. "ఛీ! ఛీ! ఎంత కర్కోటకులు ఈ రాక్షసులు. ముక్కు మూసుకుని చెట్టుక్రింద, పుట్టక్రింద కూర్చుని ఎవరి జోలికిపోకుండా వాళ్ల మానాన్ని వాళ్ల తపశ్చర్యాదులు కొనసాగించు కుంటుంటే అలాంటి బక్కవారిపైనా ఈ రక్కసుల కక్కుర్తి పనులు? ఊహించడానికే అసహ్యా మేస్తోంది. దాక్షిణ్య బుద్ధిలేని ఈ జాతి ఎంత నీచమైనది. చేసిన పాపానికి ప్రతిఫలంగా పులిగానో, పాముగానో, ఇలా రాక్షసుడిగానో పుట్టడం, పుట్టి మళ్లీ పాపాలనే చెయ్యడం, మళ్లీ దుష్టులుగా పుట్టడం ఇలా జన్మలు సాగిపోతుంటే వీరికి సుగతి ఎప్పటికి కల్గుతుందో! పోనీ ఈ సంగతి తెలియచేద్దామన్నా బుర్రకెక్కదు, ఎక్కించుకోరు కూడా కదా!" అని మళ్లీ —

"ఈ శరీరాలతో ఉన్నంతవరకు పాపాలు చేసి, శరీరాలు పోయిన తర్వాతఐనా సంగతి తెలుసుకొని నడుచుకుంటే కొంత నయమే! మీపట్ల న్యాయం చేసినట్లే! పాపంలో కొంత పుణ్యమే! సరే కానీండి వాళ్ల ఖర్మ. నేను ఇదే వాగ్దానం చేస్తున్నాను. మీ తపస్సులు కొన సాగుతాయి. నిత్యాగ్ని హోత్రాలు, నిత్యావసర సస్యాలు వర్ధిల్లుతాయి. దానికి అడ్డువచ్చే దైత్యుల్ని హతమారుస్తాను. మీరెంత ఆపదలో ఉండకపోతే నన్నిలా అర్థిస్తారో నేనూహించ లేకపోను. మీకివే నా ప్రణామములు" అన్నాడు. అందరూ జయజయ ధ్వానాలు చేసారు. రామచంద్రుడంటే రామచంద్రుడే! తూచినట్లు మాట్లాడడం, తూచినట్లు బ్రతకడం. ఇక మా తపస్సులకు ఎన్నివేల సంవత్సరాలైనా భద్రమే! మా కలాంటి వాడు నాథుడుగా, రక్షకుడుగా దొరికాడు. ఇక మా బ్రతుకంతా నిశ్చింతయే!" అన్నారు. అందుకు రాముడు "నేను మీ ఆశ్రమ ప్రాంతాలకు వస్తూనే ఉంటాను. వచ్చి ఆ ప్రాంతంలో సంచరించే నిశాచరుల్ని నిష్పంటిస్తాను, నిశ్చింతగా ఉండండి". అని వారి దగ్గర సెలవు తీసుకున్నాడు.

## సుతీక్ష్ణాశ్రమము

ఋషులందరూ వెళ్లిపోయిన తర్వాత సుతీక్ష్ణ ఆశ్రమమునకు పోదామని సీతా లక్ష్మణులకు చెప్పి రాముడు సంధ్యా రమణీయ వల్కల జటాభరణ దీక్షితుడై ప్రయాణమైనాడు.

రాత్రిళ్లు ఋష్యాశ్రమాల్లో నిద్రపోవటం మరునాడు ఉదయం సీత ముని కాంతలతో రేవుకు వెళ్లి బట్టలు ఉతికి తేవటం, నిన్న ఉతికినవి ఇవాళ, ఇవ్వాళ ఉతికినవి రేపు – ఇలా ప్రతిరోజూ ఎట్టవాగు నీళ్లలో

ఉత్కటంతో ఆ బట్టలుగూడా కావి యొక్క లలితారుణ కాంతిమంతమైనాయి. అడవులో ప్రయాణం చేసేటపుడు ముందు లక్ష్మణుడు, వెనుక సీతారాములు నడిచేవారు. సీత చెట్లను గూర్చి పుట్టమ గూర్చి అడుగుతూ వుండేది రాముడు సీత దగ్గరగా జరిగి చెవిలో చెబుతూ వుండడం, రకరకాల రంగు రంగుల పూలుకోసి సీత తన చీర దారంతో మాలలు కట్టి అలంకరణ చేసు కుంటూ రామునికి దగ్గరగా పోవడం. రాముడు ఏదో అనడం. "ఏమిటా మాటలు? మరిది వింటాడు, బ్రహ్మచర్యం అంటే ఏమిటనుకున్నారు?" అని రాముని నోటిమీద తన చేయి అడ్డం పెట్టడం. వెనకాల ఇన్ని జరుగుతున్నా లక్ష్మణుడు ముందు చూపేగాని వెనక ధ్యాస పెట్టడు. ఇలా వారి ప్రయాణం అత్యుత్సాహంగా సాగేది.

చేతులు చాపి స్వాగతం పలికే అప్సరసల్లా ప్రవహిస్తున్న నదులు దాటుతున్నారు. కనుచూపుమేర దాటికూడా గమ్యం మళ్లీ కనుచూపు మేరలో వున్నట్లు కనపడే సన్నని మార్గాలు దాటుతున్నారు. రకరకాల పక్షుల కలకూజితాల్లోని అనువాద శ్రుతుల్ని, సామరస్య స్వరాల్ని వింటూ సాగుతున్నారు. వివిధ వర్ణ ప్రఫుల్ల ప్రసూనాలతో, వివిధ పరిపక్వ ఫల వృక్షాలతో, శకుంత సంతాన కలరవాలతో అడవంతా అలంకరించిన విధంగా అలరారుతోంది. లక్ష్మణుడు ముందుకు పోతూ దారి చూపిస్తూనే వున్నాడు. సీతారాములు వెనుక నడుస్తూనే వున్నారు. ఇంతలో రేగు పండ్ల గుజ్జులో ఇంగుదీ నూనె పోపు పెడుతున్నప్పుడు వచ్చే కమ్మని వాసన ముక్కు పుటాలకు సోకింది. తెరచాప లెత్తినట్లుగా ఆరవేసిన నార చీరలు కనపడ్డాయి. ఆశ్రమ ప్రాంతానికి వచ్చినట్లు గుర్తించారు. అది సుతీక్ష్ణమున్యాశ్రమము. ముని కుటీరానికి వెళ్లి ముగ్గురూ నమస్కరించారు.

"శరభంగ మహాముని పంపగా వచ్చిన దశరథ పుత్రుడైన రాముణ్ణి, నన్ను అనుగ్రహించండి" అన్నాడు రాముడు. అందుకు ముని—

# సుతీక్ష్ణుని కోరిక

౩

"శరభంగుడు నాకత్యంత ఆప్తమిత్రుడు. ఋషి కులాలన్నింటినీ సందర్శిస్తున్న నిన్ను నేను కోరగా పంపించాడన్నమాట! మేమింతకు పూర్వమే నీ ఆచరణాత్మక ధర్మ స్వరూప చరణాల గూర్చి విన్నాములే! చిత్రకూటం నుంచి యిక్కడకు మునులు వస్తూనే వుంటారు. అన్ని సమాచారాలూ మాకు తెలుస్తూనే వుంటాయి. సూర్యకిరణంలాగా అడవి లోనికి చొచ్చుకుంటూ నీవు వస్తున్నట్లు తెలిసింది. నా సత్తపః ఫలాలుగా ఉత్తమ లోకానుభవాన్ని పొందటానికి ఇంద్రుడు తనతో రమ్మన్నాడు. కాని నాకు వాటియందు వాంఛలేదు. ఇలా తపస్సు కొనసాగించడమే నా కోర్కె. నీ వంటి రాజు నాకింక ఎవరు దొరుకుతారు ? కాబట్టి ఓ దాక్షిణ్యనిధీ ! నా ఆ లోకాలను నువ్వు స్వీకరించవయ్యా" అన్నాడు. అందుకు రామచంద్రుడు—

"మళ్లీ అచ్చు శరభంగముని లాగానే మాట్లాడారే మీరు కూడా! మీబోటివారల చరణదర్శనమాత్ర సంతుష్టుడను. నా మనస్సును పరీక్షించకండి. మీ తపః ఫలాలను అనుభవిద్దామనే మనస్సు గలవాడను గాను. కేవలము నాపై మీ అవాజ్య కరుణ నాకు కావలసిన లోకాలను సమకూర్చ గలదన్న బుద్ధి కలవాడిని" అన్నాడు. అప్పుడు ముని—

"పరీక్ష చెయ్యవలసిన స్థితిని దాటిన నువ్వు ఇలా అంటా వేమిటయ్యా! నా పుణ్యాత్త లోకాలను స్వీకరించకపోతే పోనీ, నా కోర్కె తీరకపోయినా ఫరవాలేదులే! బలవంతాన అంటగడితే అయ్యేపనా ఇదేమన్నా ? సరే! ఆ మాట అటుంచు. ఇక్కడ క్రూరమృగాలబాధగాని, రాక్షసుల బాధగాని లేదు. కాని ఇక్కడ అడవి దున్నలు, పందులు బాధ ఎక్కువ. పంటంతా పాడుచేసిపోతాయి. అవి వచ్చినపుడల్లా స్థిరా

సనాతీనులైన బ్రహ్మచారులు లేచి వెళ్లి వాటిని తరుముతూ అవతలకి తోలి, రొప్పుతూ తిరిగి రావలసి వస్తోంది. అదొక్కటి తప్ప నీ దయవల్ల ఇక్కడ మరి ఏ ఇతర బాధలూ లేవు. అంతేగాదు, ఇక్కడ నేల ఇల్లు కట్టి వుండటానికి చాలా వీలుగా వుంటుంది. నీవు వచ్చి ఇక్కడ వుంటే నా తపస్సులు, హెూమాలు సత్ఫల ప్రదమౌతాయని భావించాను. కాని ప్రస్తుతము ఈ పంట దెబ్బవల్ల పరిస్థితి మారిపోయింది. మరి ఋష్యాశ్రమాలు మరో చోటికి మార్చక తప్పటంలేదు" అన్నాడు. అందుకు రాముడు—

## రాముని అభయం

"అయ్యో! మీకెంత ఇక్కట్టు వచ్చింది ? ఐనా మీకు వచ్చిన ఇబ్బంది తీర్చడం ఏమంత పెద్దదని? మీచేత అడిగించుకోడానికి కూడా సరిపడని చిన్నపని ఇది. మీ పంటల్ని నాశనం చేసే దున్నలను, పందులను చంపే వెళ్తాను. నా పురాకృత పుణ్యం భట్టి మీ పుణ్య ఆశ్రమాలను సందర్శించ గలిగే భాగ్యం దక్కింది. నా కది చాలు" అన్నాడు.

సంధ్యా సమయమైంది. మునులందరూ వాళ్లవాళ్ల నిత్యకర్మలు కొనసాగించుకోవడంలో నిమగ్నమైనారు. రాత్రికి సీతారాములు ఆశ్రమ పర్ణశాలలో సుఖంగా నిద్రించారు. రాత్రికి అడవిలోని జంతువులన్నీ పంటలపైకి రాలేదు. కాని అలవాటుపడిన కొన్ని మామూలు ప్రకారం రానే వచ్చాయి. నిత్య నిరంతర జాగ్రదవస్థా స్థితిలో ఉండే లక్ష్మణుడు అంత కటిక చీకటిలోకూడా వాటి అలికిడి విని చంపాడు. మరునాడు ఉదయం రాముడు ముందు మునులవద్ద సెలవు తీసుకోడానికి వెళ్లి –

"ఓ మహాముని! మీ ఆశ్రమంలో గడిపిన ఈ క్షణాలు మొత్తము

నా వనవాస కాలంలో పరమానుభూతిని పొందిన కారణంగా చెప్పుకోవలసి వుంటుంది. నిజంగా అంతటి పరమ ప్రశాంతత నా ఎదకు చేకూరింది. ఎన్నో ఆశ్రమాలలో ఇంతవరకు గడిపాము. కాని సీత ఇక్కడ ఉండిపోదాం అన్నంతగా మిగతా ఆశ్రమాలలోఉండగా బలవంత పెట్టలేదు. అలా అన్నది గదా అని ఉండిపోదామన్నా కుదరదు" అన్నాడు. అప్పుడు ముని –

"ఉహు వెళ్తావా" అంటూనే ఏదో తన పని చూసి కాసేపు, 'సరేలే' అని కాసేపు, 'మళ్లీ ఎప్పుడు వస్తావు' అని మరి కొంతసేపు, 'రాపటానికి గుర్తుంటామా మేము'? అని అంటూ తాత్సారం చేశాడు. ఇంతలో తమ పంటలను ఏ దుప్పి, ఏ పంది పాడు చేస్తాయో గుర్తులు తెలిసిన ఋషులు, ఋషి బాలకులు అక్కడకు వచ్చి –

"ప్రపంచములో సర్వజంతువులు తమ పొట్ట తాము నింపుకో వలసిందే! భూమ్మీద నాటిన సస్యాలు చెడుతుంటేనే మేము ఇంత బాధ పడిపోతున్నాము గాని అవతల కొందరు మునులున్నారు. వారు అడవిలో వాటంతట అవి పండి భూమ్మీద రాలే ఆకుల్ని, గింజల్ని, కాయల్ని పళ్లని తిని తమ పొట్ట పోసుకుంటారు. కళ్లు మూసుకొని కూర్చున్న అటువంటి వారిని కూర్చున్నట్లుగానే మ్రింగే రాక్షసుల చేతలకు వారెంత బాధపడుతూ ఉండాలో గదా" అన్నారు. రామునికి ప్రథమ కర్తవ్య నిర్వహణకై తొందర పెట్టినట్లైన వారన్న మాటలు విని సుతీక్ష్ణుడు –

## సుతీక్ష్ణుని సలహా

" ఆహార విషయంలో ధర్మాధర్మములు గూర్చి ఏం నిర్ణ యిస్తాం? వర్ణాన్ని బట్టి గూడా మారుతుంది గదా! ఒకే చోట ఉన్నా

నా మార్గం నాది, మీ మార్గం మీది. కొంత వయస్సును బట్టి, మరికొంత భుజ బలయుత దార్ఢ్యమును బట్టి కూడా ఉంటుంది గదా! నువ్వూ కోడలుపిల్ల సీత ఇద్దరూ ఇంకా చిన్న వయస్సులోనే ఉన్నారు. మా ఆశ్రమాలకు ఎక్కడకు వెళ్లినా మీకు భోజనం కంద మూలాలే! కాని, మీరు వెళ్లే మార్గంలో పూవులు, కాయలు, చిత్ర విచిత్రమైన మృగాలు (మృగము అంటే లేడి అని కూడా అర్థము) పుణ్య స్థలాలు, పర్వతాలు, చెరువులు మొదలయిన వాటితో ప్రకృతి మీకు చూడ ముచ్చటగా ఉండి ముచ్చట పడినవన్నీ పొందాలని పించేట్టుగా ఉంటాయి. నాయనా సౌమిత్రీ! ఎవరికయినా సహాయం సేవా భావంతో చేయడం ఎంతో పుణ్యం. ఆ చేసేది అన్నగారికే ఐ ఆ అన్నగారు అఖిల ధర్మ స్వరూపుడయితే మరి ఆ సేవాఫలం ఎలాంటిదో వేరే చెప్పాలా? నీ అదృష్టం అలాంటిది. రాముణ్ణి కొలుచుకొంటూ రాముణ్ణి అనుసరించు రామానుజా అన్నాడు!''

సీతారామలక్ష్మణులు ముగ్గురూ భక్తి వినమ్రతతో మునికి ప్రదక్షిణచేసి ముని వద్ద సెలవు తీసుకొని బయలుదేరుతుండగా జానకి పర్ణశాల లోనికి వెళ్లి ధనుర్బాణాదులు తీసుకొచ్చి అన్న దమ్ము లిద్దరికీ ఇచ్చింది. ముని హృదయంలోనే ఆశీర్వదిస్తుండగా ముగ్గురూ మళ్లీ అడవి దారి పట్టారు. (ముని చివరకు అన్న మాటల్లోని అంతర్యాన్ని ప్రస్తుతం అర్థం చేసుకోగలగటం కష్టం గాని, ముందు ఎలా జరుగుతుందో తెలిసినపుడు ఋషి వాక్కు అంటే ఏమిటో అర్థమౌతుంది) రాముడు ఇంతకు పూర్వము మునులతో వాగ్దానం లాగా పలికిన పలుకులు ఇప్పుడు యదార్థమై చెల్లించుకునే సమయం ఆసన్నమౌతోంది. సీత రాముణ్ణి వెన్నంటి నడుస్తోంది. రాముడు తనలో—

## రాముని భావాలు

"ఈ ఋషుల భావాలు చాలా చిత్రంగా ఉంటాయి. వీళ్ల చిత్రాలు

సుతిమెత్తనవి. పట్టణాల్లోను ఇతర గ్రామాల్లోను ఎక్కడన్నా ఉన్నదా ఈ తీరు? (ఊహించలేని మానసిక ప్రకృతి కలవారు. ఈ ఋషులు మనకు అప్పుడపుడు గుండెల్లో ప్రేమ వుంటుంది. కాని ప్రేమలోనే వీళ్లుంటారు. అదే భేదము. నగరాల్లో ధర్మంగా ఉండేది కేవలం తాము ధర్మంగా ఉంటున్నట్టు నల్గురికీ తెలియడం కోసమే! నలుగురికీ అలా తెలిసిన దానిని పేరు ప్రతిష్ఠల రూపంలో సొమ్ము చేసుకోవడం కోసమే! దీనినే ఇంగ్లీషులో Marketing the virtues అంటారు. కాని ఈ ఋషులు కేవలం అకారణంగా అలా వుంటారు. అంటే Dharma Mindedness వుండదు, ఆ ధర్మంలోనే వారు ఉంటారు అని అర్థము).

"తమ రాజు కొడుకు తండ్రి మాటమీద అరణ్యాలకు వెళ్లాడంటే ఈ ఋషులు పొంగిపోతారేమిటి? (అదే మన నగరాల్లో ఐతే- 'ఆ( వాళ్ల నాన్న వెళ్లమన్నాడు. లేదా ఇంట్లోంచి వెళ్ల గొట్టాడు వెళ్లకేం చేస్తాడు' అని అనుకుంటారు. మానవుల్లో లేని దుర్లభత్వము ఉండి, మనస్సులో సంసార భావం లేని వారు ఈ ఋషులు.) మొట్టమొదటగా తండ్రిమాట విన్న వాణ్ణి నేనే కాదు కదా మరి వీళ్లు ఇలా మురిసిపోతారేం? ఇదంతా వాళ్ల సౌహార్ద్రం మాత్రమే" అని అనుకుంటున్నాడు. సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి కొంచెం దగ్గరలోనే పర్ణశాల కట్టుకుని ఉందామనే తలంపుతో ఉన్న సీత – ఇంక సుతీక్ష్ణ ఆశ్రమ ప్రాంతంలో రాముడు ఇల్లు కట్టి వనవాసం గడపటం వుండదని, ఋషులందరూ కోరిన కోర్కె తీర్చడం కోసం స్వామి ముందుకే సాగుతున్నాడనీ హృదయంలోనే నిశ్చయించుకొని రామునికి మరింత దగ్గరగా ప్రక్క ప్రక్కనే నడుస్తోంది. రాముని వేగం హెచ్చినపుడు ఒక్కోసారి సమయం చూసి "స్వామీ! ఒక్కసారి ఆగండి ! ముల్లు గ్రుచ్చుకుంది" అనడం, రాముడు ఆగడం– ఇలా రాముడు తనకు దూరం కాకుండా నడుస్తోంది. ఏవేవో మాటలు చెబుతూ చివరకు ఒక సమయంలో —

# సీత సలహా

"స్వామీ! నీవునెల్లప్పుడూ ధర్మపథాన్నే అనుసరిస్తావు. నీ మనస్సు అన్యాయ మార్గాల జోలికి పోదు. నీ ఈ ధర్మ సంపదే నేనెప్పుడూ నా పూర్వ పుణ్యంగా భావిస్తాను. నా జన్మ జనకుల ఇంట జరగడమే అదృష్ట మని భావిస్తే, నా జీవితంలో ఆ మొదటి అదృష్టం నీ సన్నిధిలో చరి తార్థమైంది. నీ సంకల్పం ఎప్పుడూ ధర్మంలోనే ఉండి, ఆ పరిధి దాటదు లోకంలో పర స్త్రీ సంగమం, అసత్య భాషణం కలగకుండా ఉండటం జీవ రాసులకు ప్రయత్న సాధ్యములు, నీకు మాత్రం స్వభావ సిద్ధములు. అలాగే అకారణ వైరం ఉండటంలో కూడా అంతే అనిపిస్తోంది. మొదటి రెండూ రేఖా మాత్రంగానయినా నీకు లేకపోవటం నా భాగ్యమనుకుంటున్నా నని ముందే చెప్పాను. పోతే ఈ మూడవ దానిని గురించే నా బాధ. లేకపోతే రాక్షసులతో తెచ్చి పెట్టుకున్నట్టు ఆ వైరం ఏమిటి చెప్పు ? నేనేమీ నీకు చెప్పగల దానిని కాదనుకో కాస్త ఆలోచించి చూడు పరిస్థితి నీకే అర్థమవుతుంది. సాయంత్రానికి - మరునాడు ఉదయానికి మధ్య ఉండే కాస్త వ్యవధానంలోనే నీ పినతల్లి ఒకరి రాజ్యం ఒకరికి కట్టబెట్టింది. నిన్ను అరణ్యాలపాలు చేసింది. మన అదృష్టం చూడాస్తే ఇలావుంది. ఇంకా అది చాలదన్నట్లు, నెత్తిమీదకు కొనితెచ్చు కున్నట్లు ఈ రక్కసులతోటి అకాల వైరం కూడా ఒకటా? బావుంది వరస ! అడిగిన వరాలలోని అంత రార్థం- అడిగిన అత్త కంటె నీకెక్కువ తెలిసినట్టుందే! మీ తండ్రి అడవికి పొమ్మన్నాడంటే విల్లంబులు తీసుకొని క్రూరకృత్యాలే చేయమన్నారో, శాంతి యుతంగా వనవాసం గడిపి రమ్మన్నారో ఆ మాత్రం మీ తండ్రి మనస్సు తెలుసుకోలేవా? ఏమయ్యా లక్ష్మణా! మీ అన్నగారికి నీవన్నా చెప్పొద్దూ? ఆ విల్లంబులు పట్టుకున్నందుకు సహవాస దోషం నీకూ సోకినట్లుందే! అసలు ఆ విల్లంబులు తేవడం వల్లే జరిగింది ఇదంతా. వాటినేకనక తీసుకు

రాకుండా ఉంటే ఆ భరద్వాజ ఆశ్రమం లోనో, అత్రి మహర్షి ఆశ్రమంలో అనసూయ దగ్గరో సుఖంగా పడివుండే వాళ్లము కదా! ఈ పద్నాలుగేళ్ల పాటు శమదమాధ్యయనాది తపస్సులన్నా పూర్తి అయ్యేవి. నిజంగా అలా కనక అచ్చు ఆరణ్యక వ్రత వాసుల్లాగే వచ్చివుంటే రాక్షసుల్ని చంపి పెట్టమని ఎవరయినా బ్రతిమాలేవారా? కత్తులు విల్లంబులూ తీసుకువచ్చి లేనిపోని భారం నెత్తికెక్కించుకున్నావు. ఈ సుతీక్ష్ణుని ఆశ్రమం చూశావు కదా. రాక్షసుల బాధ కూడా ఇక్కడ లేదు. 'హాయిగా ఇక్కడ వుండండి' అని కూడా ముని అన్నాడు కదా! అనవసరమైన క్షాత్ర కాండ కూడా వుండదు. ఏమిటో ఆ ఋషులు కూడా మీకు తగినట్టే దొరికారు. వాళ్లు ఏమన్నా నోరెత్తి అడిగారా? తగుదునమ్మా అని నీవే ముందర చంపుతావు కూడా. రాక్షసులు వాళ్లంతకు వాళ్లు నిన్ను ఏమన్నా చేశారా నీవు వాళ్లని రెచ్చగొడితేనే కదా వాళ్లు తిరగబడుతున్నారు! కారణం లేని ఈ పని నీకెందుకు చెప్పు? నీవు విల్లు ఎక్కుపెట్టాల్సిన అవసరం ఇక్కడే కాదు, అయోధ్యలో కూడా వుండదు. నీ తమ్ములు కూడా అలాంటివారే! ఎక్కడా నీకు పడని వాళ్లు, నువ్వు పడని వారూ లేరే! మరయితే ఈరాక్షసుల్ని చంపడం కొని ముప్పు తెచ్చుకోవడమే గదా! పైగా పవిత్రమైన ఈ ప్రస్థాన కాలమంతా తపస్సు చేయక పోవడం సరికదా - వైరాగ్య వినాశానికి దారితీసే వైరకలుషభావంతో వృథా అవుతుంది. అదీకాక రాక్షసులు కూడా క్రూర మృగాల్లాంటి వారే! గుంపులు కట్టి వుండటం వాటి లక్షణం. ఆ గుంపులో ఒక్కదానిని సంహరిస్తే తక్కినవన్నీ పగబట్టి ఒక్కుమ్మడిగా విజృంభిస్తాయి కూడా! నేను నీ కంటే పరిజ్ఞాత్రి నేమీ కాను. కేవలం ఇవి నాకు కలిగిన ఊహలు, సందేహాలు. మీయందు నాకుగల చనువు చేతనే వీటిని నీ ముందు ఉంచుతున్నాను. ఆ పైన నీ ఇష్టం" అన్నది. అందుకు రాముడు—

# రాముని సమాధానం (స్వధర్మం)

"నిజమే సుమా! వాస్తవానికి నీవు చెప్పిన మాటల్లో తగనివి, మంచివి కానివి ఏమున్నాయి? యదార్థం చెప్పావు. అంతే కాదు నాకు నీ మాటలు విన్న తర్వాత కొద్దిగా భయం కూడా కలగక పోలేదు. నాకు ఇంత హితవు చెప్పి మంచి కోరేవారు నువ్వు తప్పితే ఎవరుంటారు? మంచి చెడు మన ఇద్దరికీ సమానమే కదా ! ఒకవేళ నా మేలు కోరే ఆలోచనలు ఎవరయినా చేసినా - నీకు అందిన విషయాలు వాళ్ళకు అందుతాయనుకోను. ఫక్! జానకీ! భవిష్యత్తును, కర్తవ్యాన్ని గుర్తుచేస్తూ చెప్పటానికి నువ్వు విదేహ రాజు ఇంట్లోనే పుట్టాల్సిన అవసరంలేదు. (క్షత్రియ స్త్రీ అయి వుండి కూడా మామూలు వాళ్లకు– అంటే అతి సామాన్యులకు కలిగే భయాలు, తద్దే ఉహలే నీకూ కలిగాయి. ఏం లాభము అని అర్థము) తండ్రి అడవికి వెళ్లమన్నాడంటే నేను క్షత్రియుణ్ణి అవడం మానాలా ? తండ్రి నన్ను రాజ్యభ్రష్టుడై స్వధర్మాన్ని తప్పమనలేదు కదా! నా జన్మతః వచ్చిన క్షాత్రం ఎక్కడికి పోతుంది? రక్షణ ధర్మం ఎక్కడికి పోతుంది? వర్ణ ధర్మాల్లో– కోదండం చేత పట్టటం, ఆర్త జన రక్షణం, చేసిన వాగ్దానాన్ని నిలబెట్టడం ఇవి మూడు క్షత్రియునికి పరమధర్మాలు. వీటికి తోడు నాకు ఈ తపస్వీ జనం అంటే అవ్యాజమైన ప్రేమ. మనం శరభంగ ఆశ్రమం వెళ్లినపుడు ఆ ముని తన శరీరాన్ని యోగాగ్నిలో భస్మం చేసుకున్నాడు. నీకు గుర్తుందా– ఆ రోజు సాయంకాలం ముని పత్నులు నిన్ను ఎక్కడికో తీసు కొని వెళ్లారు. తిరిగి తిరిగి నువ్వు రాత్రికిగాని రాలేదు. అందుచేత నీకు తెలియక పోవచ్చు. ఆ సాయంకాలం చుట్టుపక్కల మునులందరూ వచ్చి బాధతో నాతో ఏం చెప్పుకున్నారో తెలుసా"!

"ఓ రఘునందనా ! నీవు చాలా బుద్ధిమంతుడివి. మాకు వచ్చిన విపత్తు నుండి మమ్మల్ని ఇంకొకరు రక్షించలేరు. రాక్షసుల కోరల మధ్య

మా బ్రతుకు ముక్కలయి పోతోంది. నీవు ఆదుకొనకపోతే మాబోటివారం ఇంక ఏం తపస్సు చేయగలం? నీకు సకల అస్త్ర శస్త్రాలు విశ్వామిత్రుడు ఇచ్చాడు. ఆ విశ్వామిత్రుడు ఎవరు? మావాడు. ఎందుకిచ్చాడు? జగద్ధితం కోసం. మరి ఆయనకు గురుధక్షిణ రూపంలోనయినా మా బాధ తీర్చలేవా? మమ్మల్ని రక్షించక తప్పదు." అన్నారు.

ఇప్పుడు విను సీతా! 'ఈ ధర్మ రక్షణ కోసం అవసరమైతే నిన్ను, ఇంకా అవసరమైతే లక్ష్మణుని కూడా వదిలి పెట్టాల్సి వచ్చినా వెనుకాడనేమో' (ఇప్పుడు చెప్పిన విధంగానే లోకోపవాద నివృత్తికై సీతా పరిత్యాగము, దుర్వాసముని వచ్చినపుడు ధర్మ మార్గానుసరణకై లక్ష్మణుణ్ణి కూడా దూరం చేసుకుంటాడు.) సూర్యుడి దగ్గర నుంచి ఇంతవరకు మా వంశంలో ధర్మ రక్షణ జరుగుతూనే వుంది. నేను దీన్ని చెడగొట్టడమా?" అన్నాడు రాముడు. అలా అనంగానే జానకి మళ్లీ ఏమీ మాట్లాడకుండా రాముని చేతిలోనిఖడ్గం తీసుకొని ముందు నడుస్తోంది. లక్ష్మణుడు ముందు ఆ తర్వాత సీత ఆ వెనుక రాముడు నడిచి వెళ్తున్నారు.

## అరణ్యావాస ఆనందం

సీతకు దాహం వేసి ఒక సరస్సు ఒడ్డున నిలబడి విడ్డూరంగా చూస్తూ రాముణ్ణి కూడా పిలిచి చూపించింది. ఆ చెరువులోనుండి సప్త స్వరాలు వినవస్తున్నాయి. బుడగల ధ్వనితో పుట్టిన గమక, గ్రామ, తానములను అనుసరించి అప్సరసల పాటలు వినపడుతున్నాయి. వాటిని వింటూ విస్తుపోతూ సీత దాహం మాట మరిచిపోయింది. అటుపైన గుర్తుకు వచ్చి కూడా సరస్సులోనికి దిగితే స్వరాలు ఆగిపోతాయేమోనని దిగనా,

వద్దా అని తటపటాయిస్తుంటే— రాముడు సీత ముగ్ధత్వానికి మురిసిపోయి ఆమెను కేళీసల్లాపములతో మరింత ఆనంద పరుస్తున్నాడు. ఇంతలో అక్కడకు ధర్మభృతుడు అనే మునివచ్చి ఇదంతా మాండకర్ణి ముని తపశ్శక్తి ఫలితమని, ఆ స్థల సరస్సుల వైశిష్ట్యాన్ని వివరించాడు. ఇట్టు వంటి అద్భుతాల్ని ఎన్నో చూస్తూ నడుస్తున్నారు. చక్కని వాస యోగ్య మైన ప్రదేశము వచ్చినప్పుడు అక్కడే కొన్ని రోజులు ఉండిపోతున్నారు. అలాంటి ఒకోచోట ఒకసారి సీత వంట చేస్తూ ఏదో అందివ్వమని రాముణ్ణి అడిగేది. రాముడు ఎక్కడనుంచో కోమకు వచ్చిన ఒక కొండ గోగు పువ్వును సీత జడలో పెట్టి ఎలావుంది అనేవాడు. రాముడు నిద్ర పోతున్నపుడు సీత ఆయన చేతి ఉంగరము తీసి తన చేతికి పెట్టుకొనేది. ఒకసారి నిద్ర పోతున్న రాముని కొంగుకు తన శిరోమణి వుండటం చూసింది. ఎప్పుడు ఈయన తీసారబ్బా అని ఆశ్చర్యపోయి ఆ కొంగున వున్న చూడామణిని వూడదీసుకొనేది. ఇలా ఎన్నో రోజులు ఆహ్లాదకరంగా వనవాసం గడచిపోతోంది. ఒక్కొక్క చోట నెల రోజులు, ఇంకో చోట మూణ్ణెల్లు, ఆర్నెల్లు ఇలా తెలియకుండానే పదేళ్లు గడిచిపోయాయి. రామునికి ఎందుకో ఒక్కసారి సుతీక్ష్ణు ఆశ్రమానికి వెళ్లివద్దామనిపించింది. పదేళ్ల క్రిందటి కథలన్నీ ఒక్కసారి మనస్సులో మెదిలాయి. ఆశ్రమానికి వెళ్లం గానే అందరూ ఒక్కసారి సీతారాముల చుట్టూ చేరి పూర్వపు ప్రేమాను రాగాలతో పలకరించారు. ఒక ముని తన యింటికి లక్ష్మణున్ని తీసుకు వెళ్లి "ఇదిగో! నువు చంపినదే" అంటూ ఒక పులి తాలూకు తోలు ఇచ్చాడు. అందరూ ఏన్నో కథలూ, గాథలూ చెప్పేవారు. ఎవరేది చెప్పినా అగస్త్యుని గురించి ప్రస్తావన తప్పక వచ్చేది. రాముని మనస్సులో అగస్త్యుణ్ణి చూడాలని కోరిక మెదిలింది. అప్పుడు సుతీక్ష్ణమునితో

# అగస్త్య ప్రసక్తి

"స్వామీ! ఇక్కడ ఎవరు ఏది చెప్పినా అగస్త్యుని గూర్చి రకరకాల కథలు చిత్రంగా చెబుతున్నారు. ఇక్కడకు అగస్త్యాశ్రమం దూరమని అందరూ అంటున్నారు, ఎంత దూరం వుంటుందో కాస్త చెప్తారా? మీరు ముక్తసంగులు, జితేంద్రియులు, ఇంద్రియాలన్నింటిని మనస్సులోనే నిక్షిప్తం చేస్తారు. కాని ఇంద్రియాలను అంటిపెట్టుకుని వుండే మాబోటి వారు (అంటూన్నపుడు వైదేహి వంకచూసి) మీ ఋషులకు మల్లే ఉండలేము గదా! ఈ ప్రాంతంలో వున్న ఆశ్రమవాసులందరినీ ఎన్నోరకాలుగా రక్షిస్తున్న మహానుభావులను చూడాలనే వాంఛనుండి దూరం కాలేక పోతున్నాము. కాస్త ఆ అగస్త్యాశ్రమం గూర్చి చెప్పండి స్వామీ" అన్నాడు. అప్పుడు ముని—

"రామా! నీ మాటలు, నీ చేతలు ఎవరికీ రావయ్యా. ఎవ్వరినీ కష్ట పెట్టవు గదా! ఏది చెప్పదలిచావో, ఎందుకు చెబుతున్నావో ఏమి, చేయ దలచావో ఎంతో ఆలోచిస్తేగాని అర్థం కావుగదా, సరే! నాకే చెబుదామని నాలుక దాకా వచ్చింది. మీరు, ఇన్ని నాళ్లగా ఈ ప్రాంతములో వుండి గూడా అగస్త్యుని దర్శించలేదు! మీ వనవాసకాలం గూడాసగానికి పైనే పూర్తయింది. మరి తప్పకుండా ఆ ధీమంతుని శుభ దర్శనం మీకు జరగాలి. అయితే ఆయనను చూడాలంటే మా అందరు ఋషులను చూడ్డానికి వచ్చినట్లు కాదయ్యా రామా! భక్తితో నాబోటి శిష్యుణ్ణి ముందు పంపి ఆయన అనుజ్ఞ తీసుకొని వెళ్లి ఆయన మనస్సుకు అనుగుణంగా మసలుకోవాలి. ఆయనతో వ్యవహారం ఎప్పుడూ అంతే. గుర్తుపెట్టుకో! నిజం మాట్లాడాలంటే ఈ సమస్త దక్షిణాపథంలోని సర్వ మౌనులు ఇలా స్థిర నివాసాలు ఏర్పరచుకొని. ఏ రాక్షస బాధా లేక హాయిగా బ్రతక గలుగుతున్నారంటే ఆయన చలవే! తలవంచకుండా విర్రవీగి పెరిగి పేట్రేగి

పోయిన వింధ్యరాజు నడ్డిమీద తన పాంకోళ్లతో అదిమి తన్నిపట్టి ఉత్తరా పథం నుండి ఈ దక్షిణా పథం వచ్చాడు అమహానుభావుడు. అప్పుడు ఆయనతో పాటే మేము ఇలా రాగలిగి హాయిగా బ్రతక గలుగుతున్నాము. అంతకు పూర్వం ఈ దక్షిణా పథంలో చైతన్యమే లేదు. సరిగ్గా ఇక్కడకు నాలుగు యోజనాలు దక్షిణ దిక్కుగా పోతే ముందు అగస్త్య సోదరుని ఆశ్రమం వస్తుంది. పిప్పల వృక్షాలతో, సుగంధ వీచికలతో మలయ మారుత ప్రసన్న ప్రసారాలు నాసా పుటాలకు విందు చేకూరుస్తూ స్వాగతాలు పలుకుతాయి. ఆ అగస్త్య సోదరాశ్రమం ఒక ప్రక్కగా ఒక ఆమడ దూరం నడిస్తే కుంభ సంభవుని ఆశ్రమం వస్తుంది. అసలు అక్కడికి పోతే ఎవరిని అడిగినా చెపుతారులే! ఈ పూటకు అగ్ని కార్యాలు, భోజనాలు అయ్యాయి కాబట్టి మీరు విల్లంబులు భుజాలకు తగిలించుకొని బయలుదేరండి, ఇదే శుభలగ్న సమయం" అన్నాడు.

ఇంతలో సీత అక్కడకు వచ్చి శ్రీరామునికి వినపడకుండా సుతీక్ష్ణునితో –

"తండ్రీ! ఇక్కడ ఎవరు చెప్పినా దక్షిణ ప్రయాణం రాక్షసులకు ఎదురేగడం అంటున్నారు. రాక్షస కూటాలకు అగస్త్యముని కాలకూట విషంలాంటి వాడటగదా!" అంటూ చివరి మాటలు రామునికి విన బడేట్టు బిగ్గరగా అని మునికి నమస్కరించి రాముని వెంట నడిచింది.

త్రోవలో పాము తలమీద తన పాదంతో నొక్కి దాని పడగను తన ముక్కుతో పొడుస్తున్న నెమలిని చూడమని రాముడుసీతకు చూపించాడు. అప్పుడు సీత –

"గెలిచే బలపరాక్రమ ప్రతిభలు ఉన్నాయి గదా అని ఇంకొకరితో పోరు కొని తెచ్చుకుంటూరా ? లోకోపకారార్థమైతే కుంభసంభవుని లాంటి

ప్రభువు లెన్నడూ అలాంటి సాహసాన్ని విడనాడరనుకోండి. అటువంటి పరోపకార పరాయణుల చేతనే గదా ఈ లోకాలన్నీ ఆపదలు బాసి రక్షింపబడుతున్నాయి. అదిసరే! మన సుతీక్ష్ణుల ఆశ్రమంలో వుండగా నాకు జటాధారి – గార్గేయి ఒక తమాషా కథ చెప్పింది, చెప్పమంటారా మరి ?" అంది. అందుకు రాముడు–

"చెప్పమంటారా మరి అంటే మరి ఆ చెప్పేదేమిటో మాకు తెలియదు గదా! వెంటనే "ఊఁ చెప్పు" అని ఎలా అనను అన్నాడు. అలా అనంగానే సీత——

"సర్లేండి ఈ బడాయికేం గానీండి, ఎంత బావుంటుందో నేను ఇప్పుడు చెప్పబోయే కథ. అది అగస్త్యమౌని కథ! తెలుసా? అచ్చు ఆ గార్గేయి ఏలా చెప్పిందో అలాగే చెప్తాను" అంది. అప్పుడు రాముడు "ఆ కథ ఇపుడునేనువినలేనబ్బా" అన్నాడు. కథ మీద కుతూహలం అభిమానం కొద్దీ "పోన్లేండి పెద్దగొప్ప మీరు వినకపోతే మా మరది సౌమిత్రి వింటాడు. కదయ్యా" అంటూ కథ ప్రారంభించింది.

## ఇల్వల వాతాపుల కథ

ఈ అరణ్య ప్రాంతం లోనే సద్వ్రతాచార, సంపన్నులు, సత్త్వ గుణ నిష్ఠాగరిష్ఠులు కనీసం రెండో పూటకైనా కూడబెట్టుకోపోతే ఎలా అనే భీతిలేని వారు ఉండేవారు. ఒక గృహస్థుడు వీరిలో ఒక్కొక్కరిని ఒక్కొక్క రోజు తన యింట ఆతిథ్యానికి పిలిచేవాడు. "ఈ రోజు ఎవరు అతిథిగా వస్తారా" అని ముదురు తొండ ముంగాళ్లపై నిక్కి నిశ్చలంగా నిలబడి కాళ్ల నడుమ నుండి కదిలే చీమలబారులోని చీమల్ని నోట వేసుకునే ఫక్కీలో రోజూ అతిథుల కోసం నిరీక్షించేవాడు– ఆ గృహస్థు. వాడి పేరు ఇల్వలుడు

వాడికో తమ్ముడు. వాడి పేరు వాతాపి. ఆ యిద్దరూ కామరూపులు, క్రూర కర్ములు, నర మాంసం రుచి మరిగినవారు. అది లేనిదే ముద్ద ఎత్తని మాయావులు. ఇల్వలుడు అతిథిని యింటికి తీసుకు రాంగానే వాకిట్లో గుంజకు కట్టివేయబడిన వాతాపి బలిసిన గొర్రెపోతు రూపంలో దర్శన మిచ్చేవాడు. "ఇదిగో దీన్నే వండి మీకు పెట్టబోయేది." అని ఊరించే వాడు. అతిథిగా వచ్చిన ఆ బక్క బ్రాహ్మణుడు తన నాలుకతో పెదవులను తడుపుకునేవాడు. అసలు ఆ గృహస్థు పిలుపులో ఎంత మర్యాద ఉండేదని? మా యింటికి మీరు రావాలి. మీ పాద స్పర్శకు మా యిల్లు పావనం కావాలి. మీరు కనీసం కాసిని మంచి నీళ్లన్నా మా యింట్లో పుచ్చుకొనక పోతే ఇన్నాళ్ల పాపపు తిండితో బరువెక్కిన ఈ నా పాడు పొట్టకు ఒక ముద్దన్నా పడేసేది లేదు. గడిచిన రోజులు ఎలా గడిచాయో ఆ వితర్కము ఇప్పుడు ఎందుకు? ఇక ముందయినా పరమార్థ చింతలో ఈ నిష్ఠుర గృహస్థ వ్రతాన్ని ఆచరింపదలచాను. బ్రతికినన్నాళ్లు బ్రతకం గదా అలాంటప్పుడు మీ కింత పెట్టి మేం తింటామనే పరమార్థ చింతలో కాలం గడుపుతున్నాము. దీంతో అటు మాకు ఇటు, మీకు తృప్తి కలిగి ఉభయ తారకంగా వుంటుంది. మాకు ఈ గృహస్థాశ్రమ ధర్మాచరణ ఫలితం, అతిథిగా వచ్చినందుకు మీకు స్వర్గప్రాప్తి చేకూరుతాయి. మా యింటికి రండి. వాకిట్లోకి రాంగానే బలిసిన గొర్రె కనిపిస్తుంది. మీ కోసమే దాన్ని అలా ఏర్పాటు చేసింది." అంటూ పిలుపు దగ్గర నుంచి ఎంతో ధార్మి కంగా వ్రతానుష్ఠాన మర్యాదకు తగ్గట్టు సాదర పూర్వకంగా ఆహ్వానించే వాడు. ఒకవేళ అతిథినే రాలేనని గాని "రానని" గాని ఏదైనా చెప్ప వస్తే మరీ మొరటువాడైన ఆ గృహస్థు "నేను రమ్మనడం రాకపోవటం వుండదు, వుండకూడదు. మిమ్మల్ని చూసిగూడా వ్రతభంగం చేతులారా చేసుకుంటామా? నీవు రాకపోతే వీపుమీద వేసుకుని మోసుకు పోతాను అని బలవంతాన లాక్కెళ్లేవాడు. ఇలా రోజూ జరిగే అతిథి సేవనంలో జరుపు కొనే ఆ ఇల్వలుని గృహస్థ వ్రతం అనోటా అనోటా ఆ ప్రాంతంలోని ప్రతి

బ్రాహ్మణునింట్లోవారికి తెలిసింది. గృహస్థుని ఇంటికి అతిథులుగా వెళ్లేవారే కాని తిరిగి అక్కడ నుండి వచ్చిన వారొక్కరూ కనబడరమ్మా రఘు రాముని భార్యా రత్నమా! అవును మరి రమ్మంటే ఎలా వస్తారూ ? అతిథి కాళ్లు కడుక్కుని భోజనానికి పీట పైకి చేరేసరికి ఎదురు ఘుమఘుమలాడుతూ గొర్రెపోతు మాంసము వెర్రిగా నోరూరించేది. నిశ్శేషంగా దానిని ఆరగించ గానే అన్న ఇల్వలుడు తమ్ముడు వాతాపిని ప్రేమారగా రమ్మని పిలిచేవాడు. వాతాపి అతిథి పొట్ట చీల్చుకొని వచ్చేవాడు. ఆ అతిథిని అన్నదమ్ములిద్దరూ తిని త్రేన్చేవారు. ఇంత చక్కటి గృహస్థ వ్రతం పాటిస్తుంటే అతిథులుగా వెళ్లిన వారికి ఇంకా ఇల్లు ఇల్లాలు సంసార లంపటం దేనికి? సునాయాసంగా, సూటిగా స్వర్గప్రాప్తి చేకూరుతుండె. పైగా ఆ విషయం ఇల్వలుడు ముందరే చెప్పనే చెప్పె! అంటే ! ఇల్వలుని ఈ గృహస్థ ధర్మపాలనలో చుట్టుప్రక్కల నాలుగు అడవులలోని ఆశ్రమవాసులు ఇల్వలుడు భోజనానికి పిలుస్తాడేమో నని, తోడెవరూ లేనిదే కదిలేవారు కారు. తమకు వచ్చిన దురవస్థకు పొలస్థ హస్తులై విషాదంతో విరించిని ప్రార్థించేవారు. త్రిశూల, సుదర్శనాలు, పినాక శార్‌ఙ్గములు లేకపోయినా ఎవరి కర్మకు తగ్గ ఫలం వారి నొసటి మీదనే శాపంగా వ్రాయగల ఆయుధం వున్నవాడు ఆ విరించి. ఆయనకు తెలియదు ఎప్పుడు ఏది ఎవరికి ఎవరిచే ఎలా జరగాలో ?

ఒక రోజు అటు శైవము, ఇటు వైష్ణవము కలిసివున్న మూర్తి తన కనుబొమ్మలు రెండు పినాక శార్‌ఙ్గములు వలె వున్న, వింధ్య శిఖరాన్ని అణచిన పాదపు గుర్తులు బలిని అణచిన చిన్ని హరి పాద చిహ్నాలూగా కని పించే అగస్త్యుడు ఆ దారమ్మట పోతున్నాడు. బలిసిన బాహువులు, నిండ యిన తొడలు, పచ్చని పసిమిరంగు శరీరచ్ఛాయ, పింగళజటాధారి, రుద్రాక్ష హారుడు, కుంభోదరోన్నత శరీరుడు ఐన ఆ అగస్త్యుని ఇల్వలుడు చూచాడ రాయంచలా నడుస్తున్న ఆ మునిని చూడంగానే వాడకి నోరూరింది. వెంట ఎదురేగుతూ—

"ఏ మునిని చూసినా ఈన కట్టు పుల్లలా బక్కచిక్కి చక్కిలంలా వుంటారు. అటువంటి వాళ్ల ను పిలిచి అన్నం పెట్టినా ఏం ఫలం దక్కుతుంది. పిట్ట తిండే కదా ! ఇలాంటి ఘట శరీరంలో వున్న నిన్ను తీసుకు వెళితే ఏమన్నా కాస్త పెట్టిన తృప్తి, తిన్న తృప్తి, వుంటుంది. తిన్న తరువాత కూడా మాసం రూపమై కొమ్ములతో పొట్టను క్రుమ్మగలట్టి బలిష్ఠమైన గొర్రె పోతును మీకు పెడతాను. ఈ రోజుకు నా వ్రత ఫలితం దక్కింది. నీవు దానిని తింటుంటే చూస్తేనే నా రెండు కళ్ల కు తృప్తి. ఏమిటో! పిలిచి భోజనం పెడతానన్నా పారిపోతారు. ఈ మాత్రం హరాయించుకోలేని బక్క బ్రాహ్మణుల్ని చూస్తే నాకే ఆకలి చచ్చింది. ఈనాటి నీబోటి భోజన ప్రియుల రాకతో నా పంట పండింది. అదిగో ఆ కనపడేదే మా రమణీయ గృహం, ఇవిగో ఇవి దొడ్లు, ఇవి పాడి బర్రెలు, ఇవి పాడి ఆవులు, ఇంకా తగినంత సస్య సంపద కూడా వుంది. పైపెచ్చు నిల్వ ధనం కావలసినంత వుంది. ఉ గుంజకు కట్టిన గొర్రెపోతును చూశావా? ప్రతిరోజూ ఇలా బలిసిన గొర్రెపోతునే అతిథి బ్రాహ్మణులకు పెడతాను" అన్నాడు.

అనుష్ఠానం పూర్తి అయిన తరువాత మునికి చెరువంత పెద్ద అరిటాకు వేశాడు. దానిమీద నీళ్లుచల్లాడు. వండిన వాతాపిని విస్తట్లో క్రుమ్మరించాడు. ముని ఔపోసనపట్టాడు. ఆ ఔపోసన విసురుచూస్తుంటేనే వ్యాహృతులలోనే వాతాపిని మొత్తం పూర్తి చేస్తాడా అన్నట్టు వుంది. ముద్ద ముద్దకు త్రేన్చుతూ, త్రేన్చినపుడల్లా చేత్తో పొట్ట రాసుకొంటూ జీర్ణం జీర్ణం అంటూ నమిలి నమిలి మ్రింగుతున్నాడు. ఎదురుగా నివ్వెరపడి గుడ్లప్పగించి చూస్తున్నాడు ఇల్వలుడు. ముని ఉత్తరాపోశనం పూర్తిచేశాడు. ముని లేవకుండానే ఇల్వలుడు "తమ్ముడూ! వాతాపీ! బయటకు రా నాయనా!" అని అనంగానే ముని—

" ఎంత కామరూపులైనా వింధ్యాచలమంతగా పెరగ లేరురా

దురాత్మా ! నువ్వు ప్రేమానురాగాలతో వ్రతానుష్ఠాన మర్యాదతో పిలిచి భోజనం పెడితే అది అరక్కుండా వుంటుందా వెర్రి నాయనా! ఈ పాటికి వాడు ఈ అగస్త్యునిరక్తంలో కలిసిపోయుంటాడు కూడా! ఇంకెక్కడి వాతాపి ఇటుపై నీ గృహస్థ ధర్మం చెల్లించుకోడానికి పాపం గొర్రెపోతు వాతాపి వెట్టిగా ఖర్చయిపోయాడు. ఇక ముందెలా వ్రతం కొనసాగిస్తావో ఏమో!" అని అనంగానే "అమ్మా ! వచ్చింది అగస్త్యుడా" అని ఒక్కసారి గుండె బ్రద్దలయి తమాయించుకొని అగస్త్యుని మీదకు విరుచుకు పడబోయేసరికి అగస్త్యుడు కళ్లుమూసి సమాధిని పొందం గానే శివుని కంటికి ఆహుతైన మన్మధునిలా ఇల్వలుడు మాడి మసిబొగ్గయి పోయాడమ్మా! మాదొడ్లో ఇందాక చూసిన మసిలావు వుందే అది ఇల్వలుడిదే! ఇల్వలుణ్ణి మసి చేసిన తర్వాత వాడి యావదాస్థిని ఇక్కడ మునులందరికీ పంచి ఇచ్చాడమ్మా జనకు కన్న కుమారీ!" అని, ఇది గార్గేయి చెప్పిన కథ. 'బాగుందా?' అనంగానే స్వామి– "నా కా బాగేదో తెలియదు కాని నీ కథలో నాకు తెలిసినవల్లా రెండే రెండు సంగతులు. మొదటిది నీవు రాముని భార్యవని, రెండవది– నీవు జనకు కన్న కూతురువని" అన్నాడు. అప్పుడు సీత—

"కాదు కాదు రఘూత్తముని భార్యా రత్నము" అని అనగా రాముడు సౌమిత్రునితో–

"లక్ష్మణా! ముక్కుపుటాలకు పిప్పలీ విరళ గంధస్వాదు మందానిలం సోకి యావచ్ఛరీరం తేలికైనట్టుంది. సాయం సమయమైంది. సుతీక్ష్ణులు చెప్పిన ఆశ్రమం వచ్చినట్లుంది. ఈ ప్రాంతం అడవిలా లేదు. పల్లెసీమ చెట్లు కనపడుతున్నాయి. వూళ్లోకి కాలి దారి కూడా కన్పడుతోంది. త్రోవలో పోతూ వుంటే ఆశ్రమ సరస్సు ఒడ్డున ఒక్కొక్కళ్లు సంధ్య వారుస్తూ కనపడతారు. తడి గుడ్డలు కట్టుకొని ముని పత్నులూ, పడుచులు నీళ్ల తీసుకుని వెళ్తూ మనల్ని చూసి ఒక్కసారి నిలబడిపోయి ముందుకు సాగుతూ తారసిల్లుతారు చూడు నాయనా!" అన్నాడు.

## అగస్త్య భ్రాత అతిథ్యము

ప్రయాణిస్తున్న దారిలో కొంత దూరం వెళ్ళేసరికి ఒక చెఱువు, ఆ చెఱువు ప్రక్క మోదుగ చెట్టు, ఆ చెట్టుకు తూర్పుగా ఇసుక తిన్నెలు, ఆ పైగా దర్భల గుంపు అన్నీ సుతీక్ష్ణులు చెప్పిన గుర్తులు కనబడుతున్నాయి. ఇదే అగస్త్య ఆశ్రమమని నిర్ధారణ చేసుకున్నారు. అక్కడ పచ్చని చెట్లు చాలా వినూత్నంగా వున్నాయి. సరాసరి అగస్త్య సోదరుని ఇంటికిపోయి "మేము రామ లక్ష్మణులము. ఈమె వైదేహి" అని అంటుండగానే ఆ ముని-

"ఓహో! వింధ్యాచల మర్దనుని చూడటానికి వెళుతున్నారన్న మాట, సరి సరి! అక్కడ ఆయన కూడా 'మీరెపుడు వస్తారా' అని ఎదురు చూస్తున్నాడు గదయ్యా, ఇటునుంచే వెళ్తారు గదా అని ప్రతిపూట ఈ పూట వస్తారు, ఈ పూట వస్తారు అని మీ కోసం ఎదురు చూస్తున్నాను. రండి. ప్రయాణ బడలిక తీరి కాస్త ఓపిక వస్తుంది కాని ముందు స్నానాలు చేసిరండి. నేను బ్రహ్మచారి గాడిని. అతిథులకు వంటా వార్పు ఎల్లాగా అని అనుకుంటుండగా మా పొరుగింటి వాడైన గాలవముని భార్య నేననుకోక ముందే జయలుదేరి వచ్చి అన్నీసిద్ధం చేసింది. ఇంక మీదే ఆలస్యం" అన్నాడు. సీతారామ లక్ష్మణులు భోజనాలు చేస్తుండగా వచ్చి మళ్ళీ తనంతట తానే ఎవరూ అడక్కుండానే ఇలా చెప్పటం ప్రారంభించాడు.

## వింధ్యకు వినయం నేర్పిన ముని

"తన అంజలిలోని పదివేళ్లకు సమన్వయంగా పదిదిక్కులు బ్రహ్మ సృషించాడంటారు. గాని, ఓ రామా నిజానికి ప్రజాపతి సృష్టి తొమ్మిదే! ఆ దక్షిణ దిక్కుకు దిక్కు మా అన్నగారే గదయ్యా! దక్షిణం గురించి ఈరోజు చెప్పుకుంటున్నామంటే- మంచి తేజస్వంతులు, స్ఫురద్రూపులు

ఐన ఋషి సమూహము ఈ దక్షిణ దిక్కుకు వచ్చిందంటే అంతా మా అన్నగారి చలవ, ఆ వింధ్య చలవే గదయ్యా! నిజం సీతమ్మ తల్లీ! అదంతా వారిద్దరి చలవే! శివుణ్ణి తన శిరస్సున దాల్చిన మేరువు అకాశాని కంటే ఎత్తు పెరగటంచూసి 'నేనేనా తక్కువ తిన్నది అని వింధ్య ముందు చూపే గాని వెనుక చూపు లేకుండా పోటీతో పెరిగి పెరిగి సూర్యుని మార్గానికి అడ్డు వచ్చేలా తయారయింది. తన రథం ఇరుసు వింధ్యకు తగిలి కర్‌మని గీచు కోవడంతో ఏడు గుఱ్ఱాలు పెడగా తిరిగి బెదిరిపోయాయి. పోలు విరిగింది. ఇరుసు సీల చెదిరింది. అడ్డకట్టూడి బీటిచ్చింది. చక్రంలో ఆకులు ఊడిపో యాయి. టంగు తెగి గుర్రాలు వికటమై నేలకానాయి. పుష్ప ఫల భరితమై మహా వృక్షంలా పొడుగెదిగిన వింధ్యను చూచి ఆకాశం—

"ఏమిటీ చిత్రం, ఇన్నాళ్లబట్టి చూడలేదీ విచిత్రం—ఈ వింధ్యసూటిగా ఈ బంగరుకొండతోనే పోటీకి నిలిచిందే! సరాసరి సూర్యునికే ఏసరుపెట్టిందే మహా ఆశ్చర్యంగా వుంది." అని అనుకున్నది, జానికమ్మా! అసలు కాలం ఎప్పుడూ కదలదని, సూర్యుని గమనం మూలంగానేకాలానికి ఆద్యంతాలు ఏర్పడతాయని సూర్యుని రథం ఆగిపోవడంతో రూఢి అయింది ఆనాడు రథము వింధ్యకు తగలడంలో పుట్టిన చప్పుడుకు, ఆ అదురుకు, వింధ్య మీద సమస్త వృక్షాలు భూమినంతను తమ ప్రసూనాలతో అభిషేకించాయి. పుష్పములతో భూమి ఉపరితలం కప్పబడి వస్త్రోపచారం జరిగినట్లయింది వాటివల్ల వచ్చే గంధంతో సుగంధ ధూపాలు సమర్పించి నట్లయింది. తన ప్రకృతికి కలిగిన ఈ సత్కారానికి పరమేశ్వరుడు ప్రీతి చెందాడు. ఆనందంతో శిరస్సు వూపాడు. తలలోని గంగ వింధ్యపైపడి 'గంగ ఒక హేమాద్రి సొత్తేకాదు. ఆ గొప్ప తనకూ వుందనే ఠీవిని వింధ్యకు కలిగేలా వయ్యారంగా సాగింది' అపుడు అంధతామిశ్ర లోకాల్లో బిక్క చచ్చిన జీవునిలా వున్న హేమాద్రిని చూస్తే మిణుగురు పురుగు దీనికన్న నయమేమో అనిపించింది. మునుపు పర్వతాలకు ఱెక్కలు వూడగొట్టి

నందుకుగాను ఇప్పుడు ఆ తెక్కలంత మేరకు విస్తరించి ఆకాశాన్నంటే ఎత్తు పెరిగి "మేరువా? నేనా?" అన్నట్లు నిలిచి కసి తీర్చుకుంది. దాని ముందు మేరువు పైడి ముద్దయిపోయింది. అప్పుడు బ్రహ్మ ఇంద్రాది దేవత లందరూ ఇల్వల గర్వ నిర్వాపణోజ్జ్వలుడైన మా సోదరునితో మేరువును ఆశ్రితునిగా గైకొమ్మని కోరారు. అప్పుడు మనవాడు ఆకాశానికి ఏదిగిన ఆ వింధ్యను చూసి-

"ఏమోయ్ తల పైన ఎక్కడో ఆకాశంలో పొట్టావ్! నే చెప్పే మాటలు తలకెక్కుతాయా? వాటిని నీ మట్టిగుండా చెవికెక్కించు కుంటావా?" అనంగానే నింగి నిక్కిన శిరస్సును నేలమీదకు వంచి అంత వింధ్యాద్రి భూమ్మీద చాపచుట్టలా పడి మనవాడికి నమస్కారం చేశాడు తెలుసా"" అన్నాడు! ఇలా చెబుతున్నపుడు అగస్త్యభ్రాతకు నవ్వుపొర ఎగ్రకటంతో మాట స్పష్టత లేకపోవడంతోనో ఏమో కథ వింటూనే జానకి తనపతికి శయ్య నమర్చు చున్నదల్లా ఒక్కసారి ఆగి "స్వామీ! మీరు కాస్త నవ్వాపి ఇకపై కథ చెప్పుదరూ!" అంది. ముని ఆయాస హాసంతోనే మళ్లీ ప్రారంభించాడు.

మన అగస్త్యుడు తలను నేలకానించిన వింధ్యగిరితో ఏమన్నాడో తెలుసా "అబ్బీ! ముని లోకభక్తుడవై మసలుకో ఇక. ఏం? అర్థమయిందా? మాకు దక్షిణాపెన పని వుంది. యజ్ఞాకృతిలా వుండే సువర్ణునిలా రెండు కడళ్లు మోసి పరచుకున్న నీవు మమ్ము అటు పోనివ్వు. పోనివ్వడమే గాదు మళ్లీ మేము వచ్చువరకు, వచ్చేదిగూడ అక్కడ మా పనినిబట్టి అప్పటికి ఎంత పెరుగుతావో మా పిలుపు అందుతుందో అందదో ఎందుకైనా మంచిది, మేము వచ్చేవరకు తల ఎత్తకుండా ఇలాగే పడివుండు. నీకు మా గురించి తెలుసుకదా! అనే ఇలా చెప్పడం" అన్నాడమ్మా అంటూ అగస్త్య సోదరుడు మళ్లీ 'ఆ పర్వతాగ్రంలో బంగారు పావుకోళ్ల గుర్తులున్నాయి కూడా! అన్నట్లు మీరు అటునుంచేకదా వచ్చింది బహుశా

చూసే వుండచ్చనుకుంటా. ఆ వింధ్యకు దక్కిన బంగారం అదే చివరకు' అని హఠాత్తుగా ఎలావచ్చి కథ ప్రారంభించాడో అలానే ముగించి ఆ ముని వెడలి పోయాడు. అగస్త్య భ్రాతయొక్క కథా సంవిధానానికి, ఆత్మ మనోధర్మ విస్పష్ట వైవిధ్యాలకు, సమయస్ఫూర్తికి రాముడు ఆశ్చర్య పడ్డాడు. అటుపైన ముగ్గురూ మళ్లీ తమ ప్రయాణాన్ని కొనసాగించారు. త్రోవలో ప్రకృతి రమణీయ దృశ్యాలను చూస్తూ నడుస్తున్నారు. రాముడు ఒక గార చెట్టును చూసి—

"లక్ష్మణా చూశావా! ఈ గారచెట్టుకు దక్షిణంగా తిరిగితేనే పల్లపు వాగు వస్తుంది, ఆ వాగు దగ్గరేకదా అగస్త్యుని ఆశ్రమము అని ముని చెప్పింది?" అన్నాడు. ఇంతలోనే కుందేళ్ళు గోమాయువులు కలిసే తిరుగుతూ పెండ్లి నడకలతో ఎదురు వచ్చాయి. సగానికి త్రెంచబడిన దర్భ మోళ్లు కనపడ్డాయి రేగుపండ్ల గుజ్జులో ఆవునెయ్యి వేసి పోపు పెట్టిన వాసన వస్తోంది. పాలకుండల్లాగావున్న పొదుగులతో పుంతలో పడిపోతున్నాయి పశువులు. వాటిని చూసి రాముడు ఇళ్లకు వెళ్లే వేళయింది, వాటితో పాటు వెళితేసరి, ఆవుల గిట్టలకు లేచిన ధూళి మన శరీరాలకు తగుకొప్పి శుభం చేకూరుతుంది. పదండి. లోక రక్షణార్థం అవసరమైతే సాగరాల్ని త్రాగేసి, పర్వతాల్ని అదిమేసి, అధికార మదాంధులను అధః పాతాళానికి త్రోసి, రాక్షసుల్ని తమ జఠరాగ్నితోనే దహించి వేయగల తపస్వీరుని దర్శనము ఇన్నాళ్లకు మనకు కాబోవడం మన జన్మ ధన్యం" అనంగానే జానకి—

"మీరెప్పుడూ చక్కగా విచారించి మాట్లాడతారు. మీ మాటలు వింటే ఇంక ఎవరుటివారు మీతో మరోటి మాట్లాడలేరు కదా! వింధ్యను దమించినంతటి వాడైన అగస్త్యుడు మీ కోసం ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తున్నాడని ఆ ముని అదేదో చూస్తున్నట్లు చెప్పాడు. ఇప్పుడేమో

మీరు ఆయన దర్శనం అవడం మన జన్మ ధన్యం అంటున్నారు. మీ రిద్దరూ ఎవరెంతవారు వారు. గుండెలోతు తెలియనివ్వరుకదా" అనంగానే రాముడు కించిత్ విలాస పరిహాస పూర్వకంగా-

"ఇంతటి భక్తితో మనంతటివారు వస్తున్నారని ఈ మునిజనం సంబరం పొందుతున్నా రనుకోవచ్చు గదా! ఈ ముని అంతటి అమోఘ మహస్కుడైనప్పటికీ ఇక్కడ తన ముందు నా ధనస్సును అల్పంగా చూడడు. కుంభ సంభవుడు, తనంత తాను ఇల్లుకట్టాడు. మిగిలిన మునులందరూ ఈయన అండ చూసుకొని నిశ్చింతగా తపో యాగాలతో తమ జీవితమంతా గడుపుతున్నారు. రాక్షసుల బెడద ఈ ముని ధర్మమా అని కొన్ని ఆమడల దూరందాకా వుండదు. సురలు, సిద్ధులు, సాధ్యులు ఇక్కడ తపస్సులు చేస్తూ వుంటారు. తనను, తన సుఖాలను గురించి ఆలోచనలు రానిచోటు ఇది. శుష్కవచనాలు పలికే వారు, శఠులు ఇక్కడ మచ్చుకు కూడా వుండరు. ఇలాంటిచోట చేసే తపస్సులు ఉత్తమ స్థానాలు పొందుతాయి" అన్నాడు. ఇంతలోనే వూరు మొగదిలిలో ఒక వాగు కనపడంగానే కాళ్లు, చేతులు కడుక్కున్నారు. సంధ్య వార్చారు.

## అగస్త్య సందర్శనం

అగస్త్యుని మహాగ్ని గృహాలకు ముందు - తెల్లని కనుబొమలతో నూతన యజ్ఞోపవీతధారి కనబడగానే లక్ష్మణుడు చూసి -

ఈయన సూర్యవంశీయుడైన దశరథుని జ్యేష్ఠకుమారుడు. తండ్రి కోర్కెను తీర్చటం కోసం ఈ అరణ్యాలకు వచ్చాడు. వింధ్యాచల మర్దనుడైన అగస్త్య మునికి పాదాభివందనం చేసుకుందామని వచ్చాను.

ఆ ముని సెలవైతే దర్శనానికి నిలబడతాము" అనంగానే ఆ వృద్ధ బ్రాహ్మణుడు తల ఎత్తి నుదిటిపై గొడుగులా తన కుడి అరచేతిని వుంచి ఒక్కసారి రాముణ్ణీ, సీతను, లక్ష్మణుణ్ణి తేరిపారచూసి లోపలికి వెళ్ళి—

"ఎవరో దశరథ రాజ పుత్రుడట, క్రొత్త ఆషాఢ నీల మేఘంలా వున్నాడు, సంధ్యారుణ కాంతులు క్రమ్మిన తెల్ల మేఘంలా వున్నాడు ఇంకొకడు, భూమి నుండి పెళ్లగించుకొనివచ్చిన బంగారు బొమ్మలాగా వుండి పసితనం చెరగని పడుచు ఒకామె నీ దర్శనార్థమై వాకిట వేచియున్నారు" అనంగానే—

"వాళ్ల పేర్లు చెప్ప వేమిటయ్యా?" అన్నాడు ముని. "వాళ్ల పేర్లేగదా నే చెప్పింది." అన్నాడు వృద్ధ బ్రాహ్మణుడు. అగస్త్యుడు నవ్వుకొని "సరే రమ్మను లోపలికి" అన్నాడు. వృద్ధుడు వెలుపలికి వచ్చి—

"ఎవరయ్యా ఇక్కడ రవికుల సంజాతుడు, దశరథ సుతుడు ఐన రాముడెవరయ్యా ముని పుంగవులు లోపలికి రమ్మంటున్నారు" అన్నాడు, వెంటనే ముగ్గురూ లోనికి ప్రవేశించారు. అది అగ్ని గృహము ఎక్కడ పడితే అక్కడ స్వేచ్ఛగా లేళ్ల వాటి పిల్లలు నిర్భయంగా తిరుగుతున్నాయి. అగ్నిస్థానాల వద్ద బలులు సమర్పిస్తున్నాడు అగస్త్యుడు. వచ్చిన ముగ్గుర్ని ముని చూచాడు. కళ్ళతోనే కూర్చోండన్నట్లు సౌంజ్ఞ చేసాడు. మళ్ళీ తన కార్యక్రమంలో మునిగిపోయాడు. ముగ్గురూ ముని సావధానంగా చేసే సమస్త విధి విధాన క్రతుకాండను సవిస్తరంగా చూస్తూ ఉండిపోయారు. క్రతుకాండపూర్తి ఐన తరువాత ముని సుఖాసీనుడై రామ చంద్రుణ్ణి కన్నులనిండా చూసుకున్నాడు. ముగ్గురూ మునికి సాష్టాంగ దండ ప్రణామాలు చేశారు. అప్పుడు ముని—

# అగస్త్యుని అతిథి పూజ

"తపస్సు చేసేవాడు అగ్ని కార్యానంతరము మాత్రమే అర్ఘ్య మిచ్చి అతిథి పూజ చేయాలి, లేకపోతే స్వమాంశ భోక్త వంటి వాడవుతాడు. ఇందాక క్రతువుకు చివరతో కృసర మొసంగిన దుప్పికి భార్య దూరమయినది. ఎప్పుడూ ఎంతో బాధతో జాలిగొలిపే చూపులతో నా వద్దకు వస్తుంది. నేను దాన్ని అగ్నిహోత్ర సమానంగా చూస్తాను. పితృవాక్య పరిపాలకుడవు, మహారథుడువు, మహనీయుడువు, రాజువి ఐన నీవు ఈ ఉర్వి కంతకూ ప్రియాతిథివి, నా ఇంటికి వచ్చావు. నా ఆతిథ్యాన్ని స్వీకరించు. నీ వనవాస కాలంలో ఇక్కడకు ఎప్పుడు వస్తావా అని ఎదురు చూస్తున్నాను. ఇదిగో అర్ఘ్యం, ఇదిగో పాద్యం స్వీకరించు" అంటూ నీళ్ళ, పుష్పాలు, ఫలాలు సమర్పించాడు. రామచంద్రు నికి ఆ నాటి సాయంసంధ్యా కార్యక్రమం మనోజ్ఞంగా వుంది. ముని ఒసగిన అర్ఘ్యపాద్యాదులు స్వీకరించి ఫలాదులు అరగిస్తుండగా సుతి మెత్తని వెన్నెల దొంతరులులాగా నవ్వుతూ ముని—

"కోసలేశ్వరా! దానవ సంహారా! పూర్వం ఒకసారి దేవ దానవ యుద్ధంలో దానవులను సంహరించి దేవతలను రక్షించడానికి విష్ణువు వాడిన విల్లు, అక్షయ తూణీరాల అమ్ముల పొదులు, కరవాలము ప్రస్తుతము నా గృహములోనే వున్నాయి, నీవు వాటిని గ్రహించవయ్యా! ఆ ధనుస్సు భేదింప శక్యము కానిది' అవి తూణీరాలు కావు. జిహ్వాలు చాపిన కోడెత్రాచులు, అది కరవాలము కాదు యముని కరాళదంష్ట్ర. ఇవి నీ వద్ద వుండవలసినవే!! నీకు చెందవలసినవే! అందుకోసమే వాటిని ఇన్ని రోజులనుండి నీ కొరకై వుంచినది. "ఏవి—వాటిని తెండి" అని ఎవరినో పురమాయించగా—అమ్ముల పొదులు, విల్లు, ఖడ్గము తెచ్చి ఇచ్చారు శిష్యులు. ముని ముచ్చటపడి రామచంద్రునితో ఇవి తీసి కొని ధరించవయ్యా

చూస్తాను అన్నాడు. రాముడు వాటిని ధరించాడు. రాముణ్ణి చూసిన ముని కన్నులు సూర్య గోళాల్లా మెరిసిపోయాయి. చంద్ర గోళాల్లా మురిసిపోయాయి. క్రొత్త ఖడ్గాన్నీ విల్లంబులనూ ధరించిన రాముడు ఎనలేని భక్తితో మునిపాదములకు వినమ్రతతో నమస్కరించాడు. ముని సంప్రీతుడై కళ్లు పెద్దవి చేసి "భూసుతామనోహరా! నీ ఈ ధనుర్వి ముక్తబాణ పరంపరలు గ్రీష్మాదిత్య పటుప్రతాప వహ్నిజ్వాలలై దైత్యుల కంఠాలు మాడిమసి అయిపోతాయిలే! నికృష్ట దుష్టరాక్షసులను మట్టు పెట్టి, శిష్టజన దేవతలకు కష్టాలు తీరుస్తాయిలే!" అని హృదయం నిండా రాముణ్ణి నింపుకొని నీ ప్రవర్తనే నీకు ఆభరణమై, పరుల కాచరణమై పదివేల యేండ్లు వర్ధిల్లు నాయనా లే" అని మనసారా ఆశీర్వదించి, సీత వంక చూస్తూ—

## ఆగస్త్యుని సీతా ప్రశంస

"తండ్రిమాట మీద భర్త అడవికి వెళ్తే అతని భార్య కూడా అతనితో పాటే అడవికి వెళ్ళాలని ఎక్కడ వుంది? పైగా ఆడవాళ్ల మనస్సులు, పాదరసం కన్నా చంచలంగా వుంటాయి. అందులోను రాచకన్నెల తీరు మరింత చిత్రంగా వుంటుంది. భర్త వెంట వెళ్లక పోయినా వాళ్ళ కేం తక్కువ, తండ్రి తమ పేర వ్రాసిన పది వూళ్లూ చాలు- వారి జీవయాత్ర వెళ్లి పోతుంది. ఇక భర్త మీదనే ఆధారపడాల్సిన పని ఏమిటి? భర్త లేకపోతె గడవదుకనకనా? అదృష్టం బాగుండక భర్త అడవులకు వెళ్ళవలసినంత మాత్రాన నేను వెళ్ళాలని ఎక్కడివుంది? నాకే మంత గతిపట్టలేదు, అనే గర్వం తప్పని సరిగా వుంటుంది. ఇది ధర్మమో అధర్మమో ఎలా తెలుస్తుంది? మనస్సుకు అధో దిశలో దేహము, ఊర్ధ్వదిశలో ఆత్మ వుంటాయి, కోర్కెలు

ఈ మనస్సుని క్రిందకు లాగి మనిషిలో ధర్మా ధర్మ విచక్షణను దూరంచేస్తాయి, ధర్మపు త్రోవలోనే వుండాలంటే ఈ మనస్సును ఊర్ధ్వ పథాన్ని పట్టేటట్లు చేయాలి, అంతేకాని క్రిందకు దిగజారినీయ కూడదు. ఎవరైతే ఇలా తమ మనస్సులను క్రింది మార్గం కాక పై మార్గం పట్టించి ధర్మంగా నడుచుకుంటూ ఉంటారో వాళ్ళను ప్రజలు సజ్జనులంటారు. అసలు మనస్సును పై మార్గం పట్టించాల్సిన అవసరం లేకుండానే సహజంగా ధర్మ మార్గంలోనే వుంటే వాళ్లను ఏమనాలి? నిజానికి దేవతలన్నా చాలదు. ఎల్లప్పుడూ ధర్మం నుండి చలించని మనస్సు కలిగినది సీత, పోలిక చెప్పాలంటే అరుంధతి వంటిది. (అరుంధతి ఎప్పుడూ వశిష్ఠుణ్ణి అనుసరిస్తూ వీడకుండా ఉంటుంది. ఆకాశంలో సప్త మహర్షుల్లో వశిష్ఠ తార ఒకటి, ఆ తార క్రిందే కనపడీ కనపడనట్లు మిణుకు మిణుకు కాంతులతో అరుంధతి వుంటాయి. వీరిద్దరిదీ విడదీయరాని దాంపత్యం. తారలు ఎలా గమించినా వీరిద్దరికీ ఎడబాటు వుండదు. అందుకే ఈ జంట తారలను (Celestial couple) దివ్య దంపతులు అంటారు. క్రొత్తగా పెళ్ళయినపుడు ఆ నూత్న వధూవరుల దాంపత్యము ఈ దివ్య దంపతుల దాంపత్యమువలె ఎడబాటు లేనిదిగా వుండవలెననే ఉద్దేశ్యముతో అరుంధతీ దర్శనము చేయిస్తారు. అంతేగాని దృష్టి సరిగా ఉన్నదో లేదో తెలుసు కోడానికి కాదు.) త్రికాల నిష్ఠతో ఆమె మనస్సు నిత్యము పతియైన నీతో నిండి, నిరంతరము నిన్ను గురించిన భావాలలోనే వుంటుంది. మరి అలాంటప్పుడు ఇలా నీ వెంట పడి అడవులకు రావడం పెద్ద విశేషమేమీ కాదు. లిప్త కాలంలో లేశ భాగమందు కూడా ఆమె హృదయం ధర్మ మార్గమునే తప్ప రవ్వంత సడలి ఇతర మందు వుండదు. ఇంతకంటె ఇంక ఏం చెప్పాలి–సీత గురించి?" అన్నాడు, ముని ఈ విధంగా తనను గూర్చి మెచ్చుకోలు మాటలు చెబుతూ వుంటే వినడం కూడా ఆత్మస్తుతి వంటిదేననీ సీత పరాఙ్ముఖయై, గడ్డిపరకలను కొరకుతూ చురకగా గెంతుతూ

అత్యంత ఆకర్షణీయంగా వున్న ఆడ లేళ్ల గుంపును చూస్తూ వుండగా-రామ చంద్రుడు ఇంతకు మునుపు ముని చెప్పిన ప్రియా విరహిణియైన దుప్పివంక చూస్తూఉన్నాడు. అప్పుడు ముని, మళ్ళీ—

"ఓ రామచంద్రా నిన్ను విడువలేక నీ వెంబడి కానలకు వచ్చింది, మరి అలాంటి సీత ఈ వనవాస కాలంలో ఎన్నో ఇబ్బందులు పడాల్సి వస్తుంది. వనవాస క్లేశముతో మనస్సుకు దుఃఖము రాకుండా వుండాలంటే ఆమె మనసుపడి ఏదైనా కోరినపుడు ఆ మనస్సు తీర్చడం నీ కనీస కర్తవ్యము. ఏ దడిగినా తీర్చి ఆమె మనస్సుకు ఆనందాన్ని చేకూర్చు. భార్యను అగౌర విస్తారు అన్యులు. కాని దంపతు లిద్దరూ ఒకరి మనస్సు ఒకరు తెలుసుకొని, ఒకళ్ళ మనస్సులో ఒకళ్ళు వుండి జగచ్ఛ్రేయమైన స్థితిలో వుండాలి. అటువంటి వారి ఇళ్లకు సర్వదేవతలు వచ్చి క్రీడించేది ఇల్లాలిని బట్టే అని గుర్తు పెట్టుకో! ఆడది అందంగా వుండటం వలన ఆరాధనీయ కావచ్చు. కాని ఆడది భార్యాత్వము వలన ఎక్కువ ఆరాధ నీయ అని గుర్తు పెట్టుకో. సీత రమణీయ మైనదే కాక ఈ జగత్తులో ఉత్తమ పతివ్రతాంగనలు నెత్తిన పెట్టుకో వలసిన లలనారత్నము కూడా! అందుచేత ఈమె రెండు విధాలా ఆరాధనీయ. ఇటువంటి ముగ్ధ హరిణీ ప్రియను, నీరజనేత్రను-నీరజాప్త వంశశ్రేష్ఠుడివైన నీవు నీతో పాటు అడవికి రావడానికి అంగీకరించావు. శివ ధనుస్సును వంచి త్రుంచిన నీ అవక్ర పరాక్రమ బాహుబల సంపన్నత్వము ఆమెపై నీ ప్రేమకు తగినట్లు- ఆమె మృదువైన నీ కోరిక తీర్చడానికి చాలక పోదులే, సరే! పొద్దుపోయింది సుఖంగా నిద్రించండి అని వాళ్ళను పంపించేశాడు.

కొడుక్కి పెళ్లయి కాపరం పెట్టిన కొత్త రోజుల్లో కొడుకూ, కోడలినీ అలా క్రీడావిహారం చేసిరండి అని సుమంత్రునితో రథం ఇచ్చి దశరథుడు పంపేవాడు. వెళ్తున్న కొడుకూ, కోడలినీ చూసి మురిసి పోయేవాడు.

అప్పటి భావాలు ఈ నాటి అగస్త్యాశ్రమ నివాసంలో సీతారాముల స్మృతి పథంలో మెదిలాయి. ఉషస్సులోనే సీతారాములకు మెలకువ వచ్చింది. సీత రామునితో–

"నాకు నిజంగా ఎప్పుడూ కలలురావు. కాని అదేం చిత్రమో చిత్ర విచిత్ర వర్ణాలతో రత్నాలు పొదగబడిన బంగారు మేనితో పచ్చని కళ్లతో ఆకాశానికెగిరే లేళ్లతో రాత్రంతా ఒకటే కలలు" అన్నది. అప్పుడు రాముడు–

"అరే! గమ్మత్తుగా వుందే! నాకూ అగ్ని గృహంలో చూసిన అగస్త్యుని పెంపుడు దుప్పి ఐన ప్రియా విరహ హరిణ ముందే– అది నేనెక్క డుంటే అక్కడకు వచ్చి, నా వంటికి రాచుకుంటూ కళ్లలోకి చూస్తునేవుంది– రాత్రంతా స్వప్నంలో— ఆఁ ఏముందిలే మనం పగలు వేటినిచూస్తూ మనస్సు లగ్నం చేస్తామో అవే భావాల కలలు రాత్రిళ్లు వస్తాయి అంతే!" అన్నాడు. అపుడు అక్కడకు వచ్చిన అగస్త్యుడు వారితో–

"బిడ్డలారా! శీతాకాలం దక్షిణ దేశంలో అంత చలి వుండదు. పల్చటి బట్టను కప్పుకున్నా సరిపోతుంది. ఐనా అగ్నిహోత్ర స్థలం ఐతే చలికి సుఖంగా వుంటుంది. ఏం? రాత్రి మీకు ఇబ్బందేమీ కలుగలేదు కదా! ఈ అగస్త్యుని ఆశ్రమము క్రొత్తనిపించ లేదు కదా!" అన్నాడు. అప్పుడు జానకి "స్వామీ మీ ఆశ్రమం నాకు మా జనకుని ఇల్లు, మా మామగారైన దశరథుని సౌధము" అంది. అప్పుడు ముని–

"నీవు వారిద్దరి ఇళ్లు వదిలావుగదా మరి నా ఆశ్రమంకూడా అల్లాగే చేయవు గదా!" అన్నాడు. అప్పుడు రాముడు—

"ఇక్కడ వుండటం ఇష్టం లేక కాదు ప్రభూ! మీకు ఇబ్బంది, పైగా ఇక్కడున్నపుడు అయోధ్యలోనే నాన్నగారి సమక్షంలో ఉన్నటే

వుంది. మరి అలాంటప్పుడు తండ్రి వనవాసం చెయ్యమన్న మాట పాటించినట్లు అవదుగదా అందుకని" అన్నాడు. ముని లోలోపలే అమిత ఆశ్చర్యము ఆనందము పొంది "నిజంగా దశరథ రాజు నీ ఈ సుతత్వము చేత తరించాడోయ్ రామా! సూక్ష్మ ధర్మ పథ రహస్య వేదీ!! అనంగానే రాముడు "ఔనూ, దశరథుడు నా సుతత్వము చేత తరించటమేమిటి ? ఆయన తనెప్పుడో పూర్వం ఇచ్చిన మాటను నువ్వు గింజంతకూడ బీరుపోకుండా నిలబెట్టుకున్న ఒక్కదానిచేత ఆయనంతకు ఆయన తరించాడు గాని, నేనేదో ఆయన మాట పాటించడం చేత కాదు. అట్లా పాటించటం నా ధర్మం నేను నిర్వర్తించటం క్రిందకు వస్తుంది కాని- ఇంకొకరిని తరింపచేయటానికి ఎలా కారణమవుతుంది? ఏదో నా మీద గల అవ్యాజ ప్రేమ మిమ్మల్ని అలా అనేలా చేసింది అంతే!" అన్నాడు. అప్పుడు ముని రాముని ముఖంవంకే కన్నార్పకుండా చూస్తూ నిశ్చలంగా వుండిపోయి "ఇతనికి సాటి ఇతనే! ఎక్కడున్నా ఇంతేనేమో!! అక్కడ దేవతలతోనైనా సరే ఇలాగే ధర్మ వ్యాఖ్యానము వట్ల ఎదలో కొంచమైనా మొహమాటమన్నది రానీయడు. మహాత్ములకు ఎన్నడూ భావ సంశ్లిష్టత, తడబాటు, తొందర పాటు, పొరపాటు రావుగదా! అంత పారీణత లేకపోతే ఈ జగద్వ్యాపార మెలా చేయగలడు" అని మనస్సులోనే అనుకున్నాడు (ముని ఊహ రాముడు పసిగట్టలేనివాడు కాదు. తన ఊహను రాముడు కనిపెట్టగలడన్నది మునికి తెలియంది కాదు. ఎందుకంటే స్వచ్ఛమైన తెలివనేది – అందరిలోనూ వుండే ఒకే ఆకాశం లాంటిది కదా! అందుకే స్వచ్ఛమైన తెలివి ఎవరికైనా ఒకేలా పనిచేస్తుంది అని ఈ ఇద్దరి మధ్య సంభాషణాస్వగత భావాన్నిబట్టి తెలుస్తుంది) అప్పుడు రాముడు అగస్త్యునితో "నీ తాలూకు వీర కథాభి లాషులమై శ్రద్ధగా నీ నోటనే వినాలని నీ సన్నిధి కేతెంచాము. నీ కథను ఆకర్ణిద్దామని చేతస్సు తొందర పెడ్తోంది. మరి ఆపై తమ అనుగ్రహము" అన్నాడు. జానకి కూడా "స్వామీ! మీరు అలా చెబుతూవుంటే మేమిలా

వింటూ వుంటే మీ తపశ్శక్తి కొంత వాలుజారి మాకు సంక్రమిస్తుందికూడా మరి ఇంకెందు కాలస్యం చెప్పండి?" అన్నది. రాముడు చుట్టుప్రక్కల అంతా పరికించి "స్వామీ! ఈ దేశ మింత సర్వ సస్యసంపద భరితమై ఒప్పారి అశ్చర్యాన్ని కలిగిస్తోందే!" అన్నాడు. అప్పుడు ముని ఆ దండకారణ్య వృత్తాంతాన్ని చెప్పసాగాడు,

## దండకారణ్య వృత్తాంతము

పూర్వము ఇక్ష్వాకువు తన సుతుడైన దండుడు దురభ్యాస, దుస్సంకల్ప, దుర్వ్యసనాలకు లోనై దుష్కార్యాలను చేస్తుంటే చూడలేక దేశ బహిష్కరణ చేశాడు. వాడు సద్భావ సత్ప్రవర్తనాభిలాషియై భార్గవునికి శిష్యుడైనాడు. ఒకనాడు ఆ భృగు మహామునికే మనస్సు నొప్పించే పని చేశాడు. ఆ ముని కోపంతో ఒక్క రాత్రి పగలులోవెయ్యి యోజనాల మేరంతా మట్టి కురిపించాడు. ఆ ప్రదేశమంతా మట్టి దిబ్బై గడ్డకట్టి పర్వతాలై, వాటికి వింధ్య కిరీటమై నిలిచింది. ఈ పర్వతాలన్నీ చాలా ఎత్తు. అంతకన్నా ఎత్తు ఇందలి మహా వృక్షాలు. ఈ మహా గిరులు ఆ మహా తరులతో ఇదంతా దట్టమైన అరణ్యమై రాక్షసులకు వీలైన నివాస స్థానమైంది. దండుని రాజ్యమైన ఈ ప్రాంతమంతా అరణ్యం అవడంచేత దీనికి 'దండకారణ్య'మని పేరు వచ్చింది. బ్రహ్మ మాట మీద గౌరవంకొద్ది నేనిక్కడనుండి ఇంకోచోటికి పోరాదు. హిమవత్పర్వత శృంగ నివాస గృహస్థులు కొందరు నాతోపాటు ఇక్కడకు వచ్చి స్థిరపడిపోయారు. పూర్వం సముద్రజలాన్ని నిండుగా త్రాగిన వాణ్ణి అవటం చేత నన్ను తమవంటి వాడేనని సోదర భావంతో పుష్కలావర్తాది మేఘాలు నేనున్న ఈ అరణ్యప్రాంతమంతటిని సస్యశ్యామలం చేయడానికి తోడ్పడ్డాయి. ప్రస్తుతం నీలమేఘ శ్యాముడవైన నీవు కూడా నా యందు అంతటి ప్రేమతో నా ఈ సదనానికి వచ్చి ఇరువురి మధ్యగల పయోదత్వ

బంధుత్వాన్ని ఇనుమడింప చేశావు. చాలా సంతోషం నాయనా!" అన్నాడు. అప్పుడు రాముడు చిఱునవ్వుతో మునిని చూసి—

"ఎదురెదురు చెట్ల కొమ్మలు దట్టంగా, ఎత్తుగా పెరిగి ఒకదాని నొకటి పెనవేసుకొని మార్గమంతా చల్లని నీడనిస్తూ ఒకప్రక్క నదీ జలాలు, మరొకప్రక్క పుష్పఫల భరితమైన చెట్లనుండి సుగంధ శీతల మలయ మారుతం వెదజల్లబడుతూ, మరొకప్రక్క వున్న ఈ అడవి ప్రాంతంలోనే నేను ఇల్లు కట్టుకుందామని వుంది" అన్నాడు.

"నిద్ర మేల్కొనడంతోనే అమృతధారా గీతిక లాగా జాలువారే సాధు జలపాతము, స్నానానికి పర్ణశాల ప్రక్కగా ప్రవహించే సెలయేరు, క్రీడావిహారార్థం గుహాశ్రేణీయుతమైన పర్వతాలు, మా మరిదికి విహారం లోనే విశేష ఆనందాన్ని ఇవ్వగలిగే కాంతారము, ఎవరైనా వచ్చినా అందరూ కూర్చుని చుట్టూచూస్తూ ముచ్చట్లు చెప్పుకొనేందుకు సమ మైన ప్రదేశము, దట్టంగా పెరిగినాఅందమైన తరులతా గుల్మాలతో దట్టంగాపెరిగిన సముచ్ఛాయా ప్రశాంత ప్రదేశము ఉన్నచోటు ఉంటే మాకుకావాలి చెప్పండి మునివర్యా" అంటూ సీత పతిని చురచురాచూసింది. లక్ష్మణుడు మనస్సులోనే వదినగారికి నమస్కరించాడు. శ్రీరామచంద్రుని ముఖంలో మార్పు లేకుండా ముని కన్నులవైపే చూస్తున్నాడు. ముని నిమీలిత నేత్రుడై కించిత్ ధ్యానలగ్నుడై అటుపైన—

"ఓ రఘురామా! నువ్వు ఈ అడవిలో వుండవలసిన కాలం దాదాపు పూర్తయిపోయిందయ్యా! మహా ఐతే ఇంక ఏ మూడేళ్లో! మీ కైకమ్మ తల్లి ఏ వూహతో నిన్ను ఈ అడవులకు పంపిందో, మీకింకా ఏ వూహలున్నాయో, మరి ఆ మీ వూహలకు సిద్ధి చేకూరు చోటు ఆలోచించానులే! నీ సత్యవ్రతపాలనా నియమంచేత ఆచంద్రతారార్కం

మీ వంశం పరిపూత మౌతుందయ్యా! నీ వాచా సత్యత్వానికి రూప మేర్పడే విధంగా క్రియాసంధానం జరగాలి! నీ తండ్రి వూహించను గూడా లేని విధానంతో ఆయన మాట చెల్లించినట్లు అవ్వాలి. నిజానికి వరాలు ఇవ్వడమే దశరథుని అభీష్టము. అలాకాని పక్షంలో వరాలు ఇస్తే ఏం జరుగుతుందో అది జరుగుతుందని చెప్పివుండేవాడు. వరము లిచ్చాడు కాబట్టే మళ్లీ నీతో వనాలకు వెళ్లాలని నోటితో అనలేదు. అలా అని నువ్వు వనాలకు రావడం మానలేదు. అది నీ మంచితనము. నీ తండ్రికొడుకు లిద్దరి ధర్మాల్లో ఇంత సూక్ష్మం వుంది. ఆ తండ్రి ఆ తండ్రే! ఈ కొడుకు ఈ కొడుకే! ఇద్దరూ వ్యక్త ధర్మ స్వరూపులు. సరే! నిన్నింక బలవంతంగా ఇక్కడ వుండమని అడ్డుపెట్టేదేముంది? నీకు హృదయంలో మా ఆశ్రమానికి, అయోధ్యకు భేదం లేదు. మరి అలాం టప్పుడు నువ్వు చెప్పినట్లే ఇక్కడ ఉంటే వనవాసం చేసినట్లు అవదులే! పైగా నా వద్ద నాపై మీకు గల భక్తి శుశ్రూషా భావాలు మిమ్మల్నిగూడా స్వేచ్ఛగా వుండేటట్లు చేయలేవు గూడా! అడుగున గులకరాళ్లు వుండి కాళ్లకు చీలమండలు మునిగేవరకు జలజలా స్రవించే సెలయేరు, అక్క డక్కడ పర్వతాలకు జలతారు ఉత్తరీయం వ్రేళ్లాడుతున్నట్లు తెల్లగా మెరుస్తున్న నీటితుంపరల హొయలతో పైనుండి అగాధాల్లోకి పడే జలపాతాలు, వైఢూర్యకాంతి ప్రవాహశోభతో ఒప్పారే సైకత స్థలాలు, అక్కడక్కడ ఛెంగున గెంతుతూ నయనానందకరంగా వుండే లేళ్లు, తెల్లి పువ్వుల్లా ఉండే తోకకుచ్చులతో చమరీ మృగాలు, ఎక్కడబడితే అక్కడ గుహలు కలిగిన పర్వతాలు, ఆ పర్వతాలపై ఎత్తైన చదును ప్రదేశాలు, క్రిందుగా పవిత్ర గోదావరీ ప్రవాహ పుణ్య తీరాలు కలిగిన- "పంచవటి" అనే శుభస్థలము ఒకటి వుంది. అది మీరుండటానికి చాలా భద్రమైన ప్రదేశము. అది మీ దంపతులు ఇరువురి పదచిహ్నాలు మౌళిలా దాల్చి పద్మశోభతో ఇకముందు విరాజిల్లుతుంది. నిత్యము ప్రసూన పరిమళ ప్రసార మారుతముతో ఆహ్లాదకరంగా వుంటుంది. ఇక్కడి

కెంతో దూరం లేదు. రెండే యోజనాలు. ఈ మధూక వనంలో ఉత్తరంగా వెళ్తే ఒక పెద్ద మఱ్ఱిచెట్టు దాటంగానే వచ్చే మెట్ట ప్రదేశమే! చుట్టూ గిరిశ్రేణులే. మీ దంపతులిద్దరూ హరిణ మనోహర రేఖా పరవశులు. అక్కడ చిత్ర విచిత్రమైన శరీరకాంతులతో మిమ్మల్ని ఆకట్టుకుంటాయి లెండి. మా ఆశ్రమానికి మీ రాకతో నేను ఒకసారి దశరథుణ్ణి, జనకుణ్ణి ఐనట్లుంది. నాయనా రామా! సీత కోర్కెను ఎప్పుడూ వ్యర్థ పరచకు. నీ ధనస్సు దనుజుల్ని దమించి ధాత్రీసుతా వాంఛితాన్ని నెరవేరుస్తుందిలే!" అన్నాడు.

ఆ రాత్రి రామచంద్రుడు "అగస్త్య ముని సాక్షాత్తు పరమేశ్వరుడే" అన్న రీతిలో ప్రవర్తించాడు. అదిచూసి సీత "మీరిలా వుండటానికి కారణం నాకు తెలుసులెండి. ఎవ్వరూ మీ నాయనగారి సత్యసంధత్వము ఈ ముని సమర్థించినట్లు సమర్థించ లేదు. అందుకే మీకీ రోజు అంత సంతోషము. ఔనా?" అంది. అప్పుడు లక్ష్మణుడు—

"అదికాదమ్మా! ఆ ముని అన్నగారిని ఇక విజృంభించ మన్నట్లుగా అక్షయ తూణీరాలు ఇచ్చాడు అదీ సంగతి" అన్నాడు. ఈ మాటలు సీతకు నచ్చాయి. అప్పుడు వెంటనే సీత—

"ఆ ముని 'తండ్రీ కొడుకుల్ని' ఇద్దరూ ఇద్దరే అన్నారు. గాని నిజానికి 'మీ అన్నగారు – అగస్త్యులు' ఇద్దరూ ఇద్దరే! వీళ్లిద్దరి మధ్యా మూడోవానికి తెలియని రహస్యాలోచనలు ఏవో ఉన్నాయని నా అనుమానం" అన్నది. అప్పుడు రాముడు–

"ఆఁ ఏముంది? నువ్వు తెగించి నాతోపాటు అరణ్యానికి వచ్చినందుకు, నువ్వు కోరింది కాదనకుండా తీర్చమన్నాడు. ఇది రహస్యమేమిటి? బాహాటంగానే చెప్పాడుగా" అన్నాడు. అప్పుడు సీత–

"అదే, ఆ తీర్చేముందు అవసరం ఔతాయేమో ఈ అక్షయ తూణీరాల్ని నీ దగ్గర వుంచు అన్నాడు" అన్న దృష్టితో ఇచ్చాడని గూడా చెప్పుకో వచ్చేమో!" అన్నది (ఖర దూషణాది పద్నాలుగువేల మంది మీద బాణవర్షం కురిపించగా రాక్షసులతో వైరానికి పునాది ముందు ఏర్పడుతుంది). అప్పుడు రాముడు–

"సీతా స్వయంవరం వేళ నా మెడలో దండ వేసినపుడు నువ్వింత 'అరిందా' వవుతావు అనుకోలేదు" అన్నాడు.

ముగ్గురూ ఒకళ్ల ముఖాలు ఒకళ్లు చూసుకొని, నవ్వుకొని, ప్రయాణం కొనసాగించారు.

## జటాయువు చెప్పిన ప్రజా సంసర్గ వృత్తాంతము

ఒకరోజు సీతారామ లక్ష్మణుల దగ్గరకు జటాయువు వచ్చాడు. సృష్టికి సంబంధించిన ప్రజాపతుల గూర్చి, మానవ, మృగ, పక్షి, వృక్ష జాతుల వంశ క్రమము గూర్చి సవిస్తరంగా చెప్పాడు *

* ప్రజాపతులలో మొదటివాడు కర్దముడు. అటు తర్వాత విక్రీతుడు, శేషుడు, సంశ్రయుడు, బహుపుత్రుడు, స్థాణుడు, వీర్యవంతుడు, మరీచి, అత్రి, క్రతుడు, మహాబలుడు, పులస్త్యుడు, అంగిరుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, వివస్వతుడు, అరిష్ఠనేమి, కశ్యపుడు మొదలైన 19 ప్రజాపతులు. వీరందరిలో దక్షునకు అరవై మంది కుమార్తెలు. వీరిలో ఎనిమిది మందిని కశ్యపుడు గ్రహించెను. మిగిలిన 52 మంది కూతుళ్లను అంగిరుడు గైకొనెను. కశ్యపుడు తన ఎనిమిది మంది భార్యలను పిలిచి తనపై మనస్సులను సరిగా లగ్నము చేయమని కోరగా వారట్లే చేసిరి, కాని వారిలో అదితి, దితి, కాళిక అను ముగ్గురే మనస్సును సరిగా లగ్నము

వంశ చరిత్ర చెప్పటంలో చివరకు కశ్యప, వినత దంపతులకు పుట్టిన వారు అణూర గరుడులని అందు అణూర శ్యేని దంపతులకు తను, తన అన్న గారయిన సంపాతి పుట్టెనని రామునికి జటాయువు చెప్పెను. దశరథునితో తన పరిచయాన్ని స్నేహాన్ని గురించి ఇలా చెప్పాడు.

చేయగల్గిరి. అందుచే వారిలో అదితికి దేవతలు, అశ్వినీలు, వసువులు, రుద్రులు, పుట్టిరి. దితి కడుపున దైత్యులు (రాక్షసులు) ఉదయించిరి. కాళి గర్భమున నరకుడు, కాళికుడు అను ఇద్దరు సుతులు కలిగిరి. దనువునకు అశ్వగ్రీవుడు అను కొడుకు కలిగెను. మనువునకు నాలుగు వర్ణములకు చెందిన మానవజాతి కలిగిరి. 'అనల' అను ఆమెకు వృక్షసంతతి కలిగెను. 'గోధవశ' అను ఆమెకు మృగముల తల్లి ఐన మృగియును ఋక్ష, సృమర, చమర మృగములకు తల్లి ఐన మృగమదయును, హరి, వానరములకు తల్లి అయిన హరియును, భద్రమదయును జన్మించిరి. ఈ భద్రమదకు ఇరావతి కలిగెను. ఇరావతికి ఐరావతము కలిగెను. గ్రోధవశకు ఇంకను మాతంగ-ముల తల్లి అయిన మాతంగియు, గోలాంగూల వ్యాఘ్రముల తల్లియైన శార్దూలియు, దిగ్గజ గర్భఅయిన శ్వేతయు, సురభియు ఉద్భవించిరి. ఈ సురభికి రోహిణి, గంధర్వి అను ముగ్గురు కుమార్తెలు. రోహిణి గోమాత. గంధర్వి అశ్వమాత, నాగమాతయైన సురసయు, పన్నగముల తల్లియగు కద్రువయు గ్రోధవశకు మరి ఇద్దరు కుమార్తెలు. అష్టమ భార్యయైన తామ్రకు ఐదుగురు కుమార్తెలు. వారి పేర్లు క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి. క్రౌంచి ఉలూక తల్లి, భాసి, భాస తల్లి. ధృతరాష్ట్రి కలహంస. చక్రవాకముల తల్లి. శుకికి నత అను కూతురు ఉదయించెను. ఈ నత-వినతా మాత. వినతకు అణూరుడు, గరుడుడు అను ఇద్దరు కొడుకులు. అరుణిడి భార్య శ్యేని. అరుణుడు-శ్యేని దంపతులకు ఇద్దరు కొడుకులు. అందు మొదటి వాడు సంపాతి, రెండవ వాడు జటాయువు

"పూర్వము ఒకసారి దేవతలకు రాక్షసులకు యుద్ధం జరుగుతున్న సందర్భములో రాక్షసులందరు అమరావతిని చుట్టుముట్టారు! ఆ రాక్షసులందరినీ క్రింద ఉండి దశరథుడు, వినువీథులలో వుండి నేను ఎదుర్కొన్నాము. మీ నాయన గారి ధాటికి, నా ధాటికి వాళ్లు ఆగలేక నెత్తురు ముద్దలయినారు. నా వ్యవహారం చూసి ఇది గరుడాస్త్ర ప్రభావమని భ్రమ పడ్డారు. ఆ సందర్భములోనే నాకు మీ నాయన గారికి చెలిమి ఏర్పడింది. రామా ! నీవున్న ఈ అరణ్యం సమస్త మాయలకు పుట్టినిల్లు. ప్రతి పొదలోను, గుహలోను, చెట్టులోను, పుట్టల్లోను, చెట్టుకొమ్మలలోను కూడా ఆ రాక్షసులు కామరూపులై ఉంటారు' నేను నేల మీద నుండి పది యోజనాల ఎత్తుగా ఆకాశ మార్గంలో విహరిస్తూ ఉండి కూడ ఈ రాక్షసుల ఉనికిని గుర్తు పట్టగలను. అన్నాడు. మన్వంతర దివ్య జీవియైన ఆ జటాయువు అలా మాట్లాడుతున్నపుడు భూజాత సీత ఆ జటాయువు యొక్క ముక్కుని, కళ్లని, భ్రూమధ్యాన్ని మెడని, మాట్లాడుతున్నపుడు భావానుబద్ధంగా కదిలే వాటి కదలికలను చూస్తూ ఆ వాఙ్మాధురికి విస్తుపోయింది. అప్పుడు రాముడు అంజలి ఘటించి-

"తాతా ! నీ గురించి ముందరే విన్నామయ్యా ! చిన్నతనంలో మా నాయనగారు తన తొడ మీద మమ్మల్ని కూర్చోబెట్టుకొని ఎన్నెన్నో కథలు చెబుతుండేవారు. అకథల్లో నీ గురించిన కథలు చాలా వుండేవి. నా చిన్నతనంలో విన్న ఆకథలలో వూహించిన నీ రూపానికి ఇప్పుడు ఎదురుగా వాత్సల్యంతో నవ్వుతున్న నీ ముఖాన్ని చూస్తూవుంటే మా కష్టాలు తొలిగి సంతోషం చేకూరినట్లు వుంది. పితృ దేవతలతో సమానుడవు. ఇదిగో అర్ఘ్యం, ఇదిగో పాద్యం, మామీద దయతో స్వీకరించు." అంటూ జటాయువుకు అతిథి మర్యాదలు చేసారు. చాలా రోజులకు మళ్లీ ఈ సాకేత పురవాసుల మధ్య గడిపు నందులకు జటాయువు చాలా సంతోషించి ఆకాశంలోకి సాగిపోయాడు.

# పంచవటీ ప్రదేశము

సీతారామలక్ష్మణులు పయనిస్తూ ఒక్కసారి చుట్టూ పరికించారు. మలయ మారుత స్పర్శకు శరీరాలు పులకించాయి. పచ్చదనంతో వన మంతా జీవన మాధుర్యాన్ని వలకబోస్తుంది. కొంచెం దూరంగా ఐదు మఱ్ఱివృక్షాలు కనబడ్డాయి. బంగారు వన్నె లేళ్లు, వెండిరంగు కుందేళ్లు వనమంతా యథేచ్ఛగా తిరుగుతున్నాయి. రంగు రంగుల పుష్పాలు కళ్లకు, వాటి సౌరభాలు నాసా పుటాలకు విందు చేకూరుస్తున్నాయి. అవన్నీ చూసి రాముడు–

"నాయనా లక్ష్మణా! ఇది సరిగ్గా మహర్షి చెప్పిన చోటులాగేనే ఉన్నది. మీ వదిన కళ్ల నిండా వనమే ప్రతిబింబిస్తోంది. ఆమె కళ్లలోని తృప్తి ఆనందమే 'ఇది మహర్షి చెప్పిన పంచవటీ ప్రాంతం' అని నిర్ధారిస్తోంది. చూడు! ఇక్కడ ప్రవహించే నదులు, వాగులు, చీరవిప్పని మర్యాదను పాటించినట్లు మన దేశంలో నదులు నిరంతరం ప్రవహిస్తూనే వుంటాయి. కాని, ఈ దక్షిణ దేశంలో శౌచము, మడి, ఆచారము ఎక్కువ అన్నట్లు పాతచీర విడిచి క్రొత్తచీర ధరించినట్లు-పాత నీరు పోయి క్రొత్త నీరుతో ప్రవహిస్తూ వుంటాయి. క్రొత్త నీటి చీరలో ఈ వాగు, వాగు పోకడ చూసావా" అని అంటుండగా సీత మృదువుగా ఒక తామర పూవుతో రాముని పెదవుల్ని మూసింది.

ఇది దక్షిణాపథ మహాకాంతార మధ్య ప్రదేశము. పరుపులాంటి ఈ నేల మీద వన్నెలు చిన్నెలుగా స్వేచ్ఛా పథగాములై మధ్య మధ్య ఇసుక తిన్నెలతో వింత వింత రేఖా విన్యాసాలతోవి నూత్న శోభను చేకూరుస్తున్నాయి. నదీ సంగమాన్ని వేగంగా పొందాలని ఉద్వేగంతో ఒడ్డుల్ని రాచుకుంటూ, కోసుకూంటూ ప్రవహిస్తున్నాయి చూడు. ఇది

గోదావరి సంగమమై ఉండాలి. ఈ సాగర ధర్మపత్ని గోదావరీ పవిత్ర జల సేవనం మన జన్మ పావనం. ఇదంతా పినతల్లి వరప్రసాదం'' అంటూ పెద్ద పెద్ద అంగలలో స్వామి పోతూవుంటే- స్వామి ఉత్త రీయపుటంచుకు తన చీర కొంగు ముడివేసిన సీతను చూచి నవ్వుతూ నెమ్మదిగా నడవడం చూసాడు. ఇంతలో ఒక చోట నిర్భయంగా లేళు నీళ్లు త్రాగుచున్న చోటు కనపడింది అక్కడకు వెళ్లి స్నాన సంధ్యాదులు పూర్తి చేసారు. చెట్టు చుట్టూ పెనవేసుకొని తన పువ్వుల్ని సాగరపతిని చేరబోయే గోదావరిమ తల్లికి సమర్పించుకుంటున్న వల్లీ నికుంజ ప్రాంతం చేరారు. ముళ్లు తీసి, నేల శుభ్రపరచి, అగ్నిహోత్రం చేసి, వంట చేసుకొని అటు పైన విశ్రమించారు. విశ్రాంతి అనంతరం రాముడు లక్ష్మణునితో-

''నాయనా లక్ష్మణా! ఇక్కడే ఏదన్నా ఒక చోట ఇల్లు నిర్మించు-కుంటే బాగుంటుంది. చక్కని సమోన్నత ప్రదేశం. నీళ్ల ఎద్దడి లేకుండా సమీపంలోనే విశుద్ధ ప్రవాహజలం. ఆనంద స్పర్శ నందించే మలయ మారుతం. నీకు నీ వదినె గారికి నచ్చే చోటు చూడు- వెంటనే ఇల్లు కడదాం అన్నాడు. అందుకు లక్ష్మణుడు-

''నాకు నచ్చడం నచ్చక పోవడం అంటూ లేదు. నీతో వుండాలని వచ్చాను నీ వెక్కడ వుంటే నీ కేది నచ్చితే అదే నాకు నచ్చే ప్రదేశం. నీ అనుజ్ఞతో నన్ను అనుగ్రహించు. ఎన్నేళ్లయినా నీ అనుజ్ఞా వర్తియై నీతోనే వుంటాను. నాకంటూ వేరే స్వతంత్ర బుద్ధి లేదు. అది నీకే అర్పితం. ఈ తనువు నీకే అంకితం'' అన్నాడు. రాముడు ఆ మాటలకు ఆనందం పట్టలేక తమ్ముణ్ణి ప్రేమారగా కౌగలించుకున్నాడు. "మీ అన్నగారికే కాదయ్యా నాకు మాత్రం తెలీదా నీ గురించి నీ నిస్వార్థ చిత్తం, హృదయస్థ ధర్మం నేను కాపురానికి వచ్చిన దగ్గర నుంచి తెలుసు'' అంటూ సీత అక్కడున్న ప్రదేశం బాగా నచ్చిందో

ఏమో ఆనందంగా ఆత్రంగా కలయ చూద్దామని అటు వెళ్ళింది. అన్న దమ్ములిద్దరూ ఆమెను అనుసరించారు. అక్కడ వృక్షాలు చాలా ఎడం ఎడంగా వుండటం, అది పులులూ, సింహాలు తిరిగేచోటు అయివున్నదని చెబుతోంది. నేల పచ్చిక బయళ్ల పరుపులతో చాలా శోభాయమానంగా ఉండటం లేళ్లు స్వేచ్ఛగా తిరిగేచోటు అని అనిపిస్తోంది. సెలయేళ్లు నదీ సంగమం చేసే చోటు అయివుండటం వల్ల వేసవిలో కూడా నీటిఎద్దడి వుండ దని తెలియచేస్తోంది. గుట్టల వంటి ఎత్తయిన వృక్షాలు వున్నాయి. వన విహారానికి యోగ్యమైన స్థలమిది. మృదు మధురమైన కలకూజిత శకుంత సంతానంతో నిండిన ఈ పంచవటి ప్రాంతము ఎంతో నివాస యోగ్యమైనది గదా తమ్ముడూ!" అన్నాడు రాముడు. అన్నగారు అలా అంటుండగానే లక్ష్మణుడు వెళ్లి ఒక చెట్టుకు ప్రదక్షిణం చేసి మూరెడు పొడవున్న ఒక సన్నని పుల్లవిరిచి తెచ్చి రాముడు చెప్పినస్థలాన్ని కొలవడం ప్రారంభించాడు. చిత్రకూటంలో వేసిన పర్ణశాల లెక్కలకు సరిగ్గా సరిపోయేలానే వున్నది. వాస్తుకూడ సరిపోయేటట్లు పర్ణశాల నిర్మాణానికి ఏర్పాట్లు కొనసాగిస్తున్నాడు.

## పర్ణశాలకు ఏర్పాట్లు

అవసరమైనచోట్ల గుంజలు బిగించి కణుపులు కనపడనట్టి నును పుగా, సమానంగా పొడవుగా వున్న వెదుళ్లతో గుంజల పై చుట్టు చట్రంలా బిగించి ఎత్తుగా పాతిన రెండు గుంజలకు మధ్య వెన్నుగా వెదుళ్లు బిగించి పైనుంచి రెండువైపులకు ఏటవాలుగా వెదుళ్ల పందిరిలో కప్పులను బిగించి వాటిపై సన్నని రెల్లు కర్రలు దట్టంగా పేర్చి పర్ణశాలకు తుది మెరుగులు దిద్దాడు. బయట చూడటానికి ఒక పూరి పాక లాగా వుందిగాని లోపలకు వెడితే ఆశ్చర్యకరంగా సౌధ సుకుమార మనోహరంగా వుంది. ఆ పర్ణశాల లో లోపల మళ్లీ దేనికి దానికే వేరు వేరు గదులు. అగ్ని గృహం వేరు,

విశ్రాంతిగృహం వేరు, భోజనశాల వేరు, శయన మందిరం వేరుగా ఏర్పాట్లు చేయబడ్డాయి. వెనుక దక్షిణ దిశలో ఉన్న చావిడిలో పడుకుంటే మలయ మారుత వీచికలతో వనవాసక్లేశము మటుమాయ మవుతుంది. లక్ష్మణుడు ఏం చేశాడో తెలియదు కాని లోపల నేలంతా ఎంతో నునుపుగా, అద్దంలా వుంది. పర్ణశాలాంగణ ద్వారానికి ఇటు అటు రెండు కిటికీలు, ఎడమ కిటికీ ప్రక్క ఒక గూడు, ఆ గూడులో విల్లు కొప్పు అన్చి వ్రేలాడతీసాడు. గోదావరీ జలాలు, సమిత్కుశ కుసుమాదులు తెచ్చి శాంతి పౌష్టిక కర్మలు చేసి, సీతారాములచే గృహప్రవేశం చేయించాడు. రాముని హృదయంలో ఆనందం పెల్లుబికింది. స్వల్పకాల వ్యవధిలోనే చదును ప్రదేశం కాస్తా సదనమైంది. "ఒకే తండ్రి బిడ్డలమైనంత మాత్రాన ఇలా జరుగుతుందా? ఇదేదో జన్మాంతరమైన ప్రేమ. లేకపోతే ఏమిటీ కూర్చోపెట్టి సేవలు? నిజంగా నా సుఖం కోసము పుట్టిన దైవం ఈ లక్ష్మణుడు" అంటూ రాముడు తమ్ముణ్ణి పిలిచాడు. లక్ష్మణుడు రాముని పాదాలపై వ్రాలాడు. రాముడు ప్రేమతో అతని బాహువులు పట్టుకొని లేపి కౌగలించుకున్నాడు. ఇద్దరూ వక్షాలు హత్తుకున్నారు. చెక్కిళ్లు అన్చుకున్నారు. నీలమేఘ శ్యాముడైన రాముణ్ణి చూసి సీత తళుక్కున నవ్వింది. ఆ నవ్వు మేఘంలో మెరుపులా వుంది. ఇద్దరి కన్నుల నుండి ఆనందాశ్రువుల వర్షం కురిసింది. ఎదురుగా వున్న పర్ణశాలా సౌందర్యాన్ని, సౌమిత్రిని చూస్తూ చూస్తూ ఉండిపోయారు. ఆ ఇద్దరూ హృదయంలోనే సౌమిత్రికి కృతజ్ఞతలు చెప్పుకున్నారు. లక్ష్మణుడు లజ్జతో తలదించుకొని తన జన్మ ధన్యమైనదని అంతస్సంతుష్టుడైనాడు.

పట్టణ సౌధాలలో జీవించిన సీతకు అరణ్యవాసం పర్ణశాలా జీవనం అలవాటై పోయింది. ఉషస్సులో లేవడం, ఇల్లూ వాకిళ్లలో కసవూడ్చి, నీళ్ల చల్లి, రంగవల్లులు తీర్చి దిద్దడం, స్నానానికై గోదావరీ రేవుకు వెళ్లడం, స్నానం చేసిన బట్టలు ఉతికి పిండి భుజాన వేసుకుని కడవలో మంచినీరు పట్టుకుని రావడం, తులశమ్మకు నీరుపోసి అగ్ని గృహంలో వంట

చేయడం, దైనందిన కార్యక్రమం అయిపోయింది. ఒంటరిగా రేవుకు వెళ్లినపుడు ఆ వెనుక రాముడు గాని, చాపహస్తుడై లక్ష్మణుడు గాని తోడు వెళ్లేవారు. నదీ స్నానం చేసినతర్వాత పర్ణశాలకువచ్చి నిత్యాగ్ని కార్యాలు పూర్తైన తర్వాత సీతారాములు భోజనాలు చేసేవారు. ముగ్గురూ కబుర్లు చెప్పుకుని అటుపైన సీతారాములు, లక్ష్మణుడు విశ్రాంతికై ఎటో వెళ్లేవారు. సాయంత్రం అలా వనవిహారం. వెన్నెల రోజుల్లో సీతారాములు పర్ణశాల ముంగిట చేరేవారు. లక్ష్మణుడు ఎటో తప్పుకొనేవాడు. సమస్త పుష్పాల సౌరభాల్ని నింపుకున్న గాలి అంతా వారి సొత్తే. రాముడు అయోధ్య గురించి కథలు చెప్పేవాడు. చిన్నతనంలో కైకేయి తనను ఆడించిన ఆటలు గూర్చి చెప్పేవాడు. అప్పుడు సీత మిథిలా నగరం గురించి తన బాబాయి ఋషధ్వజుడు తనను ఆడించిన ఆటలు గూర్చి చెప్పేది. రాముడు విశ్వామిత్రుని గూర్చి చెబితే సీత జనకుని గూర్చి చెప్పేది. ఇలా కళ్లు మూతలు పడేదాకా ఎన్నో కబుర్లు చెప్పుకొనేవారు. ఈ ఇద్దరికీ జాగ్రత్, స్వప్న, సుషుప్తులు మూడు అవస్థలు ఉండేవేమో కాని లక్ష్మణుడు మాత్రము ఎల్లపుడూ జాగ్రదవస్థలోనే వుండేవాడు. కంటిరెప్ప కూడా వాలనిచ్చేవాడు కాదు.

## పర్ణశాలా వాతావరణం

పర్ణశాల ప్రాంతంలో తిరుగుతున్న రామ లక్ష్మణులకు అప్పుడప్పుడు రాక్షసులు కనబడుతూ ఉండేవారు. సుందరాకారులైన రామలక్ష్మణులిద్దరినీ చూసినపుడు కొందరు రాక్షస స్త్రీలకు ఏవో కోర్కెలు కలిగేవి. నాలుకతో పెదవులు తడుపుకునేవారు. భుజాల నున్న అమ్ముల పొదులను చేతపట్టిన ధనుస్సులను చూచి వెనుకంజ వేసేవారు. కాలచక్రం గిరున తిరిగిపోతూ వసంత, గ్రీష్మ శరత్ ఋతువులు గడచిపోయాయి. హేమంతం వచ్చింది. అడవంతా దట్టంగా మంచు పట్టేసింది. ప్రాతఃకాలము సీతా

రాములు స్నానానికై బయలుదేరినపుడు ఇదివరకు తెలిసినదేఐనా ఏ మాత్రం దారి కనబడేది కాదు. కనులకు పొర కమ్మినట్లు అయిపోయేది. రాముని జటమీద, క్రింద పాపిడిమీద ముత్యాలు పోసినట్లు హిమబిందువులు నిండేవి. లక్ష్మణునికి మంచులో నిలబడిన అన్నగారిని చూసినపుడు హిమ కన్య సకల మహీపాలునికి మహోన్నతమైన సితచ్ఛత్రము (తెల్లగొడుగు) పట్టినట్లు సకల జగదీశునకు సిత చామరము వీచినట్లు అనిపించేది. అధికుడు అల్పుడు అనే భేదము లేకుండా సూర్య చంద్రులిద్దరూ దట్టంగా కమ్మిన మంచు పొరలవల్ల సమానమైపోయారా అన్నట్లు ఉన్నది హేమంతం. ముట్టిపై నిలచిన మంచు తుంపరలను తుడుచు కోవడం కోసం ఒక ఆడ లేడి ఒక సాల వృక్షం దగ్గరకు వెళ్లి రాసుకుంది. ఒక్కసారి చెట్టు కదలికకు అన్ని కొమ్మల ఆకుల నుండి మంచు బిందువులు లేడిమీద పడ్డాయి. ఒళ్లు గగుర్పొడిచి వెంటనే వెళ్లిపోయింది. ఇలాంటి దృశ్యాలెన్నో ఆ హిమ ఋతువులో వాళ్లు చూసేవారు.

పర్ణశాలకు వస్తున్నపుడు లక్ష్మణునికి— అయోధ్య, భరతుడు, కైకేయి, పెదతల్లి కౌసల్య గుర్తుకు వచ్చారు. "ఇపుడు భరతుడు ఏం చేస్తూ ఉంటాడో? సతత పాదుకాపూజాభిలాషుడు ఆ హిమపాత వేళ ఏం చేస్తున్నాడో ఏమో! ఆ కైకేయి మహాతల్లి ఆ పాదుకల పైన, వాటిని పూజించే భరతునిపైన ఎలాంటి భావం కలిగివుందో! అన్నట్లు మరిచాను, నీ దగ్గర ఆవిడగారిని గురించి ఏమీ అనకూడదు. మీ ఇద్దరి మనసులను అర్థం చేసుకోవడం కష్టం. మీ ఇద్దరి మధ్యా ఉన్నది చనువో, ప్రేమో, బాధ్యతో తెలియదు. అవిడపై దెప్పి మాటలు నీ దగ్గర అంటే నీవు ఓర్వ లేవు. ఆ నీ భావము ఏమిటో మా కర్థం కాదు. మాకు నీలాగా శాంతమైన ఊహలు రావు. వనవాస క్లేశావేశపుటూహలే దౌర్జన్య రూపమై చిగురిస్తాయి. నాయనగారు ఇన్నిరోజులు పెదతల్లిని పట్టించుకున్నది లేదు. కొడుకు పట్టాభిషిక్తుడైతే ఆ ఒక్కరోజు సంబర పడింది. అంతలోనే ఈ దౌర్భాగ్యం ముంచుకు వచ్చింది. నేను ఏమంటే ఏమి తప్పో కూడా తెలియటం లేదు.

అమాయకురాలైన పెదతల్లికి పట్టిన ఈ దుఃఖ భారము ఎప్పుడు తొలగి పోతుందో? ఆవిడ విచారం మనము ఊహించలేనిది" అన్నాడు లక్ష్మణుడు అప్పుడు రామచంద్రుడు—

"మానవులకు దుఃఖము కలగటానికి రెండు కారణాలు చెప్పవచ్చు. ఒకటి దేశాత్మకము, రెండవది కాలాత్మకము. మన తండ్రికి కాలాత్మక మైన వ్యవధానం వల్ల వ్యథ కలిగినది. తల్లి దేశాత్మకమైన వ్యవధానం వల్ల వ్యథ చెందుతోంది. ఈ వ్యథలను ఇతరులు తప్పించనూ లేరు. వాటిని గూర్చి బాధపడటం కూడా వివేక లక్షణము కాదు. అవి కాల చక్రంలో వస్తూపోతూ వుండేవే!" అన్నాడు. అప్పుడు జానకి మరిదిని చూచి "ఏమయ్యా సౌమిత్రీ మీ అన్నగారితో వాదములు దేనికయ్యా? ఆయన మాటలు రాని వారా, మాటకు మాట చెప్పలేని వారా? ఎందుకయ్యా వృథా ప్రయాస". అని అంటూ క్రీగంట రాముణ్ణి చూసింది. అదే సమయంలో సీతను తన క్రీగంట చూసి రాముడు–"నాయనా లక్ష్మణా! ఎందుకనవసరంగా ఆ ప్రసక్తి? చర్విత చర్వణము కాదా? ఐనా ఇప్పుడేమి వచ్చింది. ఇన్నాళ్లు గడిపాము కదా! ఇంక ఈ మిగిలిన ఈ కొలది దినములలో ఓర్పు వహించలేవా" అని మృదువుగా సర్ది చెప్పాడు. "అలాగైతే కాలక్షేపానికి నాకేమైనా కథలు చెప్పుడు" అని సీత కోరింది. "పర్ణశాల చేరిన తర్వాత ముంగిట కూర్చుని చెప్తానులే" అన్నాడు రాముడు.

ఒక రోజు ముగ్గురూ పర్ణశాల ప్రాంగణంలో కూర్చుని ఏవేవో కథలు, కబుర్లు చెప్పుకుంటున్నారు. రాముడు విశ్వామిత్రుని గూర్చి – వశిష్ఠ మునిపై కలిగిన అసూయ వలన విశ్వామిత్రుడు పట్టిన దీక్ష గురించి, ఆ దీక్షలో ఆయన పడిన పాట్లు గురించి, మిథిలా నగరంలో విడిదిలో నుండగా శతానందుడు చెప్పిన విషయములను సీతకు చెప్పాడు. సీత అన్నీ విని "ఐతే మీ గురువు గారు గ్రంథ సాంగులే సుమా!" అని అనగానే

ముగ్గురూ నిష్కల్మషంగా నవ్వుకున్నారు. ముగ్గురూ పర్ణశాల చావిడి లోకి ప్రవేశించారు.

## శూర్పణఖ వృత్తాంతము

మన్మథుడు ఆవులించినపుడు–ఆ ఆవులింత నుండి ఆకారం రూపు గట్టిందా? ఆ మన్మథుని విల్లు ఫెళ్లుమని విరిగనపుడు పుట్టిన శబ్దము నుండి ఒక మూర్తి పుట్టిందా? శివుని ఫాలాగ్నికి మాడిన మన్మథ శరీరం నుండి పుట్టిన జ్వాలా ధూమరేఖలు ఆకృతి చెందాయా? దహింపబడిన మన్మథుని వియోగ బాధా జనిత రతీ భాష్పములు రూపుగట్టాయా? లేక ఇవన్నీ కలిసి ఒక రూపుగట్టాయా? అన్నట్లు భ్రమింపజేసే ఒక కామిని సీతారామ లక్ష్మణు లున్న పర్ణశాల దగ్గరకు వచ్చింది. అన్నతో మాట్లాడుతున్న లక్ష్మణుడు ఈమె ఎక్కడ నుండి వచ్చిందో అడగడు. పెద్దగా పట్టించుకున్నట్లు కనపడడు.

## ఆడవాళ్లలో తేడాలు

ఆ కామిని మండిగ ముందు నిలిచి లోపలికి చూసింది. ఆ అ చూపులు ఎవరినో వెదుకుతున్నట్లు చంచలంగా వున్నాయి. అమె వేసిన వేషము, అలంకరణ, వాటిపై గల మమకారము చూస్తే ముని కాంతల వేషం కాదని, ఆమె మునికాంత కాదని తెలుస్తోంది. పోనీ దేవతాస్త్రీ అనుకోడానికి కూడా ఆస్కారము లేదు. లక్ష్మీప్రదమైన మండిగం మీద కాలు నిలిపి వుండటం దేవతా స్త్రీలు చేయని పని. పోనీ మనుష్యకాంత అనుకోడానికి కూడా వీల్లేదు. ఆమె అర్ధనగ్న శరీర వేషధారణ, లజ్జా విహీనతా దృక్కులు మనుష్యకాంతల లక్షణాలు కావు.

రెండుచేతులతో గుమ్మము రెండు కమ్ములను పుచ్చుకొని రఘురాముని కళ్లల్లోకి చూస్తూ, ఆ నేత్ర సౌందర్యాన్ని క్రోలుతూ క్రోలుతూ, ఏదో మధుర భావము, కలగ్గా మృదుల స్వరముతో దానిని తెలిపే ప్రయత్నంలో—

## శూర్పణఖ పలకరింపు

తొలకరి మబ్బు తూగుతోందా? నాట్యమయూరి ఆడుతోందా? ఆహా! ఆ మన్మథుడు నీవేనా మునీ? నేరేడు పండ్ల నీలిపగుళ్ల రంగుతో నీ తనువు అందం చిందిపోతోంది కదా! నా మనస్సును కలచి వేస్తోంది కదా! నీ అందం చిందిపోకుండా పట్టి ఆనందిస్తాను. నాతో రావా ఇపుడు? నువ్వెలా వున్నావో తెలుసా? రాక్షస సామ్రాజ్య చక్రవర్తి ఐన రావణుని పేరు విన్నావా? ఆ దైత్యేశ్వరుని పట్టపు ఏనుగువలె ఉంది నీ ఆకారం. ఆ ఏనుగుపై హొంజిలుగు హౌదా వలే నేనున్నాను. ఇట్టి మనిద్దరి దాంపత్యపుశోభ ఇంక ఏ విధముగా ఉంటుందో నీవే ఊహించుకో! నీల మేఘశ్యాముడైన నీ నుండి రతిస్విన్నాభిలాషిణియై వచ్చాను." అని తొందరపడి నందుకు నాలుక కరచుకొని "తలకి నూనె లేదు. ఒంటికి నారచీరలు. ఐనా అదేమి అందమో? ఈ విధమైన మునులు ఈ లోకంలో ఎంతమంది లేరు. ఆ ముని లందరికీ నీవు నాయకుడివా? నల్లి ఆవిశెపువ్వు పూచిన చందంగా నీ చక్కని చిక్కని మేని జిలుగులు నా కనులను పొడిచి వేస్తున్నాయి" అంటూ రాముణ్ణి నఖశిఖ పర్యంతం వర్ణించడం ప్రారంభించింది. రాముడు చలించలేదు. కామిని చికాకు పడింది. "చిన్న చిన్న రాక్షసజాతి స్త్రీలు చెప్పుకుంటుంటే విన్నాను. మన అడవిలో ఉత్పల దళ నీల మోహన శుభాంగుడు ఐన ఒక మగవాడు తిరుగుతున్నాడు. మేము చూశాము. అని వాళ్లు చెప్పారు. నిజమే! వలచిన కోర్కెపండు తొన వలె ఉన్నావు. కళ్లకి మంచి అందాన్ని

చూసే కాలం ఈ మధ్య దూరమైంది. నేను రెండు మూడేళ్లుగా ఈ ప్రాంతాలకు రాలేదు, మీది అసలు ఏ వూరు? కాలువలు, పుట్టలు, గుట్టలు దాటి ఈ అడవుల త్రోవ పట్టావు కదా! ముళ్లు, కంచెలు కూడా నీకు బాధ కలిగించవా? చూస్తే వాకిట్లో చెప్పులు కూడా లేవు. వట్టి కాళ్లతోనే నడిచి వచ్చావా ఇంతదూరం? ఏవో మన్మథుడు అందగాడని చెబుతారు. వాడెప్పుడో శివుని కంటి మంటకు బొగ్గైపోయాడు. శరీరం లేని వాడు అందగాడైతేనేం ? ఐనా నీ అందం ముందు వాడిఅందం ఎంత? నువ్వు వాడి అబ్బలాగా వున్నావు. నీ కొన గోటికి కూడా వాడు తూగడు. జరిగిపోయిన దానిని గూర్చి తలచుకుంటూ దుఃఖ పడటం దేనికి? చక్కగా వర్తమానాన్ని, భవిష్యత్తును చేయి జారకుండా ముల్లోకాల ఆనందానుభావాలను పొందడమే గొప్ప. నేను శ్వాస గ్రహించినా వదిలినా నిన్నే. నా ప్రాణము నీవే! నీ శ్వాస నా శ్వాస ఒక్కటై నిలవాలి. అప్పుడు నిన్ను ఈ విశ్వానికే నాథుడిగా చేస్తాను." అని ఎంత చెప్పినా చలనము లేని రామచంద్రుణ్ణి చూచి విసుగుకొని ఇంకా ఏదో చెప్పబోయేసరికి రాముడు—

## రాముని సమాధానం

"గుణమనేది శబ్ద ప్రాధాన్యమే కాదు కదా! శబ్దార్థాన్ని పట్టి కూడా వుంటుంది. నీ వాగ్ధోరణి మారుతుందేమోనని—బెరుకు విసుగులతో సణుక్కుంటున్నావు. ఈ విషయంలో నీలో సహజత లోపించింది. నీ ఆకార విశేషాదులు, సొంపు సోయగాలు రమణీయమే! మాది అయోధ్య, పేరు రాముడు, దశరథుని కుమారుణ్ణి. నా పినతల్లి కోర్కె మేరకు ఈ వనాలకు వచ్చాను. నన్ను విడిచి ఉండలేని ఈ కోమలి నా కంటే ముందే నాతో వనాలకు వచ్చింది. నీవు వచ్చినపుడు బయటనుంచున్న

వాడు నా తమ్ముడు. సేవా ధర్మ పరాయణుడు. మేము ముప్పురం కాలువలు, చెట్లు, చేమలు, గుట్టలు, పుట్టలు దాటి ఇక్కడకు వచ్చాము. మా ఒక తల్లి అడవులకు పంపితే–ఒక తమ్ముడు కాళ్లకు చెప్పులు లేకుండా చేశాడు. చెప్పులు లేని ప్రయాణం వలన కాళ్లమడమలకు పగుళ్లై తే– నా ఈ మైథిలి రాత్రులు ఇంగుదీనూనె మర్దనము చేస్తుంది. శివుని విల్లు విరవడం వలన నాకు భార్య అయింది. ఎంతో మంది వైదేహులు సాక్షిగా, అగ్నిసాక్షిగా ఈమె నా సహధర్మచారిణి అయింది. ఆడువారికి మోహము ఎక్కువ. ఇటువంటి ధర్మవిషయాలు చెప్పినా అర్థం కాదు. ఐనా మరీ మొరటుగా ప్రక్కన భార్య ఉండగనే వలచా ననడం ఏమంత సబబు" అని కించిత్ పరిహాస పూర్వకంగా అంటించాడు. అపుడు ఆ కామిని—

## శూర్పణఖ దర్పం

"ఎంత తక్కువ బలము కలవారో మీ మనుష్య జాతి అంత ఎక్కువ వివేక వంతులు గదా! మీ తెలివి దేవతలకు కూడా వుండదంటే రాక్షసుల సంగతి వేరే చెప్పాలా? సరే! నన్నెలాగూ గుర్తుపట్టావు కాబట్టి ఇక దాచి లాభం లేదు. నా పేరు శూర్పణఖ. ఇందాక చెప్పానే రాక్షస సామ్రాజ్య చక్రవర్తి అని, ఆ రావణుడు నా పెదతల్లి పుత్రుడు. రావణ, కుంభకర్ణ, విభీషణులని వారు ముగ్గురు అన్నదమ్ములు. ఖర, దూషణులని నా తమ్ములు. నేను ఇందరకు పెద్దదానను. అంటే వారం దరకూ ఒకే ఒక అడపడుచును. అందుమూలాన్నే అందరకీ నేనంటే అధిక ప్రేమ. పెద్ద దానిని అవడం వలన వారందరూ నేను గీచిన గీటు దాటరు. ఆ రావణుడు దిక్పాలకులనే తన చెప్పు చేతలలో పెట్టుకున్న వాడు. ఈ భూమిని ఏదో ఆదిశేషుడు మోస్తున్నాడని చెప్తారు. ఆది

ఎవరు చూసారో ఏమో! కాని కూర్చున్న పెళ్లికూతురును తట్టతో మేనమామ ఎత్తినట్టు తన ఇరువది చేతులతో కైలాసగిరినే కదిలించి, పెళ్లగించిన బాహుబల సంపన్నుడు. నందీశ్వరుడు కోపించాడనీ, అమ్మవారు కొద్దిగా భయపడిన దనీ ఊరుకున్నాడు కాని—మొత్తం కైలాస గిరినే తన శిరస్సులపై నిలబెట్టగలిగిన వాడు. పరమ మహేశ్వర భక్తుడు. తన చంద్రహాసంతో కుండల కిరీటాలతో ఉన్న దశ శిరస్సులను ఆ చంద్రమౌళీశ్వరునికు అర్పణము చేసిన భక్తి తత్పరుడు. నిరంతరము అతని కొలువులో యక్ష, కిన్నెర, గంధర్వులు వీణా స్వరములతో అతని యశో గీతికలను వినిపింప చేస్తారు. అతని ఇంటి చావడులలో గంధము తీస్తూ, పువ్వులు మాలలు కడుతూ, అతని పరాక్రమాన్ని కీర్తిస్తూ, వివశీ కృతులౌతూ ఉంటారు అప్సరసలు. వేదాల్లో చిక్కులు పడి ఉన్న మంత్ర పాఠాలను భక్తులకు, పండితులకు ఉపయోగపడు విధానంగా చిక్కులు తీసి మహన్యాసాది శైవనుతి ప్రబంధాలను విరచించాడు. బ్రహ్మ తొడ మీద కూర్చుని వేదములు చదివిన వారు మా తమ్ములు. తమ తపశ్శక్తితో బ్రహ్మ లోకాన్నే ఆర్జించినవారు. మాది అంత మర్యాదకల వంశము. ఇంత పాండిత్యము, శౌర్య సంపత్తులు కలిగిన ఈ సమస్త రాక్షస సామ్రాజ్యం పైన నా పెత్తనము చెల్లుతుంది, దేహబద్ధులైన స్త్రీ పురుషులకు రతి వాంఛ తప్పనిసరి. నాకు కామ పరితృప్తి కలిగించి కామదేవతకు పరితర్పణం చెయ్యి. మనిద్దరం చెట్టా పట్టాలు వేసుకొని దిక్కుల పర్యంతము, ఆకాశ వీధి హర్మ్యాలలో గోళముల మధ్యగా, మరుత్తులు చామరాలు వీచగా విహరిస్తూ ఉంటే అప్సరస లందరికీ ఈర్ష్య కలగాలి. నా మనుగడలో అడుగున పడి పోయిన భోగ వస్తువులను ఆఘ్రాణింప చేస్తాను. ఊహించలేని అనుభవా లను, విందులను నీ కందిస్తాను. ఇంక ఆలస్యం వద్దు. నన్ను గ్రహించు." అని కామిని తొందర పడింది. అందుకు రాముడు—

# రాముని పరిహాస ప్రసంగం

"నువ్వు రావణుడి పేరు చెప్పావు. వాడు మా ముత్తాతల నాటి వాడు. నీవు వాని అక్కగారవు. నీ ఈడేమిటి? నేనేమిటి? నలభై సంవత్సరాలు కూడా నాకు నిండలేదు. అటువంటి నువ్వు, ఇటువంటి నాకు ప్రేమ వ్యాహృతి చేత కామశాస్త్రి పారావారమునకు అవధులు చూపిస్తావా? నీకు కొడుకులు, కూతుళ్లు లేరా? నీకు భర్త లేడూ! నాతో వస్తే వాడేమి చెయ్యడా? పైగా వీళ్లందరితో నేను శత్రుత్వముకోరి తెచ్చుకున్నట్లు కాదూ? నాతో పాటు నట్టడవికి నడచి వచ్చిన ఈ భార్యను విడిస్తే నాకు పుట్టగతు లుంటాయా? సరే! ఇవన్నీ అటు ఉంచు, నీవు నన్ను వలచావు. నేను కూడా నిన్ను ప్రేమించాలి గదా? మరి అలా నిన్ను ప్రేమించాలంటే నీ సహజ స్వరూపమేదో చూడకుండా నాకు నీ మీద ప్రేమెలా కలుగుతుంది?" అని అంటూ సీత వంక చూచి –

" ఈమె నాకు ప్రియురాలు, నన్ను వలచి వచ్చిన వనిత. నాకు బుద్ధి తెలియనపుడు నీ తండ్రి నిన్ను నాకు కట్ట బెట్టాడు. మరి ఇప్పుడు వచ్చిన ఈ ప్రియురాలి యొక్క అతిలోక సౌందర్యం నీవు చూచి తీరాలి" అని ఆ దైత్యాంగనతో "అందరూ కామరూపులు గదా అని తమ నిజ రూపాన్ని వీడి ఏదో కవులు వర్ణించిన రూపంతో మగవారిని ఆకట్టుకుందామని ప్రయత్నిస్తారు. ఎంత అందముగా ఉన్నా ఒకే రకమైన అందం, రూపం కాస్త వెగటుగానే ఉంటుంది. ఒక మామిడి చెట్టు ఉన్నది, దాని పండ్లు మధురం, అదే విధముగా అన్ని చెట్లపళ్లు అదే విధంగా మధురంగా ఉంటే ఆ మధురత్వము కూడా వెగటుగానే వుంటుంది. పులుపో, వగరో. చేదో ఉంటే గాని ఆ క్రొత్త పళ్లకు ప్రత్యేకత ఉండదు. ఆ ప్రత్యేకతే అందర్నీ ఆకట్టుకోవచ్చునేమో!" అని విచిత్రార్థ స్ఫోరకంగా కామినికి క్రొత్త భావాల్ని కలిగేలా చేసాడు. దానితో

ఆ కామినికి వివేకం అంతరించి తన అసలు రూపంతో రాముడు చెప్పిన ప్రత్యేక సౌందర్యం చూపించవచ్చు, వైవిధ్యాన్ని కలుగచేయవచ్చు, రాముణ్ణి ఆకట్టుకోవచ్చు— అనే భావం కలిగి వికృతాలంకారిణియై సాక్షాత్క రించింది. ఆ రూపం ఇలా ఉంది.

## శూర్పణఖ నిజ స్వరూపం

దుర్ముఖి, మహోదరి, విరూపాక్షి, తామ్రమూర్ధజ, విరూప, భైరవ, దారుణ, వృద్ధ, అర్క ప్రసూన కైశిక, రుండ మాలాకాంచి, వసాకజ్జల' అయః కంకణ (దుర్ముఖి = అసహ్యమైన ముఖము కల్గినది, మహోదరి = బాన పొట్ట కలిగినది, విరూపాక్షి = హెచ్చు తగ్గు కన్నులు కలిగినది, తామ్ర మూర్ధజ = ఎర్రని రాగి జుట్టు కలిగినది, విరూప = వికృత మైన రూపము కలిగినది, భైరవ = వికృతముగా భయము గొలుపునట్లు మాట్లాడునది. దారుణ = చూచుటకు భయంకరమైనది, వృద్ధ = ముసిలిది, అర్క ప్రసూన కైశిక = జిల్లేడు పువ్వు వలె ఉన్న కేశములు కలది, రుండ మాలా కాంచి = పుర్రెల వరుస వడ్డాణముగా కలది, వసాకజ్జల = వంటిపై చీము, నెత్తురుల వాసన కలది, అయః కంకణ = ఇనుప కడియం కలది) అటువంటి ఆమెను చూచి జానకి భయపడిపోయింది. అప్పుడు రామచంద్రుడు సీతపై చేయి వేసి ఆ దైత్య కాంతతో—

## రాముని వ్యంగ్య ప్రసంగం

"ఆఁ మరి చూశావా! ఇంతటి అందమైన రూపాన్ని మరుగు పరచి చూపునకు ఎకసెక్కమయ్యే ఏదో ఒక్క రూపంతో నన్ను వలో వేసుకుందామనుకున్నావా! నిజంగా నీవు ఎంతకైనా తగుదువే! ఇప్పటి

నీ అందము అందం కాదంటామా? మీ అందం మీది, మా అందం మాది. మా నరులకు అది అందం కానంత మాత్రాన మీకు సుందరమైనది అందం కాడనడం పొరపాటే గదా! ఒకవేళ కాదంటే మేముండగలమా! మీకు ఆహారంలాంటి వారము మేము. తొందరపడి అలా ఎలా అంటాము. ఐనా ఒక్కటి చెప్పు. ఎలుకలాంటి మొగుణ్ణి కట్టుకుని పిల్లి ఏం సుఖపడుతుంది? దుప్పిని పెళ్లాడి పులి ఏమి ఆనందిస్తుంది? దూదితో అగ్ని సంబంధం ఎలా వుంటుంది? ఎలా వుంటుందో చెప్పనా– "విన్నంత వరకూ మొగుడే! వినకపోతే అప్పడమే!" నీవు బ్రాహ్మణ కాంతవి, నేను క్షత్రియుడను. నీవు దైత్య కాంతవి, నేను మనుష్యుడను. నీవు చూడొస్తే గొప్పింటి బిడ్డవు. నేను అంతటివాడను ఔనో కాదో ఈ అడవులసుపట్టి తిరగడమే చెబుతోంది కదా! అని అనంగానే—

## శూర్పణఖ కామం

"ఆఁ దీనికేమి! ఈ విషయాల కేమీ పెద్ద పట్టింపు లేదు పోనిద్దూ" అని వికవికా నవ్వుతూ— "నీతో నేను వస్తే నా మొగుడు నిన్నేం చేస్తాడో అని గదా నీ అనుమానం. నువ్వు అనుకున్నట్లు ఏమీ జరుగదు. నా మొగుడు నేనెలా చెబితే అలా వినేవాడు. ఎలా వెళ్లమంటే అలా వెళ్లేవాడు. నే వెళ్లిన చోటికి రాకూడదంటే రాడు. అంతే! ఒకవేళ నా ఆజ్ఞ దాటి వచ్చాడా అప్పటి కప్పుడే వాణ్ణి అక్కడికక్కడే వధించివేస్తాను. ఈ సంగతి వాడికీ తెలుసు. ఒక్కటి చెబుతాను విను! మన ఈ పొత్తును విధి కూడా విడదీయలేడు. తర్వాత – 'సాగితే మగడు సాగకపోతే అప్పడం అన్నావు' కదా! అంటే నాకు నీ మీద కోపం వచ్చి నపుడనా? ఛా! నాకు నీ మీద కోపం వస్తుందా? అలాంటి ఊహ నా కొస్తే నా కంఠం నేనే కోసుకుంటా. మరి నన్నిక అర్థం చేసుకో. అసలు మగ

వారి కంటే మగువలకు కామం వంద రెట్లు వుంటుంది. మనుష్యుల కంటె దైత్యులకు కామము వంద రెట్లు ఎక్కువ ఉంటుంది. దానిని బట్టి నీపై నాకు గల కామాన్ని ఊహించు" అన్నది. అప్పుడు రాముడు –

## రాముని సమాధానం

"మరి నీకు అంత కామం ఉంటే దానిని తీర్చగల వానిని ఎన్ను కోవాలి గాని మాలాంటి వారిని వలచి అటుపైన కామము తీరక విచా రించడం ఎందుకు? అసలు ఈ భూమ్మీద నీకు సరిపడ మగవాడే దొరకలేదా? ఈ భూమంతా గొడ్డు పోయిందా? కాబట్టి నామాట విని నువ్వు మరి ఒకరిని చూచుకో" అనగానే శూర్పణఖ "అది కుదరదు. నేను నీ యందు మనసు పడినదానను" అంది. అప్పుడు

రాముడు : నేను ఏకపత్నీ వ్రతస్థుణ్ణి.

శూర్పణఖ : ఆ వ్రతము ఐహిక సుఖదాయి కాదు, దాని యందు పారలౌకిక సుఖం చెప్పబడ్డట్లు లేదు.

నేను సుఖమే వాంఛించను.

ఐతే ఈమెతో సంసారం ఎందుకు చేస్తున్నావు?

అది ధర్మం కాబట్టి.

ధర్మం నాలుగు విధాలు. అందులో కామం ఒకటి.

"మన కూటమి విలోమము. అయినా నేను ఒక్కటి చెబుతాను నా అందం చూసే గదా మనసు పడింది. నా కంటే

వయసులో చిన్నవాడు, ఎర్రగా ఉన్నవాడు, పైగా భార్యాదూరుడు. ఏ విధంగా చూచినా నా కంటె మిన్నగా ఉన్న నా తమ్ముడైన లక్ష్మణుని వరించరాదూ నీకు పుణ్యముంటుంది! నీవు వెళ్లి నేను చెప్పానని చెప్పు. వాడు నా మాట కాదనడు. నీ మోహాన్ని ఛేదించగల విధాన సామగ్రి నైపుణ్యాలు గల సరసుడు. వెళ్లు, ఇంక వెళ్లు" అన్నాడు. రాముడు అలా అనంగానే పర్ణశాలకు దూరంగా ఒక చెట్టు నీడలో నుంచొని, పర్ణశాల వంక చూస్తూ, ధనస్సుపై ఆని నిల్చుని ఉన్న లక్ష్మణుని దగ్గరకు శూర్పణఖ వెళ్లి—

## శూర్పణఖ – లక్ష్మణుల సంభాషణ

"అన్నకు రాజ్యం పోతే తనకెలా వస్తుందా అని ఊహించే ఈ లోకంలో నీ వంటి వాడు ఉండటం ఆశ్చర్యంగా ఉంది. నువ్వు నిజంగా చాలా గొప్పవాడివి. నేను కామముతో నిండి ఉన్న దాన్ని, కన్నులు కనబడని ఆ కామానికి నీ శరీర కాంతుల వెలుగులు చిమ్మి నా కన్నులు తెరిపిస్తావనే ఆశతో వచ్చాను. మీ అన్న గారి దగ్గరకు వెళ్లి అడిగితే తాను కాదని నిన్ను పొందమని నీ దగ్గరకు పంపించాడు. నీవు అన్న గారి మాటను కాదనవని అన్న గారితో పడి అడవులకు రావడమే చెబుతోంది. నీకు కావాలంటే నిన్ను ఈ రాక్షస సామ్రాజ్యానికి రాజుగా చేస్తాను. అలా కాదంటె నీతో పాటే ఈ పర్ణశాలలో ఉండి పోతాను. నా తెలియని కోర్కెల చీకట్లను నీ శరీర కాంతులతో పటాపంచలు చేయాలి." అన్నది. అప్పుడు లక్ష్మణుడు ఇదెక్కడి గొడవరా అని మనస్సులో అనుకొని "ఇదిగో! నేను ఏ మమకారము లేకుండా ఏ కోర్కెలు లేకుండా అన్నీ వదలి అయోధ్య నుండి ఇక్కడకు వచ్చాను, ఇక్కడ తినడానికి ఒక పూట ఉండొచ్చు. ఒక పూట ఉండకపోవచ్చు. పైగా

రేపటి నుండి నీ నెత్తికి తల నూనెలు, పక్కలకు దుప్పట్లు నే తేలేను. ఏదో ఇంత గాలి, వెలుగు భోంచేసి బతుకుతున్నాను. నా పొట్ట కోసం మా అన్న గారి మీద ఆధారపడటం మంచిది కాదని ఉపవాసాలు చేస్తూ గడపేస్తున్నాను. తిని నిలబడటానికి ఇక్కడేమంత నీడ లేదు. నీ పొట్ట కైవారం చూస్తుంటే యోజనం దాకా ఉన్నట్టుంది. నీ భోజనానికి కనీసం పూటకో ఏనుగయినా కావలసి ఉంటుందేమో. మా తల్లీ ! నేను నీకు ఎక్కడి నుంచి తెచ్చేది? ఈ అడవులలో నీతో కాపురం నాతో నాకు కైవల్యమే " అన్నాడు, లక్ష్మణుడు అలా అనంగానే వెంటనే ఆ దైత్య కామిని-

"నీకాభయం అక్కర్లేదోయ్ ! నేను తినే ఆహారం నేనే సంపాదించు కుంటా. ఆ మాత్రం శక్తిసామర్థ్యాలు నాకు లేకపోలేదు, ఇకపోతే నెత్తి కోసం, నేలకోసం అంటావా నా నెత్తికోసం నూనె కాని, నేల కోసం వస్త్రం గాని నిన్నేం కోరను. సరేనా? ఇంకెందు కాలస్యం. నన్ను భార్యగా అను గ్రహించు. కొన్ని వేల సంవత్సరాలు బ్రతికాను. కాని నీ దివ్య దేహపు శోభ నా మనస్సును వెఱ్ఱెక్కిస్తోంది. నీకు ఇంకొక విషయంగూడా చెప్తాను. పదామడల దూరంలో ఉన్న ఏ పులి గాని ఏనుగు గాని ఉండి ఏ మాత్రం అలికిడి అయినా అది నా చెవులతో వినగలను. వెంటనే గట్టిగా ఊపిరి పీల్చానంటే అలాంటి జంతువు లన్నీ జలపాత వేగంతో నా నోట్లోకి రావలసిందే. కాస్త కామానికి తట్టుకోలేక మిమ్మల్ని అలా బ్రతిమాలుతుంటే కొంచెం కూడా దయ తల్చరేం. ఇంక నేను నిమిషం కూడా ఆగేది లేదు. కాదంటే ఊరుకునేది లేదు. ఆఁ! నేనేదో ముసలి దానిని, అందం లేని దానిని, రాక్షస స్త్రీని అనేగా మీరు తటపటాయించేది. అదే ఏ అప్సరస నో ఐతే మీరుఊరుకునేవారా? నేను ఇలా బ్రతిమాలవలసి వచ్చేదా? కామం అనేది రెండు విభిన్న లింగాలమధ్య సంబంధమే కాని దానికి మనుష లని, రాక్షసులని తేడా లేదు. యవ్వనం, వార్ధక్యం అనే పట్టింపు కూడా

దానికి లేదు. కామ భావన అతి దివ్యమైనది. కలిగిన వెంటనే దానిని తీర్చుకోవడమే సరైన పని. ఇంత చెప్పినా మీరు నన్ను స్వీకరించకపోతే తిండీ తిప్పలూ మాని, నిద్ర మాని మీ ముందే నా ప్రాణాలు విడుస్తా. మీరిలాంటి కర్కశ హృదయులని వెయ్యి కాలాలపాటు లోకమంతా చెప్పుకుంటుంది. అరే! ఇన్ని అంటున్నా ఉలకవు పలకవేం! ఏదో అన్నగారి మాట నిలిపే వాడివని, దానిని వేదంగా భావిస్తావని వచ్చానుకాని లేకపోతే వచ్చే దాన్నా. పోనీ మళ్లీ ఆయన దగ్గరకే పోతాను" అన్నది. అలా అన్న వెంటనే ఠక్కున లక్ష్మణుడు –

"అలా అన్నావు బావుంది. నిజంగా నీవుచేయవలసిన పని అదే! నిజం మాట్లాడాలంటే నామీద నీకు ప్రేమ లేదు. ముందు ఒకరి దగ్గరకు వెళ్లి అతడు కాదంటే నా దగ్గరకు వచ్చావు. మరి నే వేమనుకోవాలి చెప్పు? సరే! నీ మాట అలా వుంచు. మరి నా మాట కూడా కాస్త విను. మా అన్నగారిని వలచిన నిన్ను కామించే రాక్షస వ్యామోహం నాకు లేదు. నెయ్యానికైనా, వియ్యానికైనా, కయ్యానికైనా, సమ ఉజ్జీలుగా ఉండాలి. మీ అన్నగారి అంతస్థుకు మా అన్నగారేమన్నా సరిపోతారేమో కాని నేనెంత? మా అన్నగారి ముందు, నా అంతస్థెంత? ఆయన రమ్మంటే వచ్చి, పొమ్మంటేపోయే భృత్యుణ్ణి. అంత పెద్దవాడైన మా అన్నగారు నువ్వు వెళ్లి అడిగితే కాదన్నా అది కూడా గొప్పే! నిన్ను స్వీకరించినా నా కేమవుతుంది నా మొహం. నేను మా అన్నగారి సేవ చేసుకుంటుంటే నీవు మా వదిన గారి కాళ్లు వత్తుతూ ఉండాలి. నీవు ఒకటి ఆశిస్తే ఒకటి జరుగుతుంది. ఆకాశాన్ని వేల్తో పట్టుకుంటే ఎంత దక్కుడో నన్ను స్వీకరిస్తే నీకూ అంతే దక్కుడు. ఎందుకొచ్చిన మాటలు గాని, ఆయన దగ్గరకే వెళ్లు. ఏం? పర్ణశాల దాకా పంపించనా?" అనంగానే చుప్పనాతి శూర్పణఖ 'సరేలే ! ఏమక్కర్లా' అంటూ రుసరుసలాడుతూ రివ్వున పర్ణశాల ద్వారం దగ్గరకు వెళ్లి లోపలికి తొంగి చూసి–

# శూర్పణఖ - శ్రీరాముల సంభాషణ

"ఆఁ నువ్వు పంపించడమూ ఐంది, నే రావడమూ ఐంది. నిజంగా మీరు గడుసువారు. నీ తమ్ముడేదో నీ మాట జవదాటడని నీ మనస్సులో కొండంత నమ్మకం. దానిని అలాగే దాచుకో! ముందు ముందు ఎలాంటి ఆపదలు వస్తాయో, ఎప్పుడూ ముందే చెప్పలేము. నీవు ఒకవేళ ఏదైనా పని మీద వెళ్లాల్సి వస్తే తమ్ముడున్నాడు కదా అని నీ భాగ్యాన్ని గాని, నీ భార్య జానకిని గాని అప్పజెప్పి వెళ్లేవు. ఇక అంతే! అంతటివాడు మీ తమ్ముడు అని తెలుసుకో. నీ మాటేమీ వినలేదు. నన్ను కాదన్నాడు. అందుకని నీ దగ్గఱకే వచ్చాను మళ్లీ." అంది. అప్పుడు రాముడు వెంటనే "నీకు తెలివి ఇంతేనా! నేను వద్దంటే అక్కడకు వెళ్లావు బాగానే ఉంది. మరి వాడు వద్దంటే ఇంకొకరి దగ్గరికి వెళ్లాలిగాని మళ్లీ మొదటికే రావటం ఏమి తెలివి" అన్నాడు. అప్పుడు ఆ దానవి—

"ఇంక ఈ మాటలు కట్టిపెట్టు. నన్ను గ్రహించు, ఏం గ్రహించ మనంగానే మొహం అలా పెట్టావు. నిన్నేమన్నా విషం త్రాగమన్నానా? విందులు చెయ్యమన్నానా? అదేమిటలా ఇద్దరూ అతుక్కుపోతారు. ఈ జానకిని నువ్వు అంత ప్రాణంగా చూస్తున్నావా? మీ ఇద్దరి మధ్య అంతటి అనురాగం వుందా? శివ ధనుస్సు విరిగి తాను ముక్కలై మిమ్మల్ని ఒక్కటిగా చేసిందా! బాగుంది వరస!! ఊహించడానికే వీలు కాకుండా వుంది. కామంలో వున్న కామినిని తెలిసి గాని తెలియక గాని కాదంటే అలాంటి వానికి ఇంకెప్పుడూ స్త్రీ సుఖం వుండదని గుర్తుపెట్టుకో! అలాంటివాడు ఎంత పుణ్య కార్యాలకు ప్రాకులాడినా పొందేది పాపమే! నాది పెద్ద అందం కాదు నీ భార్య అందమే అందమంటావా! దేశాన్నిబట్టి జాతినిబట్టి అందాల తీరులు మారుతూ ఉంటాయి. దేహంలోని అంగాల అమరిక, విన్యాసం కూడా ఒక్కోచోట ఒక్కోవిధంగా వుంటుంది. కామం పుట్టినపుడు ప్రాణుల

మధ్య వలపు ముఖ్యం గాని వయస్సు, జాతి, అందము కాదు. కొన్ని వేల సంవత్సరాల నుండి జీవితం సాగిస్తున్నాను. నీ అంత అందగాడు నా కింత వరకు కనపడలా. మరి నీ ఇంతటి అందం ఈ ఒక్కామెయే-అనుభవించడం ఏమంత సబబు చెప్పు" అన్నది. శూర్పణఖ మాటలు సీతకు "పాపం ఆ దైత్యాంగన అన్న మాటల్లో కూడా నిజం లేకపోలేదు" అనిపించి రామునితో-

## సీత దృష్టి

"ప్రభూ! ఈమె చెప్పిన మాటలు నిజమే అనిపిస్తుంది. నిజంగా నువ్వు అన్ని జీవులకు మోహం పుట్టించే అందం కలవాడివి. అందువల్ల ఆమె అలా అనడంలో నాకు కొంచెము కూడా దోషం కనబడటం లేదు".

"ఋష్యాశ్రమాల్లో ఆడా మగా భేదం లేకుండా అందరి దృష్టి నీ మీదే వుండటం నేను చూశాను. ఏదో నిన్ను స్వామీ! ప్రభూ! అని పైకి అన్నారు గాని లోపల వారి మనస్సుల్లో ఏమి భావాలు వున్నాయో ? వారి లాగానే ఈమె నిన్ను చూసింది. వాళ్లు పైకేమీ అనలేదు, ఈమె అన్నది. నీపై నా దృష్టి ఎలాంటిదో సరిగ్గా అలానే నిన్ను చూసింది. మరి అది దోష మని అనడం సబబు కాదేమో" అన్నది. సీత అలా అనంగానే రాముని ముఖంలో కొంచెము బిగువు కనబడింది. కనుబొమ్మలు దగ్గర అయినాయి- "సీతా! అలా అంటావేమిటి? వాళ్లు ఏ దృష్టితో చూసారో వాళ్లకు తెలుసు, నాకు తెలుసు. వాళ్లు ఎరిగిన వేదాంత మేమిటో వాళ్లకు తెలుసు, నాకు తెలుసు, ఇక్కడ ఈమె దృష్టి, చెప్పే వేదాంతం ఏమిటో ఈమెకు తెలుసు నాకు తెలుసు. మధ్యలో నువ్వు వక్ర భాష్యాలు చెప్పక్కర్లా. నేను మనిషిని మనువు ధర్మం తెలిసినవాడిని. భూమిపై అధర్మం నీడ పడటం కూడా సహించను. ఇది జారిణి, కామంతో పర పురుష

వాంఛలో పడి భర్తనే చంపటానికి సిద్ధమైంది. వయస్సు ముదిరి ముసలి దైనా కామం చావని దీనికి ఇక సర్వ పాపాలూ చుట్టుకుంటాయి. ఎందుకు వృథా కంఠశోష. దీని మొహం నేను చూడను. దీనిని అవతలకు పంపెయ్యి." అని పెడ మొగం పెట్టుకుని వుండడంతో సీత తాను తొందరపడ్డానని భయంతో ముడుచుకు పోయింది. అప్పుడు ఆ దానవి జానకిని చూసి—

## శూర్పణఖ దృష్టి

"నువ్వు అతని ముంజేతి చిలుకవని నాకు తెలుసు. ఇంకా ఏదో నీకేం తెలియనట్లు, అమాయకురాలవైనట్లు. రాముని మాటకు జవదాట నట్లు, భయపడినట్లు, వంగనాచి అభినయాలు మాను. అసలిలా జరగడానికి అంతకూ నీవు కారణం కాదూ! ఏమి బూచక్కి మాటలే ! ఏమి వగలే! ఏమి సెగలు! ఏమి గుంట ఆలోచనలే! తమ్ముణ్ణి చూచి రమ్మంటే ఆయన మాట కాదనలేక అలా వెళ్లి ఇలా వచ్చాను. అంతే! ఇంతలో ఏం చేసావో చక్రం తిప్పేశావే? తీయగా నవ్వుతూ మాట్లాడే మొగుణ్ణి చేతిలో పెట్టుకుని కీలు బొమ్మ ఆట ఆడిస్తున్నావు కదే! పైకేమో నా పక్షంగా మాట్లాడుతున్నట్లు కన్పిస్తూ నామీద నీ మగని మనసుని విరిచేసావు కదే! ఎలా మాట్లాడిన వాడు ఎలా మాట్లాడాడో చూడు. ఇదంతా నీ మాటల గడుసుతనం కాదూ? తాడులాగా' వచ్చి దబ్బనంలాగా తయారయ్యే తెలివే నీది. నువ్వు ఎంత దానవు కాకపోతే ఇలాంటి వాణ్ణి వల్లో వేసుకుంటావు. పధ్నాలుగేళ్ల అరణ్యవాసానికి పతి రావలసి వస్తే నీ మనస్సులో ఎలాంటి వూహ వున్నదో ఏమో. ఆయన్ని ఒంటరిగా వదలడం నీ కిష్టంలేక పైకి మాత్రం మిమ్మల్ని విడిచి నే వుండలేను అంటూ వెంటబడి ఆయన స్వేచ్ఛకు అడ్డువస్తూ రాచి రంపాన పెడ్తున్నావు గదే! నీ ఈ వ్యవహారము ఇవాళ

తెలియక పోయినా ముందు ముందు తెలుస్తుందిలే! హవ్వ! ఎంత మధురంగా మాట్లాడాడు, ఇంతలో నీ తెలివితో ఎంతగా ఆయన నోరు కట్టి బిగించేసావు? అయినా భర్త వెంటపడి నువ్వు అడవికి రావాలా? మీ మరిది భార్య వచ్చిందా చెప్పు? ఎక్కడన్నా రాజవంశ స్త్రీలు అంతఃపురాల్లో వుండడమే ఎరిగివున్నాము గాని ఇలా ఒళ్లూ పై తెలీకుండా మగవాళ్లను వెంటేసుకొని అన్నిచోట్ల సంచారం చేయడం ఎరగం. చూడ్డానికి లక్ష్మీదేవిలా వున్నావు-ఇంక మొగుణ్ణి అమాయకుణ్ణి చేసి చిలకలా ఆడించడం నీకేం కష్టం? అవడానికి రాజులా! ఏకపత్నీ వ్రతమా! రాజులకు ఏకపత్నీ వ్రతం మాట నేనెక్కడా వినలేదు. ఏదో నాథుణ్ణి బుట్టలో వేసుకునేందుకు ఏ మందో మాయో పెట్టి ఇలాంటి మాటలు అనిపిస్తున్నావు. ఈ మిథిలావాసులు పెద్ద వేదాంతులని పేరు. నన్నడిగితే మైథిలులు అంతా ప్రాణాంతకమైన జాతి అంటాను. నువ్వు వున్నన్ని రోజులూ స్వామికి సుఖం ఉండదు. పళ్లతో నీ మెడ పట్టుకొని నమిలి మ్రింగేస్తాను ఒసినీ! నిన్నేం చేస్తానో చూడు" అంటూ ఘోరాకృతితో సీత మీదికి రాబోయింది. సీత భయ విహ్వల ఐ పెద్దకేక పెట్టి భూమ్మీద మూర్ఛిల్లింది. వెంటనే రాముడు అడ్డం వచ్చి లక్ష్మణుణ్ణి పిలిచి—

## తుది నిర్ణయం

"ఈ ఘాతుకి సీతను చంపటానికి సిద్ధమైంది. ఆలస్యం చేసి లాభం లేదు. తక్షణమే దీని దురాచరణను మాన్పు" అని అనడంతో లక్ష్మణుడు ఆమెను పర్ణశాలకు దూరంగా గెంటి కలియబడి యుద్ధంచేస్తూ అల్లె త్రాటిని దాని కాళ్లకడ్డంగా విసిరి ఒక్కలాగు లాగి క్రింద పడదోసి చెవులు, ముక్కు కత్తితో తెగకోసి "ఇంక పది ఆమడల దూరంలో ఉన్న జంతువులు కూడా భద్రంగానే ఉంటాయి పో!" అన్నాడు. ముక్కువెంట,

చెవుల వెంట నెత్తురు ఓడిపోతూ ఆకాశంలోకి ఎగిరిపోతూ "రేయ్ ఇల్లు అలకగానే పండుగ కాలేదురా. నోరు తెరుచుకొని ఎత్తిన చేతులతో భూమి పగిలేలా గర్జిస్తూ, హాహాకారాలు చేస్తూ మా రాక్షస రాజులందరూ మిమ్మల్ని ముప్పతిప్పలు పెట్టి, మూడు చెరువుల నీళ్లు త్రాగిస్తారురా! ఒరేయ్ కోట్లు లక్షల రాక్షస బలం మిమ్మల్ని చుట్టుముడుతుందిరా! ఆడ దాన్ని అణచినట్టు కాదురా! తొందరలోనే రుచి చూస్తారులే మా దైత్యుల శక్తిని. ఎంత కుటిలులురా! ఎంత వింత వక్రి వలపులురా! అందుకు తగ్గట్టుగా అనుభవిస్తారులే! అనుభవిరుస్తాలే!!" అంటూ వెళ్లి పోయిన అమె మాటలు క్రమక్రమంగా తగ్గుతూ వినపడ్డాయి.

## శూర్పణఖ ఘట్టంలో ఔచిత్య అనౌచిత్యాలు

[ఈ శూర్పణఖ ఘట్టంలో రామలక్ష్మణుల ప్రవర్తన గూర్చి చాలామంది చాలా అభిప్రాయాలు వెలిబుచ్చారు. అందులో కొందరు సబబే అంటే కొందరు అమానుషం అని, కొందరు అతి అని, కొందరు శూర్ప ణఖను అలా చేయిబట్టే ఆ ఉసురు వల్ల రాముడు చివరకు సీతా పరిత్యా గము చేయవలసి వచ్చినదని, మరి కొందరు ఇది రాముని శీలానికే పెద్ద కళంకమని ఇలా ఎన్నెన్నో అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఈ ఘట్టాన్ని చదవబోయే ముందు ఘట్టానికి పూర్వాపరాలు చదవటం చాలా ముఖ్యం శూర్పణఖ రాకకుముందు సీతారామ లక్ష్మణులు ముగ్గురూ ఎన్నెన్నో కబుర్లు నవ్వొచ్చే కథలు, చతురోక్తులు, చమత్కారాలు, చెప్పుకుంటూ హాస్య రసంలో ఆనందిస్తున్నారు. సరిగ్గా ఆ సమయంలో శూర్పణఖ వాకిట ముందు వచ్చి వాలింది. ఆమె ఎంత అందంగా అలంకరించుకొని వచ్చి నిలబడ్డా ఆ అందం, ఆ వయ్యారం ఆమెకు సహజం కాదని ఏవో తెచ్చి పెట్టుకున్నట్లుగా వున్నవని అటు దేవతా స్త్రీ కాని, ఇటు ఋష్యాశ్రమ స్త్రీ

గాని లేదా మామూలు మనుష్య కాంత గాని అయివుండటానికి వీలు లేదని ఆమె వేష భాషలను బట్టి, మండిగం మీద నుంచుని ఉన్న తీరుని బట్టి ముందే పసిగట్టేసారు. అంతకు పూర్వం గూడా పర్ణశాల ప్రాంతంలో తిరుగుతున్నపుడు రామలక్ష్మణులను చూసి వారి అందానికి వివశులై పెదవులు తడుపుకుంటూ వీరి ధనుర్బాణాలను చూసి వారి అందానికి వివశులై పెదవులు తడుపుకుంటూ, వీరి ధనుర్బాణాలను చూసి భయపడి వెళ్లిపోయిన రాక్షస స్త్రీలు వున్నారు. వారిలోనే ఒకతె ఈ కృత్రిమ వేషధారణ ప్రయత్నంతో వచ్చి వుండవచ్చునని రామలక్ష్మణులు పూర్తిగా ముందే గ్రహించుకొని వుండాలి. అందుచేత మొదటి నుంచీ ఇద్దరి మాటల తీరు ఒక ఉత్తమ కుల స్త్రీతో మాట్లాడే విధంగా లేదు. అంతకు పూర్వం చమత్కార చతురోక్తుల వాతావరణం పూర్తి కాకుండానే ఈ క్రొత్త ప్రణయ ప్రహసనం ప్రారంభమయ్యేటప్పటికి వారి చతురోక్తులు ముందుకు సాగటానికి ఈ సన్నివేశం మరింత దోహద పడింది. తనది అంత ఎబ్బెట్టు రూపమైనా తనని ప్రేమించమనడంలో నీ అందానికి తగినవాణ్ణి నేను కాదు నా కంటె చిన్నవాడు ఎఱ్ఱగా, బుర్రగా నున్నవాడు ఐన ఆ లక్ష్మణుడే నీకు సరైన జోడు అని అనడం కూడా ఆ చమత్కార వాతావరణానికి ఎంతో సహజత్వాన్నే చేకూరుస్తుంది కాని ఎబ్బెట్టుతనాన్ని తెచ్చిపెట్టదు. ముగ్గురు కాలేజీ విద్యార్థులు పార్కులో ముచ్చట్లు చెప్పుకుంటుంటే వారి దగ్గరకు వికృత రూపంలో ఉన్న ఒక ముసలి లంబాడీ వచ్చి నన్ను వరించు అని వారిలో ఒకరితో అంటే అప్పుడా యువకుడు 'నేను కాదు నీకు సరయినజోడు వాడు' అని రెండవవాణ్ణి, ఆ రెండవవాడు అలాగే మూడవవాణ్ణి చూపించి ఒకరికొకరు నవ్వుకుంటారు. ఇలా జరిగితేనేలక్కడ సన్నివేశం సహజంగా వుంటుంది. సరిగ్గా ఈ శూర్పణఖ సన్నివేశం కూడా అలాంటిదే, అందుకే కవి అలా వ్రాశాడు. ఈ సన్నివేశం మొత్తంలో శూర్పణఖ ప్రవర్తన కూడా వాళ్ల చమత్కారం కొనసాగించటానికే దోహదపడింది. అని గుర్తించాలి.

శూర్పణఖ ముక్కు, చెవులు కోయడం అంత బాగుండలేదు అని బాధపడేవారు కొందరు, వాల్మీకి ఇలా చేయించకుండా ఉండాల్సింది అని పెద్దరికాన్ని చూపేవారు కొందరు కూడా వున్నారు. అసలు రామలక్ష్మణులకు ఆ ఉద్దేశం ఎప్పుడూ లేదు. తమతో మాట్లాడుతున్నంత వరకు హాస్యంగా సంభాషణని కొనసాగించారు తప్పించి మరో ప్రయత్నమేమీ చేయలేదు. సీత మీదికి ఎగబడి చంపబోతుంటేనే రాముడు లక్ష్మణుని పిలిచి ఆ పని చేయకుండా శూర్పణఖని తప్పించమన్నాడు. నిజానికి ఆ సమయంలో ప్రతీకారంగా శూర్పణఖని చంపినా తప్పు లేదు. ఆడది గదా అనే ఉద్దేశంతోనే అమర్యాద చేసి పంపిస్తే సరిపోతుందని, ఇక ఇటుపై ఈ రాక్షస స్త్రీలు ఇలాంటి ప్రలోభ ప్రయత్నాలు చేయకుండా ఒక గుణపాఠంగా ముక్కు, చెవులు మాత్రమే కోయటం జరిగింది. దీనివల్ల ఇంకో మేలుకూడా చేకూరుతుంది. పది ఆమడల అలికిడైనా తాను వినగలనని, అప్పుడు కనక ఊపిరి లోపలికి లాగితే మనుష్యులైనా, మృగాలైనా అంత దూరం నుండి జలపాత వేగంతో తన నోట్లోకి రావలసిందేనని శూర్పణఖ చెప్పనే చెప్పింది. మరి ఇలాంటి దానివల్ల తపస్సు చేసుకునే ఋషులకు, రేవుకు పోయే ఋష్యాశ్రమ స్త్రీలకుకూడా ముప్పే కదా! ఈ ముక్కు చెవులు పోవడంలో వారికా ఇబ్బంది కలగకుండా కూడా మేలు జరుగుతోంది. అంతే కాదు' మీ రాక్షస జాతి అంతా బల పరాక్రమాలతో అహంకరించే పెట్రేగి, విఱ్ఱవీగబోకండి. ఒళ్లు దగ్గర పెట్టుకొని మసలుకోండి. అధర్మానికి పాలుపడితే అంతు తేల్చే మొనగాళ్లు కూడా ఈ అడవిలో ఉన్నారని గుర్తు పెట్టుకోండి. అనే శిష్ట రక్షణ, దుష్ట శిక్షణకు సంబంధించిన హెచ్చరిక కూడా!" ఈ విషయ మెలాగూ ఇక ముందు రాబోయే సన్నివేశంలో స్పష్టపరచబడుతుంది. అందువల్లే ఈ శూర్పణఖ ఘట్టము చదువుకునే ముందు దీని పూర్వాపరాలు తప్పక చదవాలి అని చెప్పటం జరిగింది.]

## శూర్పణఖ తన గోడును ఖర దూషణాదులతో మొరపెట్టుకొనుట

హేమంత ఋతు ప్రభావం మరింత గాఢమైంది. మంచు గడ్డల మధ్య ఉన్నట్లుగా ఉన్నది. ప్రక్క ప్రక్క వారే ప్రస్ఫుటంగా కనబడటం లేదు. సీతకు ఈ విపరీత ఋతు లక్షణాలు భీతిని కలగజేశాయి. రాక్షస స్త్రీని అలా చేసినందుకు ఇంక దాని తాలూకు మొత్తం ముఠా వచ్చి ఏ సమయంలో ఏం చేస్తారోనని భయం కూడా మనస్సు నిండా వున్నది. ఆ భీతితో నిరంతరం రాముణ్ణి వదలకుండా నీడలా అనుసరిస్తోంది.

ఆకాశంలోకి ఎగిరిపోయిన శూర్పణఖ తన ముక్కు చెవుల నుండి నెత్తురు చుక్కలు జొటజొటా కారుతూ వుండగా సరాసరి వెళ్లి ఖరుడు వున్న రాజ్యం చేరింది. ఆ ఖరుడు జనస్థానంలో ఉన్న భీకరమైన బల పరాక్రమ సంపన్నులైన ఒక లక్ష రాక్షస వీరులకు నాయకుడు. వాడి తమ్ముడు దూషణుడు, అన్నతో సమానమైన విక్రమం కలవాడు. ఇద్దరూ తపోబల సంపన్నులు కూడా! వారి తపః ఫలంగా ఎన్నో వరాలు పొందారు. ఆ వరాలతో వారి గర్వం మరింత పెరిగింది. కోర మీసాలతో క్రూర కన్నులతో యథేచ్ఛగా అడవితో తిరిగే పులుల్లాంటి వారు. శూర్పణఖ పై నుండి ఖరుడున్న కొలువులోనికి వాలింది. ఆ కొలువులో చాలామంది రాక్షసులు ఖరుని బల పరాక్రమాలు కొనియాడుతున్నాడు. ఖరుడు ప్రత్యేకంగా పద్నాలుగు మంది సేనా నాయకులతో రాచరిక విషయాలు చర్చిస్తున్నారు. ఒక్కసారి తన అప్పగారు పై నుండి వికృత ముఖంతో ఊడిపడేటప్పటికి ఆమెను వింతగా చూసి—

"ఇదేమిటమ్మా! ఈ ముక్కు చెవులమ్మట నెత్తురేమిటి? ఆ ముక్కు ముక్కలవడం ఏమిటి ? ఏమిటి కారణం ? ఎందుకైనది ఇలా ? నిన్నిలా చేసింది ఎవడు? రాక్షస రాజైన ఈ ఖరుని అప్పగారైన నీకా ఈ తిప్పలు?

ఈ నా రాజ్యంలో రాక్షసులకే రక్షలేదా? ఈ ప్రాంతంలో నా ఆజ్ఞను ధిక్క రించగల వాడొకడున్నాడా? ఎవడు వాడు? చెప్పు ముందర?" అన్నాడు.

అప్పుడు చుప్పనాతి ఉన్న గొంతంతా ఎత్తి భోరున ఏడ్చింది. అప్పుడు మళ్లీ ఖరుడు—

## ఖరుని దర్పం

"నిద్రపోతున్న కోడె త్రాచును నిద్రలేపి దాని పడగమీద గ్రుద్దటానికి సాహసించినది ఎవరు? దాని పెద్ద కోరలు కక్కే విషాగ్నిజ్వాలలను ముద్దలు జేసి మ్రింగుదామనుకునే మూఢత్వం ఏ మూర్ఖుడికి కల్గింది? ప్రళయ కాల మహోగ్నుల్లోకి దూకడానికి సాహసించే ఆ దౌర్భాగ్యుడు ఎవరు? ఇంతకంటే సముద్రంలో ఈదటానికి పోకపోయాడా? నిద్రపోతున్న సింహాన్ని ఎట్టిగా వున్న దాని జూలుని చూచి గడ్డి అని లాగడానికి ప్రయత్నిస్తున్నాడు. వాడికి రోజులు దగ్గర పడి చావు తోసుకు వస్తోంది. ఈ ఖరుడెవరను కున్నాడు? ఈ శూర్పణఖ ఎవరి తాలూకు అనుకున్నాడు నా పేరుచెబితే గడగడలాడిపోయి గుండె పగిలే ఈ చోట నా అప్పగారి చెవుల్ని కత్తిరించి తన చేటుకాలాన్ని చేజేతులా తెచ్చుకున్నాడు. ఎవడో ఎప్పుడూ చేయని తపస్సు చేసి, బ్రహ్మని మెప్పించి, ఏవో కొద్దిగా వరాలు సంపాదించి ఆ క్రొత్త వరాల తొలి పొంగులో ఏం చేయాలో తెలియక ఈ సాహసానికి పూనుకొని వుంటాడు. సాక్షాత్తు త్రినేత్రుడే ఎదురు వచ్చి నిలబడినా క్షమించరాని పనిచేశాడు. మనం ఎంత రాక్షసులమైనా కచ్చతో ముక్కులు కోసే క్షుద్రమైన పని చేయం. ఈ క్షుద్రమైన పని చేసిందెవడో? ఇది ముమ్మాటికి రాక్షసుల పనికాదు. మనుషులే చేసివుండాలి. మనుష్యులను తినని జాతియొక్క క్రౌర్యం ఇలాగే వుంటుంది. తాను తిననప్పుడు ప్రాణిని హిసించడం దేనికో? ఈ క్రౌర్యానికి పాల్పడేది నరాధముడే అయ్యుండాలి" అని శూర్పణఖను లేవదీస్తూ—

"తలచుకున్న రూపం పొందగల సమర్థురాలివి, బాహు విక్రమ బల సంపన్నురాలివి, అసాధ్యురాలవు, నిన్ను ఇలా కదలకుండా నుంచో బెట్టి చేతులు పట్టి ముక్కు, చెవులు ఆ మనుష్యులు ఎలా కోయ కలిగారే ? ఐతే వారు గట్టివారే అయివుండాలి" అని ఆమెను కూర్చోబెట్టి—

"నీవు ఏడవకుండా నిజం చెప్పు, నిన్నిలా చేసిన వాళ్లు ఎవరు ? ఈ రాక్షసులతో పోరు కోరుకునేవారెవరు? చెప్పు అనంగానే శూర్పణఖ—

# శూర్పణఖ చెప్పిన తీరు

"వాళ్లిద్దరు అన్నదమ్ములు, ఆ ఇద్దరిలో పెద్దవాడు నీలిమబ్బు తునక. అతన్ని అంటివున్న భార్య మెరుపు తీగ. నిజంగా ఆమె ఈ సంసార సముద్రానికి అవతలి ఒడ్డులాంటిది, దయాపయోనిధి. వారు మను ధర్మ విధానంలో మనుగడ సాగించే మనుష్యులు. ఆ పెద్దవాడు నిజంగా అప్పుడు విచ్చిన అవిశెపువ్వు వంటి మేను కాంతులు కలవాడు. వాడి పలు వరుస ఏం చెప్పను. దానిమ్మ గింజల్లా ధగధగా వాడి చిగుళ్లు మెరుస్తున్నాయి. పెద్ద రాచవంశపు వాడే. పెద్ద జుట్టుముడి, వాని కళ్ల చివరలు వెన్నెల తీగకు చిగురాకుల అందంలా వున్నది. అతని కన్నులను చూసినంత సేపు కన్నుల్లోకి చూచినట్లు లేదు. కళ్లని చూడనపుడు కళ్లని చూచినట్లు వుంది. వాళ్లు ఉత్తర దేశస్థులు, అయోధ్యా రాజులు, పినతల్లి పంపగా వనవాసానికై ఇక్కడకు వచ్చారు. వచ్చి ఇప్పటికి పదమూడేండ్లు అయినది. ఆ అన్నగారు నలుపు, తమ్ముడు ఎరుపు, ఆ భేదము తప్పించి ఇద్దరికీ ఏమీ తేడాలేదు. అన్నను చూస్తే తమ్ముడేనని, తమ్ముణ్ణి చూస్తే అన్నేనని భ్రమపడ వచ్చు కూడా! వాళ్ల నడుములు సింహం నడుములు. వాళ్ల రొమ్ములు విశాలములు. పొడవైన బాహువులతో అంతకంటే పొడవైన విల్లులు ధరించి ఉంటారు. వాళ్ల జటలు చూస్తే పరమశివుడు గుర్తుకు వస్తాడు. వాళ్ల పేర్లు

రామలక్ష్మణులు. రాముడి భార్య వైదేహి. నా కిప్పటికీ తలుచుకుంటే ఆశ్చర్యంగా ఉంటుంది. అసలు నన్నేవిధంగా క్రిందకు తోసారు, నా రెండు చేతుల్ని ఎలా బిగపట్టారు. నా ముక్కుని ఎలా కోసారు అలా చేయడానికి ఎంత లాఘవము, ఎంత కౌశలము ఉండాలి క్షణకాలంలో చేసేశాడు ఆ కోతి లక్ష్మణుడు. ఎంతలో ఎంత అసహ్యంగా తయారైనదీ ముఖం. వీడి పని పాడుగాను! వాళ్ల తొమ్మలో మాంసం నేను తినే ఆహారంలో నంజుకోకపోతే నాకు నిద్రపట్టదు. నేనంతకీ వారి మనస్సు కష్టం కలగకుండా మాట్లాడాను గదయ్యా! వారికి అదేం పట్టలేదు. మనం రాక్షసులం. వాళ్లు మనుష్యులు. ఇంతే వారికి తోచేది. ఈ యావద్రాక్షస జాతి మాడి మట్టిలో కలిసిపోవాలి. అదే వారుకోరేది" అంది. శూర్పణఖ అలా అంటుండంగానే ఖరుని చుట్టూ వున్న 14 మంది సేనా నాయకుల్లో వార్తా మంత్రి ఐన దుర్ముఖుడు ఖరునితో—

## దుర్ముఖుని తీర్పు

"నాదొక్క చిన్న విన్నపము, వీళ్లను గూర్చి ఇదివరకు రెండు మూడుసార్లు విన్నాను. శరభంగుని ఆశ్రమం దగ్గరలో కొన్ని రోజులు గడిపిన విప్రులు. సమస్త అసుర జాతిని అంత మొందిస్తామని ప్రతిజ్ఞ చేసినవారు. అటుపైన అక్కడక్కడ ఏదో చిన్న చిన్న రాక్షసులను చంపి అదే పెద్ద విజయంగా భావించి అక్కడున్న ఋషుల చేత సర్వసమర్థులనే పేరుపొందారు. కాని ఆ చచ్చిన రాక్షసు లెవ్వరూ మన ముఠాకి సంబంధించిన వారు కాకపోవడంతో ఆ విషయం అంత శ్రద్ధపట్టలేదు" అన్నాడు దుర్ముఖుడు అలా అనంగానే "అంతటివారు ఇప్పుడు మన ఆడవాళ్లపై చేయిచేసుకునేంతగా తయారైనారన్నమాట! పైగా ఇదివరకు ఇతరులెందరితోనో కలిసివుండే వారు. ఇప్పుడు మా ఆడపడుచు చెప్పిన ప్రకారం

ముగ్గురే వున్నారు. వాళ్లలో గూడా ఒకరు స్త్రీనే గదా! ఆఁ! ఇది పెద్ద పనేం కాదు. మీ 14 మంది పోయి సంగ తేంటో చూసిరండి. అక్కా! నీవుకూడా వాళ్లతో వెళ్లి త్రోవచూపించు" అనిచెప్పి పంపాడు.

ఖరుడు పంపిన 14 మందీ గొప్ప గొప్ప అయుధాల్ని చేపట్టి అడవిలో నడచు కుంటూ రాముని పర్ణశాలా ప్రాంతానికి పోయారు. తాను కనబడకుండా నక్కి 'కో'! అని శూర్పణఖ రాముణ్ణి పిలిచింది. లక్ష్మణుడు వస్తుంటే ఇతడే అంటూ తన ముక్కు. చెవులు చూపించింది. ఇతంలో రాముడు లోపలి నుండి బయటకు వచ్చాడు. అప్పుడు శూర్పణఖ—

"ఇరుగో మా సేనాపతు లొచ్చారు. నువ్వు చేసిన పనేమిటో ఇప్పుడు చెప్పు." అంది. చిరునవ్వు నవ్వుతూ రాముడు "నీమొగమే చెబుతోందిగా మళ్లీ నేను వేరే చెప్పాలా" అన్నాడు. ఆమాటలకు దుర్ముఖుడు ఉగ్రుడై "ఇవేం మాటలు ఆడది నిను వలచి వచ్చింది గాని నిన్నిం కోటి చేయడానికి రాలేదుగా? నువ్వు ఇష్టంలేక పోతే కాదనాలిగాని ఇలాంటి అకృత్య మేమిటి? ఎవరైనా మెచ్చేపనేనా? మీమీద వలవు కొద్దీ మిమ్మల్నేం చేయకుండా ఊరుకుందిగాని లేకపోతే మా శూర్పణఖమ్మ మీలాంటి వందమందిని నమిలి మింగేయగల శక్తి కలది. మా రాజు ఖరుడు చెప్పింది నిజమే! మా రాక్షసు లెవరూ ఇలాంటిపని చేయరు. ఈ పని మీ మనుషులకే చెల్లుతుంది" అన్నాడు. శ్రీరాముడు ఏం చెప్పాలో తోచక నిలుచుండి పోయాడు. అప్పుడు లక్ష్మణుడు—

"ఆ పని ఆయన చేయలేదు. ఇదంతా చేసింది నేను. ఈ కామిని యొక్క కామానికి ఒక హద్దూ పద్దూ వుండక్కర లేదా? కామము ఉంటే ఉండనీ, తను పోయేదోవ పోక మా తల్లి సీతమ్మను చంపడానికి వస్తుందా, పోనీ ఇది న్యాయమేనా చెప్పండి? ఆయుధాలు పట్టి న్యాయం

తెల్సుకుందా మని వచ్చారుగా! ఇంకోటి కూడా చెబుతా వినండి. పది ఆమడల దూరంలో ఉన్న మునుల, జంతువుల అలికిడి కూడా ఇది విన గలదుట! వినంగానే లోపలికి ఊపిరిపీలిస్తే అవన్నీ వచ్చి నోట్లోపడి తనకు ఆహారం అవుతాయట! నేను కల్పించటం కాదు. ఈ సంగతి తనే చెప్పింది. మరి ఇలాంటి దుష్టురాలికి ఆ శిక్ష తగినదో కాదో చెప్పండి" అన్నాడు. అప్పుడు రామచంద్రుడు—

"అరే! అలాగా నాకీ సంగతి తెలీదు సుమా! ఊపిరితోనే ఉన్న వన్నీ తనలోకి లాగేసే దీనికి మంచిశాస్తే చేసావు" అంటూ రాక్షస సేనానులవైపు తిరిగి—

"మీరు వెళ్లి ఈ సంగతి న్యాయమే అన్నారని మీ రాజుతో చెప్పండి. ఒకవేళ మీరు తిరగబడినా, ఇకముందు మునుల సమీపానికి పోయినా మిమ్మల్నందరినీ తుదముట్టించ టానికి సన్నద్ధులమయే వున్నా మని చెప్పండి. ఈ వింధ్యకు దక్షిణాన చాలా విశాలంగా భూమి వుంది. రాక్షసులూ, మునులూ, ఎవరైనా ఇక్కడ ఎవరిమార్గాన వారు నివసించ వచ్చు. భూములు దున్నుకోవచ్చు. పంటలు పండించుకోవచ్చు. పండిన పంటను ఆహారంగా స్వీకరించవచ్చు. అవి చాలకపోతే మీకు అడవి మృగాలు వుండనే వున్నాయి. అంతే కాని యజ్ఞకర్మలు చేసుకునే మునులను తినడానికి దిగజారే బుద్ధి పుట్టగూడదు. వాళ్లను ఇబ్బంది పెడితే మీ గతి అధోగతే! ఊం! మీ రాజుగారి ఆడపడుచుని తీసుకువెళ్లండి. ముక్కు, చెవులు మాత్రమే కోయడం కొంత మేలయినదని గుర్తించండి. ఇకనుండి మునుల జోలికి పోతే ఊరుకునేది లేదు. ఇది నా ఆజ్ఞగా మీ రాజుతో చెప్పండి. ఒప్పుకున్నారా సరే! మీకూ—మాకూ వైరం వుండదు. లేదా మీ అంతుచూస్తాను. ప్రస్తుతం ఈ భూ ప్రాంతానికంతటికీ రాజు భరతుడు. అతని తరపున దశరథుని పుత్రులమైన నేను, మా తమ్ముడు లక్ష్మణుడు ఇక్కడకు

వచ్చాము. భరతుని పరిపాలనలో అందరూ సుఖంగా వుండాలి. మీరు కూడా బ్రతికి బట్టకట్టాలంటే మునుల అగ్నికార్యాలకు అంతరాయం కలుగ కూడదు. ఒక ఆడదాని ముక్కు చెవులు పోయినందుకు భాధపడకండి. తేడా వస్తే మీ సర్వ రాక్షససైన్యం నుసి నుసి అవుతుంది" అన్నాడు. రాముడు అలా అనంగానే దుర్ముఖుడు కోరగా నవ్వుతూ–

"భలేగా అన్నావే! గట్టిగా కొలిస్తే నాలుగు మూరలు లేరు అలాం టిది నిన్ను నీ ధనుస్సుని చూసి మేము నువ్వు గీసిన గీత దాటకుండా నిల వాలా! నిన్నిక ఊరుకుని లాభం లేదు. నిన్ను చంపిగాని మా ఖరుని చూడం." అంటూ ఒక్కసారి రివ్వున స్వామిపై శూలాన్ని విసిరాడు.

విల్లుకి త్రాటిని కూర్చడం, బాణాన్ని తొడగడం, వదలడం. దాని ధాటికి శూలం విరగడం ఒక్కసారిగా జరిగాయి. ఎప్పుడు రాముడు ఈ పని చేశాడో అసలిది జరిగిందా అని అందరికీ అనిపించిది. అప్పుడు శ్రీరాముడు రక్కసుల చెవులు దిమ్మెక్కి పోయేటట్లు దనుష్ఠంకారము చేసి-

## రాముని యుద్ధ విలాసం

"నేనొక్కణ్ణే అనుకుంటున్నారేమో! ఈ జగమంతా నేనే కనపడ తాను మీకు. రండి చూద్దాం! మీ అందరూ కట్టకట్టుకు వచ్చినా మట్టుపెట్ట డానికి ఒక్క నిమిషం కూడా పట్టదు. ఇపుడైనా వినండి దురాత్ములారా! నా మాటవిని వెనుతిరిగి మీ రాజుతో నే చెప్పిన విషయం చెప్పండి" అనం గానే 14 మంది నాయకులు ఉగ్రులై ఒక్కొక్కరు పది పది శూలాలు, పది పది పరిఘులు. పది పది పట్టిసములు, పది పది చక్రాలు రాముని మీదకు ఒక్కుమ్మడిగా ప్రయోగించారు. వాళ్ల ప్రయోగించిన మొత్తం 560 ఆయు ధాలనూ లిప్తలో 100వ వంతు వ్యవధిలో ముక్కలు చేసి "ఊఁ! ఇప్పు

దైనా చెప్పండి! అంటూ నాతో పోరు అంత మంచిది కాదని వెంటనే వెళ్లి చెప్పండి. ఇంక ఆలస్యం చేశారా ఆ ఆయుధాల గతే మీకూ పడ్తుంది. మీ రాజు ఒప్పుకున్నాడా సరే! లేకపోతే అప్పుడే రండి. మీ మొత్తం సైన్యంతో. ఇప్పటికి మిమ్మల్ని ప్రాణాలతో వదిలివేస్తున్నాను. అన్నాడు. అప్పుడు ఆ సేనా నాయకులు లోపల కొంచెం బెరుకు వహించినా పైకి మాత్రం దర్పంగా "నువ్వు ఓ పది శూలాలు ముక్కలు చేసినంత మాత్రాన భయపడి మా రాజుతో చెప్పుకోవలసిన పనిలేదు. చూడు నిన్నేం చేస్తానో" అంటూ నిశితమైన, మహోగ్రములైన మహాయుధాలను కొన్ని వందలు రాముని మీదకు గుప్పించారు. రామునికి విపరీతమైన కోపం వచ్చింది. గ్రీష్మాదిత్యుని పటు ప్రతాపముతో, తీక్షణమైన నిశిత శర పరంపరలతో ఆ ఆయుధాలన్నిటిని తుత్తునియలు చేసి, గాఢమైన అంచులు మెరుస్తున్న నిశిత మైన 14 బాణాలు ఎక్కుపెట్టి, ఆకర్ణాంతం లాగి దీనితో మీ అందరి పని సరి అని వదిలాడు. 14 బాణాలు 14 మంది గుండెల్లోంచి దూసుకు పోయాయి. గుండెల్లోంచి రక్తం పెల్లుబికి చిచ్చుబుడ్డిల్లోంచి వెలుగు రవ్వల్లా చిమ్మింది అందరూ ఒక్కసారీ అబ్బా! అని పెద్ద కేక పెట్టి మరు నిమిషం లోనే ప్రాణాలు విడిచారు. వాళ్లు పెట్టిన ఆ కేకలు విని నేలమీద వారి శవాలను చూసి శూర్పణఖగుండెలు బాదుకుంటూ పెడబొబ్బలు పర్వతాల్లోంచి ప్రతిధ్వనిస్తుండగా వెళ్లిపోయింది. ఆశ్రమ వాతావరణం వానకురిసి వెలిసినట్లయింది.

పెద్ద భేరి మ్రోగినట్లువస్తున్న ధ్వని వైపుగా ఖరుడు చూస్తే గుండెలు బాదుకుంటూ కంటికీ, మంటికీ ఏకధారగా కన్నీరు కారుస్తూ పెడ బొబ్బలు పెడుతూ వస్తున్న శూర్పణఖ కనబడింది. దాని రూపం మహా ఘోరంగా వుంది. గడచిన రాత్రి పిడుగుపడి సగం మాడిపోయి నిస్తేజంగా మిగిలిపోయిన మద్ది చెట్టులా వుంది. గుంట గట్టులో మట్టలు ఎండి పోయి చుట్టూ చేరిన నీళ్లకు మాగిపోయినచిన్న ఈత చెట్టులా వుంది. ఎడా పెడాగా

అటొచ్చే గాలులకు, ఇటొచ్చే గాలులకు వంగిలేస్తూ వున్న వెదురు పొద లాగా వుంది. ఖరుడు అప్పగారిని ఆ స్థితిలో చూసి "పోనీ ఆ ఒంటిమీద గాయాలకు ఏవైనా వనమూలికలు వెదకి మాన్చుకోలేక పోయావా! అయినా ఏడుస్తావేంటి? అవతల వాళ్లమీద పగకలిగితే వాళ్లమీద ప్రతీకారం తీర్చు కొని అటుపైన బాధపడాలి గాని ! ఏం! నీవెంట 14 మందిని పంపించానుగా. వాళ్లు నీ వెనుక రాలేదా ఏమిటి" అని అన్నాకూడా శూర్పణఖ ఏడుపు మానలేదు. అప్పుడు ఖరుడు మళ్లీ-

"నీ వెంట పిడుగుల్లాంటి 14 మంది వీరుల్ని పంపాను. ఇంకా నీకు దుఃఖం దేనికే! లే! ఏడి దుర్ముఖుడు? మన శత్రువులు ముగ్గురూ చచ్చారా! లేకపోతే ఆకలితో నోరు తెరుచుకొని పోతున్న సింహం పైకి దూకి ఎడం చేత్తో దాని జూలుని లాగటానికి ప్రయత్నిస్తాడా! ఈ పధ్నా లుగు మంది ఎలాంటి వారనుకున్నాడో? ఈ మనుష్యుల చావు చిత్రంగా వుంటుంది. ఇక్కడ మన చేతుల్లో చస్తారు. ఏదో దేవతలతో మొరపెట్టు కోవడం కోసమా అన్నట్లు తిన్నగా అలా స్వర్గానికి వెళ్తారు. ఆ దేవతలు మన బాధ పడలేక వాళ్లు సతమత మవుతూ వుంటే రోలు వెళ్లి మద్దెలతో మొర పెట్టుకున్నట్లు వాళ్లకి వీళ్లు ఒకళ్లు." అన్నాడు. అప్పుడు శూర్పణఖ నెత్తి మోదుకుంటూ-

"ఆహా మనకంత సౌభాగ్యం కూడానా? నన్ను మాత్రం మిగి ల్చాడు. నా పని కూడా చావు తప్పి కన్ను లొట్టయినట్లయింది. బాణాలకు మనవాళ్ల ఆయుధాలన్నీ కాక మనవాళ్లు దిక్కులేని చావు చచ్చారు. ఆ స్థితిలో వాళ్లను చూస్తే నా గుండె తరుక్కుపోయింది. నీతో వచ్చి చెబుదామని వచ్చినా ఏం చెప్పాలో తోచటం లేదు. గుండె అంతా ఖాళీ అయిపోయి నట్లయింది." అంది. ఖరుడు మళ్లీ మళ్లీ అడిగాడు. అసలేం జరిగిందే? చెప్పు

చెప్పు! అని రెట్టిస్తే శూర్పణఖ మళ్ళీ మళ్ళీ అదే సంగతి చెప్పింది. దానితో ఖరుడికి ముందు ఆశ్చర్యము తర్వాత దుఃఖము చివరకు కోపము కలిగాయి.

"ఎవరో మనుష్య జాతట! ఒక ఆడ మనిషి ఇద్దరు మగవాళ్ల ఈ అడవికి వచ్చారట! పంచవటీ ప్రాంతంలో ఉంటున్నారట! వాళ్లని చంపటానికి శూర్పణఖ వెళితే వాళ్లు దాని ముక్కు, చెవులు తరిగేశారట. దాంతో దాని తమ్ముడు ఖరుడు, వార్తామంత్రి ఐన దుర్ముఖుడితో సహా 14 మంది సేనా నాయకుల్ని వాళ్ల మీదికి పంపితే అందరూ ఒక్కసారి ఆ ఇద్దరు మగవారిలో ఒకని చేతిలోనే చచ్చారట." అనే వార్త జనస్థానంలో ఆ నోటా ఆ నోటా ప్రాకిపోయింది.

## ఖరుని యుద్ధ సన్నాహం

అత్యవసర పరిస్థితుల్లో యుద్ధ ప్రయత్నాల పిలుపుగా ఖరుడు తన సర్వ మహా సేనాధిపతి ఐన దూషణుడికి, తన అంగరక్షకుడైన త్రిశిరునికి, దూషణుని సేనాపతులైన మహా కపాల స్థూలాక్ష, ప్రమాధులను, ఇంకా మిగిలిన శ్యేనగామి, పృథుగ్రీవుడు. యజ్ఞశత్రుడు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు. కాల కార్ముకుడు, మేఘమాలి, మహా మాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు, అను 12 మందికి కబురు పెట్టాడు. ఖరునితో సహా 18మంది ఈ అత్యవసర సమావేశంలో సభతీర్చి ఉన్నారు. ఖరుడు శూర్పణఖను జరిగిన వృత్తాంతం ఆసాంతం చెప్పమన్నాడు. అప్పుడు శూర్పణఖ—

## శూర్పణఖ చెప్పిన యదార్థ రామాయణం

"ఇప్పుడు నేను ఎలా కనబడుతున్నానో చూస్తున్నారుగా! నా ఈ

వికృత రూపానికి, విపత్కర పరిస్థితికి రామలక్ష్మణులు కారకులు. వాళ్లు అయోధ్యా రాజకుమారులు. దుర్మతులు. వారిపై ప్రతీకారానికై మన ఖరుడు సాయుధులైన చండ ప్రచండులైన 14 మంది సేనా నాయకుల్ని నాతో పంపాడు. పంచవటీ ప్రాంతంలో ఉన్న-వారి పర్ణశాలకు వెళ్ళాము. మన వార్తామంత్రి ఐన దుర్ముఖుడు 'మా ఆడపడుచును ఇలా చేయడం మీకు న్యాయమనే తోచిందా?' అని అడిగాడు. అందుకు వాళ్లు ఒళ్లు పొగరెక్కి 'ఆహా! ముమ్మాటికీ న్యాయమార్గమే అవుతుంది. పొండి!' అని రెచ్చగొట్టారు. అప్పుడు మన దుర్ముఖుడు ఉగ్రుడయ్యాడు. ఐతే మీ ఖర్మ' 'మీ చేత్తో మీ ముప్పు మీరే తెచ్చుకుంటున్నారు' అని అంటూ వడిగా ఒక శూలాన్ని విసిరాడు. రాముడు దాన్ని ఒకే బాణంతో ముక్కలు చేసి 'పోయి నా మాటగా మీ రాజుతో చెప్పండి. ఈ లోక మంతా నా ఆజ్ఞలోనిది· మునుల రక్షణకు అడ్డువచ్చే దుష్టులందరికీ ఇదే శిక్ష! ఈ ఆజ్ఞ దాటితే చచ్చినట్లే లెక్క!' అని చెప్పమన్నాడు. ఇక నే చెప్పాల్సిందేముంది? ఆ దుర్ముఖుడు! మిగతా సేనానులు ఎదురు తిరిగి చావనే చచ్చారు. కాబట్టి ఇక ప్రాణాలమీద తీపుంటే మీరు, మీ ఖరుడు చేయాల్సింది ఒక్కటే ఉంది! మీరంతా కట్టకట్టుకొని సరాసరి వెళ్లి, ఆ రాముడి కాళ్లమీదపడి, ఒక్కసారి మీ నోళ్లు తెరిచి "ఓ ప్రభూ! జగద్కర్తా మమ్మల్ని మాత్రం చంపకుండా మన్నించు. మీ మునుల జోలికి పోము. నీ పాదాల మీద ఒట్టు." అంటూ ఆయన్ని కాళ్లా వేళ్లా పడి, ఆయన్ని సేవించుకోండి. లేదా మీ ఇష్టం మీది. నన్నడక్కండిక అన్నది. ఆ మాటలు అందరూ విన్నారు. వాళ్లల్లో శ్యేనగామి–

## శ్యేనగావ్యాదుల సలహాలు

"నాలుగు దిగ్గజాల దంతాలనూ ఒక్కసందిట పట్టి, కసితో, కీవితో పటపట లాడించగల గర్వము, తాటకిని చంపిన ఘాటీ, విశ్వామిత్ర

యజ్ఞ విఘ్నకారులు మారీచ సుబాహులను ముప్పతిప్పలు పెట్టి సుబాహుని చంపి మారీచుని సముద్ర మధ్యంలోనికి నెట్టిన ధనుర్విద్యా పరాక్రమము, అజేయమైన త్రినేత్ర కార్ముకాన్ని విరిచి ముక్కలుచేసిన విక్రమము, పరశు రాముడంతటివాని ప్రతిజ్ఞను నేలపై కాళ్లు నిలువనీయకుండా చేసిన నిటలాక్ష తేజుడు- ఐన ఆ రాముని మీదకు ఒక 14 మంది వెళితే ఇంతగాక ఏమవు తుంది? శరభంగ మౌని ఆశ్రమ ప్రాంతాన్ని వదలి వీళ్లు అక్కడా, ఇక్కడా తిరుగుతూ ఈ ప్రాంతానికి వచ్చివుంటారు. ఈ మధ్యలో వీళ్లు ఎక్కడెక్కడ తిరిగిందీ మనవాళ్లకు వార్తలు అందకపోయి వుండచ్చు" అన్నాడు. అప్పుడు త్రిశిరుడు-

"మారీచుణ్ణి సముద్రంలోకి నెట్టేసాడు-అన్న ఒక్క మాటే గొప్పదా! ఆ మిగిలినవి మాత్రం సామాన్య విషయాలా? ఇంక మనం నిర్లక్ష్యం చేసి వాణ్ణి విడిస్తే మన మొత్తం ముఠానే మట్టి తినిపిస్తాడు. మనం వాడి మీదికి పంపిన 14 మంది సేనానులు సామాన్యమైన వారా! మరి వాళ్లందరినీ తానొక్కడే నిమిషంలో నింగికి చేర్చాడంటే ఇది సామాన్య విషయం కాదు. ఇంక వాడి మీదకు నేనో, దూషణుడో లేదా మనందరమో కట్టుగా వెళ్లి వాళ్లను తునా తునకలు చేయాలి. విడిగా ఒక్కొక్కరు వెళ్లితే లాభం లేదు. ఒక్కొక్కరిని వాడి పొట్టకు పెట్టాల్సి వస్తుంది" అన్నాడు అప్పుడు దూషణుడు అందుకుని-

"చిన్నపామునైనా పెద్ద కర్రతో కొట్టాలి. పైగా వాడేమీ చిన్న పాము కాదు. అందుకని మనమంతా కలిసే ఒక్కుమ్మడిగా వాణ్ణి ఎదుర్కోవాలి." అన్నాడు. అప్పుడు ఖరుడు-

## ఖరుని నిర్ణయము

"దుర్ముఖాది సేనా నాయకుల్ని చంపటం, శూర్పణఖని ఇలా

వికృతంగా చేయడం– మన రాక్షస మర్యాదకే గొడ్డలిపెట్టు. దీనికి తగిన గుణపాఠం చెప్పితీరాలనే, ఇక చిన్న చిన్న ప్రయత్నాలతో పని సానుకూల మవదనే మిమ్మల్ని పిలిచింది. ఇది ఏదో చిన్న పని అని అనుకోకండి. వారేదో మన వాళ్లని వధించారన్న దాని కంటే, బక్క మునులందరూ వాణ్ణి తెగపొగిడి పెద్ద మొనగాడుగా మన ముందరే కీర్తించడం ఎక్కువ బాధగా వుంది. చక్కని మృష్టాన్న భోజనాన్ని ఆరగిస్తుంటే పంటి క్రిందకు గులకరాయి వచ్చినట్లు వీడొకడు మనకు అడ్డుగా నిలిచాడు. మహా వీడు పెద్ద మొనగాడన్నట్లు అందరి కంటె అధికుడన్నట్లు ఆ మును లనటం మనకు తలవంపు పని. మా ఐదుగురు అన్నదమ్ములకు ఈమె ఒక్కతే అక్క. మా వంశపు ఒకే ఒక ఆడపడుచు. అలాంటి ఆడపడుచు ముక్కుని చెక్కేస్తే– ముక్కుమీద వేలువేసుకుని, ముక్కు మూసుకు కూర్చోవాలా!" అని అంటుండంగా శూర్పణఖ కల్పించు కొని సభా ముఖంగా ఇలా అంది–

"అబ్బా! నా తమ్ముళ్లకు నేనంటే ఎంత ప్రేమో చెప్పలేను. నేనం తకీ వాళ్లు బాహుబల మంధరులని చెప్పనే చెప్పాను. ఆ మాటలు పట్టించు కుంటేనా! నరులు, వానరులు అంటేనే ఈసడింపు గదా మన వాళ్లకు. వాళ్ల మాటంటేనే మన వాళ్లకు నవ్వు. మనకింత బలం వుండి ఇన్నాళ్లు ఇంత బ్రతుకు బ్రతికి ఆ అల్పులైన నరునిచేతిలోనే భంగపడ్డాముకదా! 14 మంది చస్తేనే గాని మన వాళ్లకు కళ్లు విప్పుకోలా! తెలివి రాలేదు." అని ఈస డింపుగా సహజమైన ద్వేష, అసూయా, ప్రతీకార, ప్రేరేపణ బుద్ధితో రక్కున అని విస విసా నడుచుకుంటూ వెళ్లిపోయింది. అప్పుడు ఖరుడు మహా సేనాధిపతి ఐన తన తమ్ముడు దూషణుణ్ణి పిలిచి సర్వ సైన్యాన్ని బయలు దేర తీయించమని, తన రథాన్ని సిద్ధం చేయించ వలసిందని ఆజ్ఞాపించాడు.

ఆ ప్రభాతవేళ సర్వసైన్యంతో మర, పరిఘ, శూల, ఖడ్గాది అయు

ధాలతో, రకరకాల, వికృత రూపాలు కలిగిన పదాతి బలంతో కృష్ణ పక్ష తిమిరమంతా కరుడుగట్టి ఒక్కచోట చేరిందా అన్నట్లున్నది. విహంగముడు మొదలైన తొమ్మిదిమంది సైన్యాధిపతులు, తొమ్మిదివేల రాక్షసులకు నాయకులుగా ఉండి ప్రధాన సైన్యంగా పోతున్నారు. మహా కపాల, స్థూలాక్ష, ప్రమాదులు మూడు మూడు సహస్ర దళములతో ఆ ప్రధాన సైన్యానికి ఇరువైపులా, వెనుకగా వుండి, సర్వ మహా సేనాధిపతియై దూషణుడు రెండు వేల మంది సేనకు నాయకుడై వీటన్నిటికి ముందుగా మహానేతగా ముందు నడుస్తున్నాడు. త్రిశిరుడు, శ్యేనగామి, పృథు గ్రీవుడు, యజ్ఞ శత్రుడు, ఖరుని రథానికి నాలుగువైపులా రక్షకులుగా నిలుచున్నారు. దైత్య రాజు ఖరుడు కనకమణి, కింకిణీ వినూత్నమైన రథం మీద కూర్చున్నాడు. అందరూ మహా భీకరంగా నినాదాలు చేస్తున్నారు. అవి ఆకాశ వీధికి తగుల్తున్నాయి. దిగంతాలకు పోయి ప్రతిధ్వనిస్తున్నాయి. సూర్యకిరణ పుంజాలలాగ 14 వేల మంది శిరస్త్రాణాలు మెరుస్తూ తళుక్కుమంటున్నాయి 'దైత్యేశ్వరా- జై! శౌర్య శేఖరా- జై! తేజోభర దుర్జయ- జై!' అంటూ సర్వ సైన్యము కదిలింది. అన్న ఖరునితో సమానంగా వెలిగిపోతున్నాడు– తమ్ముడు దూషణుడు. యజ్ఞశత్రుడు, త్రిశిరుడు, శ్యేనగామి, పృథుగ్రీవుడు ఖరుని రథానికి నలువైపులా ఖరములపై ఉండి ముందుకు నడుస్తున్నారు.

మహా ఉధృతంగా రకరకాల ఆయుధాలతో. రక రకాల నినాదాలతో, రక రకాల వికృత రూపాలతో, ఉత్తేజంగా, ఉద్వేగంగా సైన్యం పోతున్న సమయంలో– ఒక్కసారి ఆకాశం మబ్బులు పట్టేసింది. ఉరుములు ఉరిమాయి, తళుక్కు మంటూ మెరుపులు మెరిసాయి. అడవిలోని చెట్లన్నీ ఊగిసలాడి పోయాయి. కొన్ని వంగాయి, కొన్ని వరిగాయి, కొన్ని విరిగాయి. ఒక్కసారి వాతావరణ మంతా మహా భయానకంగా తయారైంది. అంతలోనే కడవలతో కుమ్మరించినట్లు నల్లని కోడెత్రాచు తోకల్లాగా ధారా పాతంగా హృదయాలు గుభిల్లు మనేట్లు వర్షం ముంచెత్తింది. నల్లని

వెలుగులు, నెత్తురురేఖలు, నాగలి విరిసిన గురుసుల చాళలు కనపడ్డాయి. రాహువు కృపారహితుడై సూర్యుణ్ణి కబళించాడు. రాత్రి రాకుండానే, పగలు పూర్తవకుండానే సంధ్యారుణఛ్ఛాయలు పొందాయి. అకాశంలో విద్యుల్లతలు రకరకాలుగా ముగ్గులు పెట్టుకుంటూ పోయినట్లుగా వున్నాయి. ఒక పెద్ద తోక చుక్క పై నుండి క్రిందకు పడింది. ఒక పెద్ద గ్రద్ద రివ్వునవచ్చి తన రెక్కతో ఖరుణ్ణి కొట్టింది. దాన్ని తన బాహుదండంతో ప్రక్కకు తోసి చీదరించుకొని—

"ఎవడో అల్పుడికి, బక్కవాడికి, పిరికివాడికి భయం వేయాలి గాని నా బోటి మొనగాడు ఈ అశుభ శకునాలను పట్టించుకుంటాడా! వెయ్యి సంవత్సరాలుగా వుంటూ ఎన్నో యుద్ధాలు చేసాము. ఇంత వరకు ఏ ఒక్క దాంట్లోను పరాజయమే లేదు. కాని ఈ రోజు ఈ వన గగనాల రెంటికీ మద మెక్కింది, నాపై కక్ష బూనినట్లు నా ప్రయాణ సమయంలో అశుభాలు పలుకుతూ గంగవెర్రు లెత్తుతున్నాయి. ఒక్కసారి కళ్లు చిట్లిస్తే దిక్పాలకులు చెదిరి పోతారు. మనసు కొంచెం మారితే పంచ భూతాలు మన్నించ మంటూ కాళ్లమీద పడతాయి. అలాంటి నాకు ఈ గ్రహాలు, పెను తుఫానులు, భారీ వర్షాలు, నక్కకూతలు పని చేస్తాయా? పదండి ముందుకు!" అంటూ సేనని ఉత్తేజపరిచాడు. సరిగా వేలెడంత ఉంటారో లేదో ఆ రాముడూ, లక్ష్మణుడూ. నా ముందు వాళ్లెంత, ఈ వెర్రి భూతాలు ఎన్ని అశుభాలు పలికితే మాత్రం నాకేం? ఆ యిద్దరినీ కణ కణలాడే, నిప్పులు గ్రక్కే నా కన్నులతో మల మలా మాడ్చి కణికలుగా మార్చేస్తాను. 'పదండి ముందుకు!' అంటున్నాడు. మా అప్పగారు ఎలాంటిది? మహనీయుడైన పౌలస్త్య వంశములో పుట్టినది. అలాంటి దాన్ని అవమాన పరుస్తారా! వారి గుండెల్లోంచి అభిషేక ధారగా రక్తం త్రాగుతాను." అని అంటూ వుండగా మిగతా సైన్యం అంతా గొంతులెత్తి 'ఖరరాజుకుజై' రాక్షస సామ్రాజ్యం

వర్ధిల్లాలి 'దుండగుల దుశ్చర్యలు నశించాలి' 'మానవులు మట్టి కొట్టుకు పోవాలి' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తున్నారు. మంథానగిరి కుదురు తొలగినట్లు, మహానది కట్ట గండి పడినట్లు ఆ మహాసైన్యం ముందుకు నడుస్తోంది. అంతలో ఒక్కసారి వాతావరణం ప్రశాంత మయింది. పంచభూతాల ఉద్వేగం తగ్గిపోయింది. అ ప్రాంతంలోని మునుల ముఖాలనుండి ఒక్కుమ్మడి శాంతి పాఠాలు వినవచ్చాయి. గోబ్రాహ్మణులకు స్వస్తి. సర్వభూతాలకు స్వస్తి. ధర్మాసక్తులకు స్వస్తి. రామలక్ష్మణులకు స్వస్తి. అంటూ వినపడ్డాయి. మళ్లీ వాతావరణం భీకరమయింది. రాక్షస సైన్యం చేసే నినాదాలు ఆకాశానికి అంటుతున్నాయి. ఆమడ దాటి ముందుకు వినబడుతున్నాయి. వినపడుతున్నంత దూరము దుశ్శకునాలు వరుసగా కలిగాయి. జనస్థానం నివాసులకు ఈ అకారణ వాతావరణ ప్రకోపానికి కారణం తెలియక భయపడి పోయారు.

సర్వశాస్త్ర రహస్య పాఠాలను చూసిన రాముడు ఈ ఉత్పాతా లన్నీ చూసాడు. లక్ష్మణునితో–

## రాముని నిర్ణయం

"నా మనస్సులో ఏదో సందేహం కలుగుతోంది. ఇలా జరగడా నికి అంతకూ కారణం శూర్పణఖను విరూపణగా మనం చేయడమే అనిపిస్తుంది. మనము అలా చేసామో లేదో వెంటనే 14 మందిని తీసుకు వచ్చింది చూసావా! సేనాధిపతులైన ఆ 14 మంది ఒక్కసారే చావడం వాళ్లరాజు ఖరుడు ఓర్చుకోలేడు. వాళ్లది ఇంకా ఎంత సైన్యం ఉందో ఊహించలేము. ఎన్నివేలు, లక్షలు ఉండనీ ఒక్క పరివేషణంలో మొత్తం అందరినీ చిత్తు చేస్తాను. నిజంగా ఇది ఆ రాక్షస సైన్యం అక్కంతా ఒ మ్మడిగా రావటానికి తగిన సమయం కూడా కాదు. ఐనా వస్తున్నారంటే

శూర్పణఖ ప్రేరితులై వస్తూ ఐనా వుండాలి- లేదా మళ్లీ ఏ ఋషి వాటికనో ఐనా చుట్టుముట్టడానికైనా అయివుండాలి. ఏమిటో పాపం! ఈ ఋషులకు ఎప్పుడు ఏ ఆపద ముంచుకొస్తుందో తెలియదు కదా! దైత్య సేనంతా ఒక్కసారిగా రావడం కూడా మనకు మంచిదే. ఇక్కడో పదిమందిని, మరో చోట పది మందిని, ఇంకోచోట పదిమందిని చంపినా మాత్రం ఏం ఒరుగుతుంది. దుర్మదులైన ఆ దైత్య మూల బలం సర్వం కూకటి వేళ్లతో పెళ్లగింపబడి చితికిపోవాలి. అప్పుడు గాని నిశ్శేషంగా వారు నాశనమై మునులకు బాధ తొలగదు.

"పదిహేనవ సంవత్సరం వచ్చిన మొదటి రోజే నేను అయోధ్యలో ఉండి తీరాలి. లేకపోతే భరతుడి కిచ్చిన మాట తప్పుతుంది. ఆ భరతుడు అతి తీక్ష్ణుడు, మాట నిక్కచ్చి వాడు. తేడా వస్తే తొందరపడి ప్రాణత్యాగం చేస్తాడు. అందువల్ల ఈ లోపలే, ఈ అడవిలో ఉండే రోజుల్లోనే ఆ రాక్షసులందరినీ చంపి-మునులకు దేవతలకు భయాన్ని తొలగించకుండా అయోధ్యకు పోతే వడ్డీపై వడ్డీతో ఆ దైత్యులందరూ ఈ మునులందరిపై కసి తీర్చుకుంటారు. నేను వారికిచ్చిన మాట వృథా అవుతుంది. అందుకని ఆ రాక్షసులందరూ ఒక్కసారిగా రావడమే మనకు కలసివస్తుంది. ఆ శూర్పణఖ ఖరుడితో నేను 14 మందిని చంపానని చెపుతుంది కాని నేను పలికిన నియమాన్ని. చేసిన కట్టడిని సవ్యంగా చెప్పదు. వాళ్లని మనపైకి ప్రేరేపించే విధంగానే తెలుపుతుంది. అందువల్ల తప్పకుండా అందరూ వస్తారు. అంతమందినీ ఎదుర్కొనడానికి నువ్వో నేనో ఎవరో ఒకరు చాలు! ఐనా నువ్వొక్కడివి వెళ్లితే నా మనస్సు నిలవదు. నువ్వు మహా బాహు ప్రచండుడివే. నీ శక్తి సామర్థ్యాలు నాకు తెలియనివి కావు. ఐనా నిన్ను పంపి నేనుండలేను, దీనికి కారణం నువ్వు చిన్నవాడివి నేను పెద్దవాడిని అవడమే. ఎంత గట్టివాడయినా తల్లిదండ్రులకి గాని అన్నదమ్ములకు గాని పసివాడు పసివాడే! అందుకని నువ్వు సీతను తీసుకొని కొంచెము దూరంగా

అక్కడ కనపడుతున్న గిరిగుహలో ఉండు. దగ్గరగా ఉంటే వాళ్లు చేసే హాహాకారాల గోలను బేల ఐన సీత వినలేదు. ఇలా అన్నాని నీవు మరో మాట చెప్పకుండా వెళ్లు. ఇంకో నిర్ణయం వద్దు. నా మీద ఒట్టు." అన్నాడు. లక్ష్మణునికిక మారు మాట్లాడటానికి అవకాశంలేక అన్నగారి ఆజ్ఞను తు. చ. తప్పకుండా పాటించవలసి వచ్చింది. దూరంగా ఉన్న శైలగుహ ప్రాంతానికి సీతా లక్ష్మణులు చేరారు. అగస్త్య మహర్షి ఇచ్చిన కవచ కార్ముకాలను ధరించి వింటికొప్పున అల్లెత్రాడుబిగించి, రాముడు రాక్షస సైన్య నినాదాలు వస్తున్నదిక్కు కెదురుగా వెళ్లి, ఒక చిన్న పర్వతపు గుట్టకు వెనుక గట్టిగా వున్న శిలాప్రదేశంలో నిలబడి ధనుస్సును కక్ష భాగంలోకి చేర్చి దైత్య సేన రాకకు ఎదురు చూస్తున్నాడు. అప్పుడు అంతరిక్షంలో వున్న దేవతలు, కొందరు మునులు—

"అరెరే! ఇటువైపు రాముడొక్కడు, ఎదురుగా అటువైపు దృఢగాత్రులైన, కర్కశులైన 14 వేల మంది రాక్షసులు. అరెరే! మన మూలాన్ని రామునికెంత కష్టం వచ్చింది? ఇంతదాకా రావడానికి మనమే గదా కారణం. పోనీ! కనీసం ఇటువైపు అన్నదమ్ములిద్దరూ నిలబడ్తా బాగుండేది. కాని అవతల సీత ఒక్కత్తే ఉండాల్సివస్తుంది గదా! ఆమెను రక్షించడానికి ఎవరుంటారు? ఒంటిగా సీత పర్ణశాలలో ఉంటే ఆమె జోలికి పోకుండా వుండేంత ధర్మబుద్ధులు రాక్షసులు కాదు గదా! పోకుండా వుంటారని నమ్మలేం. వాళ్లు ఎలాంటి పనికైనా సంసిద్ధులే. పోనీ ! దేవతలు రాముడికి సహాయ పడితే— అమ్మో! ఆ రావణుడు అలా జరుగనివ్వడే ! ఏమిటో! ఈ రామునికి అనవసరంగా కీడు తెచ్చిపెట్టాము. మనమేదో ఇలా భయపడుతూ ఆదుర్దా పడుతున్నాము కాని ఆ రాముని ముఖంలో బిగువు ఏ మాత్రమూ లేదు. పరమ ప్రశాంతంగానే వున్నాడు. మరి ఈ రాబోయే యుద్ధంలో నిప్పులు క్రక్కబడతాయి. గో బ్రాహ్మణులకు, సర్వభూతాలకు, రామచంద్రునికి స్వస్తి. ఈ వైశ్వానర మార్గానికి స్వస్తి" అంటున్నారు.

# ఘోర సంగ్రామము

ఇంతలో ఋషులు, దేవతలు అలా అంటూనే వున్నారు. సైన్యం కనుచూపు మేరకు రానే వచ్చింది. రాముడు వచ్చే సైన్యం వైపు ఒకసారి చూశాడు. ముందున్న చుప్పనాతి శూర్పణఖ గొంతెత్తి రాముని వైపు చూపిస్తూ 'వాడే!' అంది. ఖరుడు 'ఎవరు వాడు అన్నా? తమ్ముడా?' అన్నాడు శూర్పణఖ 'అబ్బురంగా కనపడే మబ్బుతునక అన్నే' అంది. ఇంత సేనకు ఒంటిగా ఎదురు నిలిచిన రాముని దగ్గరగా రథాన్ని పోనిమ్మన్నాడు. సూతుడు పోనిచ్చాడు మొత్తం సేనంతా రాముని పైకి విజృంభించారు. ఆ రాక్షస సైన్యాన్ని ఒక్కసారిగా చూసిన రామునికి ఒళ్లు మండి, కోపం పెల్లుబికి ఖరుడితో యుద్ధానికి ముందు ఒక్కమాటైనా మాటలాడుట మరిచిపోయి, కళ్లు ఎఱ్ఱబడి వక్షస్థలాన్ని ఎదురుగా ఠీవిగావుంచి ఒక్కసారి ధనుష్టంకారము చేశాడు. ఆ రావం పరుగున వచ్చే సైన్యం చెవుల్లో గింగురుమంది. దిగ్గజాలు ఉడికెత్తి ఘీంకరించాయి. ఇతడు త్రిపురాసుర సంహారి పినాకియే అయివుండాలి. అమృత కలశాన్ని ఎత్తుకువెళ్లే గరుత్మంతుడు అయివుండాలి. హిరణ్యకశిపుణ్ణి పొట్ట చీల్చే నృసింహ ఉగ్రమూర్తి అయివుండాలి. జాజ్వల్యమాన, ఉగ్ర, ధూమ, శిఖాయుక్తుండైన కృశానుడు అయివుండాలి అనిపించింది అందరికి.

అంతలోనే అక్కడ చేరిన మునులకు, భూతాల దేవతలకు పూర్వపు శాంతవదనం రామునిలో కనపడి నమస్కారం చేశారు. అంతలోనే దైత్య సైన్యం కోపాగ్ని జ్వాలలతో రామునిపై నానాయుధాలను గుప్పించారు. ఖరుడు దైత్యసేనా సముద్రమధ్యంలో బడబాగ్నిలాగావున్నాడు. సర్వసైన్యం ఒక్కుమ్మడిగా విసిరిన ముగ్గర, శూల, చటుల, చక్రాయుధాదులు రాముని చుట్టుముట్టాయి. దట్టంగాపట్టిన మంచు మధ్య మార్తాండునిలా రాముడు ఉన్నాడు. మేఘాల వెనుక ఉన్న చంద్రునిలా స్వామి

కనపడలేదు. కాని 'ఖంగు' మని ధ్వనించే అతని వింటి నారి చేసే ధ్వని మాత్రం రాముడక్కడ ఉన్నాడని అనడానికి సాక్ష్యమిస్తోంది. రామునికి-దైత్యులకు మధ్య ఉన్నచోటంతా విరిగిపోయిన, ముక్కలైన, ముఖములు విరిగిన, కుంటుపడిన, తోకలు తెగిన, దైత్యుల అమ్ములు ఆయుధాలు నిండి వున్నాయి. వారు విసిరిన ఆయుధాలన్నీ రాముణ్ణి చేరకుండా మధ్య లోనే ఇలా ముక్కలైపోతున్నాయి. రాముని ఒక్కబాణం వారి వంద వంద ఆయుధాల్ని వ్రయ్యలు చేస్తోంది. దైత్యులు వేగం పెంచారు. రాముడి బాణం అంతకంటె వేగం పెంచింది. పుంఖాలు పుంఖాలుగా శరపరంపరలు రాక్షసుల సర్వాయుధాల్ని ముక్కలు ముక్కలు చేశాయి. వారి రథాలు గుర్రాలు, గాడిదలు, ఏనుగులు రాముని నిశిత బాణాలకు మసి అయిపో యాయి. దంతాలు విరిగి, తొండాలు తెగి, తలకాయలు ఎగిరి కోళ్లు విరి గిన మంచంలా ఏనుగులు, తెగి వ్రేలాడే తలకాయలతో గుర్రాలు, చక్రాలు ఊడి తునాతునకలైన రథాలు, ఆకులు ఊడిన రథ చక్రాలు. రక్తం చిమ్మే దైత్యుల మస్తకాలు, ముక్కలైన ఖడ్గాలు నిండి యుద్ధ భూమంతా కళ్లకు దుర్భరంగా గోచరించింది. ఇంకా రాముడి విల్లు నుండి శర పరంపరలు నోళ్లు తెరిచిన కోడె త్రాచులవలె మీది మీదికి వస్తూ వుండడంతో సర్వ దైత్య సైన్యం బెదిరిపోయి, పారిపోవడానికి ప్రయత్నించింది. అప్పుడు దూష ణుడు వాళ్లకు అడ్డువచ్చి—

## దూషణుని యుద్ధం

"ఓ రాక్షస వీరులారా! ఏమిటిది? అతడు ఒక్కడు. సున్నము లోనికి ఎముక లేకుండా సునాయాసంగా చంపాల్సిందిపోయి పారిపోతున్నారా! మీ అందరూ గుంపుగా చేరి పట్టుకుంటే సరిగా గుప్పెడు కూడా కాడు. మీలో గడితేరిన దృఢకాయులు ఇంతమంది వుండగా అతన్ని ఒక్కణ్ణి

ఏమీ చేయలేక పోయారా! తోటి సోదరులు చస్తూవుంటే మీకేమీ పట్ట లేదా?" అని సైన్యాన్ని మరలించాడు. దూషణుని ఆ మాటలకు సైన్యం సిగ్గు వదలి కోపంతో మళ్లీ రాముణ్ణి ఎదుర్కొంది. మళ్లీ బరిశెలు, బింది వాలాలు, బల్లాలు, ఈటెలు, తోమరాలు, పరిఘలు ముద్గరాలు మొదలైన ఆయుధాలన్నిటినీ రాముని మీదకు విసిరారు. వాటిలో ఒక్కొక్క దానిని మూడు మూడు ముక్కలుగా రాముని బాణాలు విరిచేసాయి. ఉడకబెట్టిన చిలగడ దుంపల్లాగా రాక్షసుల శరీరాలు తయారయ్యాయి. వాళ్ల దంతాలు ఊడి మిగిలిన చిగుళ్లతో మూతులు నిండు ధాన్యపు బస్తాల మూతుల వలె ఉన్నాయి. తుమ్మకంపల గుంపుల్లాగా చచ్చిన రాక్షస గుంపులున్నాయి. మిగిలిన సైన్యానికి ఇంకా ధైర్యం చెబుతున్నాడు దూషణుడు. ఒకడు శూల మొత్తాడు. శూలంతోనే ఆ ఎత్తిన చెయ్యి తెగి క్రిందపడి పోయింది. ఒకడు హాహాకారాలు చేస్తూ రాముని మీదకు పూర్తిగా రాకుండానే తెరచిన నోటితో తల ఆకాశంలోనికి ఎగిరిపోయింది. ఒకడు రెండు చేతులా రెండు ఆయు ధాలు ధరించి రాబోతుంటే క్రింది భాగం తెగి క్రిందపడి రెండు చేతులతో ఉన్న రెండు ఆయుధాలు ఊర్ధ్వభాగం ఆకాశంలో తోరణంలాగా వ్రేలాడింది. ఒకడు ఒక పెద్ద చెట్టును పెకలించుకొని పైకి ఉరకబోతుంటే అది అగ్నికి దగ్ధమై, దాంతోపాటు వాడు దగ్ధమైపోయాడు. రాముడు బాణాలు వేసినది కన్పడటం లేదు. కాని రాక్షస సైన్యానికి ఇన్నిరకాలుగా విచిత్రావస్థలు వస్తున్నాయి. రాముని శర వేగం మరింత పెరిగింది. దైత్యులు ఒక్కసారి విజృంభిం చారు. రాముని శరాలకు దైత్యుల ఆయుధాలు పడగలందు, నడుములందు, విరిగిన పాముల్లాగా క్రింద పడ్డాయి. ముఖము లందు, పార్శ్వాలందు పగిలిన పులుల్లాగా పడ్డాయి. చెవులయందు, పాదాలయందు బడిసిన కుందేళ్ల లాగా వున్నాయి. కణతలకు తగిలి గిట్టలు చీలిన కణుదుల లాగా వున్నాయి. రెక్కలు తెగిన తూనీగలవలె వున్నాయి. రాముని కళ్లల్లో కోపరేఖ తగ్గలేదు. ఒక గాంధర్వ మహాస్త్రాన్ని సైన్యంపై ప్రయోగించాడు. కాళ్లు తెగి, చేతులు

విరిగి, తలలు పగిలి, మెడలు తెగి, ఏ అంగానికి ఆ అంగము వేరై రక్తాన్ని చిమ్ముతూ రాక్షసులు దిక్కులేని చావు చచ్చారు. యుద్ధరంగం నెత్తురు మడుగైంది.

దూషణునికి తనసైన్యమంతా సోదిలోనికిరాకుండా పోవడంతో– కుపితుడై, మిగిలిన 5 వేల సైన్యాన్ని రాముని మీదకు పురికొల్పాడు. ఇది ఖరుని మూల బలం. దూషణునికి ప్రాణబలం. రాక్షసులకు గర్వప్రదం. దేవతలకు అగ్నిహోత్రం. దూషణునికి ఇది 5 వేల అంచులు కల చక్రాయుధం వంటిది. 5 మొనల శూలాయుధం వంటిది. వెన్నెముకైన వజ్రాయుధం వంటిది. ఈ 5 వేల మందిలో 2 వేలు రాముని కెదురుగా, మిగిలిన 3 వేలు మూడు దిక్కులా రాముని క్రమ్మి అడవి చెట్లను ముఖాలకు అడ్డుపెట్టుకొని రాముని చుట్టుముట్టారు. రాముడు గుర్తించాడు. రాముడు గిర్రున తిరుగుతూ తన చుట్టూవున్న రాక్షసుల మీదికి ఒక్కుమ్మడిగా శర పరంపరలను గుప్పించాడు. గాలిలో ఎగిరి కొందరు, అడ్డంగాపడి కొందరు, ముంజి కాయల్లా తలకాయలు ఎగిరే కొందరు, నోరు తెరిచి కొందరు, కాళ్లు విరిగి కొందరు, గోళీలలాగా తలకాయలు కొట్టుకునే కొందరు, ఆకాశంలో గాలి పడగల్లాగా కొందరు- ఎగిరి, విరిగి హతమయ్యారు. ఆ చిత్రాన్ని చూసి దూషణుడు ఆశ్చర్యపోయాడు. మారీచుడు ఎలా బ్రతికాడబ్బా! బహుశా వాడితో ఏదో పనివుండే ప్రాణాలతో వదిలి వుంటాడు" అని దూషణునికి అనిపించింది. ఐనా రోషం తెచ్చుకున్నాడు. ఉన్న 14 వేల సైన్యం నేల మట్టమైనా ఇంక లాభం లేదనే బుద్ధి రాలేదు. ఉగ్రుడై రథాన్ని రాముని పైకి పోనిచ్చాడు. రాముడు మండిపడి 10 బాణాలతో అతని రథాశ్వాలని ఒక బాణంతో పతాకాన్ని, మరో 10 బాణాలతో రథసారథి వక్షాన్ని చీల్చి, మరో 10 బాణాలతో రథ చక్రాల్ని, మిగిలిన భాగాలను విదిల్చి రథంలోని దూషణుడు నేలమీదకు దూకబోతుంటే రెండు బాణాలతో అతని రెండు బాహువుల్ని ఛేదించివేశాడు. తూములోంచి నీరు వచ్చినట్లు అతని మొండా

నికి ఇరువైపులా రక్తంచిమ్మింది. వాణ్ణి అలానేవుండనిచ్చి మెడని మాత్రం త్రుంచలేదు. 'ఎంత బ్రతుకు బతికాడు? చివరకు దూషణుడు ఎలా గొడ్డు చావు చచ్చాడ'ని అనిపించేట్టుగా చేశాడు. అది శవమా అంటే శవము కాదు. ఆ స్థితిలో అతనిని చూసిన మిగిలిన సైన్యాధిపతులు ఐన మహా కపాలుడు మొదలైనవారు రాముని మీదకు అగ్నిలా భగ్గుమన్నారు. రాముడు మహా కపాలునికి కపాల మోక్షం చేయించాడు. శూలాక్షునికి అక్షులు శరాగ్నితో దగ్ధం చేశాడు. ప్రమాదుణ్ణి బాణాలతో అణగదొక్కాడు. ఇందరినీ ఈ స్థితిలో చూసిన ఖరునికి దుఃఖించాలో, కోపించాలో తెలియలేదు. తన 12 మంది సేనా నాయకుల్ని చూసి—

"మరి చూశారుగదా! అవతల రాముడి ప్రతాపం, కాస్త కూడా చెదరడు. మరి మీరేమైనా చేయగలరా" అన్నాడు. అప్పుడు వారు "స్వామీ! చెప్పడందేనికి? నువ్వే చూద్దువుగాని మా ప్రతాపం." అంటూ మహా వేగంతో రాముని మీదకు వెళ్లారు. 12 మంది రాక్షసుల్ని 12 బాణాలతో దగ్గరకు రాకుండానే మధ్యలోనే త్రుంచేశాడు. యుద్ధరంగమంతా రాక్షసుల మృత కళేబరాలతో నిండి వుంది. నక్కలు చుట్టూచేరి అందినంతవరకు తినడం ప్రారంభించాయి. కొన్ని మృత కళేబరాల శిరస్సుల చుట్టూ ఈగలు ముసిరి జుగుప్సాకరంగా వుంది. పై నుంచి ఒక్కసారి శవం దగ్గర వాలిన రాబందులు కొద్దిగాకదులుతూ, మూలుగుతున్న కళేబరాలను చూసి వెనుదిరగటానికి చేసే ప్రయత్నంలో రెక్కల గాలికి వదులుగా వుండి విడిపోడానికి సిద్ధంగా ఉన్న చేతులు, ఊగుతున్న కాళ్ళు శవాల నుండి వేరయ్యాయి. అలా వేరైన చేతినో, కాలినో మూతిన కరచుకొని వెళ్లిపోతున్నాయి రాబందులు. యుద్ధరంగమంతా ఏహ్యంగా, జుగుప్సాకరంగా, భయానకంగా, గగుర్పాటు కలిగించేలా వుంది. ఖరుడు తన 12 సేనా నాయకులు త్రుటి కాలంలోనే అలా అవటం చూసి యుద్ధసన్నద్ధుడయ్యాడు. అప్పుడు త్రిశిరుడు ఖరుణ్ణి ఆపి—

# త్రిశిరుని యుద్ధం

"సేవకుడుండగా ప్రభువు ఈ పని చేయకూడదు. పైగా నీకు సేవకుణ్ణేగాదు. అంగరక్షకుణ్ణి కూడా. నా మీద దయయుంచి నువ్వెళ్లొద్దు. నువ్వెడితే నాకు అంతకంటే పాపం మరోటి వుండదు. నీ కెందుకు ఆ రాముడి సంగతి నాకు వదిలెయ్యి. అతనేం చేస్తున్నాడో మనవాళ్ళు తెలుసుకోలేక పోయారు. అతని ఎత్తు నాకు తెలిసింది. ముందు గుర్రాల్ని, సారథిని చంపి, విల్లుని విరిచి మనవాళ్ళందరినీ విరథుల్ని, వికార్ముకుల్ని చేసి అటుపైన సులువుగా చంపేస్తున్నాడు. మనం గనక వాటిని కాపాడుకుంటూ వాణ్ణి ఎదుర్కొంటే ఏం చేయగలడు. ఏం జరుగుతుందో నువ్వే చూద్దువు గాని. నేనుండగా నీకు భయం దేనికి? నా శక్తి ఏమిటో ఇపుడు చూపించక పోతే ఎందుకు? నన్ను తొందరగా అభిషేకించు" అన్నాడు. ఖరుడికి ఆశ చిగురించి వెంటనే ఒప్పుకొని అతణ్ణి సర్వసైన్యాధ్యక్షునిగా అభిషేకించాడు.

త్రిశిరుడు విల్లంబులు పట్టుకొని, కవచంతొడిగి రథమెక్కి దాశరథి మీదికి క్రోధంతో ఎదుర్కొన్నాడు. చూడ్డానికి ముగ్గురు వస్తున్నట్టుగా వుంది. కాని యుద్ధం చేసేది ఒకడే. ఈ సంగతి గ్రహించడానికి రాముడికి ఎంతో సేపు పట్టలేదు. త్రిశిరుడు ఎప్పటికప్పుడు తన రథాన్ని, సారథిని, విల్లముల్ని కాపాడుకుంటూ రాముని మీదకు బాణవర్షం కురిపించాడు. రాముని పైన, చుట్టు ప్రక్కలా త్రిశిరుడు వేసిన బాణాలు నిండిపోయాయి. పది పది బాణాలతో రాముని పాదాలు, తొడలు, వక్షము. భుజాలు, ముఖముల మీదికిగుప్పించి గుప్పించి ఒక్కపెట్టున ప్రయోగించాడు. మూడు బాణాలు తీసుకొని సూటిగా రాముని ఫాలభాగానికి కొట్టాడు. రాముడు కళ్ళు చిట్లించాడు. కోపం పెరిగింది. "ఆహా! ఇప్పటికి ఒక మొనగాడు వచ్చాడు" అంటూ నవ్వుతూ "నీ ప్రాణాలు నువ్వు రక్షించుకోక నీ ప్రభు భక్తిని వెళ్ళడించావు. భేష్! ఐనా నా బాణం రుచి ఇప్పుడే చూస్తావు" అంటూ బాణాన్ని వదిలాడు.

అది జంఝూ మారుతంలా మాంచి వడిగా త్రిశిరుని విల్లుపట్టిన హస్తానికి కొట్టుకుంది. ధనుస్సు విరిగి నేలమీద పడింది. ఇంకో బాణానికి అతని రథ సారధి చచ్చాడు. రథకేతనం విరిగి క్రిందపడింది. ఇంక రథంలో ఉంటే ఏమవుతుందోనని త్రిశిరుడు రథంమీంచి క్రిందికిదూకాడు. అప్పుడు శ్రీరాముడు—

"నిన్ను రథంమీద వుండగానే చంపాలా, క్రిందకు దూకినతర్వాత చంపాలా? అని ఆలోచనలో కొంత ఆలస్యం అయింది. ఏదైనా మీ వాళ్లందరూ పోయిన త్రోవనే నిన్నూ పంపుతాను" అన్నాడు. రాముడలా అన్నందుకు త్రిశిరుడు ఉగ్రుడయ్యాడు. పళ్లు పటపటా కొరికాడు. ఒక గుహతో వున్న పెద్ద పర్వతం నడుచుకుంటూ వస్తోందా అన్నట్లు తెరిచిన నోరుతో రాముని శిరస్సు మీదకు ఉరికాడు. రాముడేం చేశాడో తెలియదు కాని ఆ రక్కసి దేహము ముక్కలు ముక్కలై చెదిరిపోయింది. రాముడు అమ్ములు పట్టిన వేళకు తగిలిన దెబ్బలను ఊదుకుంటూ, నుదుర్ని మణిబంధంతో అద్దుకున్నాడు. ఇంతసేపటి నుంచి యుద్ధం చేస్తుంటే రాముడిలా చేయడం ఇదే మొదటిసారి.

## ఖరునితో యుద్ధం

ఖరుడు రాముణ్ణి చూశాడు. తనవైపు తానొక్కడూ మిగిలాడు. మొదటి నుంచీ అటువైపు రాముడొక్కడే నిలబడ్డాడు. దీన్ని సహించలేక పోయాడు. ప్రతీకార వాంఛ ప్రబలమైంది. పళ్ళు పట పటా కొరుకుతూ గర్జిస్తూ ఎడమ చేతిలో బాణం పట్టి, కుడి చేతిలో శస్త్రాలను పట్టి మహా మేరువులా రాముని ముందర నిలబడి "14 వేల మందిని పొట్టన పెట్టుకున్నాడు, రాక్షస సామ్రాజ్యానికే ప్రళయం వచ్చినట్లు చేశాడు. ఆ శివుడికి మేము చేసిన ద్రోహం ఎమిటి? ఇలా జరగటానికి కారణం ఏమిటి ? ఇంక

ఊరుకుని లాభం లేదు. అందరి ఆత్మలకు శాంతి కలగాలంటే ఇదొక్కటే ఉపాయం" అంటూ తన కుడి చేతిలోని శస్త్రాన్ని ఎడమచేత పట్టిన విల్లుకు సంధించాడు. అంతలో శ్రీరాముడు భూగోళం దద్దరిల్లేలా ధనుష్టంకారం చేశాడు. ఆ మహా రావానికి కుడిచేయి సడలింది. ఒక్కసారి తగిన సమాధానం చెబుదామనే ఉద్దేశంతో తాను ప్రతిగా ధనుష్టంకారం చేశాడు. ఈ రెండు రావాలు కలిసి, వుయ్ వుయ్ వుయ్ మని శబ్దాలు పుట్టి గుడిలో కొట్టిన గంటలా శబ్దాలు వినపడ్డాయి. ఖరుడి రథం రాముని దిశగా వెళ్లింది. ఇద్దరూ కుల పర్వతాల్లా ఢీ కొన్నారు. ఖరుడు వదిలిన బాణాల్ని రాముడు తుత్తునియలు చేస్తున్నాడు. రాముడి బాణాల్ని ఖరుడు ఆకాశంలోనే మటుమాయం చేస్తున్నాడు. ఎవరు ఎవర్ని జయిస్తారో చెప్పనలవి కాకుండావుంది. ఇద్దరూ ప్రళయాగ్ని జ్వాలల్లా మండిపోతున్నారు. ఖరుడు మహా ఉగ్రుడై క్రోధాగ్ని ప్రజ్వరిల్లగా ఏ మాత్రం సందు లేకుండా వెయ్యి మార్గాలలో రాముని మీదకు శరాలను కుప్పించాడు. అవి రాముని బాణాలను ముక్కలు చేయడమే కాకుండా రాముని శరీరాన్ని తూట్లు చేసి రక్తం చిమ్ముతున్నాయి. పై నుండి చూస్తున్న సకల దేవతలు భయ, విషాదాలతో దృశ్యాన్ని చూడలేక— "అయ్యో! ఒకటి జరగాలంటే ఒకటి జరుగుతోంది. ఏమవుతుందో ఏమో! ఇంతకూ రాముడు మాట దక్కిస్తాడో లేదో" అంటూ బాధపడ్డారు. రాముడు ఖరుణ్ణి చూసి "అబ్బా! ఇప్పటికి ధనుర్విద్యలో రెండడుగులు ముందుకు వేసిన వాణ్ణి చూసాను, అయితే నీకింకా మా కైకేయి తల్లి నేర్పిన ఈ ధనుర్విద్య రహస్యాలు నీకు తెలియవు. ఇదుగో చూడు అంటూ నవ్వుతూ 'నీ శరీరం మీద ఒకేసారి శిశిరము, వసంతము అటు పైన గ్రీష్మము వర్తించేట్లు చేస్తాను' అంటూ వాడియైన బాణాల్ని ఖరుని శరీరం పైకి ప్రయోగించాడు. శిశిరంలో ఆకులు రాలినట్లు ఖరుని శరీర చర్మం వూడింది. చెవులు తెగి క్రింద పడ్డాయి. వసంతంలో ఎఱ్ఱ చిగురు చిగురించినట్లు, ఊడిన చర్మం క్రింద ఎర్రటి రక్తం చిగు

రించింది. గ్రీష్మంలో వేడిలా ఖరుని శరీరం భగభగ్గా మండిపోయింది. రథ పతాకం ఊడి క్రింద పడింది. గుర్రాల మెడలు తెగి వ్రేలాడాయి. సారధి రథం నుంచి క్రింద పడ్డాడు. రాముడు ఒకే ఒక శరంతో ఖరుని వక్షానికి సూటిగా కొట్టాడు. ఖరునికి ఉన్నవన్నీ పోయి ఒక గద మాత్రం మిగిలింది. దాన్ని పుచ్చుకొని రాముని మీదకు లంఘించాడు. దానవులకు పట్టిన దీన ఈస్థితిని చూసి పైనున్న దేవతలకు సంతోషం పెల్లుబికింది. మునుల ముఖపద్మాలు వికసించాయి. అప్పుడు శ్రీరాముడు ఖరుని గదను ముక్కలు ముక్కలు చేసి—

"ఒరేయ్! ఒక జన్మలో పాపం చేసినవాడు మరుజన్మలోనే ప్రతిఫలం అనుభవిస్తున్నాడు. దీనిని ఏ యుగంలోను, కల్పంలోను కూడా తప్పించుకున్నవాడు లేడు' అలాంటిది వెయ్యి సంవత్సరాల పెట్టు చేసిన మీ పాపం పండి, మీ పంట మీకు దక్కదా! జన స్థానంలో తపస్సు చేసే మునుల తలలు మీ కోరలతో కొరికినట్లు లేదూ? వాళ్ల యజ్ఞాలను ధ్వంసం చేసినట్లు లేదూ? ఆడా, మగా భేదం లేకుండా ఒంటరిగా కనబడితే తుంటరి పనులు చేసి తుదముట్టిస్తారా! పాపం మీకు నర మాంసం రుచి. ఏం చేస్తాం ఇక్కడ అది లేదు. చుట్టూ మీ రాక్షస శవాలే వున్నాయి. వాటిల్నే తినండి. ఇంతకు పూర్వం ఏ కంఠంతో మును లందరి మాంసంను తిన్న- నీ కంఠాన్ని కత్తిరించి నీ చేతనే కక్కిస్తా. ఈ భరతుడు పరిపాలించే భూమిలో అన్యాయానికి, అధర్మానికి చోటు లేదు. దీనికి ఏ దైత్యులు అడ్డు పడ్డా ఇలాగే వాళ్ల కంఠాలను కోసేస్తాను. బ్రతికినన్నాళ్లు యముణ్ణి బాధపెట్టారు గదా! చచ్చిన తర్వాత నరకంలో మీ గతి ఎలా వుంటుందో ఊహించుకోండి. బ్రతికి ఉన్నపుడు తెలివి అప్పుడే మీ అక్కరకు రాదు. చచ్చినట్లు పెట్టే భాధలన్నీ భరించాల్సిందే! ఇంక నిర్విఘ్నంగా మునుల జప, తపస్సులు సాగవలసిందే!" అన్నాడు. అప్పుడు ఖరుడు "అహా! ఓ పది మంది అల్పులను పట్టుకొని చంపి

అదేదో పెద్ద ఘనకార్యం చేసినట్లు చెప్పుకుంటున్నావు. ఇదంతా నీ ప్రయోజకత్వంగా ప్రకటించు కుంటున్నావు. తన్ను తాను పొగడుకోవడం కంటే బావిలో ఉరిగి చావడం మేలు. నీ బోటిగాడు మాట్లాడే పరుష వాక్యాలు వినాల్సిన పనిలేదు. ఇప్పటిదాకా యమునిలా మా వాళ్ల మీదికి విజృంభించావు. నా దగ్గరకు వచ్చేసరికి చల్ల పడ్డావేం? నా ముందే నా వాళ్లందరూ చచ్చారు. నేనూ చస్తానో బ్రతుకుతానో అది వేరే సంగతి. కాని, నువ్వింత శ్రమ పడితే నీతో వచ్చిన నీ సీతకు చీమ కుట్టినట్లయినా లేదే! ఐనా ఆ సంగతి నాకు దేనికి? రావాల్సి వుంటే చావు అదే వస్తుంది. ఎందుకు వృధా మాటలు. విల్లు ఎత్తుకో! నాకు మిగిలిందీ లేదూ, నా మీద నాకు ఏ కోర్కె లేదు. వున్నదల్లా నిన్ను గూర్చి నీ సఖి పైన నీ అనురాగాన్ని గూర్చి." అంటూ ఒక వికృత సంభాషణ చేసి ఒక పెద్ద సాల వృక్షాన్ని పెరికి రాముని మీదకు వచ్చాడు. రాముడు ఒకే బాణంతో ఆ వృక్షాన్ని, దాన్ని బట్టిన ఖరుణ్ణి నేల కూల్చాడు.

## యుద్ధానంతర ప్రశాంతము

సేనా నాయకులైన ఖరదూషణ త్రిశిరులతో సహా మొత్తం పదునాలుగు వేలమందిని రాము డొక్కడే సంహరించాడు. ఒక్కసారి ఎదురుగా ముక్కలయి పడివున్న రాక్షస శరీరాలను రాముడు చూశాడు. కుడి చెక్కిలిపై కుడి అరచేతిని ఆన్చి అలాచూస్తూ మౌనంగా వుండిపోయాడు. ఎంత సేపటికి ఏ విధమైన ధ్వని వినిపించ పోయే సరికి సీతాలక్ష్మణులు గుహవద్ద నుండి రాముని దగ్గరకు వచ్చారు. "ఏమిటి రాముడు అలా దీనంగా మౌనంగా ఉన్నాడే?" అంది సీత. అందుకు లక్ష్మణుడు—

ఎవరిని వధించిన తర్వాత అయినా యీ విధంగానే విషాదచ్ఛాయ

అన్నగారి ముఖంలో పొడసూపుతుంది. ఆయన 'ఆత్మ మర్యాదుడు' [తనలోని జీవుడు మరియొక తోటి జీవుని చంపుతున్నప్పుడు యిలా కలగటంలో ఆశ్చర్యమేముంది? అందులోను తన సృష్టినే తాను అలా చెయ్యడం మరీ విచారాన్ని కలుగ జేస్తుంది కదా! అని భావము]" అని స్వామిని ఉద్దేశించి కృతాంజలియై- "ఇంక పర్ణశాలకు పోదామా?" అన్నాడు. (యుద్ధానంతరం లక్ష్మణుడు రాముణ్ణి పలకరించడం ఇదే!) ముగ్గురూ పర్ణశాల వద్దకు పోయారు. రాక్షసులందరూ సంహరించ బడినందులకు ఆటవికులు ఆనందంతో రాముని దర్శించి, రామునికి తగిలిన గాయాలకు మందులు మాకులతో పరిచర్యచేసి వదలి వెళ్లలేక, వెళ్లలేక రాముణ్ణి చూస్తూ వెళ్లిపోయారు.

"ఇంత ఘోరయుద్ధం జరిగింది. అంత మందికి - రాముడు ఒక్కడే ఎదురునిల్చి అందర్ని సంహరించాడు కదా! మరి అంత ఘన కార్యం చేసినందుకు రాముణ్ణి యీ లక్ష్మణుడు ప్రశంసించడేం? ఆ అన్నకూడ యుద్ధం గురించి ఒక్కమాట కూడా చెప్పకోడు. యిదేమి చిత్రమో! అయితే యీ యిద్దరికి ఆ సంహారం అంటే అంత తేలికేమో!" అని సీత తనలో తాను అనుకుంది. పైకి ఏమీ మాట్లాడలేదు.

మరునాడు గోదావరీ స్నానానంతరం కమండలాలు ధరించిన సర్వఋషులు నిర్భీతిగా సంధ్యావందన తర్పణాలు చేస్తూ రాముని చూస్తూ– "ఇంతవరకు మేము వేదం చదువుకున్నామేగాని ఆ వేదం శరీరం దాల్చి రావటం యివాళే చూశాము. "ధర్మాలు గుణాలుగా మారి శరీరంతో దిగివచ్చాయా" అన్నట్లుంది నిన్ను చూస్తూంటే. నీ యోగ్యతను మేమెక్కడా చూడలేదు. నీ బలం ఎక్కడ ఎలా వుపయోగ పడాలో అక్కడ అలా ఉపయోగపడింది. ఔచిత్యంతో కూడిన బలం అంటే అదే! రోజూ ఉషస్సూక్తం చదువుకుంటూ సంతోషించేవాళ్ళం.

ఇవాళ అదే సమయంలో నిన్ను చూస్తూ వుంటే ఆ సూక్తం ప్రత్యక్ష మైనట్లు వుంది. మా వాక్కుకు శుక్లపక్షము వచ్చింది." (వాఙ్నియమముగల మాకు నిన్ను చూడగానే నియమోల్లంఘనం జరిగి వాక్కులు శుక్లపక్షం లోని వెన్నెల్లా వెల్లివిరుస్తున్నాయి అని అర్థం.) అని సర్వ ఋషులూ ఖర దూషణాదులకు తర్పణాలు చేసి వెళ్లిపోయారు. కమ్మని వాసనగల తొలి ఈత ఆవు నేతితోడి హోమధూమాలతో, సామగాన వీణారావాలతో ముని లోక పుణ్యాశ్రమాలన్నీ మలయమారుత వీచికల మధ్య మహదానందంతో నిండిపోయాయి.

## అకంపన ప్రేరణ

జన స్థానం అంతా రాక్షస స్త్రీల కంఠ ధ్వనులతో, రోదనాలతో నిండిపోయింది. రాబందుల రెక్కల చప్పుడు జనస్థానవాస రాక్షసులకు విషమ భావిఫలాన్ని సూచిస్తోంది. శత్రువులు ఎవరన్నా వచ్చి స్త్రీ బాల వృద్ధుల్ని కూడా సంహరిస్తారేమోనన్న భయంతో జనస్థానంలోని వారందరు సగానికి పైగా ఖాళీచేసి పోయారు. శూర్పణఖ కనబడక పోవడంతో 'ఇది కూడా చచ్చిందా ఏమిటి ఖర్మ, అనుకున్నారు. కదల గలిగిన వారందరు జనస్థానాన్ని వదలి ఎక్కడకో పోయారు, కొందరు ముసలి రాక్షసులు మాత్రం మిగిలారు. "ఈ జరిగిన సంగతిని రావణునికి ఎలా చెప్పాలా?' అని శంకిస్తూ వాళ్లు చివరకు 'ఎలాగో అలా చెప్పవలసిందే. లేకపోతే మన మీద నెపం వుంటుంది.' అని నిశ్చయించుకొని యిందుకు తగిన వాడు 'అకంపనుడు' అని నిర్ణయించారు. ఇంతలో ఒకడు లేచి– "ఈ పదునాలుగు వేల మంది ఇలా అయ్యారు కదా! యిక మరి ఆ రావణుడు ఈ వార్త విని ఏం చేస్తాడో ఏమో? ఎదురుపడి యుద్ధం చేయడం కంటే పక్షుల్ని పట్టే విధంగా ఏదో మాయోపాయంతో వల పన్నాలి." అంటూ అకంపనుని

వైపు తిరిగి– "రావణుడు స్త్రీ లోలుడు. దీన్ని ఉపయోగించుకొని విషయం మెల్లగా బయట పెట్టాలి. అందుకని వాడిలో కామాన్ని రేకెత్తించి ఆ విషయంతో జోడిస్తూ ఈ యుద్ధం విషయం, ఇంతమంది చచ్చిన విషయం చెప్పడం మంచిది. లేకపోతే కోపిష్ఠి రావణుడు మనలను ఏమైనా చెయ్య గలడు." అన్నాడు.

అకంపనుడు రావణుని దగ్గరకు వెళ్లాడు. జరిగిన కథంతా చెప్పాడు. రావణుడు భగ్గుమన్నాడు. అకంపనుడు భయంతో ఒణికిపోతూ "స్వామీ! నన్ను మాత్రం రక్షించు, ఏమీ చెయ్యవద్దు. మీ పాదాలు పట్టుకుంటాను" అన్నాడు. రావణుడు అంకపనుణ్ణి చూసి "ఖరుడంతటి మహాబలుణ్ణి చంపిన వాడెవడు? కులపర్వతం లాంటి ఖరుణ్ణి, చక్రవాళ పర్వతంలాంటి నా పరిరక్షణను లెక్క చేయకుండా చంపి మృత్యువాత పడబోయే ఆ మూర్ఖుడెవరు? మన మాట వింటేనే వైశ్వానరుడంతటి వాడికి గుండె పగులుతుందే! అలాంటది గోటితో కులపర్వతాల్నే మింగుదామనుకున్న వీడెవడు?" అన్నాడు. అప్పుడు అకంపనుడు- "ప్రభూ! అయోధ్యారాజు అయిన దశరథుని కొడుకు ఆ రాముడు. వాడు ముహూర్త కాలంలో ఖరదూషణాదు లతో సహా పదునాలుగు వేలమంది సైన్యాన్ని సంహరించాడు." అని అనం గానే రావణుడు వెంటనే అందుకొని "ఒరేయ్! ఒక్కటి చెప్పు, ఆ ఇంద్రుడు ఏమన్నా రామునికి సహాయం చేసాడా? లేకపోతే అంతమంది బలశాలుల్ని తానొక్కడు ఎలా చంపాడురా? నిజం చెప్పు?" అన్నాడు. అందుకు అకంపనుడు–

## అకంపనుని సమయస్ఫూర్తి

"స్వామీ! ఈ విషయంలో మాత్రం నా మాట వినాలి తమరు. ఆ వీరుడు మామూలువాడు కాడు. ఎంత సైన్యాన్నైనా కాటు వేయగల రెండు

సర్పాల్లాంటి బాహువులు కలవాడు. అజేయుడు. అలాంటి వాడి మీదకు మీరు వెళ్లకూడదు. వెళితే నా మీద ఒట్టే! వాడు వేసేవి అమ్ములు కాదు. వాడికి అమ్ములు తగలవు. ఒకవేళ తగిలినా అవి పని చేయవు. కార్తవీర్యార్జునుణ్ణి చంపిన పరశురాముణ్ణి, ఆయన పరశువును చలిమిడి ముద్దలా చేసినవాడు. కనుక మీరు వెళ్లవద్దని నా మనవి. మరణాతీతులు కూడా ఉంటారేమో సృష్టిలో! ఆ సృష్టికర్త ప్రత్యేకముగా ఇలాంటి వాళ్లని సృష్టిస్తాడేమో! అలాంటి సృష్టిని చూడాలంటే ఆ రాముణ్ణి చూడాలి. అతని ప్రక్కన వున్న అతని భార్యను చూడాలి అంతే! ఆ రాముని ప్రాణ రహస్యం అతని భార్యేనని నా అనుమానం. ఆమె–ప్రాణం అతడు-ప్రాణి మాత్రమే! ఆ ప్రాణాన్ని అపహరించు, ఆ పైన ప్రాణి ఏమౌతాడో చూడు! సకలసృష్టిలోని సర్వ సౌందర్యం రూపుకట్టిన మగువ సీత. ఔచిత్యం అంటే ఆ సీతను చూసి నేర్చుకొని ఆ తరువాత కావ్యపఠనం చేయాలి. ఆవిడ చూపుల్లో నుండి వేయి మన్మథులు ఉదయిస్తూ వుంటారు. ఆవిడ చేత అలా చూడబడి, చూడబడే ఆ రాముడు అలా తయారయ్యాడు. లేకపోతే వాడికి ఆ రూపమేది? [నిర్గుణుడు గుణమయుడయినాడని అనుకోకుండానే అతని నోటి వెంట వచ్చింది.] వేదములు వాటిమీద, ఉపనిషత్తులు, వాటిమీద వేదసారం యొక్క ఆనందమైన అనుభూతి వుంది— కొత్త చిగురులాంటి ఆమె పాదముల గోటి కాంతిలో ఆమె నిజంగా ఆనంద కారణభూతురాలు". అంటూ ఒళ్లు మరచి చెప్పకు పోయాడు. రావణుని మనస్సుకు భయం, మోహం ఒక్కసారిగా క్రమ్మాయి. "పర స్త్రీ విషయం చెప్తాడేమి వీడు" అంటూ ఫకాలున నవ్వాడు. నవ్వి వాణ్ణి పొమ్మన్నాడు. ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

కంచర గాడిదలు పూన్చిన రథం మీద ఆకాశ మార్గంలో రావణుడు బయలుదేరాడు. సూర్యుడు భూమిని వెతుక్కుంటూ వచ్చినట్లు రావణుడు మారీచుని దగ్గరకు వచ్చాడు. మారీచుడు స్వాగతం పలికి

భక్ష్యభోజ్యాదులతో సుష్టుగా భోజనం పెట్టాడు. భోజనానంతరం మారీచుడు "దానవ చక్రవర్తులు నా బోటి పేదల యింటికి వచ్చారంటే — ఊరికే వస్తారా ? ఏదో తగిన కారణం వుండే ఉంటుంది. సెలవివ్వండి" అన్నాడు. అందుకు రావణుడు—

"మన జన్మస్థానంలోని సర్వ సైన్యాన్ని ఖరదూషణాదులతో సహా వనవాసియైన రాముడు సంహరించాడట! అతని భార్య జనకరాజ సుతయైన సీతాదేవిని అపహరించాలి. పద." అన్నాడు.

## మారీచుని హితబోధ

మారీచుడు నివ్వెరపోయి 'సీతను అపహరించమని ఎవడురా చెప్పింది నీకు? మెడమీద తల వుండాలనేనా? అన్నం తిని బ్రతకాలని వుందా? దానవ సామ్రాజ్యలక్ష్మికి క్షేమమేనా? లంకాపురీ పురంధ్రీమణుల సౌభాగ్యానికి క్షేమమే గదా! వారి పసుపు, కుంకుమ, కస్తూరి, కాటుక మొదలయిన అలంకరణ ద్రవ్యాదులకు భద్రమేనా? ఆ దేవేంద్రుడేమీ – ప్రచండ పరాక్రమ వహ్ని రూపంలో మనలంకను తుదముట్టించడానికి ఈ రాముణ్ణి పంపలేదు కదా? దైత్యులకింక మంచి రోజులు అయిపోవచ్చాయేమో యీ భూమ్మీద! ఎదురుగా నిలబడి పరమేశ్వరుని మూడవ నేత్రం తెరవడం లాంటిదియీ ప్రయత్నం. చిగురుతొడిగి, పెరిగి పెద్దదయి, పువ్వులు పూసి, పిందెలు, కాయలతో పరిపక్వ స్థితిలోనికి వచ్చి ఫలాలను ఇవ్వబోయే స్థితిలో శాఖా సంపన్నంగా వున్న యీ దైత్య సామ్రాజ్యమనే వృక్షాన్ని ఆ రాముని అస్త్రాగ్నికి గురికావించి మూలచ్ఛేదానికి పూనుకోకు– నీకు పుణ్యం వుంటుంది. నీ పుట్టెకు ఈ బుద్ధి పుట్టించినవాడు దైత్య సామ్రాజ్య వృక్షానికి అంటువ్యాధి పురుగై వుండాలి. ఇంతటితో ఆపి ఇక లంకకు వెళ్లవయ్యా ! ఎందుకొచ్చిన పని ఇది.'' అని మొహం వాచేటట్లు చివాట్లు పెట్టాడు. ఏమనుకొన్నాడో ఏమో. రావణుడు చేతిలోని పద్మాన్ని అక్కడే వదిలేసి ముంగిలా వెళ్లిపోయాడు.

## శూర్పణఖ పగ

తన కన్నుల ఎదుటనే ప్రళయకాల పర్జన్య గర్జనల్లాంటి రాముని ధనుష్టంకారానికి, యముని పాశం లాంటి అతని వింటి నారికి, ఖరదూష ణాది రాక్షసులు బలియైపోయిన దృశ్యం శూర్పణఖకు మనస్సులో ఒక్కసారిగా గోచరించింది. "పదునాలుగువేల మందితో యుద్ధం చేసినా ఏ క్షణములో కూడా కొద్దిగా ఐనా చలించలేదు, అలసట చెందలేదు - ఆదేమి చిత్రమో! ఆనాడు జానకిని భయపెట్టటానికి వెళ్లబోతున్నట్లు ఎలా తెలుసుకున్నాడో ఏమో! ప్రాణాలను స్పృశించినట్టు బాధపడి ఎదుర్కొన్నాడు. ఆనాడు ఆ రాముని ప్రక్కనున్న సీత ముఖంలో ఎంత గర్వము పొడసూపిందనీ!" అని అనుకుంది. "రాముడు, అతని పరాక్రమం గుర్తుకు వచ్చినపుడు కామం, సీత గుర్తుకు వచ్చినపుడు అసూయ, పగ మనస్సున నింపాయి. రాముణ్ణి లొంగదీయాలంటే సీతకు ద్రోహం జరిగి తీరాల్సిందే! అయితే రాముని ఎది రించి ఈ పని చేయటం ఒట్టిమాట. రాముని అస్త్రవిద్య ముందు ఎంత బలవంతుడైతే మాత్రమేం ఖరుడు నిలబడి గలిగాడా? నిజంగా ఈ రాక్ష సులు మూర్ఖులు. 'తీవ్రమైన తపస్సు చేసి ఈ విధంగా, ఈ వేళ ఇలాంటి వారిచేత చావు రాకూడదు' అని కోరతారు. అడిగినవన్నీ చెల్లుబాటు అవు తున్నట్లుగానే వుండి వారి చావుకుగూడా చిన్న సందు వుంటుందని తెలుసు కోలేరు. చావు తప్పనప్పుడు ఇలాంటి ఎన్ని వరాలు పొందితే మాత్రమేమి? అంతకంటే మహిమాన్వితమైన అస్త్రాలు పొందటమే నయం కదా! ఎవరు ఎలాంటివారైనా రావణుడు యీ పోయిన వాళ్లందరి కంటే చాల నయం. అసలు మొదట్లోనే వాళ్లబదులు రావణుణ్ణి ఉసిగొల్పి వుండాల్సింది. స్పర్థకి తగినవాడు. ఆ రామునికి తగ్గవాడు. నేనంటే కొంత భయం కూడా వున్న వాడు. ఎవరితో ఎలా చెప్పాలో అలా చెప్పాలి. రావణునితో చెప్పటానికి ఒక మార్గం ఉంది. రావణునిలో కొంత అల్ప లక్షణం వుంది. కాముకుడు. జానకి సౌందర్యం ముందు ఆ అప్సరసలు ఎందుకుపనికివస్తారు! సీత తలకు

కన్నుల మిలమిలల్లో ఎంతోమంది అప్సరసలు. మన్మథులు పుట్టి పోతూ వుంటారు. ఈ సంగతి చెప్తే రావణుడు ఉండగలడా ? ఊరుకోగలడా ? వెళ్తే సాధించకుండా రాగలడా? సీతను అపహరించి ఆ రాముణ్ణి మూడు చెఱువుల నీళ్లు త్రాగించకుండా వుండగలడా? చచ్చినట్లు ఆ సీతకోసం వెతుక్కుంటూ రాముడు రాకుండా వుండగలడా? అయితే సీతా వియోగ సముద్ర తరంగాలను తెప్పలుగట్టి దాట ప్రయత్నిస్తాడా? ఏమిటో యింకా రాముడంటే ఎందుకో యీ వెధవ జాలి నాకు. ఏమైనా రామునికి సీతా వియోగాన్ని కల్పించడమే తెలివైన పని. ఈ పని మూలచ్ఛేదంగా వుంది. సీతకై రావణుని కన్ను పడేలా చెయ్యాలి." అని నిశ్చయించుకుంది. అదే సమయంలో మారీచుని వద్ద చివాట్లు తినగా ముఖం వ్రేలాడ వేసుకొని వస్తున్న రావణుడు కనపడు. దగ్గరయ్యాడు. శూర్పణఖను చూచి "ఏమిటి సంగతి అన్నాడు. ఆశ్చర్యము, కోపము, శోకము వ్యక్తపరుస్తూ—

## శూర్పణఖ వాక్చాతురత

"నీకేం మహారాజువి. నీ చలవ వల్ల అవతల ఖరదూషణాదులు చచ్చారు కదా! పినతల్లి పుత్రుడంటే ప్రేమ వుంటే వుండవచ్చు, లేకపోనూ వచ్చు. కానీ నీకు యుద్ధంలో అండదండలుగా. కుడిభుజంగా వున్నవాడు గదా! అలాంటి ఖరుడు పోయాడే– నీకు చీమ కుట్టినట్లయినా లేదే! హాయిగా వున్నావు. నీకు ఎంత కాపుగా వున్నాడో నీకు తెలియదా? నువ్వంటే వాళ్లకు ఎంత నమ్మకం? నీకు మాత్రం ఏమీ పట్టదు. నువ్వు అంతవాడివి, యింతవాడివి అని చెప్పకుని కూడని సాహసాలు చెయ్యడం మాకు, భుజకీర్తులు నీకు అలవాటయింది. ఇంతేగా నీ బ్రతుకు, నీ తెలివి తేటలూనూ. కిరీటం దాల్చి ఉత్సవ విగ్రహంలా సింహాసనంలో ఠీవిగాకూర్చోవడంలో ఈ ముల్లోకాల్లోను మనతో ఇంకొకరు సాటి వున్నారా? అవడానికి రావణుని అప్ప గారిని కాని నా బ్రతుకు ఎలా తయారయిందో చూడు. చెక్క బొమ్మని

చెక్కినట్టు చెక్కారు నన్ను. నా ముఖం చూస్తే నీ బ్రతుకు, దర్జా బయట పడుతుంది." అని వెక్కి వెక్కి ఏడుస్తూ "ఇంకా నాకు ఒక తమ్ముడున్నాడని చెప్పుకోడం మానెయ్యాలి. నేను ఇంతవరకు చూసింది ఒకడే మగాణ్ణి! రాము డొక్కడే ఆ మగాడు. ఈ భూమ్మీద కులము, మర్యాద, బంధుప్రేమ నీకు లేవంటే నేను దుఃఖపడి ప్రయోజనం లేదు. ఆ సంగతి వదిలెయ్యి. కనీసం నీ బ్రతుకన్నా నీవు చూసుకోవాలి కదా! ఒక పని చెయ్యి. ఈ సము ద్రము అవతల వున్న జనస్థానం చాయలకు పోబోకు. తలక్రింద త్రాచు చేతికి అందే సామీప్యం అంతే! ఇలా చూస్తూనే వుండు. ఏమౌతుందో చూడు. ఆ పాము ఏప్పుడో ఏదో కన్నంలోంచి వచ్చి నిన్ను కాటు వెయ్యక మానదు. నీ సామంతపు నేల అనుకుంటున్నావేమో ఆ జనస్థానం కాస్తా ఆ రామునికి వశం అయిందని తెలియదు గావును. ఋషులకు సహాయం చేస్తున్నట్లే చేస్తూ, రాక్షస సంహారము చేసుకుంటూ నీ ఈ లంకా రాజ్యాన్ని కూడా చేరి నిన్ను సామంత రాజు క్రింద కడతాడు. కప్పం కట్టమంటాడు. జాగ్రత్త యుద్ధమో, జయమో, అపజయమో, మర్యాద పోవడమో, పాడో అవన్నీ ఆడదాన్ని నాకెందుకు! సాటి ఆడది ఆ జానకిని చూడంగానే జాలితో చస్తున్నాను. పరమ రమణీయ శృంగారభావసుధాలహరి, హేలామధుర కుల్య- అంత సౌందర్యము, సౌకుమార్యము గల ఆ సీతకు అలాంటివాడా భర్త? అమృత కలశం దగ్గర బొద్దింకలాగా రాముడు సీత ప్రక్కన బికా రిగా, బైరాగిలా వున్నాడు. చాదస్తుడయిన ఆ బ్రహ్మ పనే యిది. ఏం జంట! ఏం కలయిక! ఏం దాంపత్యము! తలచుకుంటేనే ఒళ్లు కంపరం పుడుతోంది. అప్సరసలంటూ మురిసి పోయావు. రంభా, తిలోత్తమ, మేనక - వీళ్ల ముఖాలు ఆ జానకి కాలిగోటికి సరితూగగలవా? ఆ బికారి రాముని ప్రక్కన సీతను నువ్వు చూడాలి. నాకు కల్గిన పరాభవం సంగతి అటుంచు. దాన్ని గురించి అడగను. ఆ సీతకు రాముని చెరవదలించు. అదొక్కటే నే కోరేది. అదే నాక్కావలసింది. సోమయాజులకు నెయ్యి ఖర్చు తప్ప అప్సరసలు దక్కకుండా చేశావు గదా! మరి యీ బైరాగి నుండి ఆ సుకుమారి సీతను

కూడా రక్షించు. ఆమె సౌందర్యం ఎలాంటిదో తెలుసా? మన తాతమ్మగారి (సరస్వతీదేవి) సౌందర్య మెరుగుదువా! ఎంతో ఆలోచించి కష్టపడితేగాని తెలియదు. (వాక్కు యొక్క రూపం, దాని పుట్టుపూర్వోత్తరాలు ఎంతో జాగ్రత్తగాఆలోచిస్తే కాని అందదు) పోనీ పరమప్రపితామహి ఆ పార్వతి సౌందర్య మెరుగుదువా? ఎంతో ధ్యాననిష్ఠకు గాని ఆమె సౌందర్యం సౌందర్యమని తెలియడం కష్టం. (అంటే మనస్సు నశించినతర్వాత-గాని అనగా ధ్యానసమాధి స్థితిలో గాని లాభం లేదని అర్థం.) కాని సీత సౌందర్యం అలాంటిది కాదు సంగీతం లాంటిది. ఆమె సౌందర్యం ఆపాతమధురము. వర్షఋతువు ప్రారంభంలో విద్యుల్లతలు వుంటాయి చూడు. అవన్నీ చలించకుండా నిశ్చలంగా వుంటే ఎలా వుంటుందో సీత అలా వుంటుంది. మోహము, ఆనందములకు మధ్యగా వుండేటట్లుచేసిన రూపం ఆ సీతది." అని కనుకొలకుల వద్దనున్న కన్నీటి బిందువులను గోటితో ప్రక్కకు నెట్టి రావణుడికి వినబడీ వినబడనట్లు కొంచెం ఓరగా తిరిగి- "ముక్కూ చెవులు కోశాడు ఆ దురాత్ముడు, కాని, ఆ చేసేది నా కళ్లు రెంటినీ పొడిచేస్తే ఈ వెధవ రావణాసురుణ్ణి చూడకుండా పోయేది." అని నసిగింది. రావణుడు చలించాడు. "సరే రాముడెవరు? లక్ష్మణుడెవరు? సీత ఎవరు? అసలు ఎవరా ముగ్గురు? అంతా సవివరంగా చెప్పు" అన్నాడు. అందుకు శూర్పణఖ-

"నీ కున్న కోపానికి, గర్వానికి, వా కథ మొదట నీకు ఆసక్తిని కల్గించక పోవచ్చు. అంత చెప్పినా కొయ్యల్లే కూర్చున్నావు. అయినా అడిగావు కాబట్టి మళ్లీ చెప్తున్నా విను. ఆ రామ లక్ష్మణులు దశరథుని కొడుకులు, అయోధ్యాపుర వాసులు, ధర్మపరులు, కోదండం ధరించిన పరమేశ్వరులు. ఆ రాముని భార్య సీత విదేహరాజు పుత్రి. ఆ సోదరులిద్దరూ ఒకళ్లను మించిన భయంకరులు ఒకళ్లు. వారి ధనుష్టంకార ధ్వని దిగ్గజాలు తొండాలెత్తి ఒక్కసారిగా ఘీంకరించినట్టుగా వుంటుంది. వారి వింటికి ఎదురు నిలవడం మృత్యు దేవతకు ఎదురు నిలవడమే! చూస్తూ చూస్తూ నిన్ను

వారితో యుద్ధం చేసి సీతను సంపాదించమని చెప్పను. తెలీకుండా వెతక డానిక్కూడా వీలు లేని విధంగా ఆ సీతను ఎత్తుకు వచ్చేయ్. దాంతో ఆ రాముడు ఏం తోచక చస్తాడు. ఆ లక్ష్మణుడు భాతృవాక్య పరిపాలకుడు గాబట్టి అన్నగారితోబాటే చస్తాడు. పీడ విరగడవుతుంది. అంతే! ఇక చూడు సీత నీది. సీత లంకలో వుంటే వేరే దీపం పెట్టనక్కరలేదు. నిజానికి చంద్రుని ఆవశ్యకత కూడా వుండదు. ఒక్క సీత నీ మేడలో ఉంటే వేరే రత్నాలు, వైడూర్యాలు అవసరం లేదు. అదీ సంగతి మరి" అంది. రావణుడంతా శ్రద్ధగా విన్నాడు. మనస్సులోనే ఒక నిర్ణయానికి వచ్చి "ఒరేయ్ తమ్ముడూ! ఇది చెయ్యరా, అని అనాల్సినదానివి అలా అంటున్నావేం? నువ్వనుకున్నట్లు చేతులు చచ్చిలేను నేను." అంటూ లేచి "ప్రస్తుతం దండనీతి కార్యాను కూలం కాదు, సామదానాల కసలే ప్రసక్తి లేదు. భేదోపాయ మొక్కటే ప్రస్తుత కర్తవ్యం. నువ్వు రాజనీతి అనే విత్తనాలు వేశావు. పంట కొస్తాయిలే ముందు." అంటూ బయల్దేరాడు.

## రావణుని నిర్ణయము

చుప్పనాతి శూర్పణఖ ప్రేరణతో రావణుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. రథ సారథిని పిల్చి, చూడ్డానికి భయంకరంగా వుండి అతి వేగంగా పోగలిగే పిశాచాకారాల్లాగాకనపడే గాడిదల రథాన్నిసిద్ధంచేయించి రథంలోకి దూకాడు. పది తలల కుండలాలు ఒక్కసారిగా కదిలాయి. సముద్రంలో పడ్డ ఇరవై చందమామల ప్రతిబింబాల్లాగా కుండల కాంతులు తళుక్కుమన్నాయి. విద్య-అవిద్య, శౌర్యము-భీరుత, ధైర్యమూ-భయము, ఉదాత్తత-మాత్సర్యము మొదలయిన అన్ని లక్షణాలతో రావణుని మనస్సు కలగాపులగంగా వుంది. ధర్మాధర్మ సమ్మిశ్రమూర్తిగా ఉన్నాడు. సముద్రం లోపలినుండి, సముద్రం మీద, ఆకాశంలోను, అన్నిటిలోను యీ రథం వెళ్ళగలది; తూర్పు

దిక్కున కోయిల కూస్తే, పడమర దిక్కున కూసినట్లు వుంది. ఆకాశంలో నక్షత్రాలు వివిధ వృక్షాలకు విరిసిన పువ్వుల్లాగా కనపడుతున్నాయి. ఇలా భ్రాంతిలోపడ్డ కాముకుడైన రావణునికి దూరంగా వున్న కొండల్లోంచి పడే జలపాతాలు స్త్రీమొుల కట్టుకున్న తెల్లని నూలు వస్త్రాల్లా తోస్తున్నాయి. చూలింతరాళ్లైన పక్షులు వేవిళ్ళ వలన వగరు వగరుగా వున్న ఆకుల్ని తిని ఉమ్మేస్తున్నాయి. ముసలి లేళ్ల నోటిపూతకు నేరేడు పళ్ళ వగరు నీళ్ల పుక్కిట పడుతున్నాయి. తొండలు చీమల్ని తినడం వలన కసరెక్కిన తమనోళ్లను లవంగీ లతలను కొరికి శుభ్రపరచుకుంటున్నాయి. నాగకన్యలు మంచి గాలు లను ఆస్వాదించి వదులుతున్నాయి. 'శరీరంలో వసించటానికి వసంత ఋతువు వచ్చింది.' అని కోకిల కూతవేసి పిలుస్తోంది. కాని ఎందుకో రావణునికి భయం వేసింది. మనస్సు వికలం అయింది. ఎప్పుడూ రాని, తోచని ఊహలు వస్తూ రాకూడని దుశ్శకునాలు అవుతున్నాయి. మంచి సౌం దర్యం గల యక్ష స్త్రీలు కనపడ్డారు. రథ వేగానికి ఆకాశంలో గాలికి పాపట తీసినట్లయింది. పూర్వం ఒకప్పుడు గరుత్మంతుడు ఆహారం స్వీకరించడానికి ఏ చెట్టు కొమ్మమీదకు వాలి-ఆ చెట్టుకొమ్మ నాశ్రయించినవాలఖిల్యాది ఋషి పుంగవులకు హాని ఏ మాత్రం గూడా కలగకుండా, కొమ్మ విరగకుండా తన ముక్కుతో అడ్డుపెట్టి కాపాడాడో - ఆ చెట్టు దగ్గరకు రావణుడు వచ్చాడు. అటువంటి పుణ్య చరిత్ర కలిగిన చెట్టు సమీపించినప్పటికీ, రావణుని బుద్ధి మారలేదు. ఆ చెట్టు సమీపములోనే మారీచుడు వెనుకటి రాక్షసత్వం వదలి ఆశ్రమం వేసుకొని వున్నాడు. మారీచుణ్ణి సమీపించి మరల తన మనో రథాన్ని తీర్చుకునేందుకు సహాయం కోరదలిచాడు. రావణుణ్ణి చూడగానే మారీచుడు కళ్లు పెద్దవి చేసి చూసి "రాక్షసనాయకా! రా!" అంటూ సకల మర్యాదలు చేసి "సురారీ! ఏమయిందయ్యా? ఇప్పుడే కదా వచ్చి వెళ్లింది. 'ఇంతలోనే ఏమయింది ? లంకా రాజ్యంలో వింతేమీ పుట్టలేదు కదా ? " అన్నాడు. బిగించిన పది ముఖాల్లోను పది లిప్తల పాటు రావణునిలో మౌన

భావం తొంగి చూసింది. అయినా వెంటనే ఒక వికృత హాసం చేసి "నిశ్చయమైపోయింది. సీతాపహరణం జరక్క తప్పదు. ఆ రాముని సీతా విరహంతో కోరలు తీసిన పాము అవకా తప్పదు." అని రావణుడు అనంగానే మారీచుడు 'వీడికి ఉన్న పది తలకాయల్లోను ఏ ఒక్కదానికైనా మంచి ఊహ రాకూడదా?' అని అనుకొని "ఏమిటేమిటి" నేను సరిగ్గా వినలేదే ! మళ్లీ చెప్పు" అనంగానే రావణుడు—

"ఆ! ఏమిటీ? వినపడలేదా? వినలేదా? నీవు ఏదో ఊహిస్తున్నావు. నీ ఊహలు నాకు తెలియనివి కావులే ! అయినా విను. రామునికి దేహంలో సగం, ప్రాణ సర్వస్వం అయిన సీత లేదూ- ఆ పడతిని తెస్తాను. ఈ సీతాపహరణం జరిగితే రాముని ప్రాణం పోయినట్లే! నాకు వాడు చేసిన అపకారానికి ఆమాత్రం చేయదగదా! చెప్పు నీవే ! (అడక్కుండానే తను చేయబోయే పనికి సంజాయిషీచెప్పడం, ఆ చేయబోయేపనిలో కొంత లొసుగు గాని దుష్టత్వముగాని ఉంటుందని తెలియజేస్తుంది.) ఒక్కడు ఇద్దరు కాదు మొత్తం ఖరదూషణ త్రిశిరులతో సహా పదునాలుగువేల సైన్యం నాశనం అయింది. అలాంటప్పుడు వాడికి ఇంకా మన మహా వీరులను బలి ఇస్తామా? ఏదో తేలికైన ఇలాంటిదేదో చెయ్యాలి గాని. ఇప్పటికి పదమూడు ఏండ్లుగా వాడు దండకంలో తిరుగుతున్నాడు. మనవాళ్లు కూడా అక్కడే కదా నివాసం. వట్టి పుణ్యానికి అమాయకులైన మనవారిని ఏనాడైనా వాడు పొట్టన పెట్టుకోవచ్చు. వాడికి ఏ విధంగానూ నష్టం కలగడంలేదు. నష్టమయిందల్లా మనకేనని స్పష్ట మవుతోంది. ఈ పదనాల్గవ ఏడన్నా మరి ఏదన్నా గట్టి చర్య తీసుకోవద్దా ? చూస్తూవుంటే మేస్తూపోయింది," అన్నట్లవుతుంది. మరి ఆ రామునికి అపకారం చెయ్యకుండా చూస్తూ పూరుకుంటామా ? పోనీ అదల్లావుంచు— ఒక ఆడదాన్ని దిక్కులేని స్థితిలో చూసి, ముక్కూ, చెవులూ చెక్కి పంపించారంటే ఆ మొగాళ్ల బుద్ధిగాని, ధర్మత్వం గాని ఏమంటావు? కామమా ? క్రోధమా ? మోహమా?

మదమా ? లోభమా ? వీటిలో ఏదంటావు ? ఎన్నో జన్మల్లో చేసిన పాపం కూడ గట్టుకుంటే గాని ఇలాంటి వూహ వారికి కలుగదు తెలుసా! దీనిక్కారణం కామక్రోధాలు అనుకోను. మరి ఏమీ ఉపయోగం లేందే లోభ మేమిటి ? రాగం లేనిదే మోహమేమిటి ? అందుచేత అవి కారణా లని అసలే అనుకోను. మరైతే వాళ్లెందుకు చేసినట్లు ఈ పని ? నువ్వేదో వాడి తరఫున వకాల్తా పుచ్చుకున్నట్లు మాట్లాడుతున్నావు గదా చెప్పు. పోనీ నేనిలా అంటున్నానంటే నాకు భయమా ? నువ్వు చెప్పు నా సంగతి· పూజలో నా తలకాయల్ని ఒక్కొక్కటే కోసి శివుడి కర్పిస్తున్నపుడు నాకు తల తెగిపోతోందేనన్న బాధ, భయం వుందంటే-నువ్వు నమ్ముతావా? సరే! వీడూ, వీడి వంశం పుట్టుపూర్వోత్తరాల గురించి చెప్తా విను. వీళ్ల వంశంలోనివాడే సగరుడు. వాడు తన కొడుకైన అసమంజసుణ్ణి ఇంట్లోంచి వెళ్లగొట్టాడు. వీళ్ల వంశంలో ఇది మామూలే! ఇలా తండ్రి చేత కొడుకు బహిష్కరింప బడడం వాళ్ల వంశంలో కొత్తేంగాదు. ఆ వంశ లక్షణమే అంత! ఈ సూర్య వంశీయులు జితేంద్రియులు, స్వకుల హీనులు, స్వదేశదూషితులు, కొయ్యలు- కొంపలూ వదిలి చెట్లు- చేమలు పట్టే నిష్క్రియులు. (అనుకోకుండా అవసాన దశలో రావణుని నోటమ్మట దేవుడైన రాముని పరంగా నిష్క్రియుడని వచ్చింది.) పైకి సూదుల్లా కన్పడతారు. ప్రజల్ని వేల రకాలుగా చిత్రహింసలు పెడతారు. వీడు బ్రతికుండగా అసురజాతికి ఇంక క్షేమం ఉండదు. నాబోటి వాడుండగా ఇంకొకడు వీణ్ణి ఎదిరించడం తగదు. దీనికేం చేయాలో నేనే చూడాలి. ఇల్లాంటప్పుడు మంత్రివైన నీతో పని వుంటుంది. శౌర్యానికి శౌర్యం, ధైర్యానికి ధైర్యం. మాయా కార్యజ్ఞతకు మాయా కార్యజ్ఞతలలో నీకు నీవే సాటి. యజ్ఞాలు చెడగొట్ట మంటే నీలాగా తగల బెట్టిందెవరు చెప్పు?ఆ సీతకు లేడి పిల్లలంటే ఇష్టమని తెలిసింది. పాపం! అంత దయార్ద్ర హృదయం గలది ఆ సీత. [రావణుడిలా అనంగానే మారీచుడు "ఆహా ! ఇదా

సంగతి. వీడి యీ స్త్రీ వ్యామోహమా – దీనికి కారణం" అని అనుకున్నాడు. రావణుడు చెప్తూనే వున్నాడు.] అల్లాంటి అమృత హృదయ, సుకుమార స్వభావయైన సీతకు ఆ గర్భ దరిద్రుడు, రాతి బొమ్మలాంటి రాముడు భర్తా? నన్నడిగితే వాడికి పెళ్లి పెటాకులు అనవసరం. ఆ సీత జాలిపడి చేసుకుందేమోనని నా అనుమానం. నువ్వు ఒక పని చెయ్యి. రంగు రంగుల బంగారులేడి శరీరం గలిగి ఆ సీత వుంటున్న ఆశ్రమం దగ్గఱ ఆమెకు కనబడుతూ, తిరుగుతూ వుండు. ఆ రంగులు, ఆ సొంపులు, ఆ ఆకర్షణల సంగతి నీవే చూసుకో. చేప పిల్లకు ఈత నేర్పాలా? సరే! నువ్వు అలా కన్పిస్తూ ఊరిస్తూ, వుంటావు, నిన్నలా చూసిన సీత రాముణ్ణి తెచ్చిపెట్టమని కోరుతుంది. ఆ రాముడు తన ప్రియురాలి మాటను దాటలేని వాడుగదా! వెంటనే విల్లు పుచ్చుకొని నీ వెంట పడ్తాడు. నీవు వనమంతా త్రిప్పుతూ దూరంగా పోతావు. ఎంతకూ రాక పోయేసరికి తమ్ముడు అన్నకోసం బయలు దేరుతాడు. సీత ఒంటరిగా వుంటుంది. ఇక ఆ పైన ఆమెను మనం ఎత్తుకొస్తాం. ఇంక ఆ సీతా వియోగంతో రాముని అవస్థ చూడు –ఎలా ఉంటుందో? ఏం? లేకపోతే ఖరుడు తనకేం చేసాడు. పోనీ నా వల్ల ఏమైనా కష్టపడ్డాడా? నష్టపడ్డాడా అలా ప్రవర్తించినందుకు అకారణ విరోధం పెట్టుకున్న ఆ మతిహీనుడ్ని కలానే అవ్వాలి. ఏమంటావు?" అన్నాడు.

రావణుడలా చెప్పుకు పోతూంటే మారీచునకు ఏడ్పు వచ్చింది. రావణునికి పతనకాలం ఆసన్న మైందనుకున్నాడు. "నీకు కోపం రాదంటే నేనొక మాట చెప్తాను, వెనక నీకు నాపై కోపం వచ్చింది చూడూ– అప్పట్ణుంచి నేను వీరశైవదీక్ష మానేశాను. ఏదో నీబోటి సాహసులు, ఉగ్ర మూర్తులు, నిష్ఠా గరిష్ఠులు శైవదీక్షకు సమర్థులేమోగాని అలసులు, శరీర దుర్బలులు, అయిన మాబోటి వారు ఆ ఉమామహేశ్వర జ్ఞానమూర్తిలో దృష్టి నిలపగలమా! 'శివోఽహం' అనుకోడం ఎంత కష్టం! దయావార్నిధి

ఆ విష్ణువునే ఆరాధిస్తున్నాను. కైవల్య సాధనకు నామ మాత్ర స్మరణచాలు. ఇది మా బోటి వారికి సులభ మార్గం" అన్నాడు. రావణుడు వెంటనే అందుకుని—

"వైష్ణవుడవైతే నాకేం? పాషండుడవైతే నాకేం? నువ్వెలా తగలడ్డా నా కనవసరం. జ్ఞానం ఎలాగా వద్దంటున్నావు. ఇంక భక్తి మాత్రం దేనికి? వట్టినమ్మకం చాలదూ? 'విశ్వాసం చాలదా' అనే మతంలో జేరు. అవునూ, నేను చెప్పిన విషయం విన్నావా? చెవి కెక్కిందా? లేక నీ క్రొత్త మతంలో ఎదుటివాడి మాట వినకూడదు అనేంతవరకు వచ్చిందా? ఇదుగో మళ్లీ చెప్తున్నా విను.

"అపకార బుద్ధి ఐన ఆ రాముణ్ణి ఊరుకోకూడదు. వాడి భార్యను తెస్తాను. అంతే! ఇదే వాడి అపకారానికి ప్రత్యపకారం నువ్వికి బంగారు లేడిలా వెళ్లి ఆమెను మోహపెట్టు చాలు. ఆ పైన నేను చూసు కుంటాను. ఏం? ఈసారన్నా చెప్పింది విన్నావా?" అన్నాడు, మారీ చుడు వినమ్రుడై "ప్రభూ! వినకుండా ఉండటమా? అదెలా సాధ్యం? ఒక పెద్ద కొండ శిఖరం పెద్ద పిడుగులా మీద పడ్తూంటే వినపడకుండా కనపడకుండా ఎలా ఉంటుంది? ఆ కొండ బ్రద్దలవు తూంటే ఇష్టం లేక కళ్లూ, చెవులూ మూసుకుంటే మాత్రం వెలుగు, వేడి, ధ్వని సోకదా? ఈ శరీరాన్ని ధరించినందుకు, పుట్టినందుకు ఇల్లాంటివన్నీ నేను చూడకా, వినకా తప్పదు. నీవు సీతను తీసుకొని వెళ్తావు. లంకలో భద్రంగా దాస్తావు. అంతటితో అయిందా (అంటే 'అగ్నిని చెట్టు తొర్రలో భద్రంగా పెట్టడంతో ఆయినట్లేనా' అని అర్థం) అన్నాడు. వెంటనే రావణుడు అందుకొని—

"అంతకాక మరేమౌతుందేమి? నువ్వు అనవసరంగా భయపడి, అనుమానంతో ఏవేవో వెధవ ఆలోచనలు చేయక. ఒక వేళ వాడు విల్లు లోంచి బాణాలు క్రుమ్మి ప్రాణాలు తీస్తాడంటావా? సముద్రాలు దాటి ఆ

బాణాలు మనలను మ్రింగుతాయా? అసలు మన లంకను జేరుతా యంటావా? వాడు సముద్రాన్ని ఈది వస్తాడంటావా? బుద్ధి బలం గూడా లేని దరిద్రుడు ఈ భూమ్మీద నాడొక్కడేనా విల్లు పట్టింది? రావణమంత్రి నీ బుద్ధి బుగ్గలవ్వ! సీతపోయిన రాముడు బ్రతికి వుంటాడా– నీ వెర్రి కాకపోతేనూ? సీత జాడ తెలిసే గుర్తేమన్నా కనపడుతుందా ఏమన్నానా? సీత వుండే చోటు నీకూ, నాకూ తప్ప 'మూడవ కంటి' వాడిక్కూడా తెలీదుగదా! ఇంక ఆ అజితేంద్రియుడు' అధర్మాత్ముడు, పితృ పరి త్యక్తుడు అయిన ఆ రాముడు సీత లేక పోతే ఎంతసేపురా చావడం? అల్లాంటివాణ్ణి గూర్చి విచారిస్తున్నావా?" అన్నాడు. అప్పుడు మళ్లీ మారీచుడు–

## మారీచుని మంత్ర కుశలత్వం

"నువ్వన్న వాటిలో ఏమీకాడు రాముడు. అసమర్థత్వం వల్ల రాజ్యాన్ని త్యజించిన వాడుగా రాముణ్ణి ఊహించ బోకు. తన దుర్వా రములైన బాహుబలంతో ఎక్కు పెట్టిన ధనుస్సు నుండి వచ్చే బాణాలతో ప్రళయ కాలంలో ఉప్పొంగే సముద్రాన్ని మ్రింగి వేయగలడు. అల్లాంటివాడు నిరంతర బోగములతో కూడుకొనే రాజ్యాన్ని గడ్డిపోచలాగా త్యజించాడు. కమలనయనుడు, అజాను బాహువు, శైల వక్షుడు, వృషస్కందుడు. అనుభావలగ్నుడు, శూరుడు, స్త్రీలు చూచి మోహపడటం కాదు– పురుషులే మోహపడే రూపం రామునిది. అయినప్పటికి కులస్త్రీని తప్ప ఇంకొకస్త్రీని కన్నెత్తి చూడడు. అటువంటి వారినే శ్రీదేవి వరిస్తుంది భూదేవి గూడా వానినే స్వీకరించమంటుంది. అయినా కోసల భూమిని వదిలి పెట్టాడు. స్వామి. అటువంటి ఏకపత్నీవ్రతుడు. తాటక నీదృష్టిలో ఎంతటిది ఎళ్లాంటిది? మరి అలాంటి దాన్ని సంహరించినపుడు ఆ రాముని వయస్సెంతో

గుర్తుందా? మూతి మీదకు మీసాలు గూడా రాని వయస్సు. కాబట్టి ఇల్లాంటి వాటిల్లోకి దిగేటప్పుడు కాస్త ముందూ వెనకా చూచుకో !

ఘోర దంష్ట్రిలతో. దిగ్గజకపోలాల్ని పట్టి ముద్ద చెయ్యగల దీర్ఘోరు భాహుడనైన నేను ఈ అడవిలో చండ శాసనునిలా తిరుగు తున్నప్పుడు– ఎన్ని యజ్ఞాలు, ఎంత మంది బ్రాహ్మణుల్ని ధ్వంసం చేశానో నీకు గుర్తుందా? విశ్వామిత్రి డంతటివాడు నా ధాటికి తట్టుకోలేక ఈ దాశరథిని రక్షగా తీసుకువచ్చాడు పట్టుమని పదహారేళ్ళన్నా లేవు, మహా వుంటే పన్నెండేళ్లుం టాయి. నాపొగరకు వీడా రక్షకు డనిపించిందా నాడు, అంతే! పసిబాలుడు ఒకే ఒక బాణం చేశాడు. అబ్బ! ఇప్పటికి ఆ దెబ్బ గుర్తే! పాపం ప్రిక్క నున్న సుబాహుడి దేహం యావత్తూ క్షణంలో భస్మం అయింది. ఆ బాణాగ్ని నా శరీరానిగ్గూడా సోకివుంటే నేవిలా ఈ రోజు నీతో మాట్లాడేవాడినిగాను. నా మీద వేరే ఒక బాణమే వేశాడో, లేదా వాడి మీద వేసిన బాణం ఈకలగాలి తాకిడికే అలా అయానో నాకు తెలీదుగాని– అక్కడికి వంద యోజనాల దూరంలో ఉన్న సముద్రింలో పడ్డాను. ఉప్పునీళ్లు ఎన్ని తాగ్రిగానో తెలీదు. స్మృతిలేదు. మర్నాడు మధ్యాహ్నం తెలివి వచ్చింది. ఆ రఘువీరుని దయ వలన చివరకు ఇలా చచ్చి చెడి బ్రితుకు తున్నాను. తల్లిని చంపాడు, తమ్ముణ్ణి చంపాడు. నన్నొక్కణ్ణే ఎందుకు మిగిల్చాడో ఆనాడు నా కర్థం కాలేదు. ఇన్ని పాట్లు పడ్డాను గదా! బుద్ధి మారిందా అంటే లేదు.

జీవిలక్షణమే చిత్రిమైంది. బుద్ధి వచ్చినట్లే వుంటుంది. అంతే! మరుక్షణంలో బుద్ధి పోతుంది. ఆశ్రిమంలో లేడిపిల్లల మధ్య లేడిలాగా తిరుగుతూనే ఉండేవాణ్ణి. ఒంటరిగా కనపడ్డ ఋషుల్ని చూసినపుడు తినడం, మళ్లీ లేడిగా మారి తిరగడం– అదీ నా పూర్వ చరిత్రి. ఆ ఆశ్రిమంలో ఆకలి, వైరం రెండూ తీర్చుకుంటూ ఉండేవాణ్ణి! కన్నులు ఎఱ్ఱగా, పెదవుల చివర

నెత్తురు ఉన్న నన్ను వాళ్లు గమనించక పోలేదు. గమనించి, అనుమానించి, అనుమానించి గూడా లేళ్లతో కలసి పోవడంతో పెద్ద పట్టించు కునేవారు కాదు. ఆ బ్రాహ్మణ జాతిని చూస్తే నాకు చిత్రమని పించేది. తన దగ్గరకు రాని దాన్ని తనకెందుకులే అనీ, తనదాకా వస్తే మన కర్మలే అని సరిపెట్టు కునే వాళ్లు. లేదా భయమేస్తే ఆశ్రమంలో జంటలు వీడేవారు గాదు. తిరగబడలేని రజస్సులేని, నిష్క్రియులైన వాళ్లని తిని తిని నాకే అసహ్యం మేసింది.

ఈ మధ్యనే స్వామి తమ్మునితోను భార్యతోనూ వచ్చినట్లు తెలిసింది. అప్పుడప్పుడా పర్ణశాల వైపుగా గూడా నా రాక పోకలు సాగించాను. ఒకనాడు లక్ష్మణుడు — 'ఆ నడక లేడి నడకగా అనిపించటం లేదు. ముఖం చూస్తే లేడి ముట్టిలా తోచడంలేదు. పెద్ద కోర ఒకదాన్ని పెదవితో కప్పు తున్నట్లుంది. ఇన్నాళ్ల నుండి ఎక్కడో చూచి నట్లనిపించేది. ఇప్పుడు గట్టిగా ఊహిస్తే గుర్తు కొచ్చింది. ఆనాడు నీవు వేసిన బాణం గాలి విసురికి దూరంగా కొట్టబడ్డాడే-వాడే వీడు. సందేహం లేదు. అని అన్నగారితో అననే అన్నాడు. అంతే! నాకు గుండెలు గుండెల్లో లేవు. ఏ వేషంలో ఎవరు ఎలా వున్నా పట్టివ్వ గలడు వీడనిపించింది. ఆ తమ్ముడుండగా రాముణ్ణి జయించలేం. మోసగిం చలేం. మభ్యపెట్టలేం. ఆ లక్ష్మణునితో వైరం నీకూ తెలుస్తుందిలే ముందు ముందు! చుప్పనాతి 'శూర్పణఖ ముక్కూ చెవులు కోశారేం?' అని అడుగు తావా ఇంకా నయం, చంపకుండా వదిలి పెట్టారు సంతోషించు. అది అతని భార్య సీతని చంపబోయింది. అందుకు నిజంగా ఇంకోరైతే చంపిముక్కలు చెయ్యడం జరిగేది. కాని, వాళ్లు దయామయులు గాబట్టి సరిపోయింది. మన బంగారం మంచిదైతే కంసాలిని ఏదో అని ప్రయోజనమేమిటి? శూర్పణఖ నన్నడిగినా బావుండేది. వాళ్ల జోలికి, ఆ ఛాయలకే పోవద్దని సలహా ఇచ్చి వుండే వాణ్ణి. అయినా తన ఈడేమిటి— ఆ పసికూనలతో దీనికి వలపేమిటి చెప్పు? కాని ఒక్క పొరపాటు జరిగింది. అది రాముని దగ్గ

రుంది. ఏమిటంటే- అతడు కొద్దిగా పరిహాస శీలిఅవడం, అదే కొంపముంచి ఇంతవరకు తెచ్చింది వ్యవహారం. (మనకు- అని గూడ అర్థం) అసలు అడవిలోకి రావడానికి గూడా వాడి ఎగతాళి తనమే కారణం అయింది. పినతల్లి దాసీని తన చిన్నప్పుడు ఎగతాళి చేసేవాడు.

ఆ దాసిదాని వయస్సు చిన్నది, ముఖం ముసలిది. ఆమెను రాముడు తెగ ఏడిపించేవాడు. ఆ ముసలి మొగం పగపూని కైకతో పుల్లవిరుపు మాటలాడి రాముణ్ణీనాడు వనవాసిగా చేసింది. ఆ ముసలి తండ్రి ఆ కైకమ్మకు వరాలు ఎప్పుడు ఇచ్చాడో ఏమో! ఆ వరాలు సమయం చూసి మరీ ఆకాశంలోంచి ఊడిపడ్డాయి. వరాలు విన్నాడు. అంతే! పోయేంతవరకు ఆ తండ్రికి స్మృతి లేదు. తండ్రిమాట నిలబెట్టడం కోసం రాముడు ఇలా వనవాసి అయాడు. ఇప్పుడు చెప్పు నువ్వు. తండ్రి వెళ్లగొడ్తే వచ్చాడో లేక ధర్మానికిబద్ధుడై వెళ్లాడో? కొడుకిలా వనాలకి రావడం, తండ్రి అలా వియోగ బాధచేత ప్రాణాలు వదలటం ఒక్కసారి జరిగాయి. రాముడు ధర్మాన్ని ఎలా నిర్ణయిస్తాడో ఆ ఋషులకే అంతుపట్టలేదు. చర్చలు జరిపినా ఋషులకు తేలని విషయాలు రాముడు అలా వున్నపళంగా చెప్పగలిగేసరికి ఋషులు తెల్లబోయేవారు. మరి అల్లాంటి వాణ్ణి నిందించటం నీకు చాలా పాప హేతువు అవుతుంది" అన్నాడు.

"అయితే వాడు మనకు చేసిన అపకారం దిగమ్రింగుకుని పూరుకుందామంటావా?" అన్నాడు రావణుడు. అందుకు మారీచుడు–

## మారీచుని విశ్లేషణ

"ఆఁ! అల్లా అడుగు చెప్తాను. రాజనీతి ఏం చెబుతోంది? తన కంటె చాలా పెద్దవాడైన శత్రువు ఎదురొస్తే-వాడు తన్ను తన్నినా భరించి

గుట్టుచప్పుడు కాకుండా ఎవ్వరితోను చెప్పుకోకుండా పడిపుండటమే ! ఏదీ-కార్తవీర్యార్జునుని పట్ల నీవు చేసినట్లన్నమాట! తనకంటె మించడు అన్న శత్రువు వుంటే - అపకారం వాడు తలపెట్టకపోయినా పిలిచి మరీ తన్నమన్నారు. ఇంద్రుని పట్ల నీవు చేసినట్లన్న మాట! తనను మించుతాడా, మించడా అన్నట్లుండే శత్రువు అవమానిస్తే వాణ్ణి చూసినా వూరుకోవడమే ఉత్తమం. వాలి పట్ల నువ్వు ప్రవర్తించినట్లన్న మాట ! తనకు బంధువు, సాధువు అయితే వాడి మీద భారం వేసి హాయిగా నిద్రపోవాలి. కుబేరుడి పట్ల నువ్వు చేసినట్లన్నమాట! ఈ చెప్పిన నలుగురూ ఎవరిదగ్గర ఎందుకూ పనికిరారో అటువంటి వాడు రాముడు. అతని దగ్గరా నీ కుప్పిగంతులు? మెతుకు పట్టుకుంటే తెలియదా రాముని సంగతి. అడవికివెళ్లాలి అనుకున్నాడు –అనుకోడం అరణ్యానికి రావడం ఒకేసారి జరిగాయి. మాటపట్టుదల అలాంటిది. అందరిలా మాట్లాడడు. అందరిలా హంగామా పడుతూ దేన్నీ చెయ్యడు. ఏ పనినైనా తన ఆత్మతుష్టిగా హృదయ పూర్వకంగా చేస్తాడు. అటువంటివాడికి ధర్మపథాన్ని వెళ్లడం ఎంత ఆచరణీయం! ఇతరులు అల్లా వెళ్లకపోయినా ఊరుకోడు తెలుసా! అందుకోసం కోరి నీ చిచ్చు నువ్వు తెచ్చి పెట్టుకోకు. పగబట్టినా హృదయంతోనే చేస్తాడు. మరి అల్లాంటి వాడు- పెళ్లిచేసుకొన్న భార్యను దొంగిలిస్తే ఏం చేస్తాడో తెలుసునా ? నీ బోటి గాడికి దాని పవిత్రత, ప్రాముఖ్యం తెలియక పోవచ్చు. మార్తాండ తేజస్సంపన్నాన్వయుడు రాముడు. కుల మర్యాదకు లోటు ఏ మాత్రం కొంచెం జరిగినా ఎంత క్రోధం వహిస్తాడో నీకు తెలియదు. కాలాగ్ని సదృశ క్రోధుడు మరి! నీ దగ్గర నుండి తన భార్యను తిరిగి సంపాదించి వూరుకునే వాడు కూడా కాదు! తగిన పాఠంచెప్పి డొక్క చీరుస్తాడు. జాగ్రత్త! ఇదంతా నువ్వు చేస్తానన్న పనికి జరగబోయే ఫలాలను విడదీసి చెప్పాను అంతే ! క్రోధం హృదయంలో కలిగిన రాముణ్ణి నువ్వు ఊహించలేవు. చెప్తా విను. కార్తవీర్యార్జునుడు. ఏదీ కార్త వీర్యార్జునుణ్ణి ఎడుగుదువు గదా! వాణ్ణి వాడి

చేతుల్ని తన గండ్ర గొడ్డలితో నరికి అవతల పారేసిన పరశు రాముణ్ణి ఎఱుగుదువుగా- ఎవరూ— భూమి చుట్టూ ఇరవై ఒక్కసార్లు భ్రమించి క్షత్రియ వంశాల్ని నాశనంచేసి వదలి పెట్టాడే వాణ్ణి — పాదాలు క్రిందమోప వీలు కాకుండా, మడమలు, త్రొక్కుకుంటూ ఈ భూమిని వదలివెళ్లిపోయేట్టు చేశాడు రాముడు. ఇది ఎప్పటి మాట అనుకున్నావ్? పాదాల పసుపు, పారాణీ ఆరని పెండ్లికొడుకుగా వున్న పిన్న వయస్సులోని రాముని బాణం తగిలినప్పటి మాట! పాపం పరశు రాముడు ఆ రోజు తన తపఃఫలాన్ని తానే దిగ్రమింగు కున్నాడు!

ఆ రాముణ్ణి అడవులకు పంపింది ఎవరో తెలుసుగా-కైక. రాముని రాక్షస సంహారానికి ఆవిడ నాందీ వాక్యం పలికింది. మొట్ట మొదటగా రాముని చేత బాణం పట్టించింది. రామునికి ప్రథమ చాప కళా గురువు ఆమెయే! ఈ తల్లీ కొడుకు లిద్దరూ కూడబలుక్కొని ఈ అరణ్యవాసం కోరి ఏర్పాటు చేశారేమోనని నా కనిపిస్తుంది. అవతల అల్లాంటి ఆత్మ శుద్ధి గలవాడు, మానసికంగా గూడా ఏకపత్నీ వ్రతస్థుడు అయిన వానికి అస్త్రాలు సిద్ధి చేకూర్చేటట్లుగా భ్రష్టుడికి, నీచుడికి ఎలా పని చేస్తాయి ? అతని ముందు ఆ అస్త్రములు ఎప్పుడూ సిద్ధములే! అతని మనస్సంకల్పం లోనే వుంటాయి. (వెన్నెముక ముందుంటాయి). ఈ జన్మకు ఇంక మారడు, పనికిరాడు — అన్నవానిని వధిస్తాడు. (సుబాహుణ్ణి చేసినట్లు) కాలాంతరంలో బాగుపడవచ్చని తోస్తే క్షమించి వదులుతాడు, [నన్ను (మారీచుని) చేసినట్లు] ప్రమాదమొస్తే దేవుణ్ణి స్మరించి ఒప్పుకొనేవాణ్ణి ప్రాణం మీదికి తీసుకువచ్చి వదిలిపెడ్తాడు. (కాకాసురుణ్ణి చేసినట్లు) ఆ రాఘవుని పేరులోని రెండక్షరాల ధ్వని గాలిలో లీనమైనంతమేర ధర్మం పరిరక్షింప బడుతుంది. కాబట్టి అతనితో మనకు ఎందుకొచ్చింది గాని నా మాటవిని మరో ఆలోచన నీ మనస్సుకు రానీక!" అన్నాడు.

"అబ్బో! నీకు ఆ రాముణ్ణి గురించి చాలా తెలుసునే?" అన్నాడు రావణాసురుడు. అప్పుడు మళ్లీ మారీచుడు—

"నీ ఎత్తిపొడుపు మాటలకేం గాని ఇంకో సంగతి చెప్తా విను. తెగించి ధైర్యం చేసి సీతను తీసుకొచ్చావా— నీ వంశ వృక్ష మూలంలో నిప్పులు పోసినట్లే! నీ లంకా రాజ్యలక్ష్మి నెత్తిన ముసుగువేసినట్లే! "నన్ను మాయ లేడిగా సంచరించమని, నువ్వు సీతాపహరణం చేస్తానని," అన్నపుడు నీకైతే ఎలా వుందో గాని నాకు మటుకు ఈ విషయాన్ని ఊహిస్తున్న కొద్దీ గుండెల్లో బరువు పెరుగుతోంది. లంకారాజ్యం దహన మాపుతూంటే రేగే అగ్నిజ్వాలలు నిజంగా కళ్లలో కన్పడుతున్నాయి. నాకు నీ హితం కోరక తప్పదు కాబట్టి నీ మంచి చెడ్డల్ని విచారించ వలసిన ధర్మంకూడా నా కుంది. ఎవరైనా రాజుకి ప్రియంగా మాట్లాడి బహుమానాలు, మన్ననలు పొందవచ్చు. కాని నేను నీ మేలుగోరి ఇలా అప్రియం చెప్పాల్సి వస్తోంది. అధికారంలో వున్నవాడు నిజంగా రోగిలాంటి వాడు. హితమనే ఈ పథ్యం చెప్తే కోపగిస్తాడు. సద్యస్సుఖాన్నే కోరతారు ప్రతివారూ. దీని మూలాన్నే ప్రతి జీవికి పునర్జన్మ ప్రాప్తించడం జరుగుతుంది. సరే! ఆ విషయం అటుంచు. నీవు మాత్రం అతని వద్దకు పోవద్దు. నీవు సర్వ నాశనమై, నీ రాజ్యం అరాచక మౌతుంది. నీ ప్రజలు అనాథ లవుతారు. ప్రజలకు అట్టి ఇబ్బందులు చేజేతులా ఏ రాజూ తెచ్చుకో కూడదు. ముందు ప్రజలు పుట్టి ఆ పైన వాళ్లలోంచి రాజు పుట్తాడు. అంతేగాని ముందు రాజుపుట్టి ఆ పైన ప్రజలు పుట్టరు. కాబట్టి వాళ్ల క్షేమం కోసం నువ్వు సీతను తీకుకురావద్దు. "సీతను తీసుకువస్తే రాముడు ఇంకా బ్రతికితే గదా?" అని నీ వుద్దేశ్యం విను. రాముడు పుట్టింది సీతను పెళ్లి చేసుకోడానికి కాదు. ధర్మ సంస్థాపన కోసం పుట్టాడు దేనికోసం పుట్టాడో అది జరగనిదే పూరుకోడు. సీతను పోగొట్టుకోడంతో— రాముని మహిమలు. పరాక్రమం పోతాయనుకుంటున్నావా ? పోవడం కాదు.

ఇంతకు వందరెట్లు పెరుగుతాయి. అల్పుడైన వాడికి ఆపత్తువస్తే గుండె నీరసమొచ్చి కూలిపోతాడుగాని, అధికుని విషయంలో అలాకాదు. సింహం మీసం లాగినట్లే! తోక త్రొక్కిన త్రాచు అవుతాడు. కాబట్టి ఏ విధంగా చూసినా నీ వూహకు నా ఆలోచనకు సరిపడ్డం లేదు." అన్నాడు.

రావణుడు వెంటనే-"నీ ఆలోచన నా ఆలోచన ఒక్కటే కావాలని ఎక్కడుంది? అయినా నేను సీతను తెస్తానంటే నువ్వు రాముణ్ణి వర్ణిస్తావేం?" అన్నాడు. వెంటనే మారీచుడు,

"అల్లా చెప్పు. మరి ఇందాకటి నుంచి అనవసరంగా మన ఖరుణ్ణి చంపాడు, దూషణుణ్ణి చంపాడు, మన ఇంటి ఆడపడుచు ముక్కు చెవులు కోసి అవమానించాడు, అంటూ ఏవేవో కారణాలు చెప్తావేం ? అయితే తొల్లిబుద్ధి నీకు పోలేదన్న మాట! వెనక కొంతవరకు ఇల్లాంటి వ్యవహారాల్లో నీకు సాగినంత కాలం సాగింది. నేనూ నీతో చెయ్యి గలిపాను. కాని ఇక్కడ అల్లాకాదు. నీ ఆటలు సాగే చోటు కాదిది. నువ్వు బ్రతకాలని కోరుకునే వాడిని కాబట్టి చెబుతున్నాను. అమాత్యుల వద్ద చెప్పకూడ నంతటి సిగ్గైన పనులు చెయ్యకపోతే ఏమి ? ఇంద్రజిత్తు, అక్ష కుమారుల్లాంటి కొడుకులు, మళ్లీ ఆ కొడుకులకు వాళ్లను మించే కొడుకులు గలిగి మన మళ్లను ఎత్తావు. మరి ఇంక నువ్వు ఏం చూసుకుని ఆ సిగ్గుమాలిన పని చేద్దా మనుకుంటున్నావ్ ? ఆ కొడుకులు, మనమళ్లు ఏమనుకుంటారు? ఏమనుకున్నా పైకి మాత్రం అనరు. అంతే కదా! ఈ భూమ్మీద ఎవడో అనామకుడు, దుర్బలుడు ఇలా చేసాడన్నదానికీ, నువ్వు ఇలా చేశావన్నదానికీ లక్ష వ్యత్యాసం లేదూ ? చల్లని వెన్నెలను గ్రుమ్మరించే సన్న జాబిల్లిని పువ్వులా ధరించిన శివునకు నీ పది తలలు కోసి అర్పించి, అతణ్ణి మెప్పించిన కీర్తితో పాటు ఇది గూడా యుగ యుగాలగా నిలిచి పోతుంది. ఇది నీకు వ్యక్తిగత విషయమైతే కావచ్చు. కాని రేపు నీ

కులమంతా ప్రాకి కుల గౌరవం నాశనమౌతుంది. అందుకని విభీషణాదుల్తో చెప్పి చేస్తే బావుంటుందని నా కనిపిస్తోంది. ఎందుకంటే ఆ తర్వాత ఏమైనా జరక్కూడనిది జరిగితే– 'ఏం ముంచుకుపోయిందని తొందర పడ్డావు ? మాతో మాట మాత్రంగా నైనా చెప్పావా?' అని నిన్ను ఆడిపోసుకుంటారు. ముఖాన్నే నిలదీసి అడిగేస్తారు. నిన్నొంటరివాణ్ణి చేసి వాళ్ల దోవన వాళ్లు పోతారు. అంతా రసాభాసమౌతుంది. మరి నువ్వే ఆలోచించుకో! ఈ సృష్టిలో ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క జాతి పైకి వస్తుంది. మరో జాతి కిందికు పోతుంది. నిర్ణయమనే త్రాసును రాజు జాగ్రత్తగా గ్రహించాలి. వివశుడై ఒక వైపు మొగ్గు చూపించాడా–స్థిరత్వం చెడి ఆ పట్టుకున్న వాని మూలంగానే ఇలాంటి హెచ్చు తగ్గులు వస్తూ వుంటాయి. మొదట్లో ఒకసారి వచ్చావు. నాకు తోచింది చెప్పంగానే ఏమనిపించిందో వెంటనే విన్నావు. వలదనుకొని ప్రయత్నాన్ని విర మించావు! ఇంతలోనే ఏదో చెడ్డ పురుగు ఏదో వూదింది. మళ్లీ వచ్చావు. నీ తోవన నిన్ను పోనీరు. స్వార్థ చిత్తంతో హితం చెప్పి నట్లుగా ప్రియాన్ని నూరి పోస్తారు. ఒక తల్లి బిడ్డలు కనకనా ! పెదతల్లి పినతల్లి బిడ్డలు. అవతల తన సోదరులు చచ్చి నువ్వు బ్రతికి బాగా పచ్చగా వుంటే చూడ గలదా ?" అని గబుక్కున ఉన్నమాటనేశాడు.

రావణునికి కోపం వచ్చింది– "ఇందులో శూర్పణఖేం చేసింది ? నాకేం చెప్పలేదు. ఇదంతా నా నిర్ణయమే ! ఇంక ఊరికే వెయ్యి విధాలుగా వాగకు. నేను వినను. నీవు బంగారు లేడిగా వెళ్లి రాముణ్ణి ప్రేరేపించకా తప్పదు. పొంచివున్న సాలీడులా నేను ఆ సీతను ఎత్తుకుని రాకా తప్పదు. ఏం చెప్పావో ఇంతవరకు చెప్పావు. ఇంక చెప్పాల్సిన పని లేదు. వెళ్లి ముందు పని చూడు. ఇది రాజాజ్ఞ" అన్నాడు. రావణుడలా అనంగానే మారీచుడు ఒక్కసారి ఫక్కున నవ్వి—

# మారీచ నిర్ణయం

"నీ మొహం. రాజాజ్ఞ ఏమిటి ? నేను నీ మంత్రిత్వం మాని ఎన్ని దినాలైంది ? మంత్రి పదవి మానినా సలహాలు చెప్పుతున్నాను గదా అనా ? సరే! అయితే విను. మంత్రిని గనక సలహాలు చెప్పాను. బంటుని గనక నీ పనిమీద నీ మాటగా పోతాను. నీ ఇష్ట ప్రకారమే చేస్తాను. నీ ఆజ్ఞ జవదాటితే ఇంక మాకు బ్రతుకు కూడానా ? ఈ సంగతి నాకు తెలీదా ? అయితే నేను ఇప్పుడెందుకు వెళ్తున్నానో చెప్తా విను. సమయం కోసం 'నా వంతెప్పుడు వస్తుందా ?' అని ఎదురు చూస్తున్నాను. నీ రూపమై మృత్యువు నా కెదురు నిలిచింది. అందుకే నేను బయలు దేరుతున్నాను. నువ్వు రెండు విధాల నాకు సహాయం చేశావు. రామునితో సంబంధం కలగజేసింది నువ్వే! మళ్లీ పాత పగ నిప్పుడు గుర్తుకు తెస్తున్నావు. పగకు అవకాశం కల్పించావు. కానీ! అలాగే వెళ్తాను మాయ లేడిగా అవడం నాకు క్రొత్త విద్య కనకనా ? పాత విద్యకు మెఱుగు పెడతాను. తెలిసిన విద్యేగదా!" అని అన్నాడు.

మారీచుడలా అనంగానే రావణుడు సంతోషంతో "అల్లా అను అదీ మారీచుడంటే. ఇప్పుడూనువ్వు నిజంగా మారీచుడివంటే!" అని అందముగా మారీచుని భుజం చరిచి "మరి బయలుదేరు నిన్నక్కడ దింపుతాను" అన్నాడు.

మారీచుడు "ఇదిగో ఇప్పుడే వస్తున్నాను" అని తన ఆశ్రమం లోకి వెళ్లి కుండలన్నీ పగలగొట్టి, పై కప్పు అంటించి, గోడలు కూల దోసి, ఇట్లా చేస్తున్న తనని తీక్షణంగా చూస్తున్న రావణుని వంకే చూడకుండా రథమెక్కాడు. (అంటే తిరిగి తాను బ్రతికి వస్తానని ఏమీ నమ్మకం లేదని చెప్పడమన్నమాట!) ఇద్దరూ రాముని ఆశ్రమ సమీపం చేరారు.

"పంచవటీ ప్రాంతంలో ఉన్న ఐదు మఱ్ఱిచెట్లు తన ఐదు ప్రాణా ల్లాగాను, అక్కడున్న పర్ణశాల తన దేహం గానూ, అందులోని రాముడు జగన్నాధుడు గానూ తోచింది మారీచుడికి. ఆత్మ సాధకునికి మృత్యువేళ ఆసన్నమౌతున్నపుడు అలాగే అనిపిస్తుందేమో ననిపించింది. అలా అనిపించి అయినా నిజం అడిగేద్దామనుకొని "నాచావు ఒక్కదానికేనా ఈ ముహూర్తం లేక సీతను గూడా నిజంగా అపహరించడం వుందా. నిజంగా సీతనే కనక అపహరిస్తే అటు రాజ్యానికి రాజ్యం పోయి, ఇటు భార్య ఇలా అయిపోతే ఆ రాముడు ముందు దుఃఖాన్ని భరించలేడు. పదమూడేండ్లు ఏ చీకూ చింతా లేకుండా గడిచి పోయింది. ఇంక మిగిలింది గట్టిగా ఒక్క ఏడాది కూడా లేదు. పదకొండు మాసాలు. ఈ పదకొండు మాసాలు ఎలాగో అలా కళ్లు మూసుకుంటే వాళ్లు అయోధ్యకు వెళ్లేవారే గదా! అటుపైన వాళ్లు నువ్వుండ మన్నా ఇక్కడ వుండొచ్చారా? ఆ పైన నీ వెవరో — వారెవరో? అంతే గదా! మరొక్కసారి కొంచెం ఆలోచించి చూడు. లంక రక్షింపబడటం నీ మీద ఆధారపడి వుంది" అన్నాడు.

రావణునికి కుడి కంటి కండలు ముకుళించాయి. ఒక్కసారిగా పొగరుగా నవ్వి, "నీబోటి పరమభక్తుడుండగా రాముడిలాంటి చవట గూడా దేవుడౌతాడు. నేనే రాముడైతే, ఆ రాముడే రావణుడైతే నీ అంత భక్తుడే కనక లేడి అయితే– ఆ రామునిగా నిన్ను నేను చంపలేను, ఆ రావణుడుగా ఆ రాముడు ఈ సీతను అపహరించలేడు" అన్నాడు. అందుకు మారీచుడు మళ్లీ —

ఈ పథకమంతా సీతను దక్కించుకోడం కోసం అనుకోను. నా చావు పూర్తిగా కోరి ఇలా చేస్తున్నావు. లేడి రూపంలోనున్న నన్ను చూచి లక్ష్మణుడు గుర్తించనే గుర్తిస్తాడు. సీత కోరంగానే పోయేది ఒక బాణమే గదా అని నా మీద రాముడు వదుల్తాడు. నేను ఛస్తాను. ఇంక

పగేమిటి ? నువ్వు ఆ సమయంలో రథాన్ని వేగంగా లంకకు పట్టిస్తావో మరి రాముడికి ఎదురుగా నిలబడి యుద్ధమే చేస్తావో" ఒక్కడవు అన్నాడు.

అప్పుడు రావణుడు—

"ఓరీ నీ మంత్రిత్వం తగలడా! నీ తెలివల్లా ఏమైందిరా? ఇలా వెధవ ఆలోచనలు పడి పగ సాధించడం మానేస్తామా? నా పగ సంగతి అలా వుంచు. నీ పగ సంగతి ముందు నువ్వు చూసుకోలే! అప్పుడే పగలు రెండు ఝాములైంది. ఇంక మరి ఆ సూర్యుని కిరణాలలో తళ తళ మెరుస్తూ వాళ్లని మభ్య పెట్టు" అన్నాడు, అందుకు మారీచుడు—

"స్వామీ! పోతానులేవయ్యా ! ఇంత దూరం వచ్చాక ఇంక పోకుండా ఉంటానా, నాప్రియత్నం నన్ను చివరి దాకా చెయ్యనీ మరి. ఈ సమస్త లోకం ఆ రాముని అధినం. ఆ రాముని వింటి నుండి వెలువడిన బాణసర్పానికి రాక్షస ప్రాణాలు ఆహుతి అవబోతాయని తెలుసుకో! ముందు నేను ఛస్తాను, నా చావుతో పుట్టిన అగ్ని అంతటితో ఆగక లంకను యావత్తూ దగ్ధం చేస్తుంది చూసుకో! నేను రాముని చేతుల్లో చావాలనే ఇలా కూర్చున్నాను. ఎందుకో తెలుసా, 'నీవు చెప్పిన పని చేయకపోతేనువ్వెలాగూ నన్ను బ్రతికనీయవు. నీ చేతుల్లో చావడం కంటే ఆ రాముని చేతుల్లో చావడం నయం కదూ!' అందుకు, మరి నువ్వు మాత్రం చావవని అనుకుంటున్నావు. నాకు తెలుసు. కాని నాతో బాటు నీ చావును తప్పించడానికి ఆ చంద్రశేఖరునికి గూడా వల్ల కాదు. ఆ సీతను ధూమకేతువులాగా నీ లంకా మధ్యములో వుంచుకో! అల్లాంటి ఆ సీతను నువ్వు తీసుకొని పోడానికి నీ కెంతవీలు చెయ్యాలో అంతగాను చేస్తాను చూడు" అన్నాడు. అంతే! మరు క్షణంలో రావణుని కళ్లు మిరుమిట్లు గొల్పాయి. ప్రక్కనున్న మారీచుని లేడి రూపం అంతలా చేసింది.

## మాయలేడి

మాయలేడి చాలా చిత్రంగా వుంది. అరణ్యం మొత్తమ్మీద వున్న వివిధ వర్ణాల పత్రి పుష్పాదులు అన్నీ కలసి, ఒక ఆకారం కట్టి, వాటిలోని అంతశ్శక్తి మేల్కొన్నదా అన్నట్లుంది. సూర్య శ్వేత మయూఖాంతర్గత సప్తవర్ణయుత శక్రధనుస్సులా మెరుస్తోంది. ఒక ప్రక్క ఎండలో లేడి తిరిగితే నెమలి పురివిప్పి ఆడుతున్నట్లుంది. అమరకాంతల నయన కాంతుల్లా వుంది. కోటి సీతాకోక చిలుకలు గుంపుగా పరుగెత్తుకెళ్తున్నట్లుంది. చీకటిలో కనబడే పెద్దపులి పిల్లల కనుపాపల జిలుగువెలుగులు వంటిమీద తాపిన ట్లుంది. గానుగ చెట్టు లేత చిగుళ్ల మీదుగా వెన్నెల పడుతోంటే కన్పడే మిణుగురు పురుగుల్లా మెరుస్తోంది. త్రివేణీ సంగమంలో తారల వెలుగుల్ని నీళ్లెత్తి పోసినట్లుగా వుంది. మేఘంలోని మెఱుపులో దేవతల పెండిండ్ల బుక్కాయిలు చల్లినట్లుంది. పైడి ఒడలిపై గరుడ, మరకత, వజ్ర, గోమేధి కాల్ని పొడి చేసి ముగ్గులు పెట్టినట్లుంది. ఒక ఇంద్రియాను భవము ఇంకొక ఇంద్రియానికే తెలియదు. అలాంటిది ఒకరు వర్ణిస్తే ఇంకొకరికి ఏమి తెలుస్తుంది. ఆ లేడిని ఎవరంతకు వారే చూడాలన్నట్లుంది. అంతే!

అదే పనిగా తదేకంగా చూచిన రావణునికి ఆ లేడి నచ్చి తనలో తానే మురిసిపోయి "అయితే గొప్ప శిల్పి అయినా అవచ్చు. లేదా రాక్షసుడయినా కావచ్చు. కాని ఒక క్రూర రాక్షసుడు ఇంత చక్కటి శిల్పి కావడం చాలా చిత్రమే!" అని అనుకొని మెడలో వున్న తన వుత్తరీయాన్ని తీసి లేడి మెడకు వేసి—

"ఇంత అందమయిన లేడి వవుతావన్న సంగతి నేనూహించ లేకే పోయాను సుమా! నాకు ధైర్యంగా వుంది. అక్షరాలా నువ్వు ఆ సీతను సమ్మోహపరచగలవు. కాని ఆ రాముని ముందు నీ రూపరేఖా లావణ్య సోయగాల్ని మరింతగా ఒలికిస్తూ ముచ్చట గొలిపే విధంగా చరించు. నీ

వెలాగూ అతని భక్తుడివే నన్నావుగా! చూస్తూ చూస్తూ ఆత్మ భక్తుణ్ణి చంపే వాడు కాదులే! అయినా ఏమిటి నీ పక్ష పాతము చెప్పు? మతం మార్చడం ఏమిటి ? నువ్వు నమ్మిన ఆ దేవుడి తాలూకు అవతారమయిన రాముని భార్యకు వినోదం కలగజేయడానికి ఇంతగా సంతోష పడుతున్నావు. సంతోష పెడుతున్నావు. మరి మండోదరిని ఎప్పుడయినా ఇలా సంతోష పెట్టావా? ఇన్ని రోజులు యీ విద్యను దాచి పెట్టింది ఇందుకోసమా?" అని అన్నాడు.

"నాతో నీకేం పని?" అని ఒక్కసారి చెంగున గంతేసి ఎక్కడుందో కన పడనంత దూరం వెళ్లింది మాయలేడి. "ఉత్తరీయం చేతుల్లో ఉండగానే మాయమయిందే!" అంటూ అటూ ఇటూ చూడగా చాలా దూరంగా వున్న లేడిని రావణుడు చూచాడు. కేవలం రూపమే కాకుండా, స్వభావము, శరీర లక్షణానికి తగ్గట్టుగా క్రిమంగా మారిపోతూ గుర్తుపట్ట లేనంతగా మారీచుడు లేడి అయిపోయాడు. ఈ ఇద్దరి రాక్షసుల కుతంత్రాన్ని పసిగట్టిన దేవతలు పర్ణశాల సమీపంలోని పొదరిళ్లలో నక్కి ఏమవుతుందో నని కంగారుగా చూస్తున్నారు.

రథం లేదు. అవతల రావణుడు లేడు. ఒక్కడూ వెళ్తుండడంతో లోపల తన తప్పు తెలుసునేమో మారీచునికి పాపం బెరుకు బెరుగ్గానే వుంది. చుట్టుప్రిక్కల లేళ్లు – "ఆకృతి స్వజాతిదైనా తమాషాగా వుందే?" అని దగ్గరకు వచ్చి చూచి, "ఇది లేడి కాదు. ఇదేదో చిత్రింగా ఉంది. మన జాతిది మాత్రిం గాదు. లేకపోతే లేడిదగ్గర రక్తమాంసాల వాసన వేయడ మేమిటి "అని భయంతో వెంటనే దూరంగా తొలగిపోతున్నాయి.మారీచునికి ఒకపది లేళ్లు తనప్రక్కన ఉంటే బాగుండుననుకున్నా కుదరటం లేదు. పూర్వ వాసనా బలం చేత మరచి పోయి ఒకటి రెండు లేళ్లు దగ్గరకొస్తే తినేద్దామని పించి వెంటనే పొరపాటు తెలుసుకొని మానేశాడు. "ఏది ఏమయినా ఇది రావణుని కార్యము-ఆచరించక తప్పదు." అని మనస్సు బిగపట్టుకొని కొంత

దూరం వెళ్లి అక్కడ పచ్చిక బయళ్ల మీద ముట్టి పెట్టేసరికి గరికె మీద బంగారు రంగు ప్రతిబింబించింది. భయపడుతూ భయపడుతూనే పర్ణశాల ముందుకు చెంగున దూకాడు. బాగా బొడ్డు విచ్చుకున్న వంద బంగారు తామర పూల గుత్తి విసిరికొట్టినట్లు కన్పించింది. మాటి మాటికీ పర్ణశాల దగ్గరగా వెళ్లడం, మళ్లీ వెనక్కి రావడం గుండె దిటవు చేసుకొని మళ్లీ ద్వారం ముందుదాకా వెళ్లి రావడం- మారీచుని ప్రాణానికి ఇదంతా ఒక పెద్ద క్రతువులా వుంది. " నిండా మునిగిన వానికి చలేమిటి? " అన్నట్లు చిట్ట చివరకు ద్వారం ముందు నిలబడ్డాడు. "ఇంకో సూర్యుడు రామచంద్ర ప్రభువు దర్శనార్థమై వాకిట ప్రతీక్షిస్తూ నిలబడ్డాడా?" అన్నట్లు కాంతులు విరజిమ్ముతున్నాడు. అకస్మాత్తుగా సీత ఆ లేడిని చూసింది. ఆశ్చర్యము, ఆనందము ఒక్కసారిగా గలిగి "ఈ జన్మ ఎత్తినందుకు పరమార్థం యీ లేడి రూపంలో ఎదురు వచ్చింది" అని అనుకొని–

"ఏమండోయ్! రండి రండి; ఏమయ్యా లక్ష్మణా! నువ్వు కూడా రా! చాల తమాషాగా వుంది. మిమ్మల్నే! ఇలా వచ్చి చూడండిద్దరూ. చాలా వింతగా వుంది. ఒక్కసారి రావాలి" అని అనంగానే వాళ్లూ వచ్చారు. గడ్డి కొరుకుతున్నదల్లా వాళ్లను చూచి లేడి నాలుగడుగులు గబగబా అవతలకు వేసింది. వాళ్లేమి చెప్పుకుంటున్నారో వినడం కోసం మెడ నిక్కించి, చెవులు రిక్కించి వాళ్లని చూస్తూ గడ్డి మేస్తున్నాడు. సీత చెయ్యి రాముని భుజం మీద వేసి "ఏమండీ యిలాంటి లేడిని మునుపు చూడలేదు. కనీసం ఉంటుందనయినా వినలేదు. శరీరం రత్నకాంతులు చిమ్ముతోందా లేక రత్నములన్నీ కలిసి శరీరమయాయో తెలీడంలేదు." అంటూ నాలుగు గడ్డిపరకలు చేత్తో పట్టుకుని రమ్మని పిలుస్తూ "చూడండి దాని బెదురుచూపులు, అదీనూ! మనమేదో చేసేస్తామని దాని భయం. భయం లేదులే! రామ్మా రా! నా బంగారు తల్లిగదూ రా!"

రాముణ్ణి చూచి– "నిజంగా యీ అరణ్యంలో ఏమి ఆశ్చర్యాలు, అద్భుతాలు వున్నాయండీ! చూశారా! నన్ను మీతో ఇక్కడకు తీసుకురా నన్నారు. రాకపోతే సాకేతపురంలో చూడగలిగే విషయాలా ఇవి? నా ప్రాణం వున్నంత వరకు ఈ లేడిని చూసినందుకు నేను మీకు కృతజ్ఞురాలిని. మనం ఈ లేడిని చూశామని చెప్పినా నమ్మరు. ముందు బంగారు లేడి ఉంటుందని చెప్పి, నమ్మకపోతే ఆ పైన ఈ లేడిని చూపించాలి. అప్పుడు చూడండి వాళ్ల ముఖాలెలా వుంటాయో! అక్కడదాకా ఎందుకు ఇది కనక వుంటే ఇక్కడ మన పర్ణశాలకు ఎంత కళ వస్తుందండీ! సూర్యుని కాంతులతో పోటీ పడుతున్నట్లుంది కదండీ! ప్రమిదల్లో ఇంగుదీ నూనె పొయ్యడం దీపం వెలిగించడం శ్రమ తప్పినట్లే ఇక! (అంటే పర్ణశాలతో ఋణం తీరబోతోందని సూచన గూడా.) ఇంత అందంగా ఆ సముద్రం మాత్రము వుంటుందేమిటి? రత్నాలన్నీ క్రిందుగా ఎక్కడో తన గర్భంలో పెట్టు కున్నాడు. పీనాసి కాకపోతే ఏమిటి చెప్పండి ?

లోపల కడుపులో రత్నాలు, బయట ఉప్పు నీళ్లు. ఈ లేడిని చూడండి దీనిపై వెలుగు శరీరానిది కాదు. ఆత్మ వెలుగై వుంటుంది. మీ యిద్దరూ బయల్దేరి వెళ్తే మళ్లీ ఎప్పుడు వస్తారో ? చీకట్లో ఒక్కత్తిని ఒంటరిగా వుండాలి. యీ లేడన్నా వుంటే కాస్త కాలక్షేపంగా వుంటుంది. భయం తగ్గుతుంది. మన ఇంటికి వెళ్లంగానే "నాకేం తెచ్చావు కోడలా?" అంటే దీన్ని చూపిస్తే అత్తగారు ఎంత మురిసి పోతారో ఆలోచించండి. దీనికి మాంసం పెట్టనక్కర లేదు కదా! (అసలు సంగతేమీ లేకపోయినా సీత నోటివెంట మాంసం తినడం సంగతి రాగానే మారీచుడు గతుక్కు మన్నాడు.) దీనికేమన్నా పోషణ చెయ్యాలా ఏమన్నానా ? మన ఆనందం మాట అటుంచండి. పాపం, లేడి జాతి కదా ! ఇదొక్కటీ అడవులో తిరుగుతూ వుంటే ఏ పులి అయినా తినవచ్చు. లేదా ఏ రాక్షసుడన్నా చంపినా చంపవచ్చు. ఎవరో ఒకరు పట్టించుకోక పోతే ఎలా దీని

భవిష్యత్తు ? అగస్త్యుల వారు మీకు చెప్పారు గదా! నేను ఏం కావాలని అడిగినా ఇవ్వమని, చెయ్యాలన్నా చెయ్యమని. "నీ వెంబడి పడి అడవికి వచ్చింది. నీవు ఆ మాత్రం తెలుసు కోవాలి సుమా!" అని అన్నారు గుర్తుందా ? మహా రాక్షసుల్ని చంపిన వాడివి ఆ లేడిని తేలేవా ? ఇది నేను కోరదగని విపరీతపు కోరిక అంటావా ? పట్టుకునేందుకు మరి మన దగ్గర వల అవీ వున్నాయా ? ఒకవేళ లేడి ప్రాణాల్తో అందక పోతే దాని చర్మం అట్టే పెట్టుకుంటే ? ఇంక ఆలోచించవద్దు. సీత మనస్సు, నీ మనస్సు ఒకటే అని అందరూ అనుకోవాలంటే తీసుకురా. నీ పినతల్లి ఒక్క అంటే నిలబెట్టావు. ఆ మాత్రం చేయదా యీ నా మాట. పైగా ఇది నాకు జీవితాంతం పనికివచ్చేది, గుర్తుండేది. నువ్వు యీ పని చెయ్యకపోతే? మన వనవాసానికే అర్థం వుండదు. అవును ఎందుకొచ్చి నట్లు ఇక్కడికి లేకపోతే. దీని కథ మనకి, సర్వాయోధ్యావాసులకు జీవితాంతం గుర్తుండేదిగా వుండాలి," అంది. (రామాయణ పాఠకులకు కూడా అని అర్థం) సీత చెప్పినదంతా విని లక్ష్మణుడు ఇలా అన్నాడు-

సీత చెప్పినదంతా విని లక్ష్మణుడు—

## లక్ష్మణుని విశ్లేషణ

"మణి, వజ్ర, రత్న కాంతులు విరజిమ్ముతూ అతి వినూత్నముగా మున్న ఇలాంటి లేడి లోకంలో వుండదు. ఎలాంటివి ప్రపంచంలో వుంటాయో, వస్తాయో తెలియక పోవడానికి ఇదేమన్నా సృష్టికి మొదలా? కొద్దిగా బుద్ధి వుపయోగిస్తే ఇది లేడి కాదని తెలుస్తుంది. ఇక్కడ ఎగిరితే ఎక్కడ తేల్తుందో చూడు. ఎగిరిన చోట కన్పడుతోంది. మళ్లీ అవతల కన్పడుతోంది. కాని మధ్యలో కన్పడటం లేదు. ఇది మాయ కాకపోతే ఏమిటి ? మనం హిమాలయాల్లోని సర్వారణ్యాలు కూడా తిరిగాం కదా!

ఇలాంటివాటిని చూశామా ? రత్న శాస్త్రం తెలిసినవారు రత్నాలు తాపితే వచ్చిన లేడి అయితే ఇది కృత్రిమంగాక ప్రకృతి సిద్ధందిఔతుందా? రత్నాలు శరీరం దాల్చటం వుందా ఎక్కడైనా ? అక్కడక్కడ సీతాకోక చిలకల రెక్కలపై రంగుల కాంతులు చూడగలం. అంతవరకు నమ్మవచ్చు. కాని ఇలా కాంతులు విరజిమ్మడం ఎక్కడా లేదు. వుండదు. ఎవడో చిత్రకారు డేర్పరచిన శరీరంలా వుంది. సహజం కాదు. ఇదివరకు రెండు కాళ్లపై నడవడం అలవాటుపడిన దేదో ఇప్పుడు నాలుగు కాళ్లతో తడబడుతూ నడవవలసిన ఇబ్బంది రేఖా మాత్రంగా కనబడుతోంది. అంతేగాని మొదట్నుంచి అలవాటయినదిలాగా లేదు. పచ్చిక మేయబోదు. ముట్టె పెట్టి తోస్తుంది గాని తినడం లేదు. ఒకవేళ తినటం మొదలు పెట్టినా కొరుకుతుందేగాని నమలడం లేదు. ఆ చూపుల్లో 'నా యీ చెప్పే మాటలు వింటోందా' అన్న వైఖరి కన్పడుతోంది. అసలు మృగాలు మనుష్యుల భాషకు తెల్లబోవాల్సిన పనేముంది? ఈ లేడికి ఏం అవసరం వదినగారూ! కాస్త ఆలోచించండి" అన్నాడు.

లక్ష్మణుని మాటలు విన్న మారీచుడు "మనస్సు ఏదైనా వస్తువు కావాలని కోరినపుడు యీ మాత్రం సూక్ష్మ పరిశీలన వుండ వలసినదే" అని అనుకున్నాడు.

ప్రక్కన పొంచి చూస్తూ లక్ష్మణుని మాటలు విన్న రావణాసురుడు "సేన లేకపోయినా చెల్లుతుంది. చివరకు రాజ్యం లేకపోయినా చెల్లుతుంది. పర్వాలేదు. ఇలాంటి లక్ష్మణుడులాంటి మంత్రి ఒక్కడుంటే చాలదూ ! లక్ష్మణుడు ఎంత నేర్పరి? ఏం మంత్రిత్వం ? సీత యందలి రాముని మనస్సును కూడా త్రిప్పగల మంత్రిత్వం. నిజంగా రాముడి సిరికి కారణం యీ లక్ష్మణుడే! ఈ రాముడెంత అదృష్టవంతుడు. నేను సీతను ఎత్తుకు పోయినా రాముణ్ణి ప్రాణ ప్రదంగా రక్షించుకొని కార్య సాధన చేసి

తీరుతాడు. భుజబలం ఒక్కటే కాదు. బుద్ధిబలం, శేముషి, మహిమ, గాంభీర్యం అన్నింటిలోనూ ఇద్దరికి ఇద్దరే! ఇద్దరూ దుర్జయులే! ఈ ఇద్దరికీ మధ్య చెడేట్టు చేద్దామన్న చెడేదికాదు. ఇక్కడ బంధం—చుట్టరికం, సోదరత్వం, భయము ఇవేమీ కాదు. భక్తిమయ దాసత్వం కాని మరోటి కాదు. భేదోపాయం ఏమీ లాభం లేదు. ఇంత భయం ఇదివరకు ఎన్నడూ కలుగలేదు. వెనక్కి తిరిగి వెళ్లడానికా వీలులేకుండా పూర్తిగా కాలచోదితమైనాను. ఇక్కడ యీ లక్ష్మణుని తీరు చూస్తోంటే గుండె గుభేల్ మంటోంది. నిజంగా యిలాంటి లక్ష్మణుడు ఒక్కడు నా దగ్గర మంత్రిగా వుంటే వందమంది సీతల్ని ఇట్టే తెచ్చేవాణ్ణి" అనుకున్నాడు.

లక్ష్మణుడు యింకా చెప్పుకుపోతున్నాడు.

"అయితే ఋషి ఏమైనా యిలా లేడి వేషం తన తపశ్శక్తి చేత వేసివుండవచ్చు. కాని ఋషులు శరీరం మీద యింత మమకారం చూపరుకదా! కాబట్టి రాక్షసులే అనుకోవాలి. అదే నిజమనిపిస్తోంది. చూడగా చూడగా నాకొక అనుమానం కలుగుతోంది. వెనక నీ బాణం దెబ్బకు తట్టుకోలేకపోయి దూరంగా పడ్డ మారీచుడు మళ్లీ లేడి వేషం వేసి వస్తే ఎలా వుంటుందో యీ లేడి అలా ఉంది. అన్నగారి నీతి నా కెంతకూ అంతుపట్టదు. ఆ నాడు సుబాహుడితోపాటు మారీచుణ్ణి కూడా పంపించేస్తే బాగుండేది గదా. కాని శత్రు, తృణ శేషం మిగిల్చావు. ఆ మిగిలిన తృణం బాగా దుబ్బులు గట్టి యీ నాడు ఆబోతుయొక్క నిశిత దంతాలకు కూడా పెల్లగించడానికి వశం కానట్లుగా తయారయింది."

లక్ష్మణుని యీ చివరి మాట వినంగానే రాముడు 'వశం కాకపోతే వహ్ని పెడతాం!!' అన్నాడు. అప్పుడు రావణుడు రాముని కళ్లలో లక్ష రోహిణీ కార్తెల్ని చూచాడు!! అబ్బా! యీ అన్న గారికి బాహ్యశక్తి కంటే అంతశ్శక్తి మరింత ఎక్కువే అని అనుకున్నాడు. రామ లక్ష్మణుల మాటలు విన్న జానకి—

"ఏదో మాటల్లోపెట్టి నన్ను మరచి పొయ్యేట్లుగా చేస్తున్నారు. ఒక వేళ ఆ మారీచుడే మళ్లీ యీనాడు లేడిలా వస్తే నిన్ను గుర్తుపట్టి కూడ ఎదురుగా నిలబడగలడా! ఈ పాటికే మాయమవడూ? మరి చూడు, యీ లేడి ఎలా ఎదురుగా వచ్చి మన ఎదుటనే గడ్డిమేస్తోందో! అసురులు కామరూపులు అయితే కావచ్చుగాని చూస్తూ, చూస్తూ ఇలాంటి పిరికి లేడిలా బెరుకుదనంతో రావలసిన ఖర్మేమిటి? కాకపోతే కాంతులు విరజిమ్మే బంగారు లేడి అవటం ఒక్కటి దోషం అయిందేమో! అన్నీ మనమెరుగున్నవే వుండాలని, తెలిసినవే పుట్టాలని ఎక్కడుంది? మనకు అనుభవంలో లేనంత మాత్రాన బంగారు లేళ్లు వుండకూడదా ఏమిటి? అయినా ఒక ప్రక్క కళ్లకు ఎదురుగుండా కనబడుతూనే వుంటే సందేహం రావడమేమిటి ? మనం ముందే ఒకటనుకుంటాము. మనస్సు కూడా దాన్నే ధ్రువపరుస్తుంది! అయినా నేనేది కోరితే దాన్నిమ్మని చెప్పాడు ఆ మౌని గుర్తులేదా? నాకీనాడు లేడిపై కోరిక కలిగింది. నా కెలాంటి కోరిక ముందు కలుగుతుందో త్రికాలజ్ఞాని అయిన ఆ మౌని కామాత్రం తెలీదంటారా? అనాడు ఆ మౌని ఎందుకలా అన్నాడో ఈనాడు నాకు ఈ లేడిపై కోర్కె ఎందుకు కలిగిందో చిత్రంగా లేదూ? ఋషుల మనస్సుల్లో ఏం వుంటుందో మనం ఏమి ఊహింగలము" అన్నది.?

నిశితం గానూ, సుకుమారంగానూ, వున్న సీత మాటల నైపుణ్యానికి మారీచుడు ఆశ్చర్యపడుతూండగా రావణుడు- "ఇలా చెప్పాడంటే ఆ మౌని తప్పక అగస్త్యుడై ఉండాలి. రామునిచేత రాక్షస సంహారంకోరే యీ విధంగా చెప్పివుండాలి. కాని అలా చేస్తే సీతా వియోగ సముద్రం నుండి రాముడు ప్రాణాల్తో బయటపడగలడా? ఏదైనా ఈ మునుల గూఢపుతాణీలు, ఊహలు, పనులు, జగల్లీలాకృతులు గదా! కుంభజుణ్ణి ఏం చేయగలము? మా వంశకర్త అయిన బ్రహ్మదాకా పోతుంది వ్యవహారం" అని అనుకుంటూండగా రాముడు లక్ష్మణుని దిక్కుగా తిరిగి-

"ఈమె వచ్చి ఇన్ని సంవత్సారాల నుండి మనకు కాస్త ఉడకేసి పెడుతోంది. కాబట్టి, మనిద్దరికీ చెయ్యి కాల్చుకునే బాధ తప్పింది. ఆమెకు పుట్టింటిని, అత్తింటిని కూడా యీ అడవినే చేశాము. ఆమె కోరక, కోరక ఒక్క కోరిక కోరితే తీర్చకుండా వుండటం ఏం బాగుంటుంది చెప్పు? మనిద్ద రికీ ఎక్కడయితే సందేహం వచ్చిందో సరిగ్గా అక్కడే సీతకు కోర్కె కలి గిందే. నిజమే! అయినా అలా అని ఆమె కోర్కె తీర్చకుండా వుండటం ఏమీ భావ్యంగాదు. నిజంగా లేడి అయితే సీతకు తెచ్చి ఇస్తాను. రాక్షసు డయితే చంపి తిరిగి వస్తాను. కాని, ఆ ముని అలా అనడం, అందుకు తగ్గట్టుగానే యీ లేడి యిలా విచిత్రంగా వుండి ప్రలోభ పెట్టడం, యీవిడ యిలా కోరడం యిదంతా చూస్తే ఏదో గందరగోళంగా, గజిబిజిగా వుంది." అంటూ ధనుర్బాణాది ఆయుధాల కోసం పర్ణశాల లోనికి పోగానే సీత వెనుకనే వెళ్లి కవచాదులు అందిస్తూ "మళ్లీ ఎప్పుడు కన్పించడం" అంది. రాముడు ఆమె వంక నిశ్చలంగా చూచి, అది లేడి అవటమో, తెగటమో దాని తర్వాతనే అంటూ సీత వంక చురుక్కున చూచి ముందుకు తిరిగాడు. అందుకు సీతకు ఒక్కసారి కళ్ల వెంట నీళ్లు తిరిగి "ప్రభూ! ఇది నీకు ఇష్టం లేకపోతే మానెయ్యి. లేడి లేకపోతే మానె, ఠర్వాలేదు. తెలిసో, తెలియకో అడిగాను. కాని ఇప్పుడు 'ఎందుకు కోరానా' అని అనిపిస్తోంది. నువ్వు బయల్దేరి వెళ్లిన తర్వాత నువ్వు కనపడకపోతే నా కంగారు ఆలోచిం చలేను. వెళ్లకు. నిజంగా పనిలేని రాక్షసుడే అయితే మిగతా వాళ్లతో వుండక ఇలా చావడానికి ఎందుకు వస్తాడు. ఎందుకొచ్చింది. వాళ్ల మా నాన్న వాళ్లని పోనిద్దరూ! రాజధర్మం అనే పేరుతో నువ్వు చేస్తున్న రాక్షస సంహారానికి నా ప్రాణాలు జివ్వు మంటున్నాయి. నేను చూడ లేకుండా వున్నాను. ఏదైనా ఇది హింసాపథమే గదా! ధర్మ రక్షణకై రాక్షస సంహారం న్యాయమయితే అవచ్చు గాని, జీవులకు న్యాయమవు తోందా? జగచ్ఛ్రేయస్సు జరగటంవల్ల కొంత పుణ్యం వస్తే రావచ్చు గాని దానవ హింస వల్ల పాపం రాకుండా వుంటుందా? ఎలా చూసినా

యీ కృత్యం పాప పుణ్యాల రెంటికీ దారి తీస్తోంది గదా!" అని అంటూం డగా రాముని మనస్సు మరింత కరిగి "జానకీ నీ యీ సుకుమారమయిన మనస్సునందే నాకు అపారమయిన గౌరవం. అందుకే ఇప్పుడు నువ్వు ఎన్ని చెప్పినా నీ కోర్కె తీర్చడానికి సిద్ధంగా వున్నాను. నేనేమీ కోపగించ లేదు. కోపగించ లేను కూడా! విల్లు యిటు యివ్వు వెళ్తాను" అంటూ బయటకు వస్తున్న రామునికి వెనుక కవచం తగలగా కందిన భుజాన్ని నిమురుతూ, సీత వస్తూ, సాగనంపుతూ వుంటే- ఆ ఇద్దరి ప్రేమానురాగాలు చూసి అవతల రావణుడు ఒకసారి గతుక్కు మన్నాడు. రాముడు సౌమిత్రిని చూసి "జాగ్రత్త! నువ్వు సీత దగ్గర- అంటే సీతదగ్గరే వుండాలి. ఏదో దుష్టగ్రహం పీడ ఎదురుగా నోరు తెరుచుకు వున్నట్లుగా అనిపిస్తోంది. వనవాసం పూర్తి కావస్తోంది. ఏమిటిది? వనవాసం అంటే పూరికేపోదా ఏమిటి ? అయోధ్యను వదలి అడవిలోకి అడుగు పెట్టామంటే చెడ్డగాక మరేమిటి ? కాలాన్ని ఇవతల వుండి చూస్తే అది అతుకు ముక్కల లాగానే కనిపిస్తుంది. దాంట్లో లీనమయితే తప్ప దాని నిరంతరత్వం అర్థం కాదు. ఆ అతుకుల్లో దూరుతారు రాక్షసులు. అలాంటప్పుడే మనం మనంగా వుండాలి. సీతను కనిపెట్టుకొని వుండు. లిప్తల మధ్య కాలంలో గూడ రాక్షసులు దూరగలరు. జాగ్రత్త" అని వెళ్లిపోయాడు ఈ మాట విని రావణుడు "కొంపదీసి నేను కనబడితే యిలా అనలేదు గదా!" అని అనుకొని, ఉలిక్కిపడి వెన్ను తట్టుకున్నాడు.

## మారీచ వధ

రాముణ్ణి కొంత దూరం రానిచ్చి లేడి చెంగున గెంతి ఎంతో దూరం వెళ్లాననుకొంది. కాని అంతలోనే ఎలా వచ్చాడో లేడికి ఎదురుగా రాముడు ప్రత్యక్ష మయ్యాడు. అల్లెత్రాడు ఒడుపుగా దూరంగా విసిరాడు.

ధాన్ని ముందే గమనించి తాటిచెట్టు ప్రమాణమంత ఎత్తున దూకి ఎంతో దూరంగా పోయింది. రామునికి నవ్వు వచ్చింది. "ఇది నిజంగా అడవి లేడి కాదు. అడవి లేడి అయితే అంత ఎత్తుగా ఎగరడం అసంభవం. ఈ అల్లె త్రాడుతోనే నిన్ను బంధిస్తాను చూడు" అంటూ వెంబడించాడు. లేడి ముందు, రాముడు వెనక త్రాడు విసరడం, లేడి ఎగరడం యిలా జరుగుతోంది. లేడి ఎగిరినప్పుడల్లా ఇంద్రధనుస్సులా కన్పిస్తోంది. "దూకింది. అయినా ఉచ్చులో పడ్డది, అనేలోగానే మాయమయి పోతోంది. నిలుచున్నపుడు ఒక రంగు, దూకుతున్నపుడు ఇంకో రంగు, దిగుతున్నపుడు మరో రంగు అంతా తమాషాగా చిత్తభ్రమ కాదు గదా ఇది" అన్నట్లుంది. దాని కాళ్లకు బంధం వేసి లాగడానికి ప్రయత్నించే లోగానే అది సునాయాసంగా, చిత్రంగా జారవిడుచుకుంటోంది. దాని బెదురు చూపులు, రంగు, లావణ్యాదులు రామునికి జాలిని. ఆశ్చర్యాన్ని కలుగ జేశాయి. కాని చివర చివరకు విసుగెత్తింది. బాణం ఎక్కుపెట్టాడు. గంతులు మీద గంతులు వేసుకుంటూ, అంచెలంచెలుగా, వడివడిగా చాలా దూరం పోయింది. కాని ఏం లాభం? అంతకు మించిన వేగంతో రాముని బాణం వెనుకనే వెంబడించింది. అది సామాన్యాస్త్రమా మరి ? ఆగ్నేయాస్త్రము! మొదట్లో అయితే వున్నరూపం వున్నట్లు పట్టుకొని వాళ్దామని అనుకున్నాడు గాని, సాగనిచ్చింది గాదు. అందుకే ఆగ్నేయాస్త్రము వదిలిపెట్టాడు. అనుకున్నంతా అయింది. బాణం లేడి మీదపడింది. అంతే! మరుక్షణంలో రంగులు లేవు. లావణ్యము లేదు. అంతా భ్రాంతి. గొంతుకూడా మారింది. గిల గిల కొట్టుకున్నాడు. బాణం దెబ్బకు జీవుడు మొత్తం భక్తుడై చచ్చిపోయేముందు మనస్సునిండా రాముడే నిండి స్వామిని వేడుకొంటున్నట్లుగా "లక్ష్మణాగ్రజా" అన్నాడు. (అంటే లక్ష్మణుడంతటివాడు తమ్ముడుగా కల్గిన ఓ శ్రీరామచంద్రా అనే కేకపెట్టాడు.) కాని "లక్ష్మణా" అన్న అక్షరాల దాకానే శబ్దతరంగాలు బయటకు బాగా వినపడ్డాయి. "గ్రజా" అన్న అక్షరాలు వినిపించనేలేదు.

ఇదంతా వాయుదేవుని వల్ల జరిగింది. వాయుదేవుడు మటుకు ఏమి చేయ గలడు? అది రావణుని ఆజ్ఞ! రావణుడు మారీచుని మనస్సు స్వభావము ముందే తెలుసుకున్నాడు గాబట్టి చాలా జాగ్రత్తలు తీసుకున్నాడు. మారీచుడు ఇలాంటి పని ఏదో చేస్తాడని ముందే ఊహించాడు. కనుకనే వాయుదేవుణ్ణి పిలిచి తగిన విధంగా చెయ్యమని ఆజ్ఞాపించి కట్టుదిట్టం చేశాడు. అప్పుడు వాయుదేవుడు గతిలేక "లక్ష్మణా" అన్న అక్షరాల ధ్వని పర్ణశాల వున్నంత దూరానికి వినబడడానికి వీలులేక పోయినా— వినపడేట్లు గాను, "గ్రజా" అన్న అక్షరాల ధ్వని ఏ మాత్రం వినపడనీయకుండాను చేశాడు. రావణుడు ఇన్ని ఏర్పాట్లు ముందే చేసి, తన జాగ్రత్తలో, తన పనిలో నిమగ్నమై సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.

## సీత తొందరపాటు

'లక్ష్మణా' అని వినబడిన కేకను జానకి విన్నది. భయంతో ఒళ్లు ఒక్కసారి కంపించిపోయింది. హృదయం పెళ్లగించినట్లయింది. వెంటనే లక్ష్మణుణ్ణి చూచి "అది మీ అన్నగారి గొంతు కాదూ? పైగా నిన్ను పేరుపెట్టి పిలిచేది నీ అన్న కాకపోతే ఇంకెవరయి వుంటారు? నేను ఏదో అవుతుందనే అనుకున్నాను. అది ఆయనకే వచ్చిందా? నాకు రాకూడదూ? ఆ బంగారు లేడి రావడమేమిటి చెప్పు? ఇదంతా నా ఖర్మ. అయినా ఆ పరశురాముణ్ణి గెలిచినవాడు యీ లేడిని గెలవలేడని ఎలా అనుకుంటాను? అయినా అదేం ఖర్మమో నువ్వు ఏది అంటావో అదే జరుగుతుంది. అది లేడిగాక రాక్షసుడవటం నీ నోటి మాటవల్ల గాక మరేమిటి చెప్పు? వ్యర్థం కాకుండా వుండటం కోసం భగవంతుడు నీ కలాంటి నాలుక పెట్టాడు."

"విన్నని ఏం లాభంలే? ఇదంతా నా ఖర్మ. ఏం చేస్తాను. ఆ

రాక్షసుడు రాముణ్ణి కొమ్ముల్తో డొక్కలో కుమ్మివుంటాడు. నువ్వా ఆ రాముని కేక విన్నావుగదయ్యా! చీమ కుట్టినట్లయినా లేదే? ఏం ఇంకా అన్నగారిని దట్టమయిన నీలమేఘంలాగానే వూహిస్తున్నావా? అవతలవాడు రాక్షసుడు గాబట్టి అలా చెప్పాను. కోపగించుకోక. ఇప్పుడు నా మాట మన్నించి రాముణ్ణి రక్షించడానికి పోవయ్యా. ఈ అడవి నన్ను భక్షిస్తుందా ఏమిటి? నా సంగతి వదిలెయ్యి. నేనేమీ అవనులే. ఎవరయినా వింటే నవ్వి పోతారు కూడా. – 'నాకేమయినా ఆపద వాటిల్లుతుందని. అప్పుడు మీ అన్నదమ్ము లిద్దరూ 'సీతా! సీతా!' అంటూ యీ అడవి అంతా వెదకవలసి వస్తుందని—అనుకుంటూ వెళ్లడానికి తట పటాయిస్తున్నావేమో, నేనెవరిని హింసించి ఎవరితోనూ సగపెట్టుకోలేదు. నాతో వైరం ఎవరికి వుంటుంది? అంతగా ఎవడయినా అగ్ని గుండంలాంటి నన్ను ఎత్తుకు పోవడానికి వచ్చినా వాడూ, వాడి వంశము సర్వమూ దగ్ధమైపోతుందని గుర్తుంచుకో. ఎందుకింత ఆలోచన, ఆలస్యము. అవతల 'నాకేక విని తమ్ముడు చాపియై, కోపియై వచ్చేయడా'? అని ఊహిస్తూ ఉంటాడు మీ అన్న. ఇంక నువ్వు జాగుచెయ్యడం తగదు. నీ అన్న ప్రాణాలు పట్టి వుంచుకోలేడు. వెళ్లు." అన్నది, అప్పుడు రావణుడు—

ఈ ముగ్గురూ ముగ్గురే! వీళ్లు ఏమిమాట్లాడినా పథకమంతా ధ్వనిస్తోంది. ముగ్గురూ అఖిలసృష్టి విజ్ఞానామృత రసమూర్తులుగా గోచరిస్తున్నారు. నా రాక్షస మాయ వాళ్ళపై పనిచేస్తోందో, లేక వాళ్ళ మాటల్లో మాయ నన్ను కప్పుతోందో అర్థమవటంలేదు. ''నన్ను చూసే యిలా అంటు న్నారా' అన్నట్లుంది. సర్వజ్ఞులు కాకపోతే యిలా అనగలరా? ఏమయినా యిలాంటివారితో పగఅయినా పెట్టుకోకపోతే ఏం బాగుంటుంది?" అని అనుకున్నాడు.

సీత మాటలు విన్న సౌమిత్రి—

వదినా! ఒక్కటి చెప్పనా? మనుష్యులకు ఆపద రెండు రకాలుగా వస్తుంది. శత్రువశమువల్ల బయటినుండి ఒక విధంగానూ, మనలో నుండి మన కనుకూలంగా కలిగించుకునే ఊహల వశంవల్ల రెండో విధంగాను వస్తుంది. ఎంత అసుర శక్తియైనా అది బయటనుండి వస్తే అది అల్పమే! ఒక్క బాణంతో పటాపంచలయి పోతుంది. అంతే! కాని అదే లోపల నుంచి వస్తే ఎన్ని బాణాలు వేసినా సమిసిపోదు ఇక అది ధీశక్తిచే చక్కగా అభ్యసింపబడిన నిగ్రహానికి రూపమయిన తపోగ్నివల్ల భస్మమవడం తప్పితే మరో మార్గం లేదు. ఆసుర వేళ ఇది మరింత పెచ్చు పెరుగుతుంది. ఇరవై ఏళ్లు నువ్వూ, అన్నగారూ కాపరం చేశారు గదా! మీ ఇద్దరి హృదయాలు ఒకళ్ళకొకళ్లు తెలీదా! అన్నగారి బాహుబల, ధీ ప్రతిభా, మహనీయ వైభవం నీకు తెలియ చెప్పటం లేదు. మూడు లోకాలు ఆయన గుప్పెటకు చాలవే! నా దృష్టిలో అయన సమస్తానికి ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధిదైవిక నియంత. అయితే 'ఈ అడవికి ఎందుకు వచ్చినట్లు? ఈ రాక్షసమాయలో పడటం ఏమిటి?' అని అంటావేమో యీ రాక్షస మాయ ఎంతవరకు సాగుతుందని నీ ఉద్దేశ్యము? స్వామి వూరుకొని సాగనిచ్చినంతవరకు సాగుతుంది. అఖిల లోకములయొక్క బ్రతుకు ఆ స్వామి అంబకాగ్రము మీద ఆధారపడి వుంటుంది. మారీచుడే యిలా వాతాయువుగా వచ్చాడని చెప్తే నువ్వు నమ్మవు. ఆ పైడి లేడి మోహంలో పడి అలా అయినావు గాని ఆ కేక వినపడే విధాన్ని గమనిస్తే నీకే తెలుస్తుంది. అది పూర్తి కేక కాదు. తుది అక్షరాలు కొన్ని వినపడనట్లు లేదూ! సగంలో ఆగిపోయినట్లు లేదూ! గొంతుక బిగిస్తే వచ్చిన కేకలాగా లేదూ! వచ్చిన కేకలోని మొదటి లకారం మాత్రం జంతువు కంఠంలోంచి వచ్చింది లాగా వుంది. లేడి రూపంలో వుండి చనిపోబోతూ మారీచుడు అరచినట్లుగా వుంది. నా యీ వూహ నీకు నచ్చకపోయినా, లేదా నిజమనిపించక పోయినా కొంచముసేపు ఆగు, నీకే తెలుస్తుంది. రామచంద్ర ప్రభువు రాహువిముక్తుడై వస్తాడు. కంగారు పడకు. ఇది

గడ్డ సమయము. సరిగ్గా అసురవేళ నడుమ భాగం కూడా!" అని అంటుండగా జానకి కన్నులు కణ కణ లాడాయి కోపంగా—

"ఇంత కంటే నాకు వెళ్ళడం ఇష్టం లేదనరాదూ! అన్న అలా అవడం నా మతం అను. అయినా చల్లకోసం వచ్చి ముంత దాచడానికి ఎందుకు వెనకాడతావు? పదమూడేళ్లు మా యిద్దరితో కలసి వున్నావు. నీకు మా మీద ఎలాంటి అభిప్రాయాలున్నాయో? మీ అన్నగారు అమాయకుడు. అన్నీ వినలేడు. నువ్వు అన్నీ వింటావు. నీవి పాము చెవులు. మాకు వినపడనివి కూడా వినగల్గుతావు కదా! నీవు నిజంగా రామునికి భక్తుడవే అయితే ఆ రాముడు వెళ్లిన వైపుకు పోకుండా ఇలా నా వంక చూస్తూ వుండవు. భార్య అంటే కేవలం పురుష సంపర్కంగా మాత్రమే ఎంచుతారు కదా! 'ఐహికమే సకలము' అనుకునే సంసార జీవిని కాను. ఆత్మేశ్వరిని, యోగమూర్తిని. రాముడు అడవిమల్లె తీగ లాంటి వాడు. నేను అ తీగ చివరి పువ్వులాంటి దాన్ని. పతి నింద సహించక మునుపు దక్షుని కూతురు బొటనవ్రేలుతో రాచి అగ్నిని సృష్టించి దాంట్లో దగ్ధమయింది. రాముడు దూరమయితే నేనూ అంతే నని తెలుసుకో. రామునిలాంటి వానికి భార్య అయి కూడా కనీసం మనస్సులో నయినా అన్యుల్ని తలంచగలనా! దేవ, రాక్షస, మానవాళిలో రామునితో సమానులు ఇంకొకరు లేరు ఈ నా మాటలకు యీ పంచ భూతములే సాక్షులు. పతివ్రతను, రాముని భార్యను, యోగినిని. మూర్ఖు డెవరైనా నన్ను ఇంకో విధంగా ఊహిస్తే తల పగిలి చెక్కలవుతుంది. ఎవరి కడుపులో (మణిపూరక చక్రం) ఎలాంటి ఊహాలుంటాయో ఏం తెలుస్తుంది? అవి బయట పడితేనే గదా! పైకి పట్టరాని భక్తి ప్రకటిస్తూ ఏళ్ళ తరబడి వేరే వూహల్ని ఎదలో దాచుకుంటారు. దీంట్లోనే పర మార్ధాభినయము, పట్టు చిక్కుల చర్చ. ఇది అసురవేళట! ఇలాంటి ఊహల్ని బయట పెట్టడానికి అసుర వేళే!...... అని అంటూండంగా—

# గతుక్కుమన్న లక్ష్మణుడు

లక్ష్మణుడు గతుక్కుమన్నాడు. ముఖాన కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు. ఎవర్ని ఉద్దేశించి ఏమంటోందో తను తెలుసుకోలేని వాడా? కాని ఈ పరిస్థితిలో ఏమిమాట్లాడితే ఏమవుతుందోనని రేఖామాత్ర దుఃఖంతో అధోముఖుడై -

"నిన్ను నీవు రక్షించుకోవలసిన అవసరం వచ్చింది జాగ్రత్త. నా నొసట యివాళ ఇగా జరగాలని వ్రాసి వుంది. కానివ్వు. ఏం చేస్తాం. ప్రారబ్ధాన్ని ఎవరు తప్పించగలరు, నాకు అభిమానమా, సిగ్గా ? భక్తితో చేయబడిన రాతి మొద్దుని, 'ఈ మాట అనవచ్చు. ఆ మాట అనకూడదు' అని లేకుండా నీ ఇష్టం వచ్చినట్లు మాట్లాడావు. నేను వెళ్ళకుండా ఇక్కడ నుంచోబట్టే గదా నువ్వు యిలా అనగలిగావు సరే! వెళ్తున్నాను. నాకు ఇది సరియైన కాలంగాదు. అన్నయెడల నీవు దోషం చేసినదానివి అవుతున్నావు. స్త్రీలు ఆత్మ నిగ్రహంలో ఇంతటివారు అని నీవల్ల మరోసారి ఋజువయింది. అసురీ మాయ నిన్ను బాగా పట్టింది గాబట్టి యివి నీ మాటలు కావని తెలుసుకున్నాను. నీ మాటల్ని ఓర్చుకుంటున్నాను. నిజంగా అదే కాని పక్షంలో నీ యీ మాటలకు గుండెలో యీటెలు పొడవబడి చచ్చిపోయేవాణ్ణి! దుష్ట విధి తోసుకువస్తోంది. ప్రారబ్ధాన్ని ఎవరు తప్పించుకో గలరు, ఎలా వ్రాస్తే అలా అనుభవించవద్దా. ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. కాని,..........." అని అంటూ ఆకాశం వంక చూస్తే- వంశకర్త అయిన సూర్యుడు ఎంత వెదికినా కనపడ లేదు. అస్తమించబోతున్నాడు. లక్ష్మణుడు కూడా దుఃఖాన్ని దిగమింగుకొని తల వూపుకుంటూ సూర్యుని లాగే అధోముఖుడై అడవి మధ్యగా వెళ్లిపోయాడు !

## సీత ఆందోళన

సంధ్యారుణ కాంతులతో పడమటి దిక్కు ఎఱ్ఱబడింది. మబ్బులలో నుండి అస్తమించిన సూర్యునిలా లక్ష్మణుడు మళ్లీ కనపడలేదు. భూజాత సీతకు గుండె గుభేల్ మంది. ప్రళయానంతరం ప్రజాపతి ఒక్కడూ మిగిలితే ఒంటరితనాన్ని భరించలేక తనకు తోడుగా స్త్రీని, తన ఒంటరితనానికి తోడుగా భయాన్ని, సృష్టించగా-సమస్త సృష్టి అప్పటి నుండి జంటలు జంటలుగా సాగిందేమో ! సీత- "ఏమిటో, లక్ష్మణునితో ఎన్నో అనకూడని మాటలు అన్నాను. నెత్తిమీద పెద్దమ్మవారు కూర్చుంటే అంతకంటె ఏమనగలుగుతాను ? ఇవన్నీ రామునితో చెప్పకుండా ఉంటాడా ? పాతికేళ్ల కాపురంలో ఇల్లాంటి మాట ఎప్పుడన్నా అన్నానా? ఏం లాభం ? పాతికేళ్ల మంచితనాన్ని ఒక్క నిమిషంలో బూడిదలో పోసిన పన్నీరు చేశాను. రామా ! ఇంత వరకు నీవు సీతా మనో నాయకుడవే! మరి ఇక నువ్వు వచ్చి నా ముఖమైనా చూస్తావో, చూడవో; ఇది రాముని యందు నే చేసిన అపచారం. రాముచి జగత్ పతిత్వము. వాని తమ్ముని సత్యశీలము ఈ రెంటిని తెలుసుకోలేని అజ్ఞానినయ్యాను. అనకూడని పలుకులు అన్నాను. చేయకూడని దోషం చేశాను. ఇంత భయం ఎప్పుడూ పొందలేదు. నా మీద రామునికి కోపం వచ్చే వుంటుంది. మన మీద మనక్కావలసిన వారికి కోపం వచ్చినా మనం ఆపదలో చిక్కుకుంటే మనమీద కోపం వహించరు. నా స్వామికి కోపం సంగతి గుర్తుకు రాదు. నాపై తీరని జాలే తలుగునుంది. అయితే ఒక్క ఆపద వస్తే ఎంత బాగుండును ?" అనుకున్నది.

## కపట సన్యాసి

ఆ సంకల్ప బలం ఎంతటిదో ఏమో ! కట్టెదుట సన్యాసి ప్రత్యక్ష మయ్యాడు! పది తలకాయల జడ పట్టినంత దండము చంద్ర

హాసంలా వుంది. ముదిరిన కొండ గోగుపువ్వు రంగు వస్త్రం ధరించాడు. ఒంటినిండా పులిచారల్లా విభూతి రేఖలు, నవ్విన చిరునవ్వు ఆజాను బాహువు గర్వరేఖలా వుంది. స్వాముల వారికి నోరు పెద్దదా అన్నట్లుంది! తల మీద చార ఒకప్పుడు కిరీటధారేమో ననిపించేటట్లుంది. రుద్రాక్ష మాల ఒరపిడులు భుజకీర్తి ఒరపిడులు కాదుగదా అన్నట్లుంది. తమ్మి పువ్వు కండ్లలో, విశాలత్వం కన్న మనస్సంతృప్తి ఎక్కువ కనబడుతుంది. మెడలో స్ఫటికమాల– ముత్యాలహారాన్ని జ్ఞప్తికి తెస్తోంది. కళ్ల చివర కఠినత్వం కనబడకుండా విభూతి రేఖలు కప్పివేసినట్లున్నాయి. విగ్రహాన్ని చూడగానే బ్రహ్మ వర్చస్సుతో పాటు రాజసం ఆ ముఖంలో త్రోసుకు వస్తున్నట్లుంది. 'ఆ మెడ క్రింద గంట్లు చూస్తే శివుణ్ణి మెప్పించగా తీవ్ర వ్రత దీక్ష పూనిన తెగువేమో!' అనిపిస్తుంది. ఎదురు రొమ్ముల మీద కాయలను చూస్తే శివలింగాలింగనా పారవశ్యంలో కలిగిన రాపిడి కాయలేమో అనిపిస్తుంది. కొంచెం వంగినట్లున్న వెన్ను చూస్తే తపో బలంతో కైలాస వాసుని మోసాడేమో ననిపిస్తుంది. కఠినంగా ఉన్న చేతులు చూస్తే బహుశః శివుణ్ణి రత్నాలతో నిరంతరం పూజిస్తాడేమో ననిపిస్తుంది. ముఖంలో కనబడే ప్రభుత్వాధికారం బహుశః పరమ శివ భక్తి సామ్రాజ్య పట్టమేమో ననిపిస్తుంది. కుంభ సంభవుని తర్వాత మళ్లీ ఈయనేనేమో ననిపించేటట్లున్నాడు.

భయం, దుఃఖం కలిగినప్పుడు సామాన్య జనులకు ధార్మిక బుద్ధి నశిస్తుంది. కాని, సజ్జనులు తమ ధార్మిక ప్రవృత్తిలో దుఃఖాన్ని మరచి పోతారు. అంతటి స్థితిలోనూ స్వాముల వారిని చూడగానే సీతకు ధర్మా చరణ గుర్తుకు వచ్చింది. వనవాసానికి ఫలమా అన్నట్లు రాముని పర్ణశాలకు నవయోగి నడచి వచ్చినట్లుంది. నిజంగా చతురాననుడే ఈయన అనిపిస్తోంది. "స్వామీ! ఇవిగో అర్ఘ్యమూ. పాద్యమూ. ఆస నాన్ని అలంకరించండి. ఏం చేయ మంటారు ? వన వాసినిని, కంధ

మూలాలకంటె మీకు ఇవ్వలేను. ఒక్క పది నిమిషాలు మీరు కనక విశ్రాంతి తీసుకుంటుంటే మావారు వచ్చేస్తారు. హరిణ మాంసము తెస్తానని వెళ్ళారు. మీరు ఆరగించి మమ్మల్ని చరితార్థుల్ని చేయండి. మీ అంతటివారు ఇలా రావడమంటే ఇది మా పూర్వపుణ్య ఫలం కాక మరేమిటి ?" అన్నది సీత.

## సీతారావణుల సంభాషణ

సీత అలా అనంగానే ఆ కపట సన్యాసి రావణుడు– "మారీచుడనే వాడు లేడి రూపంలో తిరుగుతున్నాడు. కొంపదీసి మీ ఆయన వాణ్ణి లేడి అని తీసుకురాడు. కదా! అవునూ! ఇక్కడ ఉండేది– నువ్వూ నీ భర్తా ఇద్దరా ? పాపం పండింది. లేకపోతే ఈ అందమేమిటి ? అడవిలో ఉండడ మేమిటి? విశ్వేశ్వరా! ఏమిటిది ? భయం లేదూ? చూస్తూ చూస్తూ ఈ పర్ణశాల ఏ తోడూలేని, రాని ఇలాంటి చోట కట్టారేమి ? అనకూడదు కాని, ఏదైనా అపాయం వాటిల్లితే కేకలు వేసినా వినిపించుకునే నాథుడే ఉండడే! ఏమిటో ఈ మగువల్ని చూస్తే జాలి కలుగుతుంది. ఏ సన్నాసో పెళ్ళాడతాడు. అంతే ఇక వాడే మొగుడూ, వాడే మోక్షం, వాడే సర్వస్వం అంటూ కూర్చుంటారు కదా! ఒక ప్రక్క తేలుతూ మునుగుతూ కూడా ఆ సంసార సాగరాన్ని వీడరు. అదేమి చిత్రమో! అక్కడ హిమాలయాలపై ఆ పార్వతిని చూశాను. ఆ తర్వాత నిన్ను ఇప్పుడు చూస్తున్నాను. ఆవిడగారు కొండల్లోనూ – ఇక్కడ నువ్వు అడవుల్లోనూ! బావుంది వరస! భర్తలు అంతుపట్టని సన్యాసులైతే అంతే మరి. ఎవరో రాజకుమారుడట ! ఇంట్లోంచి తండ్రి వెడల గొడితే ఈ అడవుల్లోపడి తిరుగుతున్నాడని విన్నాను. కొంపదీసి వాడుండే చోటుకు రాలేదుకదా! వయసు చెల్లి యతిగా ఉండి ఖర్మకాలి ఇలా తుదికాలపు

భిక్షకై వచ్చానేమో అనిపిస్తోంది. శివ శివా! రాక రాక రాకూడని చోటుకీ రాలేదుకదా! పైగా రాకూడని మాటలు కూడా వస్తున్నాయి." అని సీతకు వినపడేటట్లుగా అంటూండగా సీత-

"మీరు విన్నది ఎవరో అయి ఉంటారు. నా భర్త శ్రీరాముడు దేవాంశ సంభూతుడు. దేవతలచే కూడా స్తోత్రం చేయబడేవాడు. పెద్దల ఆశీర్వచనాలు ఉన్నవాడు. జనకుని శివ ధనుస్సును రెండుగా విరిచిన వాడు. భార్గవుని వింటికే గతి లేకుండా చేసినవాడు. తన తండ్రి తన సవతి తల్లికి ఏవో వరాలిస్తే- తండ్రికి ఇబ్బంది కలుగకుండా ఆయన మాట నిలబెట్టడానికి ఈ అరణ్యానికి నాతోనూ, తమ్మునితోనూ బయలుద్దేరిన వాడు. మీరు పొరబాటు పడుతున్నారు. ఈ చుట్టు ప్రక్కల పుణ్యాశ్రమ వాసులైన ఋషులకు పరమధర్ముడైన వాడు ఆయన. ఇక్కడి వారికి తెలియక పోవడం ఉండదు. తమరెవరో ఈ ప్రదేశానికి క్రొత్త లాగా ఉన్నది. పదమూడేళ్లగా మిమ్మల్ని చూడలేదు, మీ గురించి కనీసం విననైనా లేదు." అన్నది. అప్పుడు—

"అంత తిరిగినారె? అడవులెల్ల?" అంటూ పకాలున నవ్వి "పాపం! ఏం గతి పట్టింది మీకు? సరే! మాది దక్షిణాది. లంకా రాజ్యమనీ— మీరు వినలేదేమిటి? అదే మాది. మేం మన్నించకుండా లంకలో రాజు (చంద్రుడని కూడా అర్థం) ఏపనీ చెయ్యడు. అతడు సర్వ భూషణుణ్ణి సేవిస్తూ వుంటాడు. ఆ లంకారాజ్యాధినేత, మూడు లోకాలకు భయంకరమైన శౌర్యం గలవాడు. వైభవం, ప్రభుత్వం వైఖరి చెప్పాలంటే లంకారాజ్యాన్నీ రాజునీ చెప్పి ఇంకొకర్ని చెప్పాల్సిందే! దక్షిణ దిక్కు నుండి మలయ మారుతాలు వస్తాయి. ఆ మలయ పర్వతం మీద చందన వృక్షాల గాలులు మీరు ఆస్వాదిస్తారు. అవి ఎక్కణ్ణుంచి వస్తాయో తెలుసునా? మా రాజు స్వామికి అర్చించిన గంధం వంటికి పూసు

కుని సభలోకి వస్తుండగా ఉచ్ఛ్వాస నిశ్వాసాల వల్ల రేగి, మీ వైపుగా అలా వస్తాయి. మా రాజ సైన్యాలు దేవ లోకాలకు వెళ్ళి అక్కడ అంతా కొల్లగొట్టి కావలసినవి సేకరించారు. అంత వరకూ భోగులైన దేవతలు అడుక్కుంటూ వీధిన పడ్డారు. అప్సరసలు పేలబడిపోయారు. మా రాజ్యంలో అంతా అదృష్టమే కాని, బీరు పోవడం లేదు. దెబ్బతిన్నవారు అసంపూర్ణులు మచ్చుకైనా ఉండరు. మీ రాజ్యంలో స్త్రీలు లేనిపోని నియమాలతో నిష్ఠలతో ఆత్మ వంచన చేసుకుంటున్నారు. అంతే! మిమ్మల్ని మీరు మోసం చేసుకుంటున్నారు. ఎవరిమాటో దేనికి? నీ సంగతి చూడు! సంపద తెగిపోయింది. అడవుల పాలైనారు. ఎందుకీ బ్రతుకు? సుకుమారమైన నీ శరీరానికి ఈ బ్రతుకు తగునా? నీ నిట్టూర్పుల గాడ్పులలో పచ్చ కర్పూరపు పరిమళాలు వెదజల్ల బడుతున్నాయి. మరి, నీవిలా ఉండట మేమిటి చెప్పు? బ్రహ్మ సృష్టికి ముందు రూపమేమో నీవు. (లక్ష్మీదేవిలా అన్నమాట) అలా ఉన్నావు నీవు మరి! ఈ స్థలం అగ్ని మండలం, అవతల గోదావరి, ఇవతల పచ్చని చెట్లు ఉండబట్టి ఎండ కొంత హద్దుల్లో ఉందిగాని, మా లంకా రాజ్యం రా! అక్కడ స్త్రీలు ఇలా ఉంటే భరించలేరు."

"చుట్టూ సముద్రాల వలన నిరంతరం చల్లని గాలి వీస్తూ ప్రాణాలకు హాయి చేకూరుస్తుంది. నీవు లంకా రాజ్యం రావాలి కాని, అయోధ్యా రాజు నిజంగా గడ్డి కరుస్తాడు. సముద్రాలు ఇంకడానికి వాటిలో నిప్పులు పోసి మండిస్తాడా? లంక దాకా సముద్రంలో రాళ్లేసి రాలేడు కదా! ఇరవై చేతులతో కైలాసశిఖరాన్నే ఎత్తాను. ఇలాంటివి పెద్ద విషయాలుకావు నాకు. ఆ పైన ఆ దొర (శివుడు) వుండి కూడా ఏం చేయలేక పోయాడు. దొరసాని (పార్వతి) కూడా ఉంది. అయినా ఆ గిరిసుత కేం గర్వం ? భక్తుణ్ణి కాబట్టి ఊరుకున్నాను. నీవు ఆలశ్యం చెయ్యకుండా, మరో ఆలోచన లేకుండా లంకకు వచ్చెయ్యి. ఈ దెబ్బతో ఆ పార్వతి గర్వం అణుగుతుంది. గంగను

నెత్తిన పెట్టుకొన్నాడు మా దేవుడు. భార్యకి శరీరంలో సగం ఇచ్చాడు. అల్లాంటి వాడి భక్తుణ్ణి నేను. (నిన్ను నెత్తిన పెట్టుకుంటానని అర్థం) మరి నీ భర్త నిన్నేం చేశాడు ? నీ కేమిచ్చాడు చెప్పు? ఎందుకొచ్చిన ఇక్కట్లు నీకు గాని లంకకి నాతో తేచిరా! వస్తే తిరిగి వెళ్ల బుద్ధి పుట్టదు తెలుసా?" అనంగానే సీత కోపోద్రిక్తురాలై-

"అనవసర విషయాలు వద్దు. కైలాసం ఎత్తినది రావణుడు అని విన్నాం. నీవేనన్నమాట! మా లంకా రాజును చెప్పి ఇతరుల్ని చెప్పాలన్నావు కదా! రాముణ్ణి చూసి కదా! ఈ తేడా చెప్పాల్సింది ? మానవుడైన నా భర్త గురించి నాకు తెలుసు. రాక్షసతత్త్వం గలవారి గురించి నాకెందుకు? నీ కిష్టమైతే అవచ్చు. నాకూ అవా లని ఎక్కడ వుంది? నాకేం ఉపయోగం? మా పిన్నత్తగారు అడవికి పంపేరు. నిజంగా మంచిపని చేసింది. ఆవిడ చాలా దూర దృష్టి గలది. ఈ వనవాసంలో ఎంత దుష్ట శిక్షణ జరగాలో అంతా జరగడానికే పంపి వుంటుంది. 'ఈ రాక్షసులతో మనకెందుకు పగ ? అన్నాను రామునితో. కాని చూడగా చూడగా ఈ రోజు నిజంగా పగ వుండాల్సిందే అనిపిస్తోంది. అన్నదమ్ములిద్దరూ ఇప్పుడే అలా వెళ్లారు. వాళ్ల వెళ్లేదాకా పిరికివాడిలా, దొంగలాగా నక్కి ఇక్కడకు వచ్చినట్లున్నావు. ఇదన్నమాట నీ పరాక్రమమూ-పన్నుగడ, తెలిసింది" అనంగానే కపటయోగి వికటాట్టహాసం చేశాడు. దశ కంఠాల ధ్వని కలిసి వచ్చినట్లుంది. వాకిలి విరిగి పడుతుందా అన్నట్లు నవ్వాడు. వర్షఋతువు, అమావాస్య, అరణ్యమధ్యం, పది పెద్దపులులు చుట్టూ నుంచుని వున్నట్లు, ఇరవై కళ్లూ మెరుస్తూ ఉన్నట్లు, ఒక్కుమ్మడిగా అరుస్తున్నట్లుంది. మధ్యలో తనున్నది. ఒంటరి మనిషి. తనుచేసిన పనికి మలినపడిన మనస్సుతో భయంతో క్రుంగి, కొయ్యబారిపోయింది సీత. ఆ స్థితిలోవున్న సీతను చూసి రావణుడు-

"నువ్వు రావాలి మా రాజ్యం. నీ రాకతో మా లంకలో రత్నాలు పుడతాయి. మన్మథ బాధ పోగొట్టుకొనేందుకు చాలా ప్రయత్నాలు చేశాను.

నిన్ను చూస్తుంటే నాకెందుకో నా బాధతీరి ప్రయత్నాలు ఫలిస్తాయనిపిస్తోంది. నువ్వు రాక తప్పదు. చూడు మరి. వాయుదేవుడు వీచగా, వానదేవత పన్నీరు చల్లగా, చంద్రుడు వెన్నెలల నిస్తుంటాడు. నువ్వు వస్తే శ్రీ మా యింట నిలుస్తుంది" అన్నాడు. ఈ పాపపు మాటలకు మాత్రం కొయ్యబారిన సీతకు తెలివి వచ్చింది. ఏం చేస్తాడోనని భయం వేసింది. అప్పుడు—సీత "కోట్ల సంవత్సరాలు బ్రతికినా చావు వుండక తప్పదు. ప్రతి వాడికీ వాడి చీకటి వుంది. ధర్మ విరుద్ధంగా ప్రవర్తించే నీకు ఆ చీకటి దగ్గరాతోంది. ధర్మ దేవత శిరస్సు తన శిరస్సుగా కలవాడు నా భర్త. రామ లక్ష్మణులతో వైరం సూర్యాగ్నులతో చెయ్యి చేసుకోవడం అన్నమాట గుర్తుంచుకో. ఇంత దూరం ఎందుకు? నీ తెలివైనపనికి నీ లంక చుట్టూ వున్న భూమిని చంక చుట్టబెట్టగలిగితే ఇక్కడికి రావడం ఆలోచించవచ్చు. సూర్యులకు సూర్యుడు నా రాముడు. బాణం వేస్తే లోకాలు దాటుతుంది. సముద్రం ఓ లెఖ్ఖా? మా ముద్దుల మరది నా మీద నిప్పులు గ్రక్కే కోపంతో వెళ్లాడు. ఆ కోపానికి నువ్వు ఆహుతి అయ్యేట్లువున్నావు. భక్తితో శివ పార్వతులను వశపరచుకున్న నీకు ఈ బుద్ధేమిటి? వివేకం లేదా నీకు ? పదితలల్ని ఒకటిగా కుదించుకుని వచ్చావు. ఆ పదింటినీ కాదు కుదించుకోవాల్సింది— ఇంకో అయిదు వున్నాయి. అవే ఇంద్రియాలు, మావారేమైనా చేస్తారేమోననేగా? లేకపోతే ఈ వేషం దేనికి? నీ కర్మలకు నువ్వు పంట సిద్ధం చేసుకున్నావు. పంటకు వచ్చిన దాన్ని నీ కొడవలితో నువ్వే నాశనం చేసుకోక! రాముడు వచ్చే వేళైంది. క్షేమం కావాలంటే వెళ్లు" అనంగానే రావణుడు పకాలున నవ్వి-

"ఆహా! నా ధైర్యం మాట అటుంచు. రాముడు వస్తున్నాడనీ— నన్ను చంపుతాడనీ అనే దానివి నన్ను పొమ్మంటున్నావేం? నిజంగా నన్ను చంపగల్గితే ఇలా పొమ్మనడందేనికి చెప్పు? రాముని యందు నీకుగల గుడ్డి నమ్మకం అలా అనిపిస్తోంది. అంతే! లేకపోతే రాముడు నన్ను చంపగల్గడమేమిటి? భూమిని శిరస్సు మీద మోసిందల్లా నేనూ, ఆదిశేషువూ! నేను

శివపార్వతులతో కలసిమోశాను. ఆదిశేషువు భూమిని మెడబెణికినట్లు (కర్కాటక–మకర రాసులలో సూర్యుడు ప్రవేశించేటప్పుడు భూమి ప్రక్కకు ఒరుగుతుంది) మోశాడు. నేను ఆ బాధ పడలేదు. నా ముందు ఆదిశేషువు కూడా పనికిరాడు. ఉన్న దేవత లెవరూ నన్ను మించరు. ఆ రాముడు దేవతాంశ అంటావేమిటి? అసలుకు దిక్కు లేదంటే అంశ సంగతి చెప్పాలా? నా పరాక్రమం గురించి పైవాళ్లందరినీ అడిగితే తెలుస్తుంది. నా వాకిట్లోపడి వుంటారందరూ. నాకే అశ్చర్యమౌతుంది నా పరాక్రమం గురించి. మృత్యుదేవత పళ్లు విరిగేటట్లు తన్నాను. నేను నిత్య వసంతుణ్ణి. అది ఒక్కటే ఋతువు నా రాజ్యంలో. నన్ను చూసి సంవత్సర పురుషుడు మత్సర పడుతున్నాడు. నాకు ఆది, అంతం రెండు లేవు. ఆది ఒక్కటే! అంతం లేదు. బాణాలు పని చెయ్యవు. రాముడు నా బంధువుల్ని చంపాడు. కాబట్టి, వాడి భార్యవైన నిన్ను దొంగిలించి దుఃఖం కలగజేసి తీరుతాను. అయినా వాడికి బంధువుల్తోనూ, భార్యతోనూ కలిసి ఉండడంలో గల ఆనందం తెలిస్తే కదా! అలా కలిసి ఉండడంలో క్రొత్త రుచుల్ని చూపిస్తాను. దాంతో నన్నా కలిసి ఉండడం అంటే ఏమిటో నీకైనా తెలిసొస్తుంది. పుచ్చిన ధనుస్సు ఎత్తి విరగ్గొట్టాడు రాముడు. అంతేగా! అల్లాంటివాడిపై భార్యవైన నీకు పాతివ్రత్యం! బాగుంది! రాముడు నన్ను ఏదన్నా చేస్తాడేమో నన్న జాలి, ప్రేమ, ఉండి నన్ను వెళ్లి పొమ్మంటున్నావు. నా ముందు వాడు పిట్ట. నేను వాణ్ణి చంపనులే! నీ యందు నాకు గల దయ అది, మా ఊరు వచ్చి నెలరోజు లుంటే వెళ్లిపోతాననవు, అయోధ్య గుర్తుకు రాదు తెలుసా? అడవిలో సన్యాసిలాంటివాడికి పెళ్లామై అనవసరంగా సగం యవ్వనం వృథా అయిందే అని అప్పుడాలోచిస్తావు. జీవితంలో సుఖాలు అనుభవించడం నిజంగా తెలుసుకుంటావు. అయినా నీ యవ్వనాన్ని పాడు చెయ్యడానికి రాముడికి ఏమి హక్కు చెప్పు? చూడు, నీ ముందు ఆ రాముణ్ణి కోతులాట ఆడిస్తాను. నీ బోటి దాని సుఖం ఎవడికైనా వికటి

స్తుందా? కాని ఆ రామునికి నీ సుఖం కూడా వికటించింది. వాడికి ఆ రోగం కుదురుస్తాను చూడు! మా లంకలో పుష్పంలో తిరుగుతూ ఉండే తుమ్మెదలు తేనెతాగుతూ గానాలాపన చేస్తుంటే, ఎవరూ ఆపడానికి వీల్లేదు- తెలుసా! కొత్తజంటలు మొహమాటం లేకుండా తిరగడానికి అన్ని యేర్పాట్లూ ఉన్నాయి! నీ రాముడికి ముని తపస్సు రక్షిస్తానన్న కామం పోలేదు.

రాక్షసుల్ని చంపుతానన్న క్రోధం చావలేదు. నిన్ను పొందగల సమర్థత ఏ కోశానా లేదు. అలాంటి భర్తతోనా కాపరం? వాడి వెంటపడి నువ్వు వచ్చావు. నీ కోసం సముద్రాలు దాటి నేను వచ్చాను. చూడు! ఎవరి ప్రేమ గొప్పదో! ఆనవాలు పడేటట్టుగా పోతామేమిటి? ఆకాశమార్గంలో పోతాం. ఏం తెలుస్తుంది? రాముడు ఆ పైన కనపడిన చెట్టునూ పుట్టనూ వెతుకుతూ మొక్కుతూ పోతాడు." అన్నాడు.

సీతకు మాట్లాడటమే అసహ్య మనిపించి మాట్లాడలేదు. మొహం అటు తిప్పుకుంది. రావణుడు గమనించాడు. "ఇదిగో విను! మంచిగా రాకపోతే బలాత్కారంగా తీసుకు వెళ్తాను. అదే మన పట్టుదల, రాక్షసత్వంలో నాకున్న పాండిత్యం ఎవ్వరికీ తెలియదు" అన్నాడు. సీతకు భయంవేసి పెద్ద పెట్టున కేకపెట్టింది. 'అదిగో రాముడు వస్తున్నాడు' అంది, రావణుడు అటు చూడగానే చటుక్కున పర్ణశాలలోనికి వెళ్లింది. రావణుడు లోపలకు వెళ్లి జుట్టు పట్టుకొని బలవంతాన లాక్కొచ్చాడు.

అప్పుడు సీత-

## సీత పశ్చాత్తాపము

"అయ్యయ్యో సౌమిత్రీ నేనెంత చేశాను? దైవం నా నడి నెత్తిన కూర్చొని నా చేత అనకూడని మాటలు పల్కించి చేయకూడని పని చేయిం

చాడు. ఇప్పుడు నన్ను దయ్యం పట్టింది. అయ్యో రామా! నీ పిలుపు నాకు వినపడింది. నా కేక నీకు వినపడడం లేదా? ఈ పది తలకాయల పిశాచం నన్ను పట్టింది. ఇప్పుడు చేసిన పనికి ఇప్పుడే ఫలితం వస్తుంది అన్నదానికి ఋజువు యిదే! (చెయ్యక చెయ్యక మంచి వాళ్లు ఒక్క చెడ్డపని చేస్తే దానికి వెంటనే ఫలితం వస్తుంది,) సూర్యుడికి కనపడటం లేదా? తన వంశానికి మచ్చ తెచ్చుకుంటాడా? ఈ రాక్షసుల్ని భస్మం చెయ్యలేడా? ఇందుకు చాలడా ఆ సూర్యుడు? ఓయమ్మ పిన్నత్తా! నీ పగ నా మీదకు వచ్చింది. తల్లీ కౌసల్యా! నీ ఆశీర్వచన ఫలం వ్యర్థంఅయింది. అది నా దురదృష్టం, రాక్షసవేళ అవన్నీ అక్కరకు రావడం లేదేమో? లక్ష్మణుణ్ణి ఇష్టం వచ్చినట్లు మాట్లాడాను. నా మాటలే నాకు శాపాల్లా పని చేశాయి. ఆపద అనగా బహిర్గతం, అంతర్గతం అన్న మరది మాట నిజం. నేను కొని తెచ్చికున్నదే ఇది అని మూర్ఛ పోయింది. మళ్లీ తెలివి వచ్చే సరికి తను రావణరథంలోను, రథం ఆకాశంలోను ఉన్నారు.

## సీత దైన్యస్థితి

రావణుడు సీత చేతుల్ని నొక్కి పట్టుకోవడంలో గాజులు అడ్డు వచ్చి నొక్కుకున్నాయి. కొన్ని విరిగి గుచ్చుకొని నెత్తురు వచ్చింది. చేతి పొడుగునా గాజులున్నాబావుండేది అనుకుంది సీత. రథం దక్షిణం వైపు పోతోంది. సీత దుఃఖాన్ని ఆపుకోలేక– "పర్ణశాల అధిదైవతమా! వన దేవత లారా! మీకూ! నాకూ ఋణం తీరింది. నమస్కారం. కాకుత్సుణ్ణయినా కాపాడు, కోండి. అయ్యయ్యో! తెల్లవారుఝామున పర్ణశాల ముందు ముగ్గు వుండదు. రేపటినుంచి దీపం పెట్టే అదృష్టం నాకులేదు. చేతనయితే రామునికి నా సంగతి సూచన ప్రాయంగా తెలియచెయ్యండి. రాముడు మీ అందరియందూ దయకలిగిన వాడు. తొలకరి వంటివాడు. తిరిగి

వస్తే మిమ్మల్ని వెతుకుతాడు. అడుగుతాడు. వరుసగా తలిలుకలిగిన పిశాచం నన్ను ఎత్తుకెళ్లింది– అని చెప్పండి. మీ తండ్రి వచ్చే వేళకు పది పుర్రెలు ఒక్కచోట ఉన్నటువంటి శ్మశాన రూపుడు నన్ను తీసుకొని వెళ్లాడని చెప్పండి. ఓ హరిణాల్లారా! వన దేవతలారా! నా సావాసం ఇక మీకు వుడందు. నా భర్త వేసారి దుఃఖిస్తున్నప్పుడు పరిచర్య చెయ్యండి! ఓదార్చండి. గాలి వశాన దక్షిణ దిక్కుగా నేను పోయినట్లు సూచకంగా మీ తలలను తిప్పండి. రాముడు రాక్షసుల్ని అగ్నిగుండంలో వేస్తాడు. అందరికీ క్షేమం జరుగుతుంది. ఓ గోదావరీ మతల్లీ! మాకు నువ్వు చల్లని గాలిని ఇచ్చావు. రాముడు నీ నీళ్ల క్రోలి ఆనంద పడ్డాడు. ఈ సీత చివరి నమస్కారాలు స్వీకరించు. రేపు ప్రొద్దున్న నువ్వు నాకై ఎదురు చూడవద్దు. ఆ పుణ్య వేళను క్రూర రాక్షసుడు మ్రింగాడు. పెద్ద వర్షం కురుస్తుంటే ఉండే అరటి చెట్లల్లా ఉంటారు అన్నదమ్ములిద్దరూ. నువ్వు గుర్తుపట్టలేక పోవచ్చు. అన్న కన్నుల్లో జలం, తమ్ముని కన్నుల్లో అగ్ని వుంటాయి. నేను పోయినది దక్షిణ దిక్కని చెప్పండి." అని అంటుండగా సీత కళ్లకు గంతలన్నా కట్టాను కాదు అనుకున్నాడు రావణుడు.

## జటాయువు

ఆకాశ మార్గంలో రావణరథం వడిగా దక్షిణ దిక్కుగా పోతోంది. క్రింద గోదావరి పాయ–తన బిడ్డను ఎత్తుకుపోయిన గ్రద్దను చూస్తూ పాకుతూ పోతున్న మహా భుజంగం లాగా వుంది. అవతల ఓ పెద్దగట్టు కనబడింది. గట్టు కాదది. రెక్కలు చాచుకుని ఉన్న జటాయువు, ప్రళయం అనే రెక్క తనలో ముడుచుకొని వున్నాడు. రావణుడు గతుక్కు మన్నాడు. సీత చూచింది. గుర్తుపట్టింది. ఎక్కడ లేని ఆశ, ధైర్యమూ కలిగాయి. "తాతా! రాముడూ, లక్ష్మణుడూ లేని సమయంలో వీడు నన్ను తీసుకు వస్తున్నాడు.

అనవసరంగా నేనే పంపాను రాముణ్ణి" అని అంటూండంగా జటాయువు చూసి గుర్తుపట్టి, రావణునితో "ఆవిడ ఎవరో తెలుసా? విదేహపతి కూతురు, యోగీశ్వరి, రాముని భార్య. పొరపాటైతే దింపివెళ్లు. వయస్సుచేత రాముడు నా బిడ్డ వంటివాడు. చెప్పుకోకూడదు కాని, అసమాన పరాక్రమ సామర్థ్యాలు కలిగిన వాడు. తండ్రి మాటకు బద్ధుడైన నిత్య సత్యవాది. నిష్కాపరుడయిన రాజర్షి. అతని దినచర్య దేవతలకు దినచర్య. ఈమె పతివ్రత, నాకు తెలిసినంతవరకు ఈ సీత వంటి సృష్టిని నేను చూడలేదు. నీకీ పని తగదు. కీడుతెస్తుంది, సీతను వదలిపెట్టు. ఆకాశంలో వున్న పక్షులు రాముణ్ణి తల్చుకొని మురిసి పోతాయి తెలుసా? ఈమె చేతి స్పర్శకు పువ్వులు కాయలౌతాయి.

## జటాయుం హితబోధ

ఈమె పాద స్పర్శకు స్త్రీ రత్నాలు పుట్టి పెరుగుతాయి. ఈమెను తీసుకొని వెళ్లి నీవు పుణ్య జన్మలు గల విత్తనాలు తవ్వుకోకు." అంటూరథాన్ని ఆపుదామనుకొని ఎదురుగా వెళ్లాడు. రావణుడు నెమ్మదిగా పోనిస్తున్నాడు. మళ్లీ జటాయువు రావణునితో–

"మనమంతా కాశ్యప ముని సంతతి, నీ మంచికోరి చెపుతున్నాను. మనది ప్రథమ సృష్టి. తొలి యుగంలోని మనమే ధర్మం తొలగితే ఎలా? మనవాళ్లు వేలకు వేల యేండ్లు తపస్సు చేశారు. మనుష్యులకు మేలు చేసిన వాళ్లు. నీవు చేస్తున్న ఈ పని తగనిది. వదిలెయ్యి. నువ్వూ నేనూ, ఎన్ని వేల సంత్సరాలు బ్రతికాం చెప్పు? ఇంకా నీ కిలాంటి సరదాలేమిటి? కొంత కాకపోతే కొంతన్నా నీకు విసుగు రాలేదా? ఎన్నో సంవత్సరాలు గడిపాను. నాతో పాటు నువ్వూ పెరుగుతున్నావు, మారవేం? జంతువుల సృష్టి విచిత్రం. ధర్మబద్ధంగా వుంటాయి. కామము నందు నీ మనస్సుకు - కోతికి కొమ్మల

మీద చాంచల్యము కన్న చంచలం. ఈ బుద్ధి నీకే పుట్టిందా? ఒక తలకి -పది తలలు నీకు. ఒక్కదాంట్లోనూ వివేకం లేదు. రెండు చేతులకు- ఇరవై చేతులు నీకు. బలం పదింతలు. కాని వివేకం అందుకు విలోమంగా వుంది. మనస్సు కామం మీదకు లాగితే బుద్ధి ధర్మం మీదకు పోవాలి. కామసుఖాలు స్మరిస్తున్నపుడే బావుంటాయి. కాని అనుభవిస్తున్నపుడు బావుండడం అంత వుండదు. చాలా మంది పాపం చేసినవాళ్లని చూశాం. కాని అంగీకారం కాని స్త్రీ చేత పాపంచేయించే నిన్ను ఒక్కణ్ణే చూశాను. పంచేంద్రియముల వలన చిల్లర సంతుష్టి తెలిస్తే- అది కారణ భూతమైన అసలైన ఆనందానికి దారితీయాలి. నీ సాధనగూడా తక్కువదేం కాదుగదా! మరి ఇలా చేస్తున్నావేం? అయితే మెట్ట వేదాంతం మాట్లాడుతున్నావన్న మాట! పుణ్యం, పాపం లేనివాడివి. మరి నీ బోటిగాడికి ఎందుకు ఆ శివ పూజ? అన్నీ తెల్సు. మరి ఇంక ఏం చెప్తాం? ఇంక నీకు తన్నులే గతి. రోహిణీ కార్తెలో అగ్నిని పెట్టుకుంటున్నావు సుమా! అది అంటుకోక మానదు.ఆరిపోదు గూడా! అంటుకున్న తర్వాత వెదురు గడలా కులం, వంశం తగలబడి పోతాయి." అన్నాడు. రావణునికి జటాయువు మాటలు గొత్తిగా చెవికెక్కలేదు.

## రావణ జటాయువుల యుద్ధం

జటాయువు వెనగ్గా వెళ్లి రథాన్ని ఎత్తాడు. "చాలాసేపు చూశాను. వినవేం? మర్యాద తెలీదా ? గౌరవం నీకొక్కడికే తెలుసా ? వయోభేదం గూడా పాటింపవేం? ఎంత గతిలేని వాడైనా ఆత్మబంధువుకి ఆపద వస్తే అడ్డుకుంటాడు, ఆదుకుంటాడు. చాప చెదిరితే చదరంతైనా వుంటుంది. నీ కిందాకటి నుంచి చెపుతున్నాను వినవు. ఇంత మందిని చూశాను. నీ లాంటి వాణ్ణి చూడలేదు. శూరునివే కాని బుద్ధివున్నట్టు లేదు.

అవిడ తండ్రికీ- నాకూ గాని- ఆ రాముని తండ్రికీ, నాకూ వున్న

సంబంధం నీకు తెలీదల్లే వుంది. అడుగు ముందుకు సాగకు జాగ్రత్త!" అనం గానే రావణుడు-"ఏం?ఏంచేస్తావేమిటి?"అంటూ రథాన్ని పోనిస్తూనేవున్నాడు. జటాయువు ముక్కుతో రథాన్ని పొడవంగానే రథం పల్టీకొట్టింది. రథానికి కట్టిన గాడిదలు వెల్లకిలా పడ్డాయి. జటాయువు రావణుని కుడి భాగాన్ని రెక్కతో కొట్టాడు. కుడి చెవికి వున్న కుండలం తెగి క్రింద పడింది. రావణుడు భగ్గున మండిపడ్డాడు. కోపంతో "ఏరా పక్షీ! రెక్కఅంచు అంతా తగిలేట్టు కొట్టావేం" అని ధనుస్సు పట్టాడు. కన్నుల్లో నిప్పులు వస్తున్నాయి. ఎదురుగా జటాయువు వస్తుంటే అమ్ములు వేశాడు. కాని జటాయువు వాటిని తప్పించుకొని బాణాలు వేస్తున్న చేతుల్ని ముక్కుతో గీరాడు. గ్రద్దని కాకి పొడుస్తున్నట్లుంది. రథాన్ని పైకెత్తి,సరిచేసి సారథి మలుపు తిప్పుతున్నాడు.

ఇద్దరి మధ్యా బాగా యుద్ధం జరుగుతోంది. పూచిన మోదుగ చెట్లులా వున్నారు ఇద్దరూ! మరనూనె గానుగ లాగా ఇద్దరూ తిరుగుతున్నారు. ఇద్దరి శరీరాల మీద ఇండుపగింజలంత స్వేద బిందువులు ఏర్పడ్డాయి. నెత్తురు ముద్దలు పగడాల్లాగా వున్నాయి. జటాయువు అమ్ములకు తాళలేక రావణుని వింటి మీద వ్రాలాడు. విల్లు విరిచాడు. మెడలో హారాలు తెంపాడు. దృశ్యం బందిపోటు అయిన తర్వాత వూరులా వుంది. రావణుడు ఇంకోపట్టు పట్టాడు. అనేక రకాల బాణాలతో రెక్క ఆడకుండా ఒక్కుమ్మడిగా, ముక్కు తెరవనీయకుండా కొట్టాడు. అయినా ఆ వింటిని గూడా విరిచాడు జటాయువు. రావణుడు ఇంకో విల్లు ధరించి, ఇలా వూరుకుంటే లాభం లేదని అహంకారం వచ్చి ఇంద్రజాలాయుతమైన అస్త్రాలు వేశాడు. జటాయువుకు రావణుడు కన్పించలేదు. జటాయువు బ్రహ్మను స్మరించాడు. రావణుడు కన్పడ్డాడు. అస్త్రాలు మాయమైనాయి. అప్పుడు జటాయువు—

'దుర్బుద్ధి పుట్టిన వారికి ఎంతవరకు బుద్ధి చెప్పాలి? అనిలేదు.

చివరిదాకా చెప్పాల్సిందే." అని అనుకొని రావణునితో "నీకింకా భూమ్మీద అన్నంలేదు. జీవితంలో చేసినవన్నీ చెడ్డపనులే. ఎప్పుడో ఒకప్పుడు మంచిపని చేస్తే లోకం మెచ్చుతుంది. సీతని నువ్వు వదిలేస్తే అలా మెప్పు పొందుతావు. ఈ ఒక్క— పనీ చెయ్యి. ఒకతని భార్య అతనికి గార్హ పత్యాగ్ని అయితే ఇంకొకడికి ప్రళయాగ్ని. ఆ సీతని భార్యగా చేసుకో గలిగింది ఆయన ఒక్కడే! ఆయన దయాదాక్షిణ్యాలు ముద్దకట్టిన మూర్తి. రామునికి గలిగే వూహలు సహజమైనా అవి వేదాల మధ్యలో వుంటాయి. మంచి పశువుకి ఒక దెబ్బ, మంచి మనిషికి ఒక మాట! ఏమి చెప్పినా లాభం లేకపోయింది. ఏం రాక్షస ధర్మంరా నీది. మానవుని కన్న రాక్షసుడు వేయి రెట్లు మూర్ఖుడు అని నిరూపించావు. సీత అనే ప్రళయా గ్నికి లంక తగలబడటం మొదలు పెడ్తే లంకలోని వారు బూడిదల్తో అయినా ఆర్పలేరు. ఆ నిప్పు ఇంక యుగ యుగాలకు ఆరదు. నీకాష్టం యుగ యుగాలకు అలా కాలుతూనే వుంటుంది. వివాహం అనే పవిత్ర ధర్మమందు అపవిత్రంగా వర్తించావు గాబట్టి వివాహ ధర్మమున్నంత కాలం నీకాష్ఠం తగలబడుతూనే వుంటుంది "అంటూ ముక్కుతో రావణుని తల, భుజాలు పొడిచాడు. రావణుడు జటాయువుని అస్సలు లెక్కచెయ్య లేదు. త్రోసి వేశాడు. జటాయువు వెల్లకిలా పడ్డాడు. దిమ్మెర పోయాడు. తెలివి వచ్చింతర్వాత వెనక నుంచి వచ్చి పొడుద్దా మంటే పది తలలు అడ్డంగా వున్నాయి. ముక్కుతో చేతుల్ని ఒక్కసారి చీల్చాడు. వెంటనే పుట్టలోనుండి పాములు లేచి వచ్చినట్లు తెగిన చేతులు మళ్ళీ వచ్చాయి. ఖగపతికి ఆశ్చర్యమేసింది. ఈ శక్తిని చాలా రహస్యంగా దాచాడు రావణుడు. ఇంతవరకూ, ఇది తన జీవిత రహస్యం. ఎవరికీ ఈ రహస్యం తెలియనీయకూడదు. అవతల జటాయువుకు— "కొంపదీసి తల తెగినా గూడా ఇలాగే తిరిగి వస్తుందా" అన్న అనుమానం కలిగింది. రావణుడది వెంటనేగ్రహించి "ఇంక ఈ పక్షిగాడు బ్రతికివుంటే తన రహస్యం బయటకు

ప్రాకుతుంది" అని రెండు చేతుల్తో సీతని పట్టుకుని ఒక చోట నిలబెట్టాడు. జటాయువుని దగ్గరకు రానిచ్చి రెక్కలు ముక్కలయ్యేట్టు విరగ గొట్టి—

"ఇంక ఎక్కడికీ పోలేవు, ఎవ్వరికీ ఏమి చెప్పలేవు. నా సంగతి నీకు తెలిసినట్లు లేదు. నీ సొమ్మేం నేను దొంగిలించాను చెప్పు? అయినా మధ్యలో నీ ప్రమేయం ఏమిటీ? అందుకే మీ జాతిని వేటాడి చంపుకు తినమన్నారు. బ్రహ్మ మరీ తెలివి తక్కువవాడు. లేకపోతే పక్షుల్నీ. పాముల్నీ సృష్టించడ మేమిటి? ఆ ప్రజాపతికి అకాలంగా కామం కలిగి నపుడు మీ జాతి పుట్టి వుంటుంది. నీ కీ శాస్తి జరగాల్సిందే! నారహస్యం తెలిసి, నీకు ప్రాణం వుండి గూడా ఎక్కడకీ కదలటానికి,] మాట్లాడటానికి వీలులేదు, అలా జీవచ్ఛవంలా పడివుండు'' అన్నాడు.

## సీత ఆవేదన

సీత ఆ దారుణ దృశ్యం చూడలేక పోయింది. దీనస్థితిలో వున్న జటాయువును చూస్తూ— ''ఓ కల్పాంత జీవీ! రాముని భార్య గదా అని నీవు ఇలా అయిపోయావు. నేను అనవసరంగా రాముని భార్యగా పుట్టి నిన్ను ఇలా చేశాను. పక్షివైనా ఆత్మబంధు వయావు. నీ రాక శుభశకునం గదా! మరి ఇలా అయిందేం? మరిది లక్ష్మణుడు దైవ విధి ముందు యీ విషయాలేమీ పనిచేయవని అంటూనే వెళ్లాడు. నువ్వు కనపడంగానే చాలా రోజుల తర్వాత మా మామగారు వచ్చారనుకున్నాను. ఈ స్థితిలో నిన్ను చూస్తుంటే చివరిదశలో మా మామగారు ఇలాగే వెళ్లివుంటా రనిపిస్తోంది. ఏమిటో నాజన్మే అంతా మాయగావుంది. అసలు పుట్టడం దగ్గర్నుంచి అంతే అనిపిస్తోంది. నా యందు మేలుకోరి మాట్లాడిందల్లా లక్ష్మణుడే! (మాయ చీల్చగలవాడు ఉపాసకుడే) నేను అపార్థం చేసుకుని అనకూడని మాటలన్నాను. తాను బాధ పడ్డాడే గాని పల్లెత్తుమాట అనకుండా వెళ్లి పోయాడు."

"ఇక్కడ ఇప్పుడు నా మేలుకోరి ఇలా అయావు. అల్లాంటి రంగు లేడి ఉండ దనిపించలేదు అదేమిటో ఎవరికీ లేనివీ, జరగనివీ నాజన్మలో నిజమౌతాయి. చేజేతులా రాముణ్ణి దూరం చేసుకొన్నాను" అంటూ జటాయువును సమీపించబోయి ముందుకు వెళ్లబోయింది. రావణుడు అలా వెళ్తుంటే రాక్షస మాయ ప్రసరింప జేశాడు. సీతచుట్టూ గాలి క్రమ్మింది. కదలలేక పోయింది. గాలి అగ్నిలాగా మీదకు వస్తున్నట్లు చేశాడు. 'నాపాల బడ్డావు. ఇంక నువ్వెక్కడికి వెళ్లగలవు' అంటున్నాడు రావణుడు. సీత పరుగెత్తుతోంది. యముడల్లే రావణుడు వెంబడిస్తున్నాడు. సీత అడవంతా గుండ్రంగా తిరుగుతోంది. కాని సీతకు అడవే తనచుట్టూ తిరుగుతున్నట్లుంది. ఎండిన బాడిదచెట్టులా, కోటగుమ్మంమీద దిష్టిబొమ్మ లాగా వుంది. తల చెదిరింది, చీర చిరిగింది. ఎదురుగా 'ఎక్కడికి వెళ్తావు? అంటూ మీది మీదికి వస్తున్నాడు రావణుడు. సీత ఒక చెట్టు పక్కగా వెళ్ళి సేద దీర్చుకుంటుంటే – వెనకగా ఎప్పుడు వచ్చాడో ఏమో చీర కొంగు పట్టుకున్నాడు. అంతే! "రామా!" అంది. ఆ కేకకు చెట్టుపైన పక్షులు తమ వేళ్లమధ్యన వున్న గ్రుడ్లను అమాంతం తెలీకుండానే నొక్కేసాయి. ఆ స్రావం రావణుడి మీద పడింది. "ఛీ! ఛీ!" అని పైకి చూశాడు. మరుక్షణంలో సీత పుట్టచాటుకి వెళ్లి నక్కింది. రావణుడు వెళ్లి పట్టుకున్నాడు. కోర గల్గిన పాము కప్పపిల్లను పట్టుకుంటే కీచు మన్నట్లు "కీ" అని కేకపెట్టి వాలిపోయింది. ఈ దృశ్యం చూసిన ఒక అడపాము తలను రాతికి వేసి కొట్టుకుని చచ్చింది. రావణుడు సీతను రథంలో వుంచి, రథాన్ని పైకి పోనిచ్చాడు. పైన ఋషులూ, దేవతలు అందరూ వాయువులో లీనమై ఆ దృశ్యాన్ని చూడలేక, చూడలేక చూస్తూ "ఈ రావణుడు మురికి కాల్వకు వేసిన గట్టులాంటి వాడు. కొందరు బ్రహ్మను ఛాందసుడన్నారు గాని ఏమీకాదు. లేకపోతే ప్రభుత్వం దేవతలది అంటాడేం, నిజానికి అదెక్కడిది? వట్టిపేరు మిగిలింది.

నోరు ఆ రాక్షసులదేగా. రాక్షసుల్ని ఎప్పుడూ రెచ్చిపోయేవారి గానే సృష్టిస్తాడు. వాళ్లేమో బ్రహ్మ మాకు అనుకూలుడే గదా అనుకుంటారు. పోనీ ఒక్కమాటు స్వర్గాన్నంతా రాక్షసమయం చేసినా బావుండేది. అలా గాదు, కొన్నాళ్లు వాళ్లది, కొన్నాళ్లు వీళ్లది అంటాడు. పోనీ ఆ రాక్షసుల దగ్గరకు వెళ్లి సహాయం చేస్తామంటే చేయించుకుని తన్ని అవతలకి తోస్తారు. అందుకే వాళ్లని పలకరించడం గూడా తప్పే. ఎవరిమీదో ఏందుకో కోపంగానే వుంటారు. ఆ కుటిల నీతికి హద్దు, వద్దు వుండగు" అనుకుంటున్నారు.

క్రింద ఉన్న సీత-గిలగిలలాడుతున్న జటాయువునుచూస్తూ ఏడుస్తూ "ఓ రావణా! నీ కులమంతా నాశనం చేసుకుంటున్నావు. ఆ జటాయువును అలా చేశావు. ప్రాణాలేమీ పోలేదు. రాముని కీవార్త ఆ జటాయువు ద్వారా తెలుస్తుందిలే! నువ్వు తెలివైన వాడివై తే ఆ జటాయువును పూర్తిగా చంపిరా. అప్పటికి గాని నువ్వు పూర్తిగా రావణాసురుడివి కాదు- రాజు జారుడైతే వర్ణసంకర మౌతుంది. దొంగ, త్రాగుబోతు ఐనా అంతే! రాజ్యం నాశన మౌతుంది. నీలాగే దొంగతనం, జారత్వం రెండూ తోడైతే ఏం జరుగుతుందో తెలుసా? కలిపురుషుడు "ఆహా ఎంత హాయి గొలిపే ప్రదేశం దొరికింది" అని నీ రాజ్యంలో ప్రవేశించి తిష్ఠవేస్తాడు. వాడు ప్రవేశించాలే గాని అటుపైన నీకు సర్వనాశనమే" అన్నది. రావణుడు ముఖం ప్రక్కకి త్రిప్పుకున్నాడు.

## నగలమూట

రథం ముందుకు దూసుకు పోతోంది. సీత క్రిందకు చూస్తోంది. పైకి మనోహరమైన గాలి వేసింది. అల్లాగే చూస్తూ పవిటకొంగు కొంత చింపి దాంట్లో తన నగలు తీసి మూట కట్టి ఆ మూట చంకన బెట్టుకొని

సమయం కోసం చూస్తోంది. ఆకాశం మీదకు క్రింద ఒక కొండ కనిపించింది. క్రింద జన సంచార మున్నట్లు తోచింది. "రాముడు వచ్చేటప్పటికి ఈ జటాయువు చనిపోయినా ఈ నగలు గుర్తుగా పనికి వస్తాయి" అని అనుకుంది. కాషాయాంబరధారులు కన్పడ్డారు. కొందరి ముఖాలు సౌమ్యంగా కన్పడ్డాయి. నామాలు పెట్టుకొని వున్నారు. ఋష్యమూక పర్వతం దగ్గర వానరజాతి పరమ భాగవతోత్తములు- అయిదుగురు స్ఫుటంగా కన్పడ్డారు. అందరిలో ఒకళ్లకే కిరీటం వుంది. బహుశా రాజై వుంటాడనుకుంది సీత. ఒక్కొక్కళ్లు దిగ్గజాల్లా వున్నారు. రావణుడు వాళ్లను చూసి 'కోతిమూక' అని అశ్రద్ధగా ఎటో చూస్తున్నాడు. సీత అదను చూసి ఆ అయిదుగురి మధ్యనా ఆ నగల మూట పడేసింది. రావణుడు మాత్రం ఇది చూడలేదు. ఆ అయిదుగురు పైన రథం పోతున్న దృశ్యాన్ని వింతగా చూస్తున్నారు. నగల మూట పై నుండి పడబోతూంటే ఒకడు ఉత్తరీయాన్ని పట్టాడు. అందుకే చప్పుడు గూడా కాలేదు. ఆడదాన్ని ఎత్తుకు పోతున్నవాడు గదా – ఇంకొకరెవరైనా చూస్తారేమో ననే భీతితో రావణుడు ఎటో చూస్తున్నాడు.

రావణ రథం సముద్రం మీంచి దాటుతోంది. పైన పక్షులు రెక్కలు అల్లాగే కొయ్యల్లా అయి చూస్తున్నాయి, సిద్ధులు, సారణలు వీణా రావం ఆపి చూస్తున్నారు. కన్నులు లోయలలా చేసుకొని చూస్తూన్న సిద్ధులు ఏం చేద్దామా అనేంతలోనే రావణుడు దాటి పోయాడు. దేవతలు మాత్రం దాటాడా లేదా అని కనిపెట్టుకుని మరీ చూచి దాటేంతర్వాత లో లోపలే సంతోషించారు. (ఇక రావణ వధ జరిగి తీరుతుందనే ఆశతో) రావణుడు సిగ్గు అనే మహా సముద్రాన్ని దాటినట్లు సముద్రాన్ని దాటి లంకకు దగ్గరగా సూటిగా వచ్చాడు.

# సీతా నిర్బంధనం

లంకకు దగ్గరకు వస్తున్నకొద్దీ లంకా పట్టణం పింఛం విప్పుకున్న నెమలి ఎదురొస్తున్నట్లుంది. సీత మేడల్ని చూసింది. గోపురాలు, కోట బురుజులు ఆకాశరాజు డొక్కలో గుచ్చుతున్నట్లున్నాయి. అన్నీ కోటి ఆకాశాల్ని ప్రక్కకి తంతున్నట్లున్నాయి. 'ఈ రావణుడు ఆకాశాన్ని ఆక్రమించాడా' అన్నట్లుంది. రావణుడు తన మేడ మీదకు వాలాడు. సీతను అక్కడ దింపి చెమటలు తుడుచుకుంటూ "మనకి చేతకానిది ఏదీ లేదు," అంటూ అహంకార పడ్తున్నాడు. దండకారణ్యంలో లోపల గుహల్లో కొందరు రాక్షసులు రాత్రంతా మెలకువ గానే వుండడం సీతకి తెలుసు. సరిగా అలాంటి వాళ్లే ఇక్కడా కన్పడ్డారు. జంతువులు గోళ్లతో చీరి చంపుతాయి. కాని ఇక్కడివాళ్లు కత్తులతో చీల్చి చంపుతారు. అదొక్కటే వీళ్లకు, జంతువులకు తేడా అనిపించింది సీతకు. వాళ్లు పిడుగులు పడబోతూంటే ముందున్న మేఘాల్లాగా వున్నారు. రావణుడు, అందరినీ ఒక్కసారి కొరడాతో కొట్టి పిల్చి "ఆ మేడ మీద సీత దిగింది — అడక్కుండానే అన్ని ఏర్పాట్లు జరగాలి. పడతి యెడల నిరాదరణ జరక్కూడదు. జాగ్రత్త! ఏమన్నా తేడా జరిగిందని తెలిసిందా వళ్లు చీరేస్తాను" అంటూ సీతను చూస్తూ — మళ్లీ "కలువల్లాంటి ఆమె కళ్లకు ఎండపొడ తగలకూడదు. చంద్రుడిలాంటి ఆమె ముఖంమీద మబ్బునీడ పడగూడదు. ప్రాతస్సంధ్య, సాయం సంధ్యల్లాంటి ఆమె పెదవులపై చలిగాలి తగల కూడదు. ఆ గులాబీ చెక్కిళ్లపై పువ్వుల పుప్పొడి తప్ప రేగిన ధూళి సోకకూడదు. మంచిగంధం లాంటి సౌగంధ ద్రవ్యాలు ఏర్పాటు చేయండి. ఏఏ వారాల్లో ఎల్లాంటి నగలు ధరించాలో అవి ధరింప జెయ్యండి. ఎవరు అనుకున్నారు- ఈమె? వెనక నేను కైలాసం ఎత్తిన సమయంలో కోపం వచ్చి నన్ను అదోలా చూసిన దేవి ఇలా అవతారమెత్తి మన మీద కరుణించి ఇలా వచ్చింది. ఎలా చూసుకుంటారో

జాగ్రత్త ! (చిన్న అబద్ధం ఆడాడు) ఆ స్వామి కొరకు గొంతుకలు కోసి పూజ చేస్తాను గదా ! ఇప్పుడు ఈవిడకు మర్యాద లోపమొస్తే మీ గొంతుకలు కోస్తాను జాగ్రత్త!" అని చెప్పి సీతని భద్రం చేసినట్లేనని భావించి ఇక రాముని మీద కట్టుదిట్టం చెయ్యడానికి సన్నాహాలు చెయ్యాలనుకొన్నాడు. పాము నడిస్తే ఆ పాముకు ఎన్ని కాళ్లున్నాయో చెప్పగల చోరుల్ని పిలిపించాడు. వారితో—

## రావణుని కట్టుదిట్టాలు

"విన్నారు గదా మీరు. జనస్థానం ఇప్పుడు లేదు. పెద్ద శ్మశానం అయింది. ఒక్క మదమెక్కిన వాడివల్ల అల్లా అయింది. పైగా వాడు మనిషే ! తండ్రి రాజ్యం పోగొట్టుకుని అడవుల వెంట తిరుగుతున్నాడు. వాడు ఈ ప్రాంతాలకు వచ్చినట్లు వార్తల వల్ల తెలిసింది. ఆ భూమిపై ఆకాశంలో గ్రద్దలు తిరుగుతున్నాయి. క్రింద-వాడు, వాడి తమ్ముడు శివుడు, నందీశ్వరుడిలా వుంటారు. చాలా శౌర్యం గలవారు. వాళ్లు విల్లు పట్టుకుంటే మరి ఎదురు ఎవరూ నిలువలేరు. కాబట్టి మిమ్మల్ని పంపుతున్నాను. కలబడడం, కుస్తీలు, యుద్ధాలు ఇల్లాంటి డొక్కు పద్ధతులు పని చెయ్యవు. మాయోపాయం తప్ప మరేవీ పనిచెయ్యవు. వెనగ్గా వెళ్లినా వాళ్ల వీపులు కూడా చూడగలవు జాగ్రత్త! తమ్ముడు ధీశాలి. నిద్రాహారాలు గూడా మాని అన్నను సేవిస్తున్నాడు. మన ప్రాణానికి వాడొకడు.

అన్నని మాయపుచ్చటానికైనా ఏమైనా వీలుందేమో గాని ఆ తమ్ముణ్ణి ఏ పద్ధతిలోనూ ఏమీ చెయ్యడానికి వీల్లేదు. మీ వేషాలు మార్చుకున్నా ఏం లాభం లేదు. అవీ అయినాయి. నడకనిబట్టి గుర్తు

పట్టాడు ఆ తమ్ముడు. ఎందుకిలా చెప్తున్నానంటే నా మీద మీకు భక్తి. ఆ సంగతి నాకు తెలుసు. అందుకే మీరెక్కడ ఈ భక్తితో వాళ్లమీద తొందరపడి దెబ్బ తింటారోనని చెప్తున్నాను. (తాను ఎంత మంచివాడో అని అనిపించుకోడం కోసం) మీరు వాళ్లని చంపకూడదు కూడా! మీరు వాళ్లెక్కడికి వెళ్తే అక్కడికి వెళ్తూ ప్రతిపూటా నాకు వివరంగా వార్తలందించాలి. వాళ్లదెసకు మాత్రం వెళ్లకండి. అదృశ్యాకృతులతో, తిరస్కరణీ విద్యతో మెలగండి. పొరపాటున ఆవేశంచేత గాని, భక్తిచేత గాని వాళ్ల వలలో పడకండి. అన్నగారికి ఆపద వచ్చింది. ఏడుస్తూ వుంటాడు. వాళ్లేం చేస్తున్నారో చెప్పండి, అంతే! వాళ్లని తేలిగ్గా గుర్తుపట్టవచ్చు. తొలకరి మేఘంలా వుంటాడు అన్నగారు, ఉషఃకాల బాలారుణకాంతులు తమ్మునివి. నడుస్తూంటే ఆ క్షాత్ర రీవి తెలుస్తుంది. కాని శివుడిలా జటా జూటాలు ధరించి వుంటారు. భార్యా విరహంలో ముద్ద అయిపోయాడు ఆ అన్నగారు, వాడి విరహాన్ని మరింత పెంపొందింప చెయ్యండి. పూవులై, మబ్బులై, కోకిల ధ్వనులు చేసి, వసంత శోభను కలుగజేసి ఇలా వాడి మనస్సును మరింత బాధ పెట్టండి. అవి చెయ్యండి, ఇంకేం చెయ్యక్కర్లేదు, చెయ్యలేరు గూడా– ఇక వెళ్లండి" అనివాళ్లని పంపేశాడు.

రావణుడు అన్నీ గట్టి చేసుకున్నాననుకున్నాడు. ఇంత వరకు సీతతో ముఖాముఖిమాట్లాడి ప్రలోభపెట్టి వశపరచుకోవాలనుకున్నాడు. "లంకనుముందుచూపిస్తే ఆ పైన సీత వప్పుకోకతప్పదు" అనుకున్నాడు. సీతను ఉంచినచోటు వద్దకువెళ్లాడు. రాక్షసులమధ్య ఎర్రబడ్డకన్నులతో సీత చూస్తూకూర్చున్నది. లోగడగూడా తాను విరాధుడు, మొదలైన పిశాచ రూపాల్ని చూచింది గాని, ఇక్కడి వాళ్లు మరీ భయంకరంగా ప్రతి క్షణం మారిపోతున్న రూపాలతో వున్నారు. కళ్లు మూసినా కోరలతో, తెరచిన నోళ్లతో, వ్రేలాడే నాలుకలతో కనబడుతున్నారు. ప్రాణాల్ని ఎంత తీయగలి

గితే అంత గొప్ప అనుకునేవాళ్లు ఆ రాక్షసులు. భ్రష్ట జిహ్వలు. వాళ్ల మాటలు కర్ణకఠోరంగా వున్నాయి. అల్లాంటివారి మధ్య ఇంకెన్నాళ్లు బ్రతుకు తానులే అనుకుంది. సూర్యోదయానికి స్నానం గూడచేయడానికి వీలు లేక పోయేటప్పటికి ఆహారం ముట్టలేదు. ప్రాణాలు కళ్ళల్లో వున్నాయి. ప్రాణం ఎక్కడో సముద్రం అట్టడుగున ఉన్నట్లుంది, శరీరం ఏమౌతుందో అనే భావన కలుగలేదు. తననుగురించి రాముడెలా విలపిస్తున్నాడో అన్న బాధ ఒక్కటే ఉన్నది. పది సివంగులు, పది తోడేళ్లు, ఒకలేడి చుట్టూ వుంటే వున్నట్లు సీత అచేతనంగా నుంచునివున్నది. బలవంతంగానైనా చూపించాలి అనుకున్నాడు రావణుడు. లలితమైన ఉద్యానవనాలు, సరస్సులు మణిభవనాలు, మాలాదీర్ఘికలు (దిగుడుబావులు) తోరణావలులు, చూపించాలనుకున్నాడు. అక్కడ ఎంత మాత్రంగా సూర్యరశ్మి వుంటే బావుంటుందో అంతే ఉండేట్లుగా కట్టుబాటు చేయడం జరిగింది. దేవాంశ సంభూతులు కేవలం భావసంస్కారము నందు బ్రతుకుతారు. రాక్షసులు అలా కాదు. శరీర ధర్మంమీద ఎక్కువ నమ్మకమున్నవారు. సీత రావణుని కేమన్నా భావ సంస్కారం కలుగుతుందేమోనని ఆశించింది. రావణుడు దీనికి వ్యతిరేకంగా సీతకు దేహభావం వస్తుందేమోనని ప్రయత్నం చేస్తున్నాడు. సీతని రథంలో కూర్చోపెట్టుకుని తీసుకు వెళ్లాడు.

## ప్రలోభ ప్రయత్నము

"ప్రతి పువ్వులోనూ తుమ్మెదవుంది. చూచావా అశోభ ? ఆ పువ్వులో తేనె అయిపోదు, తెలుసా ? అసలు ఇలాంటి పూలను, అందులోనూ సముద్రపు ఒడ్డున నువ్వెప్పుడైనా చూశావా ? కోకిల కూతలు వింటున్నావుగా ! ఒక కోకిల కూతకు ఇంకొక కోకిల కూతకు వైవిధ్యం కూడావుంది. వినగా వినగా విసుగొచ్చేట్లుగా అన్నీ ఒకే

రకంగా వుండవు గమనించావా ? కనుచూపుమేర వరకు ఎటుచూచినా ఉద్యానవనమే ! పెద్ద పెద్ద చెట్లు, ఎవరన్నా "ఏమండోయ్" అంటే ప్రతిధ్వనిస్తూ స్వాగతం పలికే తీరు రాడ్యూహాలు చూశావా ! ఇక్కడ గౌరవానికి ఏ లోపం రాకుండా అన్ని ఏర్పాట్లూ వున్నాయి. ఏ విధం గానూ శత్రువుల ఆటలు ఇక్కడ సాగవు. ఆ సంగీతం విన్నావా ! వెదురు బొంగుల ఖాళీలోంచి గాలివీస్తే ఈలలుగా వచ్చేధ్వని అది. ఈ కోకిల కూతలు, సముద్రపు ఘోషలు, నెమళ్ల కేకలు, మనోహరమైన తోటలు, – ఇవన్నీ ఇక నుండి నీవే" అన్నాడు.

"కోనేళ్ళల్లో ఈదుతున్న కొంగలు స్త్రీల నీలివస్త్రాల వెనుక వున్న శంఖ తావళాలులాగా వున్నాయి. ఆ నీళ్ల చాలా స్వచ్ఛంగా వున్నాయి. కోనేళ్లల్లో వెన్నెలలు పోసినట్లున్నాయి. ఈ నీళ్ల పైన చల్లగా లోపల వెచ్చగా వుంటాయి. అన్ని కోనేళ్ళలో నీళ్ల ఒకే రకంగా వుండవు. నీళ్ళ రుచులు వేరు వేరుగా వుంటాయి, ఈ కోనేళ్ళన్నీ నీవి."

"చూశావా ఎదురుగా వున్న సౌధాలు ఎంత ఎత్తున వున్నాయో? అవి తల ఎత్తి చూస్తే కంఠంనరాలు ఎర్రబడతాయి. (తల అంత పైకి ఎత్తాల్సివస్తుంది.) ఈ సౌధ స్తంభాలు ఎంత ఎత్తున ఉన్నాయో ఎవరూ చూడలేరు. ఒక వేళ చూచినా పైనుండి కాంతిపుంజం కళ్ళలోకి కొడు తుంది. ఆ పైన సూర్యకాంత శిలలున్నాయి. సూర్యకాంతి పడితే నిప్పు వస్తుంది. అక్కడ చంద్ర కాంత శిలలూ వున్నాయి. చంద్రకాంతి పడితే నీళ్లువస్తాయి. ఊహాతీతమైన భోగములను అక్కడ తట్టింప చేస్తాయి. మోహాన్ని పెంపొందింప చేస్తాయి. అద్దాల మేడలు, ఒక బింబానికి ఏన్నో ప్రతిబింబాలు, ఆ సౌధాల్లో మనల్ని మనమే చూచుకో వచ్చు తెలుసా ? (ఇలా అంటూండగా – 'నీకు అదొక్కటే జరగలేదు. అంటే ఆత్మదర్శనం జరుగలేదు' అని అనుకుంది సీత)

"ఆ భవనాల వెనుక స్వేచ్ఛా జలక్రీడల కొరకై కోనేళ్ళున్నాయి. వాటిలో మెట్లన్నీ రత్నాలంకార భూషితాలే! మెట్లమీద కాళ్ళు పెడితే రంగురంగులు ప్రతిబింబిస్తాయి. ఆకాశగంగాజలములు కావు ఇవి. పాతాళ గంగా జలాలు. అంటే భోగవతి జలమన్నమాట. ఇందులో హంసలు గూడా కామ ప్రవృత్తిని అవలంబిస్తాయి. (మనస్సు పాతాళం లోకి దిగబడితే పరమహంసలు గూడా కామ ప్రవృత్తిలోకి దిగుతారని అర్థం. మనలో భోగములకై దక్షిణాగ్నిగా ఉపయోగించు శుక్రమును భోగవతితో పోలుస్తారు. ఇది పాతాళ లోకంలో అనగా నాభికి దిగువ వున్న రాక్షసలోకంలో వుంటుంది. సత్సంతాన ప్రాప్తికై గార్హపత్యాగ్నిగా ఉపయోగించు శుక్రమును మందాకినిగా పోలుస్తారు. ఇది హృదయానికి, నాభికి మధ్యగల మర్త్యలోకంలో వుంటుంది. తేజస్సముపార్జనకై ఆహవనీయంగా ఉపయోగించిన శుక్రమును వియద్గంగగా పోలుస్తారు. ఇది హృదయానికి పైనవున్న స్వర్గలోకంలో వుంటుంది.) ఒకమెట్టు మీద వున్న హంసలు ఇంకో మెట్టుమీద నుండి చిలకల లాగా కనపడతాయి. కాస్సేప్పటికి చిమ్మబడే నీళ్లు పడి నెళ్లమలాగా కన్పడతాయి. ఇవన్నీ కూడా నీవే అన్నాడు రావణుడు."

"ఆ ప్రక్కనే పెద్ద స్తంభాలున్నాయి. ఆ గోపురాల చివర్లు మబ్బుల్ని తాకుతున్నాయి. వాటికి కట్టిన తోరణం ఆకాశం అనే వస్తాదుకు వేసిన పూలదండలాగా వుంది. ఇంద్ర నీలమయమైన స్తంభాలు, ఇంకా అస లైన విహార సౌధం వుంది. నిన్ను తీసుకు వచ్చేంతవరకు నేను ఇక్కడకు రాలేదు. ఈ భోగాలు, ఏర్పాట్లు అన్నీ నీ కోసమే! నీవే! (అంటే ప్రకృతి సంబంధ మైనవే! అని గూడా అర్థం) నేను నీ దాసుడిని. నా అదృష్టానికి నీవు రాణివి. ఈ నా చంద్రహాసం సంగతి నీకు తెలియదు. చెప్తాను విను. ఎదురుగా వస్తుంటే ఇంద్రుడి వక్షస్థలం మీద కొట్టాను. అంతే! పోయి చూడు కావలిస్తే! అల్లాంటిదాన్ని నీకు రక్షగా అట్టే పెట్టాను. నేను ఒక

స్వర్గాన్ని జయించానని చెప్పుకుంటారు. కాని నిజానికి అది చిన్నమాట. ఇరవై స్వర్గాలను ఇరవై చేతుల్తో పెళ్లగించి పెట్టాను. ఏ లోకంలో వాళ్లైనాసరే వాళ్ల ప్రాణాలమీద రుచితప్పి వుండిపోయారు. పుట్టని శత్రువులు కలది ఈ లంక, ఈ లోకం. నీ ఎఱ్ఱని పాదాలతో ఈ భూమిని పవిత్రం చెయ్యి. మొదలు, తుదిలేని నా ఐశ్వర్యం నీ పాద నీరజముల ముందు వుంచుతున్నాను. నేను ఇంతవరకు అడిగించుకున్న వాణ్ణే కాని. ఎవర్నీ, ఏదీ అడిగింది లేదు- ఒక్క నీ ముందు తప్ప. నీ రాముడు వచ్చి నిన్ను తీసుకుని వెళ్లినా అయోధ్యలోనే గదా కాపురం?"

"ఈ లంక ముందర ఆ అయోధ్య ఎంత? నా ముందు రాముడెంత? ఎదురుగా చక్కెర పెట్టే వేపాకు తింటానంటే ఇంక నేనేమీ చెప్పలేను. మమకారం చేత ఈ లంక కంటే అయోధ్యే బావుంటుందనిపిస్తే మరుక్షణంలో ఆ అయోధ్యను నీదిగా నే చేస్తాను. నీ సౌభాగ్యం నాది కావాలిగాని, నీవు ఏది అడిగితే ఇవ్వను? అందుకు నా పరాక్రమానికేం తక్కువ? నీ సౌభాగ్యం, నా పరాక్రమం కలిస్తే ఎన్నైనా శ్రేయస్సులు జరుగుతాయి. నా మాట కాదనకు."

"సీతా ఇది విను. నేను శివుణ్ణే మాయలో పడేశాను. ప్రతిరోజూ శివుడికి తలలుకోసి ఇస్తాను. ఆ తలలు మళ్లీ వస్తాయని ఆ శివుడికి తెలీదు. వెఱ్ఱివాడు. నేనలా యిస్తుంటే పొంగిపోతాడు శివుడు. ఆ శివుడు మనవాడే! మనం ఏం చేసినా చెల్లుతుంది. (శివునిమీద గూడా గౌరవం అలా తగ్గిపోతోంది) నా బ్రతుకు నీ పాదాల దగ్గర పెట్టి నీచరణ పద్మాలంటి శ్రీ రహస్యం తెలుసుకున్నాను. ఇంత త్రికరణ శుద్ధి నాకు ముందెన్నడూ లేదు. లేకపోతే క్షణకాలంలో శ్రీ రహస్యం తెలుస్తుందా! (శ్రీవిద్యా రహస్యం) ఈ లంకా రాజ్యం కావాలంటే నీ పేర వ్రాయించుకో! ఇది శివుడికి తలకాయ అర్పించిన లాంటిదికాదు! సీత లంకాధిపతి అయితే నేను నీ దాసుణ్ణి అవుతాను. కామవిద్యకు కల్పవృక్షం లాంటిదానా! నీ కన్నుల

కటాక్షం కాకపోతే ఆ మన్మథుడు తన జెండాపై చేపన్నెందుకు పెడతాడు? ఆ చేప నీ చూపు. అందుకే వాడంత విర్రవీగి, పేట్రేగి పోతున్నాడు. నీ కటాక్షం పడ్డ చోటల్లా నాకామం పరిపూర్ణ మౌతుంది. ఇంక మరో మాట చెప్పకు, మరో ఆలోచన రానీకు, నా మాట మన్నించి నన్ను ధన్యుణ్ణి చెయ్యి." అన్నాడు.

రావణుడు పలికిన మాటలకు సీతాదేవి ఒక గడ్డిపోచను ఇద్దరికీ మధ్యన వుంచి, ఆ గడ్డిపరకను చూస్తూ

## సీత నిర్లక్ష్యము

"శివునకు నీ తలకాయ నివ్వడం అర్చనేమిటి? అవి ఊరికే మళ్లీ వస్తాయి గాబట్టి అర్పించావు గాని అవి రాకపోతే అర్పించే వాడివా? పైగా శివుణ్ణి మోసం చేశానని ప్రగల్భాలు పలుకుతున్నావు. నీ వివేక మెంతని చెప్పాలి? శివకైవల్యం పొందటానికీ, దీనికీ ఏమన్నా సంబంధం వున్నదా అసలు ? శరీరం, మనస్సు ఆయన కధీనమైవుంటే నీకు సంకల్పా లుండేవి కావు— నన్ను ఇలా తీసుకువచ్చే వాడివి కాదు. నీ యీ పని భక్తి అవుతుందా ? పవిత్రత కోల్పోయింది. భక్తివల్ల స్వప్రయోజనం సాధిద్దామనుకుంటున్నావు, అంతేగాని అది భక్తి ఎలా అవుతుంది? "ఎందు వల్ల ఇంత భక్తి?" అన్న ప్రశ్నకు వచ్చే సమాధానం బట్టి దాని విలువ వుంటుంది. నీది కేవలం తామస మార్గం. దీనికి దుష్ట ఫలితం తప్పదు. చావబోయే ముందు చేసే పనులు ఇవి. సత్పదార్థాన్ని కరిగించి అమ్ముకుంటున్నావు. పైగా దీని మూలాన్ని నీ కామం గూడా వృద్ధి చెందుతుంది— అంతే! కామానికి అధీసుడివిగా అంటే కామానికి పైన వుండాలి గాని కామ పూరణం చేయకూడదు. కామాన్ని పూరిద్దామన్న దుష్టబుద్ధి వల్ల ఇల్లాంటి ఆలోచనలు వస్తాయి. ఈ కామం శరీరంలో అధో మార్గానికి లాగేస్తుంది. (అధో మార్గం అంటే దక్షిణ దిక్కు. భోగములకు, కేవలం ఇంద్రియ పరి

తృప్తికి ఉపయోగించే శుక్రాన్ని దక్షిణాగ్నిగా సమన్వయ పరుస్తారు. ఈ దిక్కుకు యముడధిపతి. అనగా మృత్యువు అధిపతి. మరి పర్యవసానం ఆలోచించుకో! అవతల రాముడు పరమసత్త్వ గుణాఢ్యుడు. 'ఎటువంటి వారినైనా సంహరించ గలను,' అన్నది మీ రాక్షస ప్రవృత్తి అవచ్చు: కాని 'ఎటువంటి వారినైనా సంరక్షించగలను' అన్నది రాముని ప్రవృత్తి. నువ్వు ఒక్కడివీ ఆయన కరుణకు నోచుకోలేదు. అందుకు నాకు బాధగానే వుంది కూడా! మా పర్ణశాల వద్దకు "సన్యాసి"లా వచ్చి, నిన్ను నువ్వు పొగుడు కున్నావు. పొగుడుకోవాలంటే ఆ సన్యాసిలా రావడమేం ఖర్మ! చంద్రహాసం పట్టుకుని ఇంద్రాదుల్ని కొట్టా నన్నావు. ఇదిగో చూడు. నీ చంద్రహాసం అంతు తేల్చడానికి– రాబోతుంది రామ బాణం. సిగ్గులేక ఎందుకీ పనికమాలిన ప్రగల్భాలు? చేసిన తప్పుడు పనులను గొప్పగా చెప్పుకోడం నీ సంస్కారాన్ని తెలియ చేస్తుంది. నీ వెనక వుండే వైభవం గొప్పది గావచ్చు, మరి చేసే పనులు దానికి తగ్గట్టుగా వుండాలి గాని, ధర్మ భ్రష్టతను తెల్పేవిగా వుంటే ఏం ప్రయోజనం ? మనస్సు నిండా ఇంత కంపు వుండి 'శరీరం ఎంత ఇంపుగా ఉందోచూడు' అని స్త్రీ వశం కోసం సగర్వంగా చెప్పుకున్నట్లున్నది. ఇల్లాంటి వాడిచేత ఏ స్త్రీ వలపు పొందు తుంది? ఈ చపల బుద్ధికి పరిహారం– కోతులు వచ్చి గోళ్లతో చీల్చి నపుడే వీలౌతుందేమో! మూర్ఖుడైనవాడు (అంటే నీ బోటిగాడు) పాతి వ్రత్యమనే అగ్నిలో పడి భస్మమౌతాడు. సూర్యునికి కాంతి ఎల్లాగో, ఎక్కు పెట్టిన వింటికి అమ్ము ఎలాగో నేను రాముడికి అలాటిదాన్ని. నేను వేరే వ్యక్తినిగాను. రాముడు విల్లు అయితే నేను బాణాన్ని, ఒక మహామూర్తిలో సగ భాగం నేను. నీ తలలు తెగిపోతే మళ్లీ పుట్టుకొస్తాయన్న రహస్యం ఆ జటాయువు ద్వారా తెలిసిపోతుందని రెక్కలు, డొక్కలు ముక్కలు చేశావు. రామునికా విషయం తెలియటంతోటే నిన్ను తన తీవ్రలోచనాగ్ని తోనే దహించెయ్యగలడు జాగ్రత్త!" అన్నది. సీత అన్న ఈ చివర మాటకు రావణుడు మండిపడి–

## రావణుని కోపం

"ఇంత మందిని చూశాను. ఇల్లాంటి ఆడదాన్ని చూడలేదు. అల్లా అయితే నే చెప్తున్నా విను. పన్నెండు నెలలు నీకు గడువు ఇస్తున్నాను. అందాకా చూస్తాను. (ఏమీ చెయ్యలేక పోవడానికి ఇదే నిదర్శనం) ఆ లోపున మారావా మారావు. మారవూ? ఏం చేస్తానో చూడు. ముక్కలు ముక్కలు చేసి, తాలింపు పెట్టి దంతాలతో నమిలి మింగేస్తాను. ముద్దు వచ్చినపుడు చంకెక్క మన్నారు. అదేం లేకపోగా బిఱ్ఱ బిగిసి నన్నే భయపెడతావా? ఎవడడ్డమొస్తాడో నేను చూస్తాను. పెళ్లాన్ని సరిగా చూసుకోలేని సన్యాసి నా అంతటి వాణ్ణి చంపుతాడంటావా! నీకిదే శాస్తి–" అంటూ చుట్టుప్రక్కల వున్న పిశాచ శ్రేణిని పిల్చి–

'వళ్లంతా కందిపోయి చారికలు పడేట్టుగా బలవంతాన దీన్ని నేల మీద పడేసి బర బరా లాక్కుపోయి అశోక వనంలో వుంచండి. మరచి పోయి అయినా సరే ఎప్పుడూ ప్రాణాలు మాత్రం తీయకండి. మీ రందుకు బాగా అలవాటు పడినవారు గాబట్టి చెప్తున్నాను. పడతికి ప్రాణాపాయం వాటిల్లితే మీ ప్రాణాలుండవు మరి జాగ్రత్త! 'ఇలా బ్రతికి వుండటం కంటే చావు ఎంత నయం? ఎంత సుఖంగా వుంటుంది' అని ఈమె మనస్సుకు అనిపించేట్లు మాత్రం చెయ్యండి. ఈ తలబిరుసంతా వదిలి దారికి రావాలి. గడ్డాలు పెరిగి పిశాచరూపు లైనవారు మరో ఇద్దరు మీలో చేరడానికి తగినట్లుగా మారినవారు వచ్చి ఈవిణ్ణి చూడ్డానికి వచ్చే లాగా చెయ్యాలి. పట్టపగలే పీడ కలలు వస్తాయనేట్లుగా చెయ్యాలి," అని విస విసా ముందుకు నడచి, మరల వెనక్కి వచ్చి, అందులో నాయకులను రహస్యంగా పిలిచి– "ముందు చతుర్విధోపాయాలూ ప్రయోగించండి. అల్లా అని చెదరగొట్టి గుండె చెదరిపోనీకండి" అమెకు ఆ భర్త, మరిది

ఇద్దరూ వస్తారని ఆశ. అది ఎన్నడూ జరిగేది కాదని గట్టిగా చెప్పండి." అని వెళ్ళిపోయాడు.

పిశాచ రూపులైన రాక్షసులు సీతను అశోక వనానికి తీసుకు వెళ్లారు. 'కూ' అని స్వాగత వచనాలు పలుకుతున్న కోయిలలు తమ నీల శరీరచ్ఛాయతో రాముని రూపాన్ని, తమ పేరులో మొదటి రెండక్షరాలు తారు మారు చేసి దర్పణ ప్రతిబింబ న్యాయంగా మరాళములు రాముని నామాన్ని, పింఛం విప్పినాట్యం చేసే నెమళ్లు రాముని కేరగంట చూపుల్ని గుర్తు తెస్తూ సీతకు అశోక వనమంతా రామ మయంగా గోచరించింది. చిగురాకు కొరికిన కోకిల కళ్లలోని ఎఱ్ఱదనంలోను, చిలుక ముక్కు యొక్క దొండపండు ఎఱ్ఱదనం లోను, మెట్టతామర పూలప్రక్క కేగిన హంస రెక్కల ఎఱ్ఱదనంలోను, గున్న తంగేడు పూల గుబురులో చేరిన లేడిముట్టె ఎఱ్ఱదనములోను–రుద్రుడు తన అరుణాంఘ్రులతో ప్రళయ తాండవానికి తయారవుతున్నాడా అన్నట్లు – అశోక వనమంతా ఒక అకాల సంధ్యా రాగం ఉద్భవించింది. తూర్పు, పడమర దిక్కుల వద్ద రావల సిన సంధ్యలు సముద్ర మధ్యంలో (లంకలో) జనించాయి. ఇదేమీ పెల్లుబికే బడబాగ్ని కాదుగదా అన్నట్లు భయంకరంగావుంది.

## రామ లక్ష్మణుల ఆరాటం

రాముని బాణం తగలంగానే మాయలేడి రూపంలో వున్న మారీచుడు "లక్ష్మణా (గ్రిజా)" అన్న కేక పెట్టాడు. ఆ కేకలోని ముందు అక్షరాలైనా 'లక్ష్మణా' అన్నవి మాత్రమే వినబడేట్టు వాయు స్తంభన చేయించాడు రావణుడు. సీత పోరగా లక్ష్మణుడు రాముని వద్దకు బయల్దేరాడు. అవతల రాముడు కేకపెట్టిన మాయలేడి దగ్గరకు వెళ్లాడు. రాముడు మారీచుని శరీరం చూశాడు. చచ్చిపోయేటప్పటికి

వాడికున్న ముఖం అలానే వుంది. హృదయంలో భక్తి, ముఖంలో భయం స్పష్టంగా కన్పిస్తున్నాయి. రాముడు అది గ్రహించాడు. వీడు తనంత తాను రాలేదు. ఎవడో పంపిస్తే వచ్చివుంటాడు. ఎవరు పంపించి వుంటారు ? వాడికి కారణం ఏమైవుంటుంది ? నా యెడ భక్తి వుంటే వీడిలా ఎందుకు చెయ్యాలి ? పెట్టిన కూత మోసం. చేసిన నమస్కారం భక్తి – రెంటికీ పొసగటం లేదు. ఏమో ఇల్లాంటివి జరగకూడదా? ఈ రాక్షస రాజ్యంలో ఎల్లాంటి చిత్రాలైనా వుండవచ్చు. లోపల వైరం, పైన స్నేహం. అల్లాగే లోపల భక్తి, బైటకు వైరం వుండాల్సిన వారుండవచ్చునేమో! ఏం చేస్తాం! అసలు వీళ్ల మనస్సుల్ని తెలుసుకోడమే కష్టం. ఏదైనా వీడు పర్ణశాలనుండి నన్నిక్కడకు తీసుకువచ్చాడు. లక్ష్మణుడు ఇక్కడకు రావడానికి కేకవేశాడు. అవతల సీత వంటరిగా వుంటే చంపి తినడానికి రాక్షసులు వేసిన పన్నాగమా ఇది? సీతను చంపి తినడానికైతే వీడెందుకు చేస్తాడు, నా మీద భక్తి గదా ! అయితే సీతని ఇంకో రాక్షసుడు ఎత్తుకొని వెళ్లడానికా? వాడిమాట కెదురు చెప్ప లేనివాడై వుండాలి వీడు. వీడు సీత కన్నుల కరువు తీర్చాడు. నా మీద అంత భక్తి అయితే నా కిదంతా చెప్పితే నేను చూసుకునేవాణ్ణి గదా ! ఇంతదాకా రానిచ్చేవాణ్ణా ! వెధవ తెలివి రాక్షసులది. లేక వీడి తల్లిని చంపిన పగ పోలేదా ? లక్ష్మణుడు అంత తెలివి తక్కువగా ఇక్కడకు రాడు. అయినా కేక అంత దూరం వినిపిస్తుందా? నా చేతుల్లో పధ్నాలుగు వేల మంది చచ్చారు. మళ్లీ ఏ రాక్షసుడు ధైర్యం వహిస్తాడు! అంటూండగానే వెనక్కి తిరిగాడు. వెనక నక్క 'కూ కూ' అని కూసింది. ఎడమ కన్ను అదిరింది. గుండె మీద కొటినట్లైంది. రక్త ప్రసారం వడి పెరిగింది. ముఖం చెమట పట్టింది. విల్లుపై పట్టు సడలింది. (శక్తి సడలింది–శక్తి–సీత) ఆ కాసేపు కళ్లల్లోటతళుకు తగ్గింది. (కళ్ళలో తళుకు–సీత) అర లిప్తలో ఇల్లా అయింది. (రెప్పపాటులో సగం) నిష్కారణంగా సీతను రాక్షసులు చంపి తిన్నారా ? అడవిలో వంటరిగా

దుఃఖిస్తూ సీత వాళ్లకి ఆహారం అయిందా ? లక్ష్మణుడు అంత తెలివి తక్కువగా రాడు. కాని తొందరపడి సీత పంపవచ్చుగదా! నాయందు పగచేత సీతను చంపి రాక్షసులు ముక్కలు చేసి తినలేదు గదా! అనుకో కూడదు అనుకున్నా ఆగని ఆలోచనలు వచ్చేస్తున్నాయి.

అట్నుంచి లక్ష్మణుడు వస్తున్నాడు. ముఖాన నెత్తురు చుక్క లేదు. "రాముడే మయ్యాడో ? సీత ఏమౌతుందో" అన్న రెండూ చాలు నెత్తురు లేకపోవడానికి. సీతను వదలి రావద్దన్నాడు తను. వదలి వచ్చాడా? రావద్దంటే లక్ష్మణుడు వచ్చే మనిషి కాదు. లక్ష్మణుడు దగ్గరకు వచ్చేశాడు. తనూ లక్ష్మణుడూ ఇద్దరూ ఒకలాగే ఉన్నారు. గత ముప్పదియైదు ఏళ్లగా ఇలా ఇద్దరూ ఎప్పుడూ లేరు. లక్ష్మణుడు దగ్గరకు రాంగానే ఉండబట్టలేక "ఏమిటిలా వచ్చావు. నిన్ను చూస్తే నా గుండె నిలవటం లేదు. సీతకేమైంది ? రాక్షసులు పంచుకొని తిన్నారా ? చెప్పు ? నువ్వొక్కడివే వచ్చావేం ? నిన్ను చూస్తుంటే యుద్ధం చేసిన లక్షణం గూడా కనపడటం లేదు. కేవలం విషాదమే గోచ రిస్తోంది. నేను కళ్లతో సీతను చూస్తానా? రాక్షసుల చేత చంపబడిన ఎముకల ప్రోగులు చూస్తామా? గుమ్మంలో కాలు పెట్టంగానే నా కాళ్ల మీద ఆవిడ చూపుల వెల్గులు పడ్తాయా? సీత మనది అనుకోకు– భూ పుత్రి, జనకజ, దశరథుని కోడలు అందరికీ సమాధానం చెప్పాలి." అన్నాడు రాముడు. అప్పుడు లక్ష్మణుడు "అన్నా వదినగారు పర్ణశాలా ప్రాంగణంలో భద్రంగానే వుంది. నేను పయలుదేరి వచ్చేవేళకు నేను వచ్చే మార్గాన్ని చూస్తూ ఆ ప్రాంగణంలోనే నిలబడి వుంది. అక్కడ మరి రాక్షస సంచారమున్నట్లు లేదు. ధరణీజాత భద్రంగానే వుండవచ్చు" అన్నాడు. వెంటనే రాముడు–

"అయితే మాత్రం పర్ణశాల వద్ద వంటరిగా జానకిని విడిచి

వస్తారా? భద్రమేనని ఎలా చెప్పగలము? ఈ లేడి ఊరికే వస్తుందను కుందామా? ఊరికే నిన్ను పిలిచిందనుకుందామా? నా జానకి చల్లని చూపుకన్న పదివేల రాజ్య సుఖాలు ఎక్కువా? నాదేవి రక్షింపబడాలిగాని అల్లాంటి రాజ్యాలు ఎక్కడ లేవు? ఈ భూమి ఇక్కడ మాత్రమే వుంది- ఇక్కడ లేదని లేదు గదా! అదిగో నా ఎడమ భుజం ఎలా అదురుతోందో? బహిశ్శకునాలు, అంతశ్శకునాలు ఒకే రకంగా వున్నాయి. (సాధారణంగా సామాన్యజీవులు తమ మనో దృక్పథంలోని కోరికలను బట్టి బహిశ్శకునాలు ఇష్టానుసారంగా మళ్లించుకుంటారు. కాని, అంతశ్శకునాలు భవిష్యత్తును నిజంగా సూచిస్తాయి. 'శుభఫల దశాయాం తాదృశేరంతరాత్మా' అన్నారు. ఈ అంతశ్శకునాలనుబట్టే పెద్దలు నడచుకుంటారు. లోపలి మనస్సు, బయట నడత రెండూ ఒకటే అయిన చిత్తశుద్ధి, త్రికరణ శుద్ధి గలవారికే అంతశ్శకునాలు బహిశ్శకునాలు ఒకేలా వర్తిస్తాయి. మాండవ్యమహర్షి అందుకే ఇల్లాంటి వారి విషయంలో 'మనోజవంతు మాండవ్యః' అన్నాడు అడవిలో అన్ని జంతువులూ కుడి నుండి ఎడమకు పరుగెడ్తున్నాయి. అడవిలో పవిత్ర వాతావరణం లేదు. ఈ ఒక్కరోజు అడవి అడవిలా అనిపిస్తోంది ఇన్నాళ్లకు. ఈ మృగాలన్నీ ఇదివరకు మన ప్రక్కనుంచి రాచుకుని వేళ్లేవి. కాని నేడు మనిద్దర్నీ చూసి కళ్లు ఎఱ్ఱగా, చూపులు కోసగా వుండి దూరం దూరంగా పోతున్నాయి. 'దిగులు పడటం దేనికి?' అని ఎంత సమాధానం చెప్పుకుందామన్నా ఆగటం లేదు లక్ష్మణా! నేను వచ్చేటప్పుడు ఎల్లాంటి సమయంలోనూ నిన్ను వదినగార్ని వదిలి రావద్దని చెప్పానుగదా! అయితే నన్ను రక్షించటానికి వచ్చావా? నా దగ్గఱకు రావాలో అవతల స్త్రీ దగ్గఱకాపలా వుండాలో ఏ మాత్రం వివేకవంతుడికైనా తెలుస్తుందే! అక్కడ క్షేమంగా వుంటే ఈ హృదయంలో క్షేమం వుంటుంది. సీత క్షేమంగా వుండాలేగాని వెయ్యి కైకమ్మ తల్లుల కోర్కెల్ని చెల్లించ గలను తెలుసా? నేను గెలవలేని రాక్షసుల్ని నువ్వు గెలవగలగటం,

అవతల సీత రక్షణలోనే ఉండటం సాధ్యమౌతుందను కున్నావా నాయనా ? నన్ను చంపగలిగిన వాడెవడైనా వుంటే నువ్వు వాణ్ణి ఏమీ చెయ్య లేవు తెలుసా ? అల్లాంటి సమయాల్లో నువ్వు మటుకు వచ్చేం లాభం చెప్పు?" అన్నాడు. లక్ష్మణుడికి గుప్పున రక్తం త్వరితంగా ప్రవహించింది. కోపం రాలేదు గాని, ఏమీ చెయ్యలేకపోయాడు. కన్నీరు కట్టలు త్రెంచుకొని ప్రవహించింది. అవతల సీత ఇలాంటి పరిస్థితి కల్పించి వుంటుందని రాముడు గ్రహించాడు. "పట్టరాని దుఃఖం ఇక్కడ వచ్చిం దంటే అక్కడ నీకు పట్టరాని కోపం వచ్చివుండాలి. సీత వెళ్లమంటే— ఆ సీతకు రక్షణ గురించి తెలీదు; నువ్వు అక్కడే వుండిపోవాలి. దుమ్మెత్తి పోసినా సరే— నీవు సీత రక్షణ కోరేవాడివే అయితే అక్కడే వుండాలి గాని అభిమానపడి ఇలా వచ్చెయ్య కూడదు. సీత నిన్ను నిందించటం నీకు నెపంగాని, కారణం గాని కాకూడదు. క్షత్రియుడివి గాబట్టి నువ్వు అవిణ్ణి రక్షించడమే నీ ధర్మం" అన్నాడు రాముడు.

అప్పుడు లక్ష్మణుడు—

ఈ ధర్మా ధర్మ విచక్షణ అనే దారానికి చిక్కులు అసలు ఎక్కడ పడ్డాయో తెలుసుకోవాలి, ఇష్టాఇష్టాల ప్రమేయం దీని మీద పని చెయ్యనీకుండా చూడాలి. మనం ధర్మం అనుసరిస్తున్న సంగతి మీద ఇత రులు ఏమనుకుంటున్నారు అని కూడా వుండకూడదు. కీర్తి కాంక్ష తీరక పోతే అలా అనిపిస్తుంది, అల్లాంటి ధర్మాన్ని పరిపాలించాలంటే అందుకు తగినవాణ్ణికాను. వదినగారు అలా అన్నదే అని మనస్సు చికాకు కలిగింది. మానవుణ్ణే నేను. (జీవాత్మ—పరమాత్మతో అంటున్న వాక్యాలు) అది మన స్సుకు అంటకుండా వుండాలంటే ఎలా? ఆ తేడా లేకపోతే నేనూ నీ అంత వాణ్ణే అయ్యేవాణ్ణి మేము అభిమానానికి దాసులమే! విధి అనేవాడు మాలోని ఈ లోపాన్ని అవకాశం క్రింద తీసుకుంటున్నాడు. నీబోటివాడికది అంటదు కాబట్టి విధి నీ పట్ల ఏమీ చెయ్యలేడు" అన్నాడు

రామలక్ష్మణు లిద్దరూ మాట్లాడుతూ వస్తున్నారు. పర్ణశాల సమీపించారు.

## సీతా వియోగం

పర్ణశాల బావురుమంటోంది. ఎవ్వరూ వున్నట్లు అలికిడి లేదు. ప్రబల ప్రభంజనానికి గురియైన మహావృక్ష శాఖ లాగ రాముడు అల్లల్లాడి పోతున్నాడు. మెదిలే లేడిని చూసి, కదిలే తీగని చూసి, వ్రాలే కొమ్మని చూసి తన సీతేమోనన్న భ్రాంతి పడుతున్నాడు. మబ్బుతెర నీడతో పరిగెత్తే కుందేలు అచ్చు మనిషి కదిలినట్టుగానే కనిపించంగానే అటుగా వెళ్లిన రామునికి మబ్బుతెర వీడంగానే భ్రాంతితొలగింది. రఘువంశంలో కుంజరం లాంటి రాముడు సీతకై ఇలా వెతుక్కుంటూ, భ్రాంతి పడుతుంటే క్రింద దిగ్గజాలు తొండాలు వంచగా భూమి క్రుంగినట్లయింది. పర్ణశాల ముందు నాల్గు దిక్కులా సీత కనబడలేదు. పర్ణశాల వెనక వుందేమోనని వెళ్లి చూడగా అక్కడాలేదు. అగ్నిగృహం, నడవ, మహానసం, అమ్ములు విల్లులు కట్టిన వెనకచోటు అంతా చూశారు. పర్ణశాల వాగులోనికి నీళ్లకై వెళ్లిందేమోనని అక్కడికి వెళ్లి చూశారు. ఏమీ తోచక, చెయ్యలేక ఆకాశం వంక చూడంగా కళ్లలో నీళ్లు తిరిగాయి. కాస్సేపు అన్నని తమ్ముడు, తమ్ముణ్ణి అన్న చూసుకున్నారు. అన్న ముఖాన దుఃఖం, తమ్ముని ముఖాన 'నేను చేసింది తప్పేమోనన్న శంక' పులిమినట్లు కనబడుతున్నాయి. వెదకి, వెదకి వేసారి రాముడు పర్ణశాల బయట వున్న అరుగుమీద చతికిలబడి—

"నాయనా లక్ష్మణా! అనవసరంగా జానకిని అడవికి తీసుకు వచ్చాము. అయోధ్యలోనే వదిలి రావల్సింది. ఇంతటి భర్త వుండగా నాకేం భయం అని వచ్చింది కాబోలు పాపం! ప్రక్కన ఆడది వుందన్న సంగతన్నా గుర్తుపెట్టుకోకుండా ఆ రాక్షసుల్తో విరోధం పెట్టుకున్నాను.

బొత్తిగా లోకజ్ఞానం నశించింది. మన బుద్ధికి అన్ని విషయాలు తడతాయని అహంకరిస్తాం గాని–ఇవాళ మన బుద్ధికుశలత ఏమైందో చూడు! బుద్ధి ఎంత భూత అద్దంలాంటిదైనా సూర్యాభిముఖంగా వున్నప్పుడే ప్రతి ఫలిస్తుంది. తట్టని విషయం లేకపోవచ్చుగాని. తట్టని రోజు వుంటుందని తెల్సుకోవాలి. పోయిన వస్తువును వెదకితే అదికనబడిన రోజున నేను వెదికాను కన్పడింది అంటాడు. కాని, అదే మనిషికి ఇంకొక రోజున అదే వస్తువు కన్పడదు. అందుకనే నేను కాబట్టి వెదికాను అని అహంకరించకూడదు. వెలుతురున్న నిమిషంలో కన్పడుతుంది. అది లేని మరు నిమిషంలో కన్పడనే కన్పడదు. ఇలా వెనకా ముందులుగా వుండి గూడా కనపడిన నిమిషంలో మనిషి ఎంత గర్వపడతాడో!"

ఏమరుపాటు నాదగ్గర ఉన్నదని తెలిసి- ఏమరుపాటు రూపంలో ఆ రాక్షసుడువచ్చి సీతను ఎత్తుకుపోయాడు. ఇన్ని వేలమందిని నా ఒక్క విల్లుతో చంపాను అనుకోవడం ఎంత తెలివి తక్కువోచూడు. అవతల అంత ప్రమాదాన్ని ఈవిల్లుతోనే తెలీకుండా సృష్టించు కుంటున్నా మన్నమాట! అన్నిచోట్లా మన తెలివే పని చేస్తుందను కోవడం ఎంత అవివేకం! విధిలో జరగాల్సినవి జరుగుతుంటాయి. ఆ విధిముందు ఈ అహంకారాలు పనిచెయ్యవు. ఇన్నాళ్లనుండి ఈ అడవి అడవిలా తోచలేదు. కాని యిప్పుడు యిది అడవిలా కనిపిస్తోంది. ఈ చెట్లన్నీ సీతకు తోబుట్టువులు గదా! (సీత, వృక్షాలు ధరణీజాతలే.) సీతకేదైనా ప్రమాదం వస్తే ఇవి నాతో చెప్పవా? ఈ చెట్ల మౌనం చూస్తే సీతకేమీ ప్రమాదం లేదేమోననే అనిపిస్తోంది. కాని ఇక్కడి వాళ్లంతా మునులు, మౌనవ్రతం గలవారు. వాళ్ల మధ్య పెరిగిన చెట్లు అవడం వలన ఈ చెట్లు గూడా మౌనం వహించాయేమో ననిపిస్తోంది. లక్ష్మణా! రాక్షసులు సీతను తిని సుడిగుండాల్లో పారేసి వుంటారు. అయినా గోదావరీ నదీమతల్లి దగ్గరకు విహారార్థమై వెళ్ళి వుండచ్చనే ఆశ కల్గుతోంది. అటుగా వెళ్లి చూడు. ఆ మొక్కుగూడా

తీరుతుంది" అన్నాడు. దుఃఖితుడై ఏమీ తోచని స్థితిలో వున్న రాముణ్ణి— శుష్కించిన భావాల్తో మోడల్లే ఎండిపోయిన లక్ష్మణుడు చూస్తూ వెళ్లాడు.

గోదావరి వద్ద సీత కనబడలేదు. లక్ష్మణునికి యిదంతా రాక్షస మాయేమో ననిపించింది. ఆ విధంగా అయినా అది క్షుద్రమే గదా! ఈ పాటికి ఆగిపోవాలి. సీత పాతివ్రత్యం ముందు అదెంత? నేల మీదేమన్నా సీత కాలి గుర్తులున్నాయోమో వెదుకుదాం అనిపించినా, ఎక్కడికన్నా వెళ్లినా ఈ పాటికి పర్ణశాల చేరి వుండవచ్చు అని అనిపించి పర్ణశాల వైపు వడిగా వచ్చాడు. ఇద్దరూ పర్ణశాల లోపల, బయట మళ్ళీ వెదికారు. అంతవరకు లోపల లీనమైవున్న దుఃఖం ఒక్కసారి రాముడికి పొంగి పొరలి బయటకు భళ్లున వచ్చింది. గట్టుల మ ్య నిండి వున్న చెరువుకు తూము పెడితే వూరికి నష్టం వుండదు. అలాగే లోపలి దుఃఖం కళ్లద్వారా, కన్నీళ్ల రూపంలో పోయినా అంత ఇబ్బంది వుండదు. కాని గట్లు అనే హృదయకవాటాలు బ్రద్దలైతే ఆ ఇక్కట్టు చూడ లేము. పెల్లుబికిన దుఃఖంతో వున్న రాముడికి సీతను గురించి తప్ప మరో ఆలోచన లేదు. "నఖశిఖ పర్యంతం సర్వ లక్షణ శోభిత, అట్లాంటి స్త్రీ ఇలా అవుతుందని కలలో గూడా అనుకోలేదు. అల్పా యుష్కురాలు గూడా కాదే! సీత ఆయుర్దాయం బాగా వుందనుకున్నానే గాని, నేను ఇంత దురదృష్టవంతుణ్ణి అవుతానను కోలేదు. అసలా అను మానం రానేలేదేమిటో! చేతిలో ధనుస్సు వుంది. దీనికి గుణం (అల్లెత్రాడు) వుందని ఇంకో ధైర్యం. రక్షించుకోగల సామర్థ్యముంది. లోపల ఏక పత్నీవ్రత ధర్మం వుంది– అని గర్వ పడ్డాను. ఇప్పుడు ధనుస్సు వుంది గాని దానికి గుణం లేదు. సీత లేకపోతే గుణం వుండదు. (ఆయన నిర్గు ణుడౌతాడు ప్రకృతి లేనపుడు) పరిస్థితులెలా వెళ్తున్నాయో కాస్త ఆలోచించ లేక పోయాను. కూడా సీత వస్తోంది అంటే ఎంతో గర్వంగా వుండేది.

ఈ విధంగా ఒంటరిగాణ్ణైపోతానని ఎప్పుడూ ఉహించలేదు. (సృష్టిలో ప్రళ యాన్నిగూర్చి భగవంతుడూహించలేడు. ఎందుకంటే ఊహ సగుణం)"

"నిమిష నిమిషానికి లోభిలాగ ఈ రాముడు పుణ్యాలు రాసులుగా పోసుకున్నాడు. అందుకే ఈ సీత లభించింది. కాని ఆ సీత ఇప్పుడు మాయమైంది. నా పుణ్యాలరాశి, మట్టినిదున్నితే కాస్త పెళ్లగా బ...టపడ్డ భూమికి (సీతకు) నాధుణ్ణి నేను, ఇక్కడకు వచ్చి ఇంత మందితో పగపెట్టు కున్నాను. ఏం ధైర్యం చూసుకుని?– నా ఇంట్లో సీత వున్నదని– అంతే! కాని– సీత వుందికాబట్టి అంతమందితో పగ పెట్టుకోకూడదు అన్న విషయం స్ఫురించలేదు. సీతను అరణ్యాలకు తీసుకు వచ్చినమాట—ఇక్కడకు తీసుకు వచ్చిన తర్వాతనే జనకునకు తెలిసింది. ఇప్పుడెలా ఆయనకు ముఖం చూపించేది? అడవికి తీసుకు వెళ్లినట్లే ఆయనతో చెప్పలేదు. ఇప్పుడీవార్త పిడుగులాంటిది.... అంటూ అడుగు ఎత్తి భూమిమీద పెట్టబోతూ, "తవ కూతుర్ని నాశనం చేసిన నేను ఆ భూదేవికి ఏం సమాధానం చెప్తాను? ఈ పృథివి యందు నివసించడానికి కూడా చోటు లేదు" అంటూ గోదావరి లోకి పోబోతున్నాడు.

అటువంటి స్థితిలో వున్న రామునికి నమస్కరిస్తూ లక్ష్మణుడు 'నేను గూడా మీతో పాటు వచ్చాను. మీరెలా అయితే నేనూఅంతే! మీతో వచ్చిన వాడు మీ అడుగుజాడల్నే ఆశ్రయిస్తాడు. మీరిలా వెళ్లడం అంటే రెండో మనిషిని కూడా గోదావర్లోకి దింపడమేనని తెలుసుకోండి. ఆలోచించండి మీరే! నాకు మరో ఆలోచన వుండదు, మీరు పాదం నీళ్లల్లో పెత్తే నేనూ పెట్టడమే! అయినా ఆవిడ ఏమైందో కాస్తయినా తెలుసుకోకుండా యిలా ఆత్మహత్యకు పాల్పడడం ఎంత స్వార్థమో ఆలో చించండి." ఈ మాటతో రాముడు కాస్త వినేట్టుగా వున్నాడనిపించి, మళ్లీ– 'ఇక్కడ ఒక్క నెత్తురుబొట్టు గూడా లేదు, హత్య జరిగిందనుకోవడానికి

ఇక్కడ ఒక ఎముక గూడా లేదు. వాడెవడో ఎత్తుకు పోయి వుండాలి కాని చంపలేదని తెలుస్తోంది. వాడు అడుగులు ఎటు వేశాడో తెలీకుండా చేశాడు అంతే! ఒకవేళ చంపి తినేవాడైతే ఇక్కడే తినేవాడు. కాబట్టి నీతో పగ వున్నవాడు, నువ్వంటే భయమున్నవాడు అయి వుండాలి. (పగ, భయం అని అంటున్నపుడు కళ్లెఱ్ఱ బడ్డాయి) వాడి కొంప వాడేతగలెట్టు కునేట్టుగా చేస్తాం" అంటూ ప్రతీకార వాంఛ రామునిలో రేకెత్తించాడు. లక్ష్మణుడలా అనంగానే రాముడు—

"పగవుంటే ఎదురుగా వచ్చి బలా బలాలు తేల్చుకోవాలి. అది చేతకాకపోతే ఇంకొకరిని ఆసరా తెచ్చుకొని పోరాడాలి. అదీ కాకపోతే తలవంచ వచ్చుగదా! ఎవడు కాదన్నాడు ? పగవానితో యుద్ధం చేసి చచ్చినా వీరస్వర్గం అనుభవించే వాడే, కాని ఇదేమిటి నీచుడిలా చేశాడు? కృతయుగం మొదలు యింతవరకు పరాయివాని భార్యను ఎత్తుకు రావడం నేను ఎరుగను. యిలా చేసివుంటాడంటే నమ్మలేకుండా వున్నాను. ఆ ఎత్తుకుపోయిన వాడెవడో, ఎక్కడకు వెళ్లాడో, సీత ఏమైందో ఆ సంగతి తేలలేదు. మనకు చెబుదామన్నా జంతువులకు నోరులేదు. ఈ లేళ్లు సీతదగ్గర చూపులను మాత్రమే నేర్చుకున్నాయి కాని మాటలుగాదు." అని అంటూండగా ఎదురుగా ఆడ లేడి కన్పడింది. భర్తతో కాపరం పెట్టిన గర్భిణీ హరిణమది. (అంటే సీతారాముల సంసారం నిజాని కలా సాగాల్సింది అని సూచన). దాన్ని సీత గురించి అడిగాడు. చమరీ మృగాల్ని అడిగాడు. "రాక్షసుడెలా ఏ విధంగా ఏ దిక్కుగా ఎత్తుకు వెళ్లాడు ? చూపించండి" అని అనంగానే ఆ హరిణములు ఒక్కసారిగా దక్షిణ దిక్కుగా పరుగెత్తాయి. లక్ష్మణుడు వెంటనే విల్లుమీద చెయ్యివేసి దక్షిణ దిక్కుగా కాలు పెట్టాడు ముందరగా. రాముడు ఎదురుగా కొండను చూసి "ఇంద్రుడు మీ రెక్కలు విరగ గొట్టాడు గాని నోళ్లు తియ్యలేదుగా. ఓ గిరిరాజా ! మారు పలకవా ! (అంటే ప్రతిధ్వని అయినా చెయ్యలేవా?)

బాణం ఎక్కుపెట్టి వేశానంటే ఏ వస్తువైనా చీలి పోతుంది. ఇంత పర్వతాన్ని చూర్ణం చెయ్యగలను. ఈ దారిన పోయిన ఆ రాక్షసుడు నీకు తెలీదా ? ఆ సర్వస్వం నువ్వు చెప్పితీరాలి. నువ్వూ భూమిని ధరించే వాడివే. (భూధరము) నేనూ భూభారం వహించేవాణ్ణి (రాజు). సాటి వాణ్ణి అడుగుతున్నాను. దౌర్భాగ్యం పట్టి ఇలా తారాడుతున్నాను.

కాని నేనూ రాజునే! కొంత దూరమైంది అంతే!" అన్నాడు. లక్ష్మణుడు చెవుల్తో చూస్తున్నాడు రాముని పరిస్థితిని. కళ్లు అడుగు జాడల్ని వెతుకు తున్నాయి "స్వామీ ! ఈ పర్వతం చెప్పింది, చూడు," అంటూ క్రింద కనబడ్డ కాలి చిన్నెల్ని, పెద్ద పాదం గుర్తును చూపించాడు. రామునికి కొండంత ఆశ కలిగింది. ఆ పాదముద్రలో శంఖచక్రాల గుర్తులు కన్పడు తున్నాయి. అవి చక్రవర్తి లక్షణాలు. కాని చేసింది పాడుపని. రాక్షసరాజు చేసి వుండాలి అని నిర్ణయించుకున్నాడు. ప్రక్కనే సీతాదేవి కాలి గుర్తులున్నాయి. కోమలంగా, రాముడు గభాల్న వంగి పాదాల చిహ్నాలమీద చేత్తో తాకాడు. రెండు అడుగుల ముందు నలిగిన పూలు, చిగురుటాకులు కన్పడ్డాయి. అవి తీసి గుండెలమీద వేసుకున్నాడు. ఆ పూలు పెట్టబడిన జడ, ఆ జడ కలిగిన సీతను వూహించుకుని సొమ్మసిల్లి పడిపోయాడు. కాసేపటికి తేరుకున్నాడు. భూమికి రత్నగర్భ అన్న పేరు సీత పుట్టడం వల్ల మరింత నామసార్థక్యాన్ని పొందింది. విలువ పెరిగింది. (సీతంటే నాగటిచాలు. నాగటిచాలు ఎవరికన్నా అన్నం పెట్టేది. అందుకే నాగటిచాలు వల్ల భూమికి ఖరీదుతో సంబంధం కాని విలువ పెరిగింది. రత్నమనగా విలువైంది అని అర్థం గూడా వుంది) రాముని మీదకు తుమ్మెదలు గుంపులు గుంపులుగా వస్తుంటే రామునికి సీత జుట్టు గుర్తుకు వచ్చింది. మతిపోయిన తోటమాలి తోటలో తిరుగుతున్నట్లు రాముడు తిరుగుతున్నాడు. భర్త లేకుండా చూసి భార్యను తీసికొనివెళ్లే అశూరుడు పిరికివాడు. అల్లాంటి వానితో విరోధం రావడంతో మరీ బాధ పడ్డాడు.

వీడికంటె ఆ ఖరదూషణాదులే నయమనిపించారు. ఎదురుగా వచ్చి యుద్ధం చెయ్యడానికి వాళ్లకి తగిన కారణం గూడ వుంది. (శూర్పణఖ చెవులు, ముక్కు కోసినందుకు) మరి సీతను ఎత్తుకెళ్లిన ఈ క్షుద్రునితో విరోధం గూడా దుస్థితిని, కీడును, అపకీర్తిని తెలియజేస్తుంది. పేరు తెలీకుండా ఎదుటివానికి హానిచేసినవాడు - తనెక్కడున్నాడో తెలీకుండా తానుపోతాడు" అనుకుంటూ పోతూండగా—

## యుద్ధం జరిగిన చిహ్నాలు

ఒక విరిగిపోయిన అమ్ములపొది, ధనుస్సు, ముక్కలైన రథం, సీత నగలనుండి రాలిన బంగారు రజను కనబడింది. అక్కడ ప్రదేశమంతా సంగ్రామలక్ష్మి నాట్యము చేసినట్లుంది. ఆమె మొలనూలి పైడి రతనాలు భూమిమీద జారిపడ్డా యన్నట్లుంది. అక్కడ భూమిమీద వస్తు సముదాయం అరణ్యంలో ముగ్గుల్లా వున్నాయి.

క్రిందపడివున్న వస్తువుల్ని చూచి రాముడు "ఈ ధనుస్సు, తూణీరాలు ఎవ్వరివో ? సీతకోసం ఎవరన్నా ఇద్దరు వ్యక్తులు కొట్టుకున్నారా ? ఆ ఇద్దరూ రాక్షసులేనా? ఒకళ్లు సీతని తీసికొనివెళ్తూంటే ఇంకొకడు అడ్డగించి పోట్లాడాడా?" అని అనుకున్నాడు క్రిందపడ్డ రత్నాల ముక్కలపై సూర్య రశ్మి పడి తళ తళా మెరుస్తూ సూర్యవంశపు కోడలి చిహ్నాలు అగుపడు తున్నాయి. రామునికి ఆందోళన కలిగింది. సీత క్షేమం మీద అనుమానం కలుగుతోంది. "ఆ ఇద్దరూ పోట్లాడుకున్నారనుకుందామంటే సీత వస్తువు గాని, ఒక పదార్థంగాని కాదు గదా!" అనుకున్నాడు రాముడు. అపురూప మైంది, పటిష్ఠమైనది అయిన ఒక ధనుస్సు కన్పడింది. విరిగి పడివున్న కవచం కన్పడింది. అది చూడ్డానికి ఉదయిస్తున్న సూర్యునిలావుంది. ఛత్రం, మణి ముక్కలు, దండం పడివున్నాయి. గాడిదలు పడివున్నాయి. వాటి

ముఖాలు మాత్రం పిశాచాల ఆకారాలు కలిగివున్నాయి. ఆ హారధ్వజం (జెండా) నిప్పులా మెరుస్తూ క్రిందపడి వుంది. బండికి పోలుకట్టి బంగారంతో చెయ్యబడి వుంది. తూణీరాలు పట్టుకునేచోట అపురూపాలైన హంసరెక్కలు కట్టబడి వున్నాయి. చనిపోయిన సారథి చేతిలో కొరడా అలాగేవుంది. ఆ కొరడా బంగారంతో చేయబడినది. సారథి తలపాగాకు బంగారు జరీ, బంగారు మువ్వలు వున్నాయి. లోపల కవచం గుండెల మీద వుంది. సూర్యరశ్మిలా కళ్లల్లోకి పడుతోంది.

ఆ కొట్టుకున్న వాళ్లిద్దరూ రాక్షసులో, పిశాచాలో – పేర్లతో పనేమిటి? ఇద్దరు కొట్టుకున్నారు, ఇద్దరూ మహాదక్షులు. చక్రవర్తి లక్షణాలు గలవారు అయివుండాలి. మహాభోగులు, సమర్థులూ అయివుండాలి అలా అని ఈ వస్తువులే చెబుతున్నాయి. ఆకాశంలో యుద్ధం చేసినట్లు తెలుస్తోంది. ఇద్దరూ ఇంద్రపదవికి తగినటువంటి వారైనా, లేదా ఇంద్రుని ఎదిరించి పోరిన వారైనా అయివుండాలి. అంధకారయుతమైన లోకాలకు వెళ్లారు – అల్లాంటివాళ్లు ఇలాంటి పనికి పూనుకుంటే" అని రాముడు అనుకున్నాడు. మళ్లీ—

ఈ యుద్ధం త్రిమూర్తులకు తెలీకుండా జరిగిందా ! ఇది అందరికీ (దేవతలకుకూడా) తెలిసిన విషయమే అయివుండాలి. ఈ ప్రయత్నానికి ఎన్నాళ్లనుండో కుట్ర జరిగివుండాలి. లక్ష్మణా ! సీతను ఈ విధంగా ఎత్తుకుపోవడం దేవతలకు తెలీకుండా జరగదు. ఇంతమంది దేవతలుండి, ఋషులుండి, తపస్వులుండి, ఇల్లా జరుగుతుంటే నోరునొక్కుకుని ఊరుకున్నారంటే ఈ సృష్టి భ్రష్టమైందన్న మాట! ఇది బాగుపడాలంటే పునఃసృష్టి చేయాలి. చేస్తాను – ఓ సృష్టిలోని దేవతలారా ! ఋషులారా ! వినండి—

'నా భుజాల్లో వస్తున్న బాణాలనే సూర్య కిరణాలకు మంచులా కరగి అరిపోకండి. ప్రళయ కాలాగ్నితో, ఘోరాస్త్రాలతో సృష్టిని ప్రళయం చేస్తాను'. అంటూ రాముడు నడుం కడుతున్నాడు. జడ ముడి వేశాడు. విల్లుత్రాడు తీసి ఎక్కుపెట్ట బోతున్నాడు. నుదురుమీద రుద్రుడు తాండవం చేస్తున్నాడు. క్రోధాగ్ని రగులు కుంటోంది. సమస్త లోకాలు కట కట లాడాయి. ఆ సమయంలో– దేవతలంతా ఆ ఆదిశేషుణ్ణి ప్రార్థించారా అన్నట్లు – లక్ష్మణస్వామి వంగి నమస్కరిస్తూ రాముణ్ణి సమీపించి ఇల్లా అన్నాడు.–

"ఇన్నాళ్లూ నీ కన్నుల్లో లోకరక్షణ తొణికిసలాడింది. ప్రేమ నిండింది. అల్లాంటి నీ కనుల్లో సుడిగుండాలు, అగ్నివస్తే ఎవరన్నా భరించగలరా ? అల్పులెవరో అవతల నీకు కోపించాల్సిన అవసరం కల్పించినా నీ బోటివారికి తిరిగి కోపించడం తగదు. ఆగి ఆలోచించాలి. ఒకవేళ కోపించాల్సిన అవసరమొస్తే ముఖంలో కోపించినా ఫర్వాలేదుగాని మనస్ఫూర్తిగా క్రోధం పూనరాదు. 'మనిషిని రక్షించేది, తెలిపేది ప్రవర్తనగాని తపశ్శక్తి, బాహుబల పరాక్రమంగాదు' మీకు తెలియని దేముంది ? మన వంశగురువు ఎంత శాంతమైన మనస్సుతో విశ్వామిత్రుని అమానుష చర్యను ఎదుర్కొన్నాడు ? వందమంది కొడుకుల్ని భస్మం చేసిన ఆ విశ్వామిత్రుణ్ణి పల్లెత్తుమాట గూడ అనలేదు. మరి ఆయన శిష్యుల మెలా ప్రవర్తించాలో కాస్త ఆలోచించండి."

లక్ష్మణుని మాటల్లోని చనువు, చమత్కారం, సమయస్ఫూర్తి, కార్య నిర్వాహకత్వానికి మెచ్చుకున్నాడు. అయినా కోపం చల్లారలేదు. "మరి నువ్వే నడు ముందు. అయినా గాలి సుడిగుండాల్లో గుర్తులు చూసివెళ్దామా ? ఎలా" అన్నాడు.

## జటాయు దర్శనం

ఎదురుగా ఒక పెద్ద కొండవలె గుట్టవలె ఉండి ముడుచుకున్న రెక్కలు గల దానిలా వుంది. లక్ష్మణుడు దాన్ని చూచి 'ఇది ఇక్కడ వుండటానికి వీల్లేదు. ఇదేదో రాక్షసమాయ' అనంగానే రాముడు బాణం ఎక్కుపెట్టాడు.

"అయ్యో నాయనా! నేను బాబూ జటాయువును" అన్న మాటలు వినంగానే ఇద్దరికీ ఒక్కసారి ఆశ్చర్యము, ఏడుపు వచ్చాయి. దగ్గరగా వెళ్లారు. జటాయువు శ్వాస ఎక్కువదూరం వ్యాపించలేకపోయినట్లు గ్రహించి "తాతా, ఎవరు నిన్నిలా చేసింది?" అని కళ్లెఱ్ఱ చేశాడు. అందుకు జటాయువు కాలాన్ని వృథా చెయ్యకుండా—

"రాఘవా! సీతను రావణుడు ఎత్తుకుపోయాడు. అక్కడికీ నీ సంగతి చెప్పాను. అయినా వాడికి ఎక్కలేదు. ఏం ప్రయోజనం? వాడికి వివేకం బదులు రోషంవచ్చింది. వాడు మదపుటేనుగు, నామాట ఎందుకు వింటాడు?" అని చెప్పి సొమ్మసిల్లాడు. లక్ష్మణుడు ఆకు దొన్నెతో నీళ్లు తెచ్చి పోశాడు. రాముడు కన్నీళ్లతో ఇలా అన్నాడు.

"అదృష్టవంతుడంటే నన్నేతీసుకోవాలి. అవతల తండ్రి పోయాడు. భార్యను ఎవడో ఎత్తుకుపోయాడు. రాజ్యభ్రష్టుణ్ణి అయ్యాను. ఇక్కడ తండ్రి అంత వాడు ఇలా అయిపోయాడు. ఇదంతా దైవయోగంలా వుంది కాని మానవ సంఘటన కాదేమో! దురదృష్టమనే జ్యోతి హృదయం లోతులు తాకుతోంది. ఎక్కడ అడుగుపెడ్తే అక్కడ నాశనం అయిపోతోందే" — మరల జటాయువుకు స్పృహ రాంగానే జటాయువుతో—

"నీకు తెలిస్తే చెప్పు. వాడికి నామీద ఎందుకంత పగ? ఆ సీత-నీ కోడలు ఏమంది ? ఆ సమయంలో బ్రతుకుతుందని నీకనిపించిందా ? నువ్వు చూశావా ఆ స్థితిలో?" అన్నాడు. అందుకు జటాయువు-

"లోకం బ్రతుకుతూందంటే ఆశతోనే బ్రతుకుతోంది నాయనా! నిరాశ ఎప్పుడూ కూడనిదే! నువ్వింకా చిన్నవాడివి నాయనా! అయినా ఆశ వదలిపెట్టడానికి ఆ సీత భర్త వాజమ్మా ఏమన్నానా? కొండల్ని గుట్టలు చెయ్యగల సమర్థుడు. సముద్రాన్ని పుడిసిట పట్టగలవాడు. సీతను ఎత్తుకు పోయినవాడు వైశ్రవణునికి సోదరుడు" అంటూ చివరిమాట చెప్పి ప్రాణాలు వదిలాడు. అన్నదమ్ములిద్దరూ గుండె చెఱువయేలా ఏడ్చారు. "ఇంక ధర్మానికి ప్రపంచంలో విలువ ఏమిటి? అమిత నిష్కల్మషపు గుండె కలవాడు, నిర్వ్యాజమైన ప్రేమ గలవాడు, సర్వపూజ్యుడు, మా తండ్రి సఖుడు అంటూ పోయిన జటాయువును గూర్చి వలవల ఏడ్చారు. రావణుడు సీతను ఎత్తుకు పోతున్నపుడు ఏ వనదేవతలు నిశ్చేష్టులై నివ్వెరపోయి నిలచిపోయారో ఆ వన దేవతలే ప్రస్తుతం సోదరులిద్దరూ జటాయువు గూర్చి దుఃఖిస్తూ జటాయువు గుణగణాలను కీర్తిస్తున్నపుడు ప్రశంశాపూర్వకంగా పుష్పవర్షం కురిపించారు. శ్రీరాముడు ఇంకా-

"మన తండ్రిగారు, ఈయనా కలసి ఆ ఇంద్రుడికి సహాయం చేశారు. తన ప్రాణాలిచ్చి తన స్నేహితుడి బిడ్డల్ని రక్షించాడు. అడవికి వెళ్లిపోయాడని ఆ తండ్రి మనల్ని గూర్చి ప్రాణాలు వదిలాడు. అడవికి వచ్చారు, వచ్చారు అంటూ మనల్ని గూర్చి ప్రాణాలు వదిలాడు. బహు చిత్రంగా వుంది వీరిద్దరి మరణం. తన అవసానదశలో గూడా ఆ రాక్షసుణ్ణి పది చెఱువుల నీరు తాగించి రాముని బలగం ఎంతటిదో రుచి చూపించి వుంటాడు. రామునితో పగ అంటే ఎల్లాంటిదో తెలిపి వుంటాడు. కడు వృద్ధుడు, మన్వంతర జీవి. నాకోసం ఇక్కడ ఇలా దీనస్థితిలో వధింపబడ్డాడు.

ఈ ఋణం ఎలా తీరుతుందో! నాకోసం నువ్విలా అయిపోయినా నేను ఇలా నిలబడివున్నానంటే నా హృదయమెంత శిల? నేనసలు ఈ అడవికి రాకపోతే నువ్వింకా బ్రతికి ఉండేవాడివి. నాదే పాపమంతా. అంత కాకపోతే సీత అలా ఎందుకవుతుంది? అవతల రాక్షసులనూ చంపాను. ఇవతల అయిన వాళ్లనీ చంపుకుంటున్నాను. చివరకు ఈ పక్షిరాజుకైనా ప్రాణాలు పొయ్య గలిగానా, తియ్యడమే గాని" అని అనుకున్నాడు. లక్ష్మణుణ్ణి చూసి,

## జటాయువుకు ఉత్తర క్రియలు

"సౌమిత్రీ! ఆ తండ్రికి నిజంగా భరతుడే కొడుకు. ఈ రాముడు ఈ పక్షిరాజుకు పుత్రుడు. ఈ తండ్రికి నేను యథావిధిగా ఉత్తర క్రియలు చేస్తాను. నాకింతకంటె ఆత్మీయుడు దగ్గరబంధువు ఎవరు వుంటారు? [రామాయణంలో రామునికి నిజమైన బంధువు ఎవరంటే జటాయువే! ఎందుకంటే తండ్రిగూడా పొందలేని ఉత్తరక్రియల్ని జటాయువు రామునిచేత చేయించు కున్నాడు. అందుకే జటాయువు రామబంధువు అయినాడు. ఆ 'రామబంధువ'నే పదాన్నే ఈనాడు 'రాబందు' అంటున్నాము.] అంటూ మంచి మోదుగ సమిధలు, చందనపు కట్టెలు తీసుకువచ్చి వాటితో దహన సంస్కారం జరిపించాడు. ఉత్తర క్రియలు పూర్తిచేశాడు. చేతిలోకి ఒకదర్భను తీసికొని పైకిచూస్తూ "ఓ పక్షిరాజా, సూటిగా ఉత్తమ లోకాలకు పోవయ్యా, ఎవరన్నా అడిగితే నేను అనుజ్ఞ ఇచ్చాననిచెప్పు" అని దర్భ వదిలాడు. ఆ దర్భ వెంటే జటాయువు తన బిడ్డయైన రాముణ్ణి స్తుతిస్తూ ఉత్తమ లోకాలకు తరలిపోయాడు-ఆరిన పంచెలు, ఆరని దుఃఖంతో ఇష్టం లేకుండానే రాఘవులిద్దరూ ఆ ప్రదేశాన్ని వదలి కదిలారు.

## అయోముఖి

రామలక్ష్మణులు పశ్చిమాభిముఖులై వెళ్తున్నారు కళ్లు ముందు వైపుకు, మనస్సులు జటాయువు తాలూకు చితాభస్మం వైపు వున్నాయి. కళ్లనుండి నీళ్లు చిమ్ముతుండగా ముందు విష్ణువు ఆ పైన ఇంద్రుడిలా వెళ్లారు. కొంతదూరం పోయి దక్షిణ దిక్కుగా తిరిగి చిక్కని అడవిలో ప్రవేశించారు. అది క్రౌంచారణ్యం. ఒక నల్లని మబ్బులాంటి పొద కన్పించింది. దాని వెనుక మెఱుపులాగ సీత కన్పడుతుందేమోనని ఆశకల్గింది ఇద్దరికీ. ముందుగా పోతూ వెదకసాగారు. అది పెద్దలోయలా వుంది. అవతల ఏముందో కనబడడంలేదు. సూటిగా పాతాళలోకంలోకి దోవలావుంది. 'ఈలోయలో ఏమన్నా సీతమ్మ తల్లిని పెట్టలేదు గదా' అన్న అనుమానం లక్ష్మణుడికి కలిగింది. చీకట్లు తెట్టు కడుతున్నట్లుంది. లోపలికి వెళ్లేటప్పటికి రెండు మెరుపుల్లా కనబడ్డాయి. కొంప మునిగింది. అవి రాక్షసి కోరలు. ఆ రాక్షసివి అన్నీ పిశాచపు పనులు. అరిచింది. భయపెట్టింది. ఒక్కసారి ఎగిరి దూకి నిలబడి లక్ష్మణుణ్ణి చూచి "అబ్బా! ఎంత బావున్నాడు! అని చెయ్యి కట్టుకుని ముఖం మీద ముఖం పెట్టి నవ్వింది. పకపకా నవ్వింది. లక్ష్మణుణ్ణి ఒక్కసారి కౌగలించుకుంది. దాని పొట్ట దగ్గరకు లక్ష్మణుని జటలు వచ్చాయి. అది తెలుసుకొని లక్ష్మణుడంత పొట్టి అయింది. నవ్వంగానే రక్తం చిందులు పడ్డాయి. 'నువ్వు నాకు నచ్చావు. ఈ రాక్షసులంటే నాకు అసహ్యం. క్షణ క్షణములు వాళ్ల బుద్ధులు. నువ్వు నాకు నచ్చావు. తెల్ల మబ్బు తునకలా వున్నావు. రా ఇద్దరం క్రీడిద్దాం. నా పేరు అయోముఖి. (ఇనుపముఖం)" అంది.

లక్ష్మణుడు ముఖం చిట్లించుకున్నాడు. అసహ్యం వేసింది. ఆడదాన్ని చంపడమా అని ఆలోచిస్తూ చివరకు చంపడానికే నిర్ణయించుకుని ఒక్కసారి అవతలకు నెట్టి-"ఇది ఒక జాతి. నిముషంలో ప్రేమ, మరునిముషంలో చంపుతానని మీద పడతారు. కామం పట్టలేరు. ఎలా పుడతారో

అలాగే ఛస్తారు గూడా! పూర్వజన్మ పరజన్మ రెండూ ఎలా వుండివుంటాయో ఆలోచించలేము!" అనుకున్నాడు.

లక్ష్మణుడు నెట్టంగానే దూరంగా పడి "అమ్మో! ఎంత బలవంతుడివి. అట్లా అయితే అస్సలు నిన్ను పోనివ్వకూడదు." అని ఎదురుగా వచ్చి నిలబడి "నిన్ను ప్రేమించిన దానిని చంపుకుంటావా?" అన్నది రాక్షసి. 'కాలు కదిపితే చస్తావు' అన్నాడు లక్ష్మణుడు కత్తి అడ్డుపెట్టి. భారమైన కోర్కెతో గుడ్డిదైన రాక్షసి లక్ష్మణుడి మీదకు వచ్చేస్తోంటే కత్తివాటుకు ముఖం భుజాలు చీలిపోయి చచ్చిపోయింది. 'ఆ రోజున ముక్కూ చెవులూ, ఈ రోజు ముఖం భుజాలు తన కత్తికి ఎఱ అయినాయి. ఇవన్నీ ఆపదను సూచిస్తున్నాయి.' అనుకున్నాడు.

## కబంధుడు

చీకట్లో చేతులు కదల్చవద్దు అంటూ చేతులుపట్టుకొని వెళ్తున్నారు రామలక్ష్మణులు. ఇద్దరూ వాళ్ల ప్రయత్నం కంటె కొంచెం వేగంగా నడుస్తున్నట్లు అనిపించింది వాళ్ళ వేగంకాక ఇంకోవేగం వెనక పనిచేస్తున్నట్లున్నది. ఒక సుడిగుండంలో పడ్డట్లుంది. ఎత్తైనశిఖరం మీదనుండి పడే మహాప్రవాహ మధ్యంలో వున్నట్లుంది. ఎక్కడికోలాగేస్తున్నట్లుంది. కారణం కనిపిస్తుందేమోనని చూద్దామంటే వీలు లేకుండా చిమ్మచీకటి. చీకట్లో వెలుతురుగా కనపడేది ఒక్కటుంది. ముక్కు. నోరు, ముఖం పొట్టలోనే చిక్కుకుని వున్న ఒకరూపం కదలడం మొదలుపెట్టింది. ఆ ప్రక్కన పెద్ద జంతువుల అస్థిపంజరాలు పడివున్నాయి. కట కట కటా చప్పుడు అవుతోంది. తెరిచిన నోరులోంచి లోపల జంతువులు కనబడుతున్నాయి. ముఖం పది పాము చుట్టలులా వుంది. తిరగలిలో పడేసి నూరినట్లు వుంది దాని తిండి. దాన్ని

చూసి లక్ష్మణుడు– "అన్నా చూశావా ఎంత చిత్రంగా వుందో! ఎంద్రకాయ లాగా లేదూ! నిజంగా ఆ విధాత సృష్టి ఎంత వికటంగా గూడా వుంటుందో దీన్ని చూస్తే తెలుస్తుంది" అని అంటూండగానే ఆ రాక్షసుడు ఏం చేశాడో ఏమో ఇద్దరికీ గాలి ఆడలేదు. చెతుల్లో ఎత్తి పట్టుకున్న కత్తులు అలానే వున్నాయి. శ్వాస ఆడటం లేదు. లక్ష్మణుడు తెలివితప్పి పడిపోయేట్టు న్నాడు. రాముడు చెయ్యి పట్టుకున్నాడు. "అన్నా! నువ్వు నాకోసం చూడ కింక! నువ్వు వెనక్కి వెళ్లిపో! నువ్వూ ఇక్కడ చిక్కుకుపోయి అవతల ఆ తల్లి అలా అయితే ఏం ప్రయోజనం?" అన్న లక్ష్మణుని మాటలు విన్న రాముడు మనస్సులోనే– "అబ్బా ఎడతెరిపి లేని ఇబ్బందులు. తిండి తిప్పలు గూడా లేవు. పడతి సీత దగ్గఱ లేకపోయేటప్పటికి ఎన్ని ఇబ్బందులు. తన శక్తి సామర్థ్యాలు తెలిసిన లక్ష్మణుడు గూడా 'నువ్వు పారిపో' అన్నాడంటే నామీద జాలి పెరిగి ధైర్యం తరిగిపోయిందన్న మాటే గదా!" అనుకుని లక్ష్మణుని ఉద్దేశిస్తూ,- లక్ష్మణా! నన్ను దిగజార్చేట్టుగా మాట్లాడకు. నువ్వు మంత్రివి, నేను రాజును. మంత్రి, మంత్రబలం ఇలా సడలిపోతే ఇక రాజే మౌతాడో ఆలోచించు. ఇలాంటి సమయంలో మంత్రి, మంత్రబలమే రాజును రక్షించునది" అన్నాడు. ఇంతలోనే ఏకాక్షుడు, ఉదర ముఖుడు, క్రోశ బాహుడు అయిన ఆ రాక్షసుడు–

"ఎవరయ్యా మీ ఇద్దరూ ? అన్నకంటే తమ్ముడే వివేకవంతు డిలా వున్నాడే ? నా ముఖమృత్యు ద్వారంలోకి వచ్చికూడా ధైర్యవచ నాలు పలుకుతున్నారు ? సన్నని నడుములు, సమంగా పంచినట్లున్న మీ అవయవాల తీరూ నిజంగా నాకీ రోజు పండగ. మధురాన్నం దక్కింది. నా జోలికి ఎవరూ రాలేరు. ఆ బ్రహ్మగూడా ! ఇక్కడ మీ దాగుడు మూతలు పనికిరావు. ఇద్దరూ మన్మథుని పూల బాణంలా వున్నారు. అయినా తినకుండా వుండలేను" అన్నాడు. రాముడు ఆ మాటలు విని "లక్ష్మణా ! ఒక ప్రక్కనుండి మరణం ఆసన్న మౌతోంది.

సీతను ఇంకా వెతకటం ప్రారంబించనే లేదు. నువ్వేమో గుండె దిగజారి పోయేట్టుగా మాట్లాడావు. ఇదంతా చూస్తుంటే మనం కాలవశుల మవక తప్పదనిపిస్తోంది." అనంగానే లక్ష్మణుడు దండతాడిత మహాభుజంగమై, రోష కషాయిత నేత్రుడై, అరుణ వదనంతో, కనుకొలుకులు మరింత తీక్షణమై– "ఒక క్షుద్ర రక్కసుడి కిలా భయపడడమా? ఇంతకు పూర్వమే గదా విరాధుని చంపింది. అంతకంటే గొప్ప కష్టమా ఇది ! వీణ్ణి నరికి పారేస్తాను" అంటూ విజృభించి "అరె! తల లేదే నరకడానికి? ఎలా వీణ్ణి నరికేది! అయితే వీడి ఆయువుపట్టు ఎక్కడై వుంటుంది. పొట్టలో వున్న నోట్లో పొడిచి చేతులు నరకటం ఒక్కటే మార్గము" అని అన్న మాటలు విని ఆ రక్కసుడు–

'ఒరేయ్ కుఱ్ఱకుంకా ! వ్రేలెడు లేవు, నువ్వా నా బాహువులి నరికేది ! ఉండు చెప్తా' అంటూ ఒక్కసారి చేతులతో లక్ష్మణుని పట్టి, పొట్టకే వున్న నోటిదగ్గఱకు లాగ బోయాడు. అంతే ఆ చేతులు నోటిదాకా రాలేదు. పొట్టివై పోయాయి, అవి ఎప్పుడు లక్ష్మణుని ఖడ్గంచేత విరగ గొట్ట బడ్డాయో ! అంతా తృటి కాలంలో జరిగి పోయింది. లక్ష్మణుడు నరుకుతా ననటం, ఆ రాక్షసుడు కళ్లు తెరవడం నరక బడటం మాత్రమే తెలిసింది. కాని వీటి మధ్య ఏమి జరిగిందో తెలియలేదు. అంత త్వరిత గతిని జరిగింది. పర్వతాల రెక్కల్ని ఇంద్రుడు విరగ గొట్టాడు. సరిగ్గా అల్లాగే ఒక వికృత రక్కసుని బాహువుల్ని ఖడ్గంతో ముక్కలు చేశాడు. ఝంఝా మారుతానికి సమూలంగా నేలకొరిగిన మహా వృక్షంలా రక్కసుడు నేలమీద పడ్డాడు. కొంచెం బాధ తగ్గింది. ఒక్క కంటితోను విలపిస్తూ అతి దీనంగా "మీ రెవరు నాయనా !" అన్నాడు. 'సుమిత్ర బిడ్డ, రఘు వీరుడైన లక్ష్మణుని చూస్తున్నావు. పినతల్లి మాటమీద ఇలా వచ్చాము. ఎవడో క్షుద్రుడు నా జానకిని దొంగతనంగా ఎత్తుకు పోయాడు. ఆమె

కోసం వెతుకుతూనే ఈ దక్షిణ దిక్కుగా ఇలా వచ్చి నీ చేతుల్లో పడ్డాము" అన్నాడు. నల్లవిశె పువ్వులా మెరిసిపోతున్న రాముడు — అప్పుడు ఆ దనుజుడు—

"ఇన్ని రోజుల బట్టీ నా బాహువుల్ని చూచి విఱ్ఱవీగి పోతుండే వాణ్ణి. కాని మీ రాఘవుల బాహువులతో వేసిన ఒకే ఒక్క కత్తి వ్రేటుకు నా బాహుగాఢ పర్వ మహాబంధము ముక్కలై పోవడం ఆశ్చర్యం గదా! ఇంతవరకు ఈ కబంధ హస్తాలకు చిక్కించు కోడమే తప్ప ముక్కలవడం తెలీదు. మీ రూపాల్ని మీ బాహువుల్ని చూచినప్పుడే అనుకొన్నాను— నువ్వే తమ్ముడితో ఇలా వచ్చి వుంటావని. మీ ఇరువురకు స్వాగతం, ప్రభూ! స్వాగతం. రూపంచేత నేను కబంధుడను. నా రూపమే నాకీ పేరు తెచ్చింది. నా చేతులారా ఇలా అతి వికృతాకారాన్ని తెచ్చుకున్నాను స్వామీ! సూర్య చంద్రుల్ని పోలే శరీర రూపురేఖా విలాసాదుల్ని ఇలా చేసుకున్నాను." అంటూ రెప్పలు వాల్చి రాముణ్ణే తదేకంగా చూస్తూ అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు "ఓయీ! అయితే నువ్వు అంత అందగాడివి అంటున్నావు. మరి ఇలా మొండెంలా, విగత శిరస్కుడిలా, ఉదర ముఖుడివిగా ఎలా అయినావు? నీ పూర్వపు సౌమ్యమంతా మాటుపడి పోవటానికి కారణ మేమిటి? అంతా వివరించవా" అన్నాడు.

## కబంధుని పూర్వ వృత్తాంతం

ఈ సృష్టిని చూచినప్పుడు గతంలో నాకు చాలా విచిత్రమైన భావం కలిగేది. ఏమిటో సృష్టి ఇంత వికారంగా, విచిత్రంగా, అసహ్యంగా వుందనిపించేది. చాలా ఏవగింపు కలుగుతూ వుండేది. ముఖ్యంగా ఈ మానవుల ఆకారాలంటే మరీ ఏవగింపుగా వుండేది. నవ్వు గూడా వచ్చేది.

"కుండలాగా ఈ తలేమిటి ? ఆ తలలో నోటికి మరో కన్నం. ఈ తలని, మొండాన్ని కలుపుతూ మెడ ఒకటి ! వీడి సృష్టి పాడుగానూ! పొలాల్లో దిష్టి బొమ్మలులాగా. ఈ మానవ సృష్టి ఏమిటి ? ఊగిసలాడే ఆ చేతులు, కాళ్లూ చూస్తే అచ్చు పొలాల్లోని గడ్డి కుక్కిన దిష్టి బొమ్మలే గుర్తుకు వచ్చేవి. తలవేరు, పొట్టవేరు, కాళ్ల చేతులు వేరు వేరుగా పెట్టి, వట్టి దండగ పనులు చేశాడు వెఱ్ఱి బ్రహ్మ. తలకాయను పొట్టలోనే పెట్టి కాళ్లు, చేతులు ఆ పొట్ట చుట్టూ పెడ్తే తక్కువ చోటు సరిపడేదిగా" అని పించేది. ఆశ్రమంలోకి ఎవరన్నా వస్తూంటే— ఇలా నే నూహించినట్లుగా వుండే రూపంతో ఆ వచ్చిన వారిని భయపెడుతూ వుండేవాణ్ణి. ఇంకా విచిత్రమైన రూపాల్తో గూడా కనబడుతూండేవాణ్ణి. అకులు రాలిపోయి ఎండిపోయి రెండు కొమ్మలు మాత్రం కన్పడే వృక్షంలా కనబడేవాణ్ణి. ఆశ్రమంలో దర్భలకై సంచరించే ఋషులకు, ఋషి బాలకులకు కొంత భయాన్ని కలిగిస్తూ వుండేవాణ్ణి. ఒకసారి నే నూహించిన మనిషి ఆకారంలో వుండగా ఒక ఋషి చూశాడు. ఆ ఋషికి మొత్తం అంతా తలకాయే ! ఆ ఋషి పేరు స్థూల శిరుడు. ఆ ఋషికి ఎదురుగా వెళ్లాను. నా తలకాయ నా పొట్టలోనే పెట్టుకొని వెళ్లిన ఆ నా రూపం చూసి ఆ ఋషి నన్ను 'అలా వుండిపో!' అని శపించాడు. అంతే! అప్పటి నుంచి ఇప్పటి వరకు అలానే వుండి పోయాను. డెక్కలతో ఆ ఋషి కాళ్లు పట్టుకుని శాపవిమో చనం తెలపమని బ్రతిమాలాను. ఆ ఋషి ఎంతసేపటికీ మాట్లాడలేదు. చిట్ట చివరకు చెప్పాడు. మానవుడు సకల సౌందర్య రాశిలా ఏ రోజున నీకు కనపడి, 'అబ్బా! ఎంత అందంగా వున్నాడు!' అని అనిపిస్తే ఆ రోజే నీకు శాపవిమోచనం" అన్నాడు ఋషి. అల్లాంటి రోజు నాకు వస్తుందా, అన్న ఆలోచనలో నేనుండడం చూచి, ఆ ఋషి "రఘుకుల దీపకుడు— సౌమ్యశుభగాకృతితో— రామచంద్రుడు, తమ్ముడు లక్ష్మణునితో వస్తాడు. ఆయన నిన్ను మంటలో వేస్తే నీ దుష్ట రూపం తొలగి నిజరూపం వస్తుంది."

అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు– "మరి ఈ క్రౌర్యం, చంపుకు తినడం ఎక్కణ్ణుంచి వచ్చాయి? ఆ శాపంలో ఇవి లేవు గదా!" అన్నాడు. దానికి కబంధుడు–

"ఆ ముని పాదాలు కదిలేలోగా ఇంకో ప్రార్థన చేశాను. 'మరి నాకు భోజనమెలా? ఈ రూపం చూస్తే ముష్టిగూడా వెయ్యరు గదా! పోనీ నన్ను చంపనన్నా చంపు. లేదా ఈ రూపంతో వుండి పొమ్మన్నందుకు తిండి గూడా ఏర్పాటు చెయ్యి' అన్నాను. అందుకా ముని 'అయితే చూడు. నీకు కోరలు ఇచ్చాను. పొడుగాటి చేతులు యిచ్చాను. ఆ చేతులు ఎంత దూరమైనా సాగగల పొడవు గలవి. దోవల్లో వాటిని చాచి అందినవల్లా ఆహారంగా స్వీకరించు. ఆ చేతులు చాస్తే అవతల జీవరాసులు ఆకర్షింప బడాల్సిందే. ప్రక్కకి తొలగి పోలేరు. మళ్లీ– బాహుసముదీర్ణ లక్షణులు, శాంతోగ్రులు, జగన్నాధులు నీ యీ శరీరాన్ని మూట కట్టి అగ్నిలో సంస్క రించేంతవరకు ఇంతే!" అని చెప్పి ఆ ముని చక్కా పోయాడు. చాలా రోజులు నిరీక్షించాను. మీ దర్శనం కలుగలేదు. ముని ఆ శాపమిచ్చి, శాప విమోచనం చెప్పినప్పుడు ఇంద్రుడు విని నవ్వాడు. ఆ నవ్వు గుర్తుకు వచ్చింది. బహుశః ఆ ముని, ఇంద్రుడు కేవలం నా కళ్ల నీళ్లు తుడవటం కోసమే శాపవిమోచనం అలా చెప్పి వుంటారు అనిపించింది. దానికి తగ్గట్టుగా ఎన్ని రోజులకూ మీ దర్శనం కలుగలేదు. నాకు చాలా అప నమ్మకం కలిగింది. ఇక మీరు వచ్చేది అబద్ధమే అనుకున్నాను. క్రౌర్యం పెరిగింది. అదివరకు ఆకలి మాత్రమే తీర్చుకున్నాను. నిరాశ కలిగిం దగ్గర్నుండీ ఎవరు కన్పడితే వారిని తినెయ్యడమే పని. ఇన్ని రోజులూ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించాను. మీరు రారనుకున్నాను. మంచు తుంపురుల్లా, కలువ పూవుల్లా, ముగ్ధ సుకుమార సౌమ్య మూర్తుల్లా, ఎంత లోతు త్రవ్వినా కొబ్బరిపాల వంటి నీరు వూరే పెద్ద జలలా మీరిరువురూ నా అదృష్టం కొద్దీ వచ్చారు. ఇన్ని నాళ్లూ నేను చూపింది ఛిలిపితనమే

గదా! మీరు నన్ను ఇన్ని రోజులిలా వుంచారు. ఇంక ఆగలేను. మీతో ఏదో విన్నవించుకోవాలని ఒకటే తహ తహ పడుతున్నాను, ఇంక ఆలస్యం చెయ్యకండి. నా శరీరాన్ని అగ్నిలో సంస్కరించి పుణ్యం కట్టుకోండి. రాముడు నాకు దహన క్రియ చేశాడు, అని చెప్పుకుని గర్వపడతాను. మీకు మంత్రిత్వం చేద్దామని వుంది" అన్నాడు. అప్పుడు రాముడు—

"రావణుడుట ఎవడో, ఎక్కడుంటాడో వాడి ప్రభుత్వం ఎట్టిదో ఆ వైనం చెప్పి నన్ను ఆదుకో నువ్వు. నిజంగా ఆలోచిస్తున్న కొద్దీ ఆశ్చర్యము కలుగుతుంది. ఇంతవరకూ ఈ నా చేతుల్లో నీలాంటి వాళ్ల ఇంతకు మునుపు కూడా చనిపోయారు. కాని వాళ్లందరూ మేలు చేసి పోయారు. నాకు ముందు త్రోవ చెప్పి మరీ పోయారు. నేనిలా వాళ్లని తగలెట్టడం వాళ్లు నాకు త్రోవ చెప్పడం— ఇంతేగదా నా బ్రతుకు" అని కన్నీళ్లు కారుస్తూ, "నా ఎదలోని దీపము కాస్తా పోతోంది. ఆ దీపం వెతకటానికి దీపం కావాలి. ఆ దీపం వుంటే వెతకనే అక్కరలేదు. నువ్వేమన్నా సహాయపడ గలవా? నేనే మన్నా పనులంటూ చేస్తే సీత ప్రేమ బలమే. నీకు పుణ్యముంటుంది మరి చెప్పు" అన్నాడు. అప్పుడు కబంధుడు—

"నన్ను ముందర నువ్వు తగలెట్టు— అప్పుడు నాకు వెనకటి శరీరం వస్తుంది. ఇప్పుడైతే శాప పాపంవల్ల నాకు చెప్పగల సామర్థ్యం ఉండదు. కాబట్టి ముందు నా శరీరాన్ని దహించు. అటుపైన నీకు మేలును చేకూర్చే సర్వము చెపుతాను. అన్నీ తెలిసినవాడు, అఖిల సద్గుణాలు ఆశ్రయించిన వాడు, ఒకడు నాకు తెలుసు. నీకూ, అతనికీ స్నేహం కుదిరేటట్టు చేస్తాను. మరి ముందు నా యీ చెడ్డరూపాన్ని పోగొట్టు. నన్ను అగ్నిలోవేసి తగలెట్టు. నీబోటి మహానుభావుని చేత నాలాంటి అల్పుడు తలక్రింద కొరివి పెట్టించుకోవడం ఎంత పుణ్యం చేసినా రాదు. కాని ఈవేళ ఇది నా అదృష్టం. మరి కానీండి. ఎందుకింక ఆలస్యం?" అన్నాడు.

# కబంధుని సలహా

రామలక్ష్మణులు వెంటనే ఒక పెద్ద కొండ లోయలో ఎండిపోయిన వృక్షాల్ని పడేసి, నిప్పేసి రగులుకున్న తర్వాత ఆ కబంధుణ్ణి దొర్లించారు. కబంధుని శరీరం కాలుతూ వుంటే రామలక్ష్మణులు చూస్తున్నారు. ఇంతలోనే పైనుండి ఒక పిలుపు వినవచ్చింది. "ఇదిగో! నేనిక్కడ వున్నాను." శాప విమోచనమై తొలి రూపుతోనున్న కబంధుని పిలుపది. సుస్నిగ్ధ సౌందర్యమూర్తిలా వున్నాడు. శుద్ధ స్ఫటిక స్వచ్ఛత గోచరిస్తోంది. ఆజానుబాహుడు, కిరీట కుండల ధారియై వున్నాడు, అంజలి ఘటించి "స్థూల శిరుడైన ముని, ఇంద్రుడు అలా శపించ బట్టి నా కలాంటి రూపం వచ్చింది. అయినా అప్పణ్ణుంచి ఇంతవరకు, లోపల రామనామ జపం చేస్తూనే వున్నాను, నీ రాకకై. కాని శరీర ధర్మంచేత బయటకు రాక్షసుడిలా కన్పడ్డాను. లోపల రామనామం జపింప బడుతున్న సంగతికూడా ఆ రూపంలో వుండగా చెప్పలేక పోయాను. పైకి హెూరు, లోపల రత్నాలు వున్న సముద్రంలా వున్నాను ఇన్నాళ్లూ".

నీ అర్ధాంగి సీత రావణునిచేత అపహరింప బడటం, నీకు సుగ్రీవునితో మైత్రి, ఆ రావణ సంహారము నా కళ్లకు తట్టుతున్నాయి. సందేహం లేదు. నువ్వూ, ఆ సుగ్రీవుడు ఒకే పరిస్థితిలో వుండగా ఇద్దరూ కలుసుకుంటారు. ఇప్పుడు సుగ్రీవుడు ఋష్యమూక పర్వతం దగ్గర తలదాచు కుంటున్నాడు. తనను నమ్మిన నల్గురు వానర వీరులు కూడా తనతోనే వచ్చారు. సత్య సంధుడు, బుద్ధిమంతుడు, అధర్మ బుద్ధి కలుగనివాడు, మంచి శౌర్యవంతుడు, తమ్ముడు అయిన ఆ సుగ్రీవుని భార్య నపహరించాడు వాలి. పరులకు ఎల్లాంటి ఉపకారం చేస్తామో దానికి తగిన ఫలమే మనకు వస్తుంది. ఆ సుగ్రీవుడు చాలా కృతజ్ఞతా బుద్ధి గలవాడు (అంటే ముందు నువ్వు వాడికి ఒక మేలుచేసి చూడు అని సూచ

నగా చెప్తున్నాడు.) నీవు వాడి మేలు కోసం ప్రయత్నం చేసి నెగ్గినా, నెగ్గకపోయినా నీకు సహాయం చేస్తూనే వుంటాడు. కాని మరోలా భావించడు. తన రాజ్యాన్ని, భార్యని ఎత్తుకుపోయినా అన్నగారైన వాలిని నిందించకుండా వున్నాడు. అల్లాంటి వాడు ఆ సుగ్రీవుడు. నువ్వు సందర్శించి ఆపదలో వున్నవాణ్ణి ఆదుకో! ఋక్ష రజసునికి సూర్యాంశ వల్ల పుట్టినవాడు ఆ సుగ్రీవుడు. (అంటే– మీ సూర్య వంశంవాడే అని పరోక్షంగా చెప్పడం) అతనితో అగ్నిసాక్షిగా స్నేహం చెయ్యి. నిన్ను తన ఆత్మలా భావిస్తాడు. నాల్గు దిక్కులకు తన నిపుణులైన వీరుల్ని పంపి, నీ సీతను నీకు అందించ గలడు. అంతటి సమర్థుడు. అవతల వాలి పరమ కోపిష్ఠి. ప్రజారంజకుడు కాడు. ఇదీ వారిద్దరి గురించి. వాళ్లిద్దరూ వున్న పరిస్థితుల గురించి" అని చెప్పి, పంపానదీ తీర అరణ్య మార్గంలో వున్న మతంగాశ్రమము మీదుగా వున్న ఋష్యమూక పర్వతానికి త్రోవ సూచిస్తూ ప్రయాణాభిముఖుడై "రామచంద్రా!" అన్నాడు– కబంధుడు. రామలక్ష్మణులు అలానే చూస్తూ "కబంధా!" అన్నారు. రాను రాను కబంధుడు దూరమై పోయాడు. అతడెక్కిన విమానం మెరుస్తున్న చుక్కలాగా అయిపోయింది. అక్కడినుండి కబంధునికి రామలక్ష్మణులు ఇద్దరూ రెండు తులసి మొక్కల్లా కనిపించారు.

ఊర్ధ్వ లోకాలకు పోతూ కబంధుడు చెప్పిన మాటలు మనస్సులో మెదిలి రాముడు లక్ష్మణునితో—

"గతించిన పదమూడేండ్లు నేను రాజుననే భావమే నాకు ఎప్పుడూ కలుగలేదు. కాని ఈనాడు కబంధుడు చెప్పిన మాటలు ఒక మంత్రి చెప్పినట్లనిపించి నేను రాజుననే భావాన్ని కలుగ జేశాయి. నువ్వొక మంత్రివి, సుగ్రీవుడొక మంత్రి, ఆ సుగ్రీవుని సేనలు, అతని–రాజ్యం ఇంకేం? రాజుక్కావలసిన నాలుగంగాలు చేజిక్కించు కున్నట్లే" అన్నాడు నవ్వుతూ. లక్ష్మణుడు గూడా పేలవంగా నవ్వాడు.

## మతంగాశ్రమం

ఇద్దరూ దట్టమైన అడవిలోంచి వెళ్తున్నారు. చుట్టూ రక రకాల వృక్షాలు పుష్ప, ఫల భరితమై వున్నాయి. చూత, జంబూ, ప్రియాళ, పనస, అశ్వత్థ, నాగ, పున్నాగ, అశోక, నక్తమాల, కదంబ, కరవీరక, అగ్నిముఖ్యక, సురక్త, పారిభద్రాది వృక్ష రాజాల్ని చూసుకుంటూ అడవిలో నడుస్తున్నారు. ఫలవృక్షాల నుండి లక్ష్మణుడు కొన్ని పళ్లు తీసుకువచ్చి రామునికిచ్చాడు, రాముడు పళ్లను తిని వాటి తీయదనానికి ధాత్రి సారాత్త బుద్ధికి ఆశ్చర్య పడ్డాడు. దివిలోని సంతాన వృక్షాలేమన్నా ఈ భువికి వచ్చాయా అనిపించింది, కాని, ఆ క్షణంలోనే భూజాత సీత గుర్తుకు వచ్చిందో ఏమో 'సీత లేదుగదా' అన్నాడు. (ఫలవృక్షాలు, సీతాదేవి భూజాతలే అయినా వృక్ష ఫలాల తీపి సీతను మరపించలేక పోయాయి. అంటే భూ సంతానంలో సీతను ఏవీ మించలేవని అర్థం) ఈ విధంగా లక్ష్మణుడు చెట్లెక్కి కొన్ని కొమ్మలు వంచి, కొన్ని కొమ్మలు విరిచి కొన్ని ఎన్నో రకాల పళ్లను పట్టుకువచ్చి రామునికిస్తూ నడుస్తున్నాడు. ఒక పర్వతం మించే ఇంకో పర్వతం మీదకు, ఒక అడవిలోంచి ఇంకో అడవిలోకి నడుస్తూ చిట్ట చివరకు పంపాసరస్సుకు చేరుకున్నారు. ఆ సరస్సు పైనుండి పక్షుల కూతలు ఒకే స్వరంలో వచ్చిన సంగీతంలా వున్నాయి. దీనికి కారణం ఒక మహా తపస్వి ఈ ప్రాంతంలో వుండి వుండాలనిపించింది. ఆ సరస్సులోని వెండి పొలుసు చేపలపై సూర్యకాంతి పడి కళ్లల్లో ప్రతిబింబిస్తోంది. ఎటు చూసినా చెట్లు, తీగలు, పొదులు, పొదలు దట్టంగా వున్నాయి. ఒడ్డునున్న చెట్ల కొమ్మలు కొన్ని సరస్సు పైకి వాలి వున్నాయి. కొన్ని పర్వతాల సందుల్లోంచి ప్రవహించి వచ్చిన సెలయేళ్లు సరస్సులో కలుస్తూ శ్రోత్ర పేయంగా మధుర స్వరాల్ని పుట్టిస్తున్నాయి. సరస్సులోకి పడ్డ నీరు సుళ్లు తిరుగుతూ పరవసిస్తోంది. ఝుంకారాలు చేసుకుంటూ గండు తుమ్మెదలు, చక్కని రెక్కల తళుకులతో కులుకుతూ సీతాకోక

చిలుకలు ఆనందోత్సాహముతో పూలను చేరుతూ మకరందాన్ని ఆసా దిస్తున్నాయి. అక్కడ వున్న పక్షులకు మనిషి క్రొత్త లేదు. మనిషి తమ నేమన్నా చంపుతాడేమో నన్న భీతి లేదు. చేత్తో అందుకో గలిగిన ఎత్తు లోనే ఎగురుతున్నాయి.

'పంపానదీతీర వాతావరణం సీతావియోగ బాధను మరుగు పరచ గలిగిందా' అన్నట్లు రాముని ముఖంలో, కన్నుల్లో కోమల భావరేఖ పొడ సూపింది. దాన్ని చూసి లక్ష్మణుడు రామునికి మరికొంత ఉపశమనం కలిగేటట్లు చేయసాగాడు. 'పంచదార వర్తి తీపేగా? మమ్మల్ని రుచి చూడండి' అన్నట్లు వున్న అక్కడ నీళ్ల దొన్నెలలో రామునికి తెచ్చి ఇచ్చాడు. మంచు గడ్డలులాగ వున్న మత్స్యాల్ని సంపాదించి కాల్చి పట్టుకొచ్చి ఇచ్చాడు. నెయ్యి ఓడుతూ వున్నట్లుగా వుండే పంపాతీర విహంగాల సాధు పక్వ మాంసాల్ని ఇచ్చాడు. అగ్ని కార్యాలకు కావలసి నవి అందిస్తున్నాడు. రాముని జుట్టు సరిచేశాడు. ఉత్తరీయాన్ని సర్దాడు. ధనుస్సు భుజానికి చేర్చాడు. 'సరిగ్గా సీత ఇలా చేసేది' అని రామునికి గుర్తుకు వచ్చింది. నవ్వుదా మనుకొని పెదవుల చివరిదాకా నవ్వు వచ్చింది. కాని నవ్వలేక పోయాడు. అటూ ఇటూ చూశాడు. తమ భర్తల వాయు స్పర్శ సంగత పులకాంకితలై మృదువుగా బెదురు చూపులతో లజ్జపడుతూ ఆడ హరిణాలు కన్పడ్డాయి. ఆ హరిణాల బెదురు చూపులు మొదటి రోజున సీత తనను చూసిన చూపులను గుర్తుకు తేగా వాటి వంక రాముడు చూడలేక పోయాడు. అడవి పందులు అచ్చు ఏనుగు గున్నల్లాగా వున్నాయి. ఎదురుగా తొడిమల వంపులు కనపడకుండా వత్తుగా వలయా కారంగా వికసించిన తెల్లని పువ్వుల ముత్యాల హారాల్లా వున్నాయి. రాముడు సౌమిత్రిని చూచి ఇదంతా కబంధుడు చెప్పిన మహిమాన్వితమైన మతంగ ముని ఆశ్రమ ప్రాంతమేనని చేతులెత్తి నమస్కరించాడు. అడవిలో చరించే తన శిష్యులకు ఎక్కడ అలుపు వచ్చి చెమటలు పడతాయోనని

ఇల్లాంటి వాతావరణాన్ని ఏర్పాటు చేసిన ఆ మతంగ ముని నిజంగా ఎంతటి దయా సముద్రుడో అనిపించింది రామునికి. సీత పట్ల తన రక్షణతో శిష్యులపట్ల మతంగముని రక్షణను పోల్చుకుని ఇద్దరితోని మమ కారానికి కొంచెంగూడా భేదం లేదనుకున్నాడు (ముని రక్షణలో శిష్యుల వలె తన సీత గూడా భద్రంగానే వుండాలి అనే సూచన.)

## శబరి

రామలక్ష్మణు లిద్దరూ పంపాసరస్సు పడమటి యొడ్డున నడుస్తు న్నారు. సరస్సుమీంచి వస్తున్న అతి శీతల వాయు సంభారానికి చలిపుట్టి ఉత్తరీయాలు తీసి పైన కప్పుకొని నడుస్తున్నారు. కబంధుడు చెప్పిన మార్గంలో ఎక్కడ ఏచెట్టు చెప్పాడో– దాన్నల్లా తాము వెళ్తున్న మార్గంలో గుర్తుపట్టి, పుట్టలు, గుట్టలు దాటుతూ వెళ్తున్నారు. 'రామా! అన్న కేక వినబడింది. వెనుదిరిగాడు రాముడు. ఎవ్వరూ కనబడలేదు 'బహుశః చివురు జొంపము గాలికి మలగి అలా వినపడి వుండచ్చు' అని సర్ది పుచ్చుకున్నాడు. లక్ష్మణుడు ఆశ్చర్య పడ్డాడు. 'ఇది ఇప్పటి మాటగాదు వేదాల్లోనిది. ప్రకృతి కాంతలో లీనమైన మాట అది' అంటూ రామ హృదయంలోనే తన మనస్సును నిల్పి 'ఆ కబంధుడు చెప్పిన త్రోవ మనం తప్పలేదు ప్రభూ! ఇది ఆ మతంగముని పుణ్యాశ్రమమే,' శబర్యారామమే అయితీరాలి' అన్నాడు. అంతలోనే ఒక్కసారి 'రయ్' మని చల్లనిగాలి సోకింది. ఎదురుగా పండు ముదుసలి, మెడలో తులసి పేరు, మేనంతా మెత్తని విభూతి, తుట్ట తుదదాక ఎండిన చెట్టు కొమ్మలాగా వుండి. ఆ కొమ్మ చిట్టచివర పుష్పించిందా అన్నట్లు నెత్తిమీద రకరకాల పూలతో పండ్లతో నిండిన బుట్ట వుంది. కడుపులో దాగివున్న మెరుపుల్ని మేఘాలు కలవరించినట్లుగా వున్న పూవులు కొన్ని, బంగారము రాగి కలిపి కరగించి

నట్లున్న రంగులోవున్న పండ్లు కొన్ని, రసానుకూల వాంఛాపరీపాక ముగ్ధా కార వర్తులములుగా వున్న పండ్లు కొన్ని, పాలను నింపుకున్న ఆవు పొదుగు ల్లాగా వున్న తమ గర్భంలో మధువుల్ని నింపుకొన్న పూవులు కొన్ని– విడి విడిగా బుట్టనిండా వున్నాయి. అసలే ముదుసలి, నెత్తిమీద బుట్ట బరువుతో నెమ్మదిగా నడుస్తూ వచ్చింది. రాముని ఎదుట నిలబడి పోయింది. రెప్ప వాల్చదు. మరో ప్రక్కకు చూడదు. ఆమె రెండు కళ్లల్లో తానే ప్రతిబింబిస్తున్నాడు. తలమీద వున్న పూల బుట్ట క్రిందకు దించలేదు. "అయోధ్యా వీధుల్లో నేను నిన్ను చూసినట్టు చూడగల వారున్నారా?" అంది. అందుకు రాముడు "అయోధ్యలో అసలు నీవంటి వారుంటారా? మరి ఇంక పూలబుట్ట దింపుకో ఎంతసేపు చూస్తావు నన్ను?" అన్నాడు. "అయ్యో స్వామీ! ఆ సంగతే మరచాను గదా!" అంటూ చిరునవ్వు నవ్వింది. రాముడు పూలబుట్ట దించాడు. శబరి మళ్లీ రాముణ్ణే చూస్తోంది. అప్పుడు రాముడు "పూవులా ఇవి? వెలుగుల ముద్దలు ఇవి." అంటూ కొన్ని పూవుల్ని తన కాళ్లమీద చల్లుకున్నాడు. అప్పుడు శబరి దృష్టి స్వామి చరణాలమీద పడి, "అయ్యో స్వామీ ఆగవయ్యా– నాకు మతి మరుపైతే నీకు తొందర– బావుంది. వుండు," అంటూ దోసిళ్లతో పూలుతీసి స్వామి పాదాలమీద చల్లి కళ్లనిండా ఆనందాన్ని నింపుకుంది. రెండు కళ్ల వెంబడి రెండు వాగుల్లాగా నీరు కారుతూండగా "ఓ నీరజాక్షా! నీ కోసమే నయ్యా ఈ పళ్లు తెచ్చింది ఇవి చాలా రుచిగా వుంటాయి. ఆకాశమో సముద్రమో చూస్తున్నట్లుంది నీ రూపం, నీ ఆకృతి చూసినప్పుడు. అందుకే అంత విస్మృతిలో పడ్డాను. అందుకే పూవుల్ని నీ పాదాలకు సమర్పించడం ఆలస్యమైంది. చిన్నప్పటి నుండి మునులకు సపర్యలు చెయ్యడమే నాకు తెలుసు. ఇంకోపని, ధ్యాస లేదు. అందుకనే అలా అయింది. నన్ను క్షమించు స్వామీ! ఈ ఫలాన్ని స్వీకరించు' అన్నది. అప్పుడు రాముడు–

"నట్టడవిలో నుంచున్న వాణ్ణి నుంచున్నట్లుగా నన్ను తినమంటే ఎల్లా చెప్పు. కాళ్లు కడుక్కోవాలి, కళ్లు, చేతులు తుడుచుకోవాలి. స్నానం చేయ్యాలిగదా ! మరి నీవు అదేంకాదు ఈ పాటునే తినమని అంటే నేను కాదని నీకు అమర్యాద చేయగలనా?" అన్నాడు. అప్పుడు శబరి–

"నీ పాద స్పర్శకు నోచుకున్న ఈ ప్రదేశం నీ ధర్మ స్పృష్ట దృక్పక్షమైన ఇక్కడి చెట్టు నా గృహం కాదా ! నాకు ఈ దేశంలో ఇంతకన్న మంచి ఇల్లు ఏముంటుంది? నువ్వున్నచోటే నా యిల్లు. ఇక స్నాన మంటావా ! మహా సముద్రంలాంటి నిత్య పవిత్ర మూర్తివి. నీకు స్నానం ఏమిటి చెప్పు? నాకు చేతులున్నాయి అవి వున్నందుకు సార్థకం, సాఫల్యం అవాలని ఈ పూవులు తెచ్చాను. అంతే కాని, నిన్ను అర్చించటానికి నేనూ, నా హృదయ పుష్పంలేమూ! చెట్లు వున్నాయి కాబట్టి పండ్లు తెచ్చాను. (అంతే కాని 'అవి నీకు సమర్పిస్తే – ఏదో కలిసి వస్తుందని కాదు' అని అర్థం) ఈ భౌతిక శరీరం అంటూ ఒకటి వుంది గాబట్టి ఇలా నీ దగ్గరకు నడచి వచ్చాను. నాకేదో మనస్సనేది ఒకటంటూ వుంది కాబట్టి నిన్ను గురించి ఊహచేశాను. నిజానికి నా లోపల నేను నీకు పూలూతేలేదు. పండ్లూ తేలేదు. నీ దర్శనం కోసం రానూ లేదు. నీవేమన్నా నా ఇంటికి క్రొత్తగా ఏమన్నా వచ్చావు గనకనా అదీలేదు. నా చిత్తజన్ముడవు నీవే (నా మనస్సులో తలచిన మాత్రంలా పుట్టేవాడవు అని అర్థం). అగస్త్యాది మునుల ఆశ్రమ ఫలాలు అంత తీపి కాదు ప్రాణనాథా! ఇవి నాశ్రమ ఫలాలు. (కర్మ ఫలాలు అని అర్థం.) నీ కోసం నా ప్రాణాలు మీదుగట్టు కొన్నాను. నువ్వొ వచ్చావు. స్వామీ! ఇంక మ్రొక్కు చెల్లిస్తాను. ఆలస్యం దేనికి స్వీకరించు. ప్రియాంగనా విరహ తప్త ధామదేహా!" అంది. అందుకు ముసిముసి నవ్వు లతో రాముడు–

"భూజాత సీత అందాన్ని చూచిం తర్వాత చుప్పనాక (శూర్పణఖ) నన్ను చూచి కామించిందంటే, ఆ భూజాత సౌందర్యాన్ని చూడనిదానవు నీవిలా నన్ను కోరడంలో తప్పు లేదులే! అయినా నీ యీడేమిటి? నువ్వు శరీరంలో లేవు. కుబుస ప్రాయంలో వున్నావు. నా ఈడేమిటి? నా మేనేమిటి? అయినా నువ్వు నన్ను 'ప్రాణనాథా' అంటున్నావు. అయితే మన్మథుణ్ణి. కాకపోతే భర్తను మాత్రమే అల్లా అంటారు. మరి నువ్వు ఏ అర్థంలో 'ప్రాణనాథా! అంటున్నావు. పోన్లే! ఆ సీత కోసం దుఃఖిస్తున్న నన్ను నువ్వు ఆ మాత్రం ప్రేమించావు సంతోషం. కష్టాలు పూర్తిగా వస్తే ఎలా? ఇట్లా ఊరట పొందేవి వుండాలిలే" అన్నాడు. అప్పుడు శబరి—

"నీ మాటల కర్థం నాకు తెలీదు. ప్రాణనాథా ఈ పండ్లను ఆరగించు" అంటూ నవ్వింది. నవ్వుతూంటే ముడతలు పడ్డ పెదిమలకు మధ్య నెలపొడుపు నెలవంకలా రేఖామాత్రంగా నవ్వు పొడ సూపింది. శబరిని చూసి రాముడు—

చాలా రుచిగా వుంటాయి తినమంటావు గదా! నువ్వు తిని రుచి చూడకుండా అవి రుచిగా వుంటాయని చెప్తే నేనెలా తినగలను? అన్నాడు. అపుడు రాముని కనుకొసలు శరత్కాల పూర్ణచంద్ర చంద్రికా వల్లీ కిసాల ములుగా వున్నాయి. శబరి రాముని చూచి—

## కర్మఫల భక్షణ

"స్వామీ! ప్రతి వృక్షం దగ్గర పండ్లు కోయబోయే ముందు నేను రుచి చూచే తెచ్చాను" అంది. అప్పుడు రాముడు మృదు దరహాసంతో లక్ష్మణుని వంక చూశాడు. ఆ చిరునవ్వుల్ని శబరి చూచి కొంచెం తత్తర పాటు పడి "స్వామీ! నేనేమీ తప్పు చెయ్యలేదు గదా!" అంది. అందుకు

రాముడు "ఆహా! తప్పెలా అవుతుంది. అలా చెయ్యకపోతే రుచి ఎలా తెలుస్తుంది? అవునుగానీ ఈ పళ్లన్నీ నేనొక్కణ్ణే తినబుద్ధి కావటం లేదు. నాకు తోడుగా నువ్వు, మనిద్దరకు తోడుగా తమ్ముడు సౌమిత్రి కలిసి తిందామా" అన్నాడు. అపుడు శబరి–

"అయ్యో ఇంకా నేనేం తినగలను. రుచి చూడటంలో ఒక పదో, పరకో లేదా పాతికో అయినా తిని వుంటాను. (కర్మాచరణలో తిన్నాను అని అర్థం) వాటితో పొట్ట నిండింది రామా! ఇంక సందులేదు ఈ హృదయంలో, విరామం లేదు. (మిగతా రామ మనేది నాలో లేదు అంటే రాముడు కానిది నాకు లేదని అర్థం) శ్రమపడి వచ్చావు నా శ్రమ ఫలాలు స్వీకరించు ప్రాణనాయకా! దయామతీ!" అంది. అపుడు రాముడు శబరిని ఏవో ఏవో ప్రశ్నలు అడుగుతూ పండ్లు తింటూ వుండడం చూస్తే లక్ష్మణునికి "ఈ కాసేపు అన్నగారు సీతమ్మ తల్లిని గూర్చి మరచిపోయాడా" అనిపించింది. రాముడు మాత్రం ఒక్కొక్క పండు తీసికొని ఒక్కొక్క పేరు చెప్పి ఫలాలు (కర్మఫలాలు) స్వీకరిస్తున్నాడు.

ఇది మౌని పరిచర్యకై అడవిలో కాళ్లు కండెలు కట్టేలా తిరిగిన దాని ఫలము. ఇది మౌని అగ్ని పరిచర్యకై కుశలు, దర్భలు, కుసుమములు తెచ్చిన దాని ఫలము. ఇది వర్ష ఋతువులో బట్టలెంతకూ ఆరకపోతే ఆ ముని నారబట్టల్ని గాలికారబెట్టి పరిచర్య చేసిన శ్రమ ఫలము. ఇది అగ్ని పరీక్షకై పిడకలు, నుముక గప్పి భద్రపరచిన శ్రమ ఫలము. నీ దీర్ఘకాలపు శ్రద్ధ కెసగు ఫలము. ఇది నన్ను పలుగా కోరి వరించి ప్రతీక్షించిన దాని ఫలము–అంటూ శబరి చిన్నప్పటి నుండి మునులకు చేసిన కర్మాచరణ మంతా తనకు చేసినట్లుగానే గుర్తించడంతో శబరికి నేత్రాలు సజలములై ఆనందాశ్రువులు రాలాయి. లక్ష్మణుడు ఆకుదొన్నెతో తెచ్చిన నీళ్లతో రాముడు చేతులు కడుక్కొని మూతి తుడుచుకొని మళ్లీ శబరితో ప్రసంగం మొదలు పెట్టాడు.

# రామ శబరుల సంభాషణ

"అవ్వా! నివ్వరిటెన్నులలాగా నీ శిరస్సు పూర్తిగా ముగ్గుబుట్టలా వుంది'' అన్నాడు. అందుకు శబరి "నీ ఆత్మ అనే వాకిట్లో రంగవల్లులు (ముగ్గులు) వేయించుకునేందుగ్గాను నా తల ఇంతగా పండింది" అంది.

"అవ్వా నువ్వు ఎంతో తపించి నీ ఆయుష్షంతనూ ఆర్చి ఇలా ఎండి ఏకులా తయారైనావు" అన్నాడు. అందుకు శబరి "నీతోడి స్నేహ మనే చమురుతో తడిపి ఆ ఏకును దీపంగా వెలిగించు'' అంది.

"అవ్వా! నీ తీవ్ర వ్రతదీక్షలో నీ ప్రాణాలు గూళ్లు పట్టాయి'' అన్నాడు. అందుకు శబరి "నీ యింత తీవ్ర దయాభిషంగము వలన నా ప్రాణము గూటికి చేరింది. సంతోషం" అంది. అప్పుడు రాముడు-

"నీ మాటలు సామాన్యాలు గావు. ఎంతో ఊహ చేస్తేగాని వాటి దివ్యార్థాలు తెలియవు. నీ పరమోదార ఫలానుభూతివలన నా శ్రమ తీరింది. ఆశ్వయుజ మేఘాల చివర్లలా జుట్టు ఉన్న నువ్వెవరసలు? నీ పేరేమిటి?" అన్నాడు అందుకు శబరి-

మతంగ ముని కోపం చేసిన పరిచర్యలో ఆయన ప్రేమను, నీ సన్నిధిని పొందగలిగాను. నా పేరు శ్రమణంటారు. తమరు చిత్రకూటము వచ్చినపుడు మా గురువు శరీరంవదలి మాణిక్య కింకిణీ రవముతో వెళ్లే రమ ణీయమైన రథంలో దేవలోకానికి వెళ్లారు. వెళ్తూ వెళ్తూ నన్ను "వస్తావా?" అని అడిగారు. కాని అలా అడుగుతూనే "మనవనానికి హరేంద్రమణులైన అన్నదమ్ము లిద్దరు వస్తారు. మబ్బుతునక, మంచు తునకల్లా వుంటారు వారికి స్వాగతం పలికి నా త్రోవనరా!" అన్నారు. ముని తరలి వెళ్లిన నాటి నుండి వంటరిగా వుండి పడిన వియోగ బాధ ఈ నీల సుందర

మేఘాకృతి సాన్నిధ్యంలో సమిసిపోయింది. ఈ నీలమేఘ దర్శనంతో నాలో ఆనందవర్షం పెల్లుబికింది. ఆయన వేదాధ్యయనానికి వనంలోని ప్రతిచెట్టూ పుట్టలతోపాటు నేనూ పరవశించాను. వేదార్థాలు హృదయాన్ని స్పృశించాయి. ఆ మంత్రార్థాలు నీవే అని తెల్సింది. మరి అవతల మౌని ఇబ్బంది నేనూ ఊహించగలను.

ఫలాలు, సమిధలు, పువ్వులు సరియైనవేళకు అందిచ్చే వారుండక చిరిగిన అంగ వస్త్రాలను తామరతూటి దారాలతో అతుకుపెట్టే వారి ఆశ వుండక, చక్కగా ఊది అగ్నిని రాచేసేవారు వెనుక వుండక, ఇంద్ర రథం మీద ఉత్తర మార్గంగా పోయిన ఆ మహా ముని అక్కడ ఏం పాట్లు పడుతున్నాడో ఏమో! ఆయన ఆజ్ఞ ఇంక జవదాట లేను. ఇంక అలస్యం చెయ్య లేను. సిద్ధంగావున్న అగ్నిలో నా శరీరాన్ని ఉంచి ఆయన్ని కలుసుకుంటాను నన్ను అనుగ్రహించు తండ్రీ!" అన్నది. అప్పుడు చిరునవ్వులు చిందిస్తూ రాముడు—

'నీకు మౌని మీద మమకారం. నాకు నీ మీద మమకారం ఈ వలపు పొంతనాలు నిజంగా పలువిధాలు సుమా!' అన్నాడు. అందుకు శబరి 'సముద్రానికి గోదావరి అంటే ఎంతో ఈ శబరిమీద కూడా అంతే!'(ఇంతకు పూర్వము రాముణ్ణి సముద్రము అన్నది) అనంగానే రాముడు "అవును, ఆ ముని సముద్రుణ్ణి చేరడానికి గోదావరిలా వెళ్లు. కబంధుడు ఆ మునిని 'మహత్వ ప్రౌఢవారాసి' గా కొనియాడాడు గూడా! అటువంటి మునియొక్క రమణీయమైన ఆశ్రమాన్ని చూడాలనే కోరికతోనే ఇలావచ్చాను. ఆయన మహిమలు- అతి విచిత్రములు పుణ్యవంతములు గదా!" అన్నాడు. అప్పుడు శబరి దిక్కుల్ని చూపిస్తూ" "ఇవియే ఆ మహాముని మహిమావదాతము" లన్నది. అప్పుడు రాముని కన్నుల్లో నిండు చందురుని పండు వెన్నెలలు గోచరించాయి. మళ్లీ శబరి

ఫల వృక్షాల్ని చూపిస్తూ "ఇవియే ఆ ముని తపస్సుకు మొలకెత్తి, పెరిగి పుష్పించి తపోమాధుర్యాన్ని నిగూఢంగా గర్భాల్లో ధరించి ఫలించిన నిదర్శనాలు" అంది. రామునికి తాను తిన్న ఫలాల రుచి గుర్తుకు వచ్చి పులకరించిపోయాడు. వంటినిండా విభూతి లేపనం కలిగి, కొద్దిగా వంగినడుస్తూ పాపట ప్రదేశమందు మాత్రము కించిత్తు కేశములు కలిగి, తెల్లని కనురెప్పల చివరనున్న కేశముల మధ్య తెల్లబడిన చూపులు గలిగి, ఆనంద మందహాస రేఖలా అనిపించే పగుళ్లు కలిగిన క్రింది పెదవితో శబరి-

"ఓ మునిజన హృదయ నివాసా! ఈ పువ్వుల్ని చూడవయ్యా. ఆ మౌని రాజు అల్లా వెళ్లాడో లేదో ఇవి తెల్లబోయి వెల్లబారి వాడిపోయాయి గదా! నా ప్రక్కన నీ వుండి నన్ను నడిపిస్తుంటే ఆ ముని నాలో వుండి నన్ను నడిపిస్తున్నట్లేవుంది. నా హృదయంలో మీఇద్దరూ ఒక్కటే! ఆయనతో వెంటనడచి వెళ్దామనుకున్నాను. కాని ఆగమన్నాడు ఆయన. నీ దర్శనమైంది. ఆ లోపం తీరింది. నాకోరిక నెరవేరింది. అప్పుడు ఆ ముని ప్రక్కన ఇప్పుడు నీ ప్రక్కన. ఇప్పుడు నీ ప్రక్కన మళ్లీ ముందు ఆ ముని ప్రక్కన. నా బ్రతుకు మీఇరువురి చరణాల సరణలో ధన్యమైంది. ఆ మౌని నీకు స్వాగతం పలకటం కోసం వృక్షాలు, పక్షులు ఇన్ని వుండగా నన్నే నియోగించి నీ సుగుణమూర్తి దర్శన భాగ్యం కలుగజేశాడు. ఓ రఘుకులాంబుధీ చంద్ర !రాజీవనేత్ర! అఘవిదారణశీల! ఆనందమూల! నాప్రాణనాథ! ఓంకార శేషపర్యంక యోగ నిద్రా సమాధిస్థిత! త్రయీశిఖావర్తి! వేదవేద్యా అంటూ అగ్నిప్రవేశం చేసింది. చివరకు నాద స్వరూపా!' అంది అంతే! యోగాగ్నిలో భస్మమై పోయింది. శబరి అగ్ని ప్రవేశంతో తుమ్మెదల ఝుంకారం రాను రాను వృద్ధి పొందింది. రాముడు విన్నాడు తీరా చూస్తే అది పైన ఆకాశంలో ఎగురుతున్న విమాన నిస్వనంబుగా గ్రహించి, విమానంలో వున్న శబరిని చూస్తూ— "భూమిమీద జీవరాశులు పుట్టి వృద్ధి చెందుతాయి

కాని దేవలోకంలో వృద్ధి చెంది పుట్టాయి. చూడు లక్ష్మణా! ఆ పోలికలే వేరు. ఆ విమానంలో వున్నది శబరేనని నువ్వు గుర్తుపట్టగలవా? ఇంతకు ముందు యోగిని, ఇప్పుడు దేవత" అన్నాడు.

శబరి వున్న విమానం ఆకాశంలో పోతూండగా దాని తాలూకు నిస్వనం రాను రాను సన్నగిల్లింది. అప్పుడు రాముడు, లక్ష్మణుడు ఆకాశం వైపు చూస్తున్న వారల్లా ముఖాలు క్రిందకు దించి నడుస్తూ పంపానదీ తీరాన్ని చేరుకున్నారు. అప్పుడు లక్ష్మణుడు–

"మనలను చూడకపోయినా ఆ మతంగ మునికి మనమంటే ఎంత జాలి. ఆ శబరిని మనకోసం, మన శ్రమను తీర్చడం కోసం వుంచివెళ్లాడు. మనం వున్న ఈ చోట మనిషి జాడ గూడా లేదు. మాట్లాడే దిక్కు లేదు. నీకు నేను, నాకు నీవు తప్ప మరో దిక్కులేదు. (ఈ సృష్టి అనే అరణ్యంలో జీవాత్మకు పరమాత్మకు జీవాత్మయే దిక్కు మరొకరుండరు అని అర్థం)". అన్నాడు అప్పుడు రాముడు–

"ఏమిటో నన్ను చూస్తే నాకే చిత్రమనిపిస్తోంది. కాకపోతే ఏమిటి చెప్పు ఆవిడ వయస్సెంత నా వయస్సెంత! ఆవిడ సాధన ఎంత నా సాధన ఏంత? అటువంటి వృద్ధురాలితోనా నేనట్లావెగతాళిగా మాటలా టడం, ఎందుకనో శబరిని చూడంగానే నన్ను మరచిపోయాను. సీత సైతం గుర్తుకు రాలేదు. ఇచ్చటి కోనేళ్ల సముద్రాలు గాని కొలనులు గావు. సాధార ణంగా ఏ వస్తువును చూచినా కొంత వికృతి, వికారం వుండి తీరుతుంది. కాని ఇక్కడ వికృతి లేని ప్రకృతిలా వుంది. (అంటే అంత స్వచ్ఛము సహజ ముగా నున్న స్వ స్వరూపానుభూతి కలుగుతోంది అని అర్థం) ఎందుకనో ప్రాణాలు కొంత తేలిక పడినట్లుంది. మనస్సు ఋష్య మూకాభికముఖంగా పోతుంది. ఆ కబంధునిచే స్తుతింపబడిన సుగ్రీవుడు మనస్సులో మెదుల్తు

న్నాడు. అతని రూపం ఊహిస్తోంటే–అద్దంలో నా ముఖాన్నే చూస్తున్నట్లనిపిస్తోంది. మనసంతా చల్లగా హాయిగా వుంది, సీతను పొందినట్లుగానే తృప్తి కలుగుతోంది. ఏది లక్ష్మణా ఆ గిరిని గూర్చి కబంధుడేం చెప్పాడో మళ్లీ చెప్పు" అన్నాడు, అప్పుడు లక్ష్మణుడు—

పాపం చేసిన వారు ఆ కొండ ఎక్కలేరు ఒకవేళ ఎక్కడానికి ప్రియత్నించినా పిశాచరూపాలు కన్పింస్తాయి ముందు. రాత్రి ఏదన్నా డబ్బుమూట కల్లో కనబడితే మేలుకొనవుడు నిజంగా ఆ మూటను ఎదురుగా చూస్తారు. పిశాచ రూపాల్ని చూస్తే మేల్కొన్నప్పుడు పిశాచ రూపాలు కనబడతాయి॥ అల్లాంటి కొండకు తూర్పు దిశలో ఒక గుహయందు ఋక్షరజసునికుమారుండైన సుగ్రీవుడు నివసిస్తూ ఉంటాడని కబంధుడు చెప్పాడు అన్నాడు. అప్పుడు రాముడు—

'ఇప్పుడిక ఆలోచన చెయ్యకూడదు, ఇంక పద పోదాం' అటు నుంచి ఏదో వేడిగా గాలి వస్తోంది" అన్నాడు. అయితే వేడినీటి గండాలున్నాయోమోనని బయలు దేరి ఒకచోట స్నానం చేసి అగ్రజుడు అనుజుడు ఇద్దరూ బయలు దేరారు. నేత్ర పర్వంగానూ మనోహరంగానూ పంపాసరస్సును చూచి రాముడు—

'ఈ తటాకము ఒడ్డుననే కదా సజ్జనరత్నము, మిత్రలోక శిరోమణి మిత్రిసూతి అయిన సుగ్రీవు డుంటాడని కబంధుడు చెప్పింది. నా సీతా వియోగ దుఃఖ సాగరానికి సేతువు కట్టగల సధర్ముడు అతడు. అదిగో అప్పుడే రెండుసార్లు నా కుడి భుజమదిరింది. సందీపితమగు మైత్రికి చిహ్నమే! పద, నడు" అంటూ ముందుకు నడిచాడు. అనుజుడు అనుసరించాడు.

(అరణ్యకాండ సమాప్తము)